# కృతజ్ఞతాంజలి

శ్రీయుతులు విద్వత్కవిశేఖరులు బ్ర॥ శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు తమ విపులమైన పీఠికలో లక్ష్యలక్షణ సమన్వయ పద్ధతిలో నా నాటకమును సమీక్షించితమయ పారదయా వాత్సల్యముల నాపై ప్రకటించినారు. అట్లే బ్ర॥ శ్రీ వల్లా దుర్గయ్యగారును నాటకవస్తు విమర్శనమును అందలి కల్పనా శిల్పమును సుదీర్ఘముగా సమీక్షించితమ అమూల్యమైత్రిని నాయందు ప్రకటించినారు. అదే విధముగా శ్రీయుతులు డా. జి. వి. సుబ్రహ్మణ్యముగారు తమ అపూర్వ ప్రతిభాపాండిత్యములతో నానాటకమునందలి కల్పనలను మూలకథలలోనున్న వానికంటె నుత్తమముగా నిరూపించి నాయందు అమితవాత్సల్యమును కనబరచినారు. అట్లే సహృదయులు సాహిత్య ఎకాడమీ కార్యదర్శులు నాయందు అపారవాత్సల్యముగల దేవులపల్లి రామానుజరావుగారు నా నాటకముపై తమ అమూల్య అభిప్రాయము వెలిబుచ్చి దానిలోగల సారమును అల్పపదములలోననల్పార్థ భాసితములుగా దీపింపజేసినందుకు వారికి నేనుఋణపడియున్నాను డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు నానాటకములోని సమకాలీన సమాజ పరిస్థితుల నెత్తిచూపి ఇదిపూర్వ పురాణకథయైనను సమకాలీన సమాజ విచారముగలదని దయతో నిరూపించిరి. అంఖడ సంస్కృతాంధ్ర పాండిత్య మండితులు శ్రీ కె. రాజన్నశాస్త్రిగారు నానాటకములోని ప్రాశస్త్యమును సర్వవిధముల వెలికి దీసిచూపినారు. ఇంతేకాక ఈ నాటకమును సంస్కృత భాషలో ననువదింప వాగ్దానమొనర్చితమ అప్రతిమానమైత్రిని చాటుకొనినారు. నా ఆత్మీయుడు ఆప్తుడు దాశరథి రంగన్న నాటకకథ కల్పనలోని మెలకువలు దాని శ్రేష్ఠత్వము వెలిపరచి దానికి శోభచేకూర్చి తన అపూర్వమైత్రిని కనబరచినాడు. ఇంతేకాక శ్రీయుతులు బ్రహ్మశ్రీ దివాకర్ల వేంకటావధానిగారు బ్ర॥ శ్రీ పాటిబండ మాధవశర్మగారు దిగ్దంతుల వంటి పండిత ప్రకాండులయినను నా యల్పకృతిలోని గుణలవములను సర్వజ్ఞుడు బాలశశిని తలధరించినట్లు ప్రకటించినాకు ఆశీస్సుల నందజేసినారు. నాప్రియమిత్రులు బలరామాచార్యులు తమ చక్కని చిక్కని ముఖచిత్రమును నాటకమునకు అపారకృపామైత్రీ భావములనందజేసినారు. శ్రీరామమూర్తిగారు సౌజన్యమూర్తీభవించిన సహృదయులు ఈ ముఖచిత్రమునకు ఎంతోదయతో బ్లాకులనందజేసినారు. ఇన్నిటికి ముఖ్యము నా అంతరంగులు నా ఆత్మీయులు నాకు సర్వదా ఆదరణీయులు శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారు తమ శ్రీరామా పవర్ ప్రెస్‌లో సర్వాంగ సుందరముగా నా పుస్తకమును ముద్రించి యిచ్చిరి. వీరందరికిని నేను నాజన్మమంతయు ఋణపడియున్నాను. ఆ ఋణమును నాకృతజ్ఞతాభినందనలతో వడ్డీ మాత్రము దీర్చుకొనుటకు ప్రయత్నించుచున్నాను.

గౌ॥ శ్రీ మురళీధరరావుగారు పెద్దపెల్లి డిప్టీకలెక్టర్‌గానున్నపుడు ఆసౌజన్యమూర్తి ఆధర్మకీర్తి నానాటకమునకు 5000 రూపాయలు సన్మానముచేసి మహోపకారము గావించిరి. ఉభయ సాహిత్య ఎకాడమీల నుండి ద్రవ్యసహాయము చేయించిన, ఆప్తమిత్రులు శ్రీ రామానుజరావుగారికి శ్రీ బాపురెడ్డిగార్లకు నాకృతజ్ఞత లర్పింతును. ఎందరో మహానుభావులందరికిని నావందనములు వీరందరిని ఈశ్వరుడాయురారోగ్యభాగ్యము లొసగి కాపాడు గాక.

ఈ నాటకములో అడాడ ప్రమాదములు దొరలినవి. దాని పట్టికనిచ్చుచున్నాను సవరించికొని చదువ ప్రార్థితులు. నేనల్పజ్ఞుడను గదా! నన్ను క్షమించగలరని విశ్వాసమున్నది.

రచయిత

| పేజీ | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 3. | అభ్యసిత | అభ్యస్త |
| 8. | నిశ్యంబుద | నిశియంబుద |
| 18. | బంధితుడు | బద్ధుడు |
| ,, | శిరోపరి | శీర్షోపరి |
| ,, | నిధనత్వము | నిధనము |
| 19. | తామసము | సంతమసము |
| 20. | అవీక్షిత్కుమారుడు | అవీక్షితకుమారుడు |
| 66. | పారుడను | పాఱుడను |
| 101. | సంవర్తకాశ్రము | సంవర్తకాస్త్రము |
| 106. | స్పర్శాసుఖము | స్పర్శసుఖము |
| 120. | బాహూద్వయ | బాహోద్వయ |
| 123. | నేమీ | నేమి |
| 128. | కాఠిన్యత | కాఠిన్యము |
| 142. | కల్మషభృత | కల్మషయుత |
| 165. | పత్యాధీన | పత్యధీన |
| 205. | అశ్రునేత్రుడు | సాశ్రునేత్రుడు |
| 118. | మౌనమై | సమౌనమై |

# పద్యానుక్రమణిక

పుట సంఖ్య


అ

156. అంగవిరహితుడై
32. అందము మేల్వయసు
91. అకట శివనింద.
34. అక్కట నాల్గు
140. అక్కట యస్త్ర
112. అడరెడి ప్రేమ
90. అతనికిఁ గల్గిన
153. అతిథులనేటి
84. అతివ గళమున
180. అతివా! యెవ్వతెవీవు?
128. అనుకరణమ్మొనర్చెడి
47. అన్నెలఁత నాట్య
88. అపుడు బొమముడి
87. అమిత కామాంధ
24. అరయఁగ ధర్మ
31. అరయ ధనికులు
97. అరయ నాల్గు
134. అరుగుటకు కాలు
131. అరెరే నీవాక
47. అలకలే కావవి
195. అశ్రులొల్క
193. అసినాగఁబులు
24. అక్షరధనమ్ము.

ఆ

216. ఆకలి లేకయున్
81. ఆదిని బల్లవాకరములై
36. ఆనంద జలధి
10. ఆశ్రమములు
20. ఆశలేనివాడె
174. ఆశ్రమ మృగముల.

ఇ

75. ఇంత పఱాక్రమ
53. ఇచటి నుండి
205. ఇరుల తీవల.

ఈ

48. ఈ గానాంబుధ
71. ఈ మరుఁడు
81. ఈమె తనులత
52. ఈ యుభయలోక
206. ఈవని నిల్లు
82. ఈ విషయ మందు

ఉ

194. ఉండవలెనన్న
103. ఉయ్యేల తీవ
4. ఉల్లమంతయున్
109. ఉవిదనా రాగ

ఊ

48. ఊరెడి జవ్వనంపు

ఎ

160. ఎండ నీడలట్టులే

110. ఎంతయుఁ బ్రేమ.
136. ఎక్కడి పాపిణకాంత
199. ఎనయఁగ నఖప్రి
1. ఎయ్యది యాది
189. ఎవ్వడ వోరి!

# ఏ

189. ఏ పాపంబు
133. ఏమి మొగంబు
127. ఏమేమో!

# ఒ

210. ఒత్తనట్లు రథాన

# ఓ

139. ఓ కొమరుండ!
111. ఓ యపీక్షితా!
38. ఓషధీ నాధు

# ఔ

45. ఔర మాటాడ.

# క

52. కంటిదారినా
115. కందెరలయట్లు
187. కఠిన కష్టంబు
4. కతల గద్య
129. కననవమానముగా
171. కనరానినను
69. కన్నియ రూప
109. కరము కరముల
31. కష్ట పరవశునగు
24. కళలు ప్రతి.

# కా

71. కాంత పొందది
15. కాంత సంధ్యా
168. కాకులు రెట్టరాల్చ
158. కాలసర్పంబు.

# కు

8. కుటిలసమ
66. కుసుమముల
66. కుసుమశరు.

# కూ

157. కూడవు కూడవీ.

# కొ

60. కొమ్మ యరవిరి

# కో

34. కోరికలూర

# క్ర

151. క్రిందుమీదులు
191. క్రొత్తఁగఁ గూసమున్
103. క్రొన్ననవాను
183. క్రొవ్విరులీను.

## గ

204. గగనమొక
154. గర్వోన్మాదులు

## గా

76. గాత్రము పుల్కలెత్త
105. గాత్రము పుల్కలెత్త

## గి

186. గిరిరాజు.

## గు

24. గురు కృపా
193. గురు ఫణిరూప
25. గురుపు శిష్య.

## గె

192. గెలిచి యరినన్ని.

## ఘ

140. ఘన ప్రతీప
32. ఘనులు గంభీర.

## చ

132. చంద్రముండై
45. చదువుకొన.
218. చనుబాల్ద్రావిన.

## చి

167. చిక్కితి వాపన్నదిలో
196. చిక్కిన గాత్రవల్లి

## చూ

112. చూపులని యెడి.

## చె

195. చెక్కిళులంటి
15. చెమ్మటం గ్రమ్మ.

## చొ

196. చొక్కపుమేని.

## జ

9. జగతి నీర్ష్యాళు
41. జరుగం గల

## జీ

54. జీవములు పడి

## త

163. తత్వ దర్శక. జ్ఞాన,
16. తత్వవిదుల్
155. తద్వినాన్యసువస్తు
220. తనదు వంశమ్మె
1. తనమనో
104. తమిముఖేందు
148. తలపడి గున్న
67. తలలూపించెడి.

## తూ

192. తూణము నందు

## త్వా

189. త్వరపడనేల

## ద

128. దంపతుల ప్రేమ
148. దక్కెరి పో సతీ!

## దా

191. దానధారలుగ.

## దే

209. దేదీప్యమానమౌ.

## దై

172. దైవసముడగు

## ధా

220. ధార్మికులపీషితుని

## ధీ

184. ధీర యోధులకై.

## న

54. నందన వన వీధి
120. నదమొనరించు
37. నవసుమ
45. నవ్వుల నెద.
2. నశ్వరానందంబు

## నా

84. నా కనుల నీమె
136. నాడులకు నవజీవ.

## ని

192. నిండు మనంబు
58. నిగ నిగ లాడుచు
79. నిగ నిగ లాడుచు
157. నిదుర వుచ్చెడిని
52. నినువల చితినను
142. నిలవుగంభీర

## నీ

185. నీచనావేడి
190. నీదుబాణాగ్నిచే
200. నీ ప్రణయ
155. నీ యనంగాకృతి
166. నీలాభ్రవనితా
177. నీవు సర్వవ్యాప్తి

## ను

112. నుడువలేక

## నె

69. నెఱియా ముద్దియ.

## నృ

22. నృపుఁడు రాష్ట్రి.

## ప

15. పగలొానరించి
106. పడ(తి నిన్నును
129. పతికి సతి
169. పదిగహృదయ
127. పరిమళమీను
30. పరియాచకపుం

## పి

182. పిలిచిన బదులిడ

## పా

195. పానీయమానుచు
88. పాపములచిన్హారిం
119. పాఱు(బోతుతా
193. పాతెడి వేడి.

## పు

114 పుట్టిన నాటినుండి
72. పుట్టినపుడె
219. పుట్టుట కంటెను
190. పులినోటి

## పూ

112. పూల బాణాల
169. పూలు నాలుగు

## పై

209. పై కెగసి చూడ

## పొ

31. పొడవును లావు
201. పొలతిరా :

## ప్ర

176. ప్రణయ సంగత
25. ప్రభువుకై
177. ప్రసరించి యంత

## ప్రా

136. ప్రాణమేగుట
205. ప్రాణముతోడ
167. ప్రాణముల తోడ

## ఫ

184. ఫలముల నిత్తు

## బ

19. బడిని నాత్మ

## బా

132. బాణాస్త్రాయుధ

## బి

114. బిడ్డ ఎన్నాళ్ళు

## బో

133. బోనులో( బడి

## బ్ర

22. బ్రతుకనన్

## భ

8. భవ్యకావ్యము

## భూ

130. భూమి రుహాంపు

## మ

16. మంజుల హామ
79. మందహాసామృతమ్ముల
49. మత్త నయనాబ్జ
202. మరుని భాగ్యలతయె
23, మహీన ధర్మాప్త

## మా

52. మానిని మందహాసముల
74. మారుడు బూదియై.

## ము

197. ముట్టన్మానెడి
10. మునువని
142. ముల్లుఁగొని
119. ముసురుకొను

## మె

17. మెడమోడ్చి
197. మెఱపు తీవ

## మో

107. మోమును వాడె

## మ్రో

45. మ్రోళ్ళ చివుర్చి

## యు

89. యువతి జపతపో

## ర

48. రతనము సాన
7. రమయు
187. రవి కర.
42. రసికహృదయాల
151. రహిమేఘముల

## రా

87. రాగ కషాయిత

## రూ

115. రూపులన్ని తానయి

## రే

44. రేఖలోయవి

## ల

106. లలన నీరూప
5. లలిత పదారవింద
103. లలినేలంగన

వ

104. వనిత పాపట
220. వనితారత్నము
9. వనిలతాంగులు
115. వరగుణమ్ములు
1. వరవిజ్ఞాన
207. వసుధ సుఖ

వా

107. వాయువెదురయి
102. వారిజ నేత్ర

వి

221. వింతలు గాగనీ
203. వికసిత మనోజ్ఞ
25. విద్యుతో గ్రమ
6. విద్యయుపకృతి
152. విన్నుగ్రుమ్మెడి
89. విరహాగ్ని కన్నను
186. విరహాన
86. విరి శరమ్ములు

వీ

182. వీరవర్య

వె

161. వెడలుపు సన్నముల్

వై

133. వైరిమస్తక
146. వైరివితతిచే

శ

98. శక్తి చేత
193. శరఘాతమ్ముల
166. శశి ప్రతి బింబ

శి

154. శిరము మణి

శ్రీ

219. శ్రీరమణి విష్ణునకు

శృ

87. శృంగార వార్ధి

స

44. సంగత రేఖ
33. సంపదన్వితు
221. సకల జనులు
88. సడలుచు చోల
56. సదమలాక్షర
6. సరవినన్నయ
44. సరసీచంద్ర
53. సరసత రాకుమారి
41. సరసమధుర
109. సరసిజమంచు.

సా

158. సాధకుల సుఖము
93. సామదాన.

స్వా

219. స్వాభిమానమెపుడు

స్వీ

217. స్వీయ జీవిత
122. స్వీయ దేహము

స్త్రీ

221. స్త్రీల మానములకు
220. స్త్రీల శీలమ్ములును

సు

204. సుకవి ప్రతిభల

సౌ

50. సౌందర్యవారాశి

హ

161. హరి పదాంబుజ

హా

184. హాస సుమము

హృ

186. హృదిని విడని
176. హృదయ సదనమ్ము

క్షి

122. క్షితిని నెల్ల


---



శ్రీ వానమామలై వరదాచార్యులు

గీ॥ శీలవతిగాథనొందు రచించినారు
ప్రతిగొనంగరెయంచు వినతినొనర్చు

శ్రీమతి వైదేహి

దీప్తసౌభాగ్యవతికి వైదేహసతికి
అస్మదర్ధాంగికీకృతి యంకితమ్ము.

# తొలి పలుకు

పోతనచరిత్రమును రచించి 'అభినవ పోతన' బిరుదాంకితులైన శ్రీ వానమామలై వరదాచార్యులుగారు సహృదయులు. కావ్యరచనలో తమ పాండిత్యమును ప్రకటించుటయే గాక నాటక రచనలోకూడ తమది అందెవేసిన చేయే యని వైశాలిని నాటకముద్వారా నిరూపించుకొనిరి. వైశాలిని చక్కని నాటకము. మార్కండేయ పురాణాంతర్గతమైన విశాల అవీక్షితుల చరిత్రయే దీని కాధారము. పోతన చరిత్ర చదివిన వారికి వరదాచార్యులవారికి భక్తిశృంగారరసములు అభిమానాస్పదములనిపించును. రసానుగుణమైన శైలితో చక్కని పదముల పొందికతో కవి మనస్ఫూర్తిగా ఒక రసమును వర్ణించునపుడారసము అతని కభిమానాస్పదమేమో యనిపించును. వరదాచార్యులవారికి యీరసములన్నియు అభిమానాస్పదములేమో యనెడివిధముగా 'వైశాలిని' యందు శృంగారము, ప్రధానముగ వీరకరుణ రౌద్ర, హాస్యరసములు ఎంతో పోషింపబడినవి. ఆయాఘట్టములను చదివినపుడు యీ కవికి రసపుష్టముగా కవిత్వము చెప్పుట వెన్నతో పెట్టిన విద్యయేమో యనిపించును.

ఈ నాటకమున ప్రాసంగికముగా చెప్పబడిన గౌరీకల్యాణము చాలా చక్కగా నున్నది.

విరిశరమ్ములఁ గురిపించి హరునెదంద
విషయవాననల్ రగిలించివిడిచె మరుఁడు
పూలతీఁగెను వెదరెడి భోగివోలె
శివుఁడు పార్వతీపాణి నాసించిడాసె.

ఎంత చక్కని ఉపమానము.

అమిత కామాంధకారము లావరింప
హరుని ప్రణయావలోక తస్కరుఁడు పొంచి
అగజ రూప యౌవన ధనమపహరింప
మందహాసమ్ములను మచ్చుమందుచల్లె.

ఎంత హృద్యమీ పద్యము.

అభిమానధనుడైన అవీక్షిత్తు, పతివ్రతా శిరోమణియైన విశాల పాత్రల నెంతయో ఉదాత్తముగా వరదాచార్యులవారు తీర్చిదిద్దిరి.

''ఆశలేనివాఁడే గురువనబరఁగు
లోభరహితుండె శిష్యుడై రూఢిమెరయు
ఆశలేనివానికి లొంగు నీశుఁడేని
విగతలోభుండు వైకుంఠజగతిఁగెల్చు''

"మహీనధర్మాప్త సౌఖ్యసంపదలకన్న
ధర్మఘటిత దుఃఖదరిద్రతలెయశమిడు
మంచి కీర్తి జీవితమును మించుసుఖము
దుష్టకీర్తి మృత్యువుకన్న దుఃఖతరము"
"సంపదన్వితునొరుని సహింపలేక
చెరుపఁదలచుట తనుదానెచెఱుపుకొనుట
పాలతోఁగూడు నీరమున్నావనెంచి
పొంగుదెప్పించు నగ్నియె పొలియదొక్కొ".

ఇట్టి సూక్తులెన్నియో యిందుగలవు. కణ్వపుత్రాశ్రమమున గురువునకు, అవీక్షితునకు జరిగిన సంభాషణ చక్కని ఉపదేశముతో కూడి యున్నది. సామెతలిందు కొల్లలుగా గలవు. సందర్భోచితముగా చక్కని అలంకారములను ప్రయోగించిరి.

శ్రీ వానమామలై వరదాచార్యులవారి పద్యమెంత హృద్యముగా నుండునో వారి గద్యముగూడనట్లే హృదయంగమముగా నుండును. 'వైశాలిని' యందు ఆచార్యులవారి సంభాషణ రచనాపాటవము అమోఘము. వీరి కవితాధార నిరర్గళమై మృదుమధుర పదసమాన బంధురమై సహృదయుల మనస్సుల నాకట్టుకొనుటలో వింతయేమున్నది. సహజసుందరమైనది వీరికవిత.

సుకవిప్రతిభలప్రకటించు సుకృతితాను
నతని విబుధులు కీర్తించునటులొనర్చు.

నిజమే. కవి యొక్క సత్కావ్యమే కవిప్రతిభను ప్రకటించి విబుధులచే శ్లాఘింప జేయును. ఇది శ్రీ వానమామలై వరదాచార్యులవారి వట్టున యథార్థము.

ఇట్లు
దేవులపల్లి రామానుజరావుగారు
ఆం. ప్ర. సాహిత్య ఎకాడమీ కార్యదర్శి,
ఆంధ్రసారస్వత పరిషత్తు అధ్యక్షులు.

హైదరాబాదు,
తేది. 5-5-1975.

# వైశాలిని సమకాలీనత

"మార్కండేయ పురాణాంతర్గతగాథ నొకఁడాధునిక కవి కించిత్కల్పనా విశేషంబుల నర్చించెను" కథా మూలమును గూర్చి, కవినిగూర్చి, నాటకమును గూర్చినటిచేసిన తొలి పరిచయమిది. కథ ప్రఖ్యాతమే కాక ప్రశస్తమైనది, దీనికికొన్ని కల్పనా విశేషములు చేరినవి. ఇంక కవి 'అభినవ పోతన' యను బిరుదమువడసిన శ్రీమాన్ వానమామలై వరదా చార్యులు గారు. ఇంక నాటక ప్రశస్తికి కొదువయేమి ?

విదిశాపురాధీశుఁడగు విశాలన్నృపాలుని యాత్మజాత వైశాలిని సకలరాజన్యసైన్యంబుల నొక్కకేల నుక్కడంచి, యఖిల మహీమండలము నేకచ్ఛత్రముగఁ బరిపాలించిన సార్థకనామ ధేయుఁడగు కరంధమసార్వభౌమునియేకైక పుత్రరత్నము అవీక్షితుడు. అంతియకాదు. అవీక్షితుడు విశ్వజిద్రణక్రీడలో సకలరాజమండలిని నిర్జించి, విజయలక్ష్మినిచేపట్టినవాడు. అట్టి యీ దంపతుల పుణ్యసమాగమ ఫలము-సకలప్రాణికోటికి ప్రాణమై ధర్మపరిపాలనచేయ బోయెడి మరుత్కుమారజననము. ఇదేనాటకఫలమును.

తృతీయాంకమున ప్రసక్తమైన కుమార సంభవగాథకును, ఈ నాటకకథకును కొన్ని పోలికలుగలవు. పార్వతీదేవివలెనే వైశాలినియును వలచిన భర్తను పొందుటకై తపశ్చర్యకు పూనుకొనినది కుమార సంభవముతోనే రెండుగాథలును మంగళాంతములైనవి.

ఇందులోని అసలు కథస్వల్పమే. అయినను కల్పనలవలన పెరిగినది. నాయికా నాయకులు తాముకావించిన స్వల్పాపరాధములవలన శప్తులైనారు. వైశాలిని పూర్వజన్మమున గంధర్వరాజగు సునయుని తనయ అజ్ఞానవశమున అగస్త్యమహర్షిని అపహసించినది; మానవకాంతగా పుట్టి విరహతాపమున దుఃఖపడుమని ఆయన శపించెను. ఇంక అవీక్షితుడు ఈ జన్మలోనే తెలియక నాగులపట్ల అపచారమొనర్చి శాపము పొందినాడు. ఈరెండు శాపములలోను 'విరహము' సమానధర్మము. అందుచేతనే కథ పెరుగుటకు అవకాశమేర్పడినది; నాటకము స్వర్గ-మర్త్య-పాతాళలోకముల నాక్రమించికొనినది.

మహర్షులకోపమైనను మంగళములకేననుట సత్యదూరముకాదని అగస్త్యమహర్షి శాప వృత్తాంతమున స్పష్టమైనది. ఆశాపఫలముగానే వైశాలిని—సకల ప్రజలను స్వపరభేద వివక్ష లేక సమదృష్టితోఁగాంచి పీడిత తాడిత ప్రజానీకమును దయఁజూచి సర్వదావారి దుఃఖ నివారణమునకై యుపకరింపఁబోయెడి పుత్రునకు, మరుత్కుమారునకు, తల్లికాగలిగినది. ఒక మహామహునకు తల్లికాగలిగిన పుణ్యవంతురాలు కావుననే నాటకమున కామెపేరు సర్వధా తగియున్నది.

క్రాంతదర్శియైన కవి సమకాలిక ప్రజాజీవితమును నిశితముగ బరిశీలించి అందలి కష్ట నష్టములకు వ్యథజెందుట అనివార్యము. శ్రీమాన్ వరదాచార్యులవారు ప్రథమాంక ప్రారంభ మందలి శుద్ధవిష్కంభమున విద్యాధరుఁడైన మణికుండలుని మాటలద్వారా తమ ఆవేదనను వ్యక్తముచేసినారు —

"భూలోకమున పీడిత ప్రజానీకమును దర్శించుట దుర్భరము...ధనికుఁడు దరిద్రుల దోచుకొని మరింత ధనికుఁడగుచున్నాఁడు. బలి బలహీనుల తలలఁ బాతాళమంటఁ ద్రొక్కుచు మరింతపైపదవి నధిరోహించుచున్నాఁడు. విద్యాధికుఁడు విద్యావిహీనుల వంచనోపాయములతో మోసమొనర్చి విశేషసుఖములఁ జూఱగొనుచు నతిచతురుఁడనని పించుకొనుచున్నాఁడు. అవకాశవాది యీ మువ్వురి ప్రళయ తాండవములకు ననుకూలగతిలయవేయుచు వంతఁబాడుచు నవసరములఁ దీర్చికొనుచు హాయిగా జీవించుచున్నాఁడు......బడితగలవానిదే లోకము. పైసగలవానికే నాకము. అచటి ప్రజల తత్త్వమిట్లున్నది. ప్రభుత్వముదానికి లయవేయుచున్నది."

ఇట్టిభూలోకమునుండి. గంధర్వలోకమునకు విచ్చేసిన అవీక్షిత్తునకు—ఈ రాజ్యమున బరిశీలింప నొకబిచ్చఁగాడైనను మచ్చునకుఁ గానరాఁడు. పేరునకైన బూరిగుడిసెలేదు... ... ఇచట ధనిక దరిద్రభేదములులేవు. ప్రతిపౌరుఁడు విద్యావంతుఁడే, ధనవంతుఁడే, శక్తిమంతుఁడే, స్వతంత్రుఁడే ఎవరికిని నన్నవస్త్రముల కొదువలేనేలేదు" అనిస్పష్టపడినది. "ప్రజలందరును స్వతంత్రులై సమాన సంపదలందులఁ దూఁగుచు శాంతి సౌఖ్యములఁ దేలుచున్న ప్రతిదేశము స్వర్గమేకదా! స్వర్గమననిదియేనేమో!" అని అతఁడు తలపోసినాడు. ఆ మాటనేపైకి అన్నప్పుడు 'నీ వాక్యములు యథార్థములు. సంక్షేమ రాజ్యమేదియైనను స్వర్గమే" అని గంధర్వరాజగు సునయుఁడు వివరించినాడు. 'సంక్షేమ రాజ్యము' శ్రీమాన్ వరదాచార్యులవారి ఆశయము. మార్గదర్శియైన కవి లక్ష్యమిదియే. ఈ రాజనీతిని విశద పరచవలె నన్న సంకల్పముతోనే శ్రీమాన్ వరదాచార్యులవారు ఈ దృశ్యకావ్యమును రచించియున్నారనుటలో సందేహము లేదు. ఉత్తమమైన ఈ నాటకరచనద్వారా తమసంకల్పమును సిద్ధింపజేసుకొన్న శ్రీమాన్ వరదాచార్యులవారిని మనఃపూర్వకముగా అభినందించుచున్నాను.

ఈ ఆధునికకాలమున, ప్రాచీన సంప్రదాయాను సారముగా వెలువడిన ఈ ఉత్తమ నాటకము సహృదయుల మన్ననలను పొందగలదనియే విశ్వసించుచున్నాను.

ఇట్లు

డాక్టర్—పోణంగి శ్రీరామ అప్పారావుగారు

తేది 1-6-1976. డైరెక్టర్ ఇంటర్ నేషనల్ తెలుగు ఇనిస్టిట్యూట్.

# అభినందనము

## డా. దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) పి హెచ్. డి.

అభినవ పోతన బిరుదాంకితులు, మహాకవులు, శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు రచించిన వైశాలిని యను మహానాటకము నాదృతిమై చదివి మిక్కిలి యానందించితిని. వారు నాటకలక్షణములన్నియు సమకూడునట్లుగా మార్కండేయ పురాణమునుండి వస్తువును గ్రహించి శృంగార రసప్రధానముగా నీ నాటకమును రచించిరి. కథానిర్వహణమందును, రసపాత్రపోషణమందును, హృద్యసన్నివేశకల్పనమందును వారు ప్రదర్శించిన నేర్పు సర్వథా ప్రశంసాపాత్రమైయున్నది వారాయాసందర్భముల రచించిన పద్యములు రసభావపూరితములును నాటకోచితములునై పూర్వ సంస్కృత మహాకవుల నాటకపద్యములను దలంపునకుఁ దెచ్చుచున్నవి. వారిశైలి సర్వసుబోధమును జాతీయతాపదప్రచురమును శక్తిమంతమునై యింపు నింపుచున్నది. సంపూర్ణ లక్షణ సమన్వితములైన పెద్ద నాటకములను రచించుట సన్నగిల్లుచున్న యీ రోజులలో శ్రీమాన్ ఆచార్యులవారీ నాటకము రచించి నాటకకళకు మరల వినూత్న జీవము పోసియున్నారు, పరిమాణమున పెద్దదయ్యును ప్రౌఢ భావపరిపుష్టమైన యీ మహానాటకము విద్వాంసులకే కాక కళాశాలలలో పఠించు ప్రౌఢ విద్యార్థులకుఁగూడ పఠనీయమై యింపునింపునని నేనభిప్రాయపడుచున్నాను. మహాకావ్యకల్పనమునకే కాక మహానాటక నిర్మాణమునఁగూడ తమ నిరతిశయ కళాకౌశలమును ప్రదర్శించి ప్రశంసార్హులైన శ్రీమాన్ ఆచార్యుల వారి నెంతయు నభినందించుచున్నాను.

ఇట్లు
డా॥ దివాకర్ల వేంకటావధాని

తేది. 20-5-1975.



# అభిప్రాయము

అభినవ పోతన బిరుదాంచితులు, మహాకవి శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు సర్వాంధ్రులకు సుపరిచితులైన విద్వత్కవీశ్వరులు. పోతన జీవితమును మహాకావ్యముగా సంతరించుటేకాక పెక్కు లఘుకృతులనుకూడ రచించినారు. వివిధ సాహిత్య ప్రక్రియలను చేపట్టి విజయవంతముగా నిర్వహించి యిప్పుడు నాటకప్రక్రియను చేపట్టినారు. "నాటకాంతమ్ సాహిత్యం, కావ్యేషు నాటకం రమ్యమ్" అను ఆభాణకములను సార్థకము గావింపబూనినారు. వైశాలినియను బృహన్నాటకము నిర్మించినారు. పేరునుబట్టి నాయికా ప్రాధాన్యమును సూచించినారు. "సతీమతల్లుల గర్భఖనిలోనే సుతులై శూరశిరోమణులుదయింతురు. ఆ వీరశిరోమణులు తాపన్యాయాంధకారమునుబాపి జగదభ్యుదయమును జేకూర్చెదరు".

వేద పురాణగాథలందు ప్రసిద్ధుడైన మరుత్తుని జన్మకు గారణములైన వైశాలినీ–అవీక్షిత్తుల పవిత్ర చరిత్రమీనాటకమందలి ఇతివృత్తము. ఆదినుండి యంతమువరకు శృంగార వీరరస ప్రవాహములను జంటగా నడిపించి కవిగారు సహృదయుల హృదయములను రెండు రసముల నడుమ డోలాందోళితము గావించినారు. ప్రస్తావనయందలి వసంతర్తుగానముచే శృంగారము అంగిరసమన్న అభిప్రాయము సూచించినారు. ఆశృంగారము సంతానఫలమై దాంపత్య రూపమగుటచే ధర్మమూలమై జగదభ్యుదయ హేతువగుట నిరూపించినారు.

పౌరాణిక వృత్తాంతమును వర్తమానజీవిత ప్రతిబింబకముగా మలచుకొనుటలో కవిగారు ప్రదర్శించిన మెలకువ, నైపుణి కొనియాడదగినవి. శ్రేయోరాజ్యస్థాపనము పరమ ప్రయోజనముగా నిర్వహింపబడిన యీ నాటకమున సమకాల జీవిత సమస్యలెన్నియో చోటుచేసికొన్నవి. సంప్రదాయావిరుద్ధమైన సర్వతోముఖాభ్యుదయము కవిగారి పరమలక్ష్యము. ఆ లక్ష్యమున కభిముఖముగా నాటకము నడచినది. నాయకాభ్యుదయము జగదభ్యుదయమైనది.

ఇతివృత్త విస్తృతి, సన్నివేశ బాహుళ్యము, ఉపదేశాభినివేశము నాటకమును సుదీర్ఘము గావించినవి. రెండు వందల పుటలకు పైబడి, తొమ్మిది అంకములు గల యీ నాటకమున పద్యములు రెండువందలకు పైగా ఉన్నవి. ప్రదర్శనము కవి ప్రతిబంధకము లగునేమో ! కాకుండుతీరున ప్రదర్శనయోగ్యత సమకూర్చుటకు ఆచార్యులవారేదేని ప్రణాళిక సూచించినచో మేలుగానుండును.

నాటకము ప్రయోగప్రధానముగనుక సామాజికరంజనముదాని ప్రశస్తికి గీటురాయి. సర్వలక్షణ సంపన్నమైన నాటకమును నిర్మింపబూనిన ఆచార్యులవారు తమ పూనికయందు కృతార్థులైనట్లే నాటకము వెల్లడించుచున్నది. ప్రయోగమున విజయవంతమైనచో కవిగారి ఆశయములు ప్రజాబాహుళ్యమున ప్రచారముపొంది వారాశించిన యభ్యుదయము సమకూరును. తథాస్తు.

ఇట్లు

తేది. 8-8-1975. డా॥ పాటిబండ మాధవశర్మగారు M.A.P.H.D.

# అభినందన సుమాంజలి

జయంతితేసుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తియేషాంయశః కాయేజరామరణజంభయం ॥

"భర్తృహరి"

మార్కండేయ పురాణమునందు రేఖామాత్రముగానున్న కథాంశమునుగైకొని "అభినవ పోతన" బిరుదాంచితులు శ్రీమాన వానమామలై వరదాచార్యులవారు తమ యనల్పశిల్పకల్పనా వైభవముతో నద్భుతావహముగానీ "వైశాలినీ" దృశ్యకావ్యమును తీర్చిదిద్దినారు. పాత్రోచిత సంభాషణలతో, సంభాషణోచితపదబంధములతో, పదబంధబంధురమగు రసనిర్వహణముతో, రసనిర్వహణాను కూలములగు సుందరకథాకల్పనలతో సర్వాంగ సుందరమై యీ నాటకరాజ మొప్పుచున్నదనుటలో సందియమొకింతయును లేదు.

రసమేనాటకమునకు జీవాతువు. తన్నిర్వహణమునందు నిందుకవిచూపిన యనన్యసామాన్య మగు అవధానము ఇంతంతయనరానిది.

ప్రధానముగానిందు ధర్మవీరరసము పోషింపబడినది. అవీక్షితుని గురుభక్తినిరతితో ప్రారంభమైన ఈ నాటకము మాతాజ్ఞాపాలనకై తాబూనిన "కిమిచ్ఛక" వ్రతాంగమగు పౌత్రభిక్షాదానముతో అనగా మరుత్త కుమారజననముతో ముగియుచున్నది. ఏకావ్యమందైనను ఈ యుపక్రమోపసంహారములే యాకావ్యముయొక్క ప్రధానరస నిర్ణయకారులై యొప్పారును. మహాభారతమును శాంతరసప్రధానముగా నిర్ణయించుపట్ల ధ్వనికారులు ఈ సరణినేయవలంబించి దర్శకులైయేపారినారు.

గురుదక్షిణనొసంగికాని వివాహమాడనను ప్రతిజ్ఞ "ఆచార్యాయ ప్రియంధనమాహృత్య ప్రజాతంతుమ్ మావ్యవచ్ఛేత్సీః" అను శ్రుతిచోదిత ధర్మానుష్ఠానతత్పరతనువే నోళ్లచాటుచున్నది. గురుదక్షిణ సంపాదింపవలెనన్న దృఢ కేళవధ యాచరణీయమగుచున్నది. తదనుకూలముగా నిందు ప్రతినాయకనికృతంత్రములు నాయక విజయమున్నగు కథాంశములు ప్రస్తుతము లైనవి. ఈ పట్టములన్నిటిలో కవితదంగమగు యుద్ధవీరమును సముచితముగా నిర్వహించి యున్నాడు. సుప్రతాదేశమునందును వైశాలిని "విశ్వవిజయినేవరింతు"నను ప్రతిజ్ఞతన నాకర్షించుటయుతా నామెను వివాహమాడుటకు పూనుకొనుటలైనది. తత్కథాంశ నిర్వహణావ సరమున కవి మిక్కిలి నేర్పుతో చిత్రించిన శృంగారరస నిష్యందము రసికుల నానందజలధుల నోలలాడించుచున్నది.

ఇట్లేనాటకమున ప్రధానరసముగా ధర్మవీరము మరియు తత్ప్రధానరసాంగములుగా యుద్ధవీరశృంగారములు నచ్చటచ్చట నాయాహాస్యాదిరసములును పోషింపబడి దీనినెల్లెడ రసో చితబంధురముగా సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దినవి. నాటకమునందంతటను, గురుభక్తి,

వినయ శీలానురక్తి, శరణాగతరక్షణ, ఆర్తత్రాణ విచక్షణ, మాతృభక్తిపితృభక్తిమున్నగు వాని పట్టనాయకుడు ప్రదర్శించినయమితోత్సాహమే ఆయాయంకములలో చర్వితమగుచుండుటచే నీనాటకమునందలి, ప్రధానరసము "ధర్మవీర" మనుటలో విప్రతిపత్తియుండరాదు. తదను బంధిగానే యితరరసములు పోషింపబడినవి. "కామినీవిరహాంధుడనై గంతవ్య పథముమరచిన నాకుదయతో దారిచూపితివి." అను నవీక్షితునివాక్యము శృంగారము ప్రధానరసముగాదని చెప్పుచున్నది.

మాతృభక్తిని వ్యక్తముచేయుపట్ల 'కనరానినను నీవు" అను 171 వ పుటలోని పద్యము గమనార్హము. ఆటులేద్వర్ధకేశి వధయననెట్టిదో వైశాలిని పలికినపలుకులవలనదెలియ వచ్చును "ఒకవంక ప్రజానంక్షేమము మరియొకవంక గురుదక్షిణా సమర్పణము, ఇంకొక వైపు మనయుభయుల కల్యాణకారకమైనదీ దృఢకేశివధము' ఈ వాక్యముల గమనించినచో యుద్ధవీరమును ప్రధానరసముగాజాలదు.

ఈ నాటకమును చదువుచున్నంతసేపును. ఈ కవివతంసుని బహుముఖ ప్రజ్ఞాపాటవము సూక్తినిధిత్వమును ఎడనెడవెల్లడియగుచు నాశ్చర్యచకితుల నొనర్పుచుండును. వీనికి నుదాహరణముగా :

1. సంగీతసాహిత్యముల తారతమ్యము (P. 2) 2. రాజుప్రజలపరస్పర సంబంధము (P. 21) 3. ధర్మార్థకామమోక్షములతత్వము (P. 23-24) 4. కళలు-కళాప్రకాశస్థానములు (P.24) 5. గురుశిష్యసంబంధములు P.24) 6. ఈశ్వరాస్తిత్వవాదము (162-163) 7. పార్వతీపరిణయము P. 88-91) 8. హింసయేదియేదికాదు (P. 159) 9. ధర్మము యొక్క నిజస్వరూపము (P. 164) 10. గంగాప్రాశస్త్యము = మున్నగునవెన్నియోకలవు.

ఆర్టేసూక్తులెన్నియో సహజసుందరములై సుబోధములై పఠితలకంఠస్థమొనర్చుటకు ప్రేరేపించుచుండును. మచ్చునకుకొన్ని(దుష్టకీర్తి) 24 వ పేజీ (గురుకృపా) P. 24 (అరయ ధనికులు) P 31 నంవదన్వితు) P. 33 (ముల్లుగొని( P. 142 ఇట్లుతనసూక్తిప్రియత్వము నాటకమున చాటియున్నాడు. "తగినసూక్తులన్ రసికుల దన్పుకావ్యమగునెడనె కవివరు మూల్యమగణితమగు" అను కవిసూక్తి ప్రకారముసూక్తులను క్రొగొంత్తభావనలతో చేయు వర్ణనలెంతో హృదయావర్జకములై యున్నవి. పేజీ 34 లో 'అకట నాల్గుశీర్షముల" వైశాలిని వర్ణన 166 పేజీలోని "శశిప్రతిబింబమాస్యమ్మయి" అను గంగావర్ణనముల తీరుఅద్భుతములనక తప్పదు. ఈః సుగందును వర్ణించిన స్వభావోక్తి ఎంతహృద్యముగానున్నదో చెప్పలేము. చదివియే తీరవలెను. "కనులల్లార్చును" 215 వ పేజీలో "చదువుకొననట్టి పామరజనులకైన, అఖిల భాషావిభేదములవల్ల దోసి రంగురూపుల సౌందర్యరసజగత్తు కనులదావించు నీచిత్ర (దృశ్య) కావ్యరసము" అనునట్లు ఈకవిచిత్రవర్ణన సందర్భమందలి ఈపద్యము ఇతని కావ్యవిషయమందును యథార్థమగుచున్నది.

ఇట్టికవితంసుడుతానొక అపూర్వదృశ్యకావ్యరత్నమును ఆంధ్రభారతి కంఠసీమనలంకరించితనకేకాక సహృదయులందరికిని ధన్యతనాపాదించినాడనవలెను. నేనీ సందర్భమును పురస్కరించుకొని యీ మహాకవికి నాహృదయ పూర్వకాభినందన లందజేయుచున్నాను.

కె. రాజన్నశాస్త్రిగారు M.A.M.O.L.
సంస్కృత సాహిత్యరత్న, విద్యాప్రవీణ సాహిత్యరత్నాకర,
సంపాదకులు ఉపన్యాసకులు S. P. కాలేజి హైదరాబాద్.

# పీఠిక

శ్లో॥ "కార్యోపక్షేపమాదౌ తనుమపి రచయన్ తస్యవిస్తారమిచ్ఛన్,
బీజానాం గర్భితానాం ఫలమతి గహనం గూఢ ముద్భేదయంశ్చ,
కుర్వన్ బుద్ధ్యా విమర్శం ప్రసృత మపి పునస్సంహరన్ కార్యజాతం,
కర్తావా నాటకానా మిమమను భవతిక్లేశ మస్మద్విధోవా".

కుటిల నీతి విచక్షణుఁడైన చాణక్యుఁడు అండగా నిలిచి యున్నప్పుడు చంద్ర గుప్తుని నందరాజ్య భ్రష్టునిచేయుటకై తాను విస్తరించి రచించు రాజనీతిలో ఎంతో క్లేశం ఉందనీ, ఆక్లేశం ఇతివృత్తరసభావ సంధి పంచకాది రచనాత్మకమైన నాటకాన్ని విరచించడంలో కవికి మాత్రమే ఉంటుందనీ అమాత్యరాక్షసుడన్న మాట ఇది మహాకవియు, నాటకకర్తయు, అయిన విశాఖ దత్తుని దృష్టిలో వైరినిర్మూలనము చేయదలచుకున్న ఒక మహామంత్రికి కలిగేక్లేశమూ, నాటకకర్తకు కలిగేక్లేశమూ సమాన స్థాయిలో, సమాన పరిమాణంలో ఉంటవి అన్నభావ మును, సంస్కృత ముద్రారాక్షస నాటకంలోని పైశ్లోకం వ్యక్తపరుస్తున్నది.

'కావ్యేషు నాటకం రమ్యం' 'నాటకాంతం కవిత్వమ్' అన్ననూక్తులు దృశ్యకావ్యములకు అందులోను నాటకానికి ఉన్న మహత్త్వాన్ని సూచిస్తాయి. రమణీయార్థ ప్రతిపాదక శబ్దరచనా ధురంధరత, రసభావాభివ్యక్తీకరణదక్షత, కథానంవిధానచతురిమ, అవాంతరార్థకల్పనా పటిమ, వివిధలోకవృత్తవిషయాభిజ్ఞత మొదలయిన రచనా సామగ్రి కవి హృదయంలో నిండుగా ఉన్ననాడు గాని ఉత్తమనాటకం పుట్టదు ''నట = అవస్పందనే' అను సంస్కృత ధాతువు నుండి నాట్యం, నాటకం, నటుడు మొదలయిన శబ్దాలు పుట్టినవి. అతి ప్రాచీనమైన కాలంలో నాటకశబ్దం సామాన్యవాచకంగా ఉండి, నాట్యప్రధానములైన రచనల నన్నింటినీ తనలో ఇముడ్చుకొని ఉండినట్లు కొన్ని ప్రాచీన రచనలు తెలుపుతున్నవి

రూపకశబ్దం అర్వాచీనం ' రూపయితి, రూపయిత్వా'' అనుపదములు, నటులకు సూచ నార్థమై ఉపయోగింపబడినట్లు తెలస్తున్నది. నృత్తం, నృత్యం, నాట్యం అనేశబ్దాలు అదే పేర్లతోనే ప్రదర్శింపబడుతూ వుండిన దృశ్యకావ్య సముదాయమే ప్రప్రథమమున ఉండినట్లు తెలుపుతున్నవి తరువాత తరువాత నాట్యప్రధానమైన రచనలు ఎక్కువగా బయలుదేరి నృత్త, నృత్యాలను తమకు అంగములుగా చేసుకొన్నవి. దశవిధ రూపకములు నాట్యప్రధానమైనవే కనుక వాటికి ''నాటకములు'' అన్నసామాన్య నామధేయముండుట వింతకాదు. నాట్యపరి భాషతో కూడిన 'నాటకము' అనేది ఒకటి ఉండడం, చతుర్విధాభినయములలో 'రూపం' అనగా వేషధారణం ముఖ్యం కావడం, అనే రెండు కారణములచేత దశరూపకకర్తకాలానికి దృశ్యకావ్య నముదాయానికి 'నాటకం' అన్న సామాన్యనామంపోయి ' రూపకం'' అన్న పేరు

వచ్చింది. అప్పుడు నాటకం దశవిధరూపకములలో ఒకటిగా మారి పోయింది. మనం సంస్కృతాంధ్రనాటకములనుగురించి ముచ్చటించు కోవడమంటే "రూపకములను, ఉపరూపకములను" గురించి ముచ్చటించు కొనుటయే. సంస్కృత భాషాభిజ్ఞులు ఏదినాటకమో, ఏది త్రోటకమో, ఏది ప్రకరణమో, ఏది ప్రహసనమో నిర్ణయించి చెప్పుటవలన చదువుకొనువారికి క్లేశములేకుండ రూపకలక్షణజ్ఞాన రసానుభవములు కలుగుచున్నవి. కుప్పతెప్పలుగా వచ్చిపడుతున్న తెలుగు నాటకములలో ఏవియెట్టి లక్షణములతో వ్రాయబడియున్నవో రచయితలు చెప్పక పోవుటచేతను, వాటికి పీఠికలు వ్రాసేవారైనా వివరింపక పోవుటచేతను, తెలుగులో అన్ని నాటకములు "నాటికలు" అన్న పేర్లతోనే ప్రచారం పొందుతున్నవి. అందువలన కేవలాంధ్ర భాషావిదులకు, చదువరులకు, దృశ్యకావ్య లక్షణములు సరిగా తెలియుటలేదని చెప్పవలసి ఉంటుంది

నాట్యశాస్త్రం, నాట్యదర్పణం, అభినయ దర్పణం మొదలయిన గ్రంథాలు నృత్త, నృత్య, నాట్య స్వరూపాలను చక్కగా వివరించినవి. శారదా తనయుడు తనభావ ప్రకాశములో, నాట్యవేదమును గురించి మనువు సూర్యభగవానుని అడుగుటయు, సూర్యుడు శివుని అనుమతి చేత, ఒకప్పుడు నందీశ్వరుడు బ్రహ్మకు ఉపదేశించిన వృత్తాంతము బ్రహ్మకు మానస పుత్రులుగా ఒకముని, అయిదుగురు శిష్యులు ఉద్భవించుట, వారు నాట్యవేదమును వివిధము లయిన అంగములతో అభ్యసించి లోకమున ప్రదర్శించుట, వారికి "భరతులు" అన్న పేరు వచ్చుట మొదలయిన అంశములతో ఒక చమత్కారమైన కథను వ్రాసినాడు. శారదా తనయుని కథనం ప్రకారం "కోహలుడు", "శాండిల్యుడు" మొదలయిన భరతులు లోకాను గ్రహ బుద్ధితో నాట్యశాస్త్రం రచించినట్లు తెలుస్తున్నది.

ఆదిమకాలంలో నృత్త, నృత్య, నాట్యములను గంధర్వులు, అప్సరసలు దేవతల యెదుట ప్రదర్శించే వారట. అంటే ఆర్షయుగంలో ఋషి కుటీరాలముందు ఇవి ప్రదర్శింపబడే వన్నమాట.

తాళం, లయ, మాత్రం ఉండి నేత్ర భ్రూముఖ హస్త భుజాద్యవయవముల యొక్క ఆకుంచన, ప్రసారణములతో చేయునది నృత్తం. లయబద్ధమైన ఆ అవయవ చలనమే ఒక వినోదాత్మకమైన దృశ్యం.

ఆ నృత్తంలో భావం, గానం కూడా చేరితేనేగాని ఎక్కువ హృదయంగమంగా ఉండదని కొంతకాలం తరువాత తోచిన కారణంగా 'నృత్యం' ఆవిర్భవించినది. ఈ నృత్త, నృత్య శబ్దాలు రెండూ "నృతీ=గాత్ర విక్షేపే" అన్న సంస్కృత ధాతువు నుండి నిష్పన్నములైనవి. నృత్యంలో ఆంగికాభినయ బాహుళ్యం. పదార్థాభినయం ఇమిడి ఉండడంచేత భావాశ్రయమై, నృత్తంకంటే ఎక్కువగా సహృదయుల మన్ననకు పాత్రమైంది. లాక్షణికులు నృత్యాన్ని 'మార్గ' మనికూడా వ్యవహరించినారు. నృత్తనృత్యాలు లలితంగా ఉంటే లాస్యం. ఉద్ధతంగా ప్రదర్శింపబడితే తాండవం.

నాట్యం రసాశ్రయమైనట్టిది. "ఆంగికం, సాత్త్వికం, ఆహార్యం, వాచికం" అనే అభినయ చతుష్టయంతో కూడి నాయికా నాయకాద్యను భూతిని అనుకరించుటం రసాశ్రయ నాట్యం. నాట్యశబ్దం సాత్త్వికాభినయ బాహుళ్యాన్ని సూచిస్తుంది. నటుడు నాయకాది తాదాత్మ్యమును ప్రదర్శించుటయే నాట్యమని చెప్పవచ్చు. రసభావాను కూలమైన నటుని చేష్టలన్నీ నాట్యశబ్ద వాచ్యములే అవుతాయి.

నృత్త, నృత్యములు అంగములుగా ఉండి నాట్యం ప్రధానమై యున్న దృశ్యమే నాటకం, లేదా రూపకం. దృశ్యకావ్యాలకు సమూహ వాచకంగా 'రూపకం' అనే శబ్దం వాడుకలోకి వచ్చిన తరువాత "తద్రూపారోపాత్తు రూపకమ్" అనిదానికి లక్షణం నిర్వచించాడు. దశ రూపకకర్త. అనగా అనుకార్యులైన రామ హరిశ్చంద్రాదుల రూపం నటునిపై ఆరోపింప జేసేది కాబట్టి 'తత్' ఆకావ్యం 'రూపకమ్' అని వ్యవహరింపబడు తుందని అర్థం. అవస్థాను కరణరూపమైన అభినయం రూపక సముదాయంలో ముఖ్యం అన్నమాట.

'రూపకం' ఒకటిగా ఉండక, పదిరూపకములు, పదునెనిమిది ఉపరూపకములు, ఇంకను కొన్ని అధికరూపకములు ఆవిర్భవించుటకు కారణం, ఇతివృత్తం, రసం, నాయికానాయకులు మొదలయిన అంశములలో స్వతస్సిద్ధమైన వైవిధ్యం ఉండడమే.

ఇతి వృత్తం (Plot) స్వభావాన్నిబట్టి ప్రఖ్యాతం, ఉత్పాద్యం, మిశ్రం అని మూడు విధాలు 'ప్రఖ్యాతం' అంటే పురాణేతి హాసములలోకాని, చరిత్రలోకాని ఉన్నకథ. ఆ ప్రఖ్యాతేతి వృత్తాన్ని నాటకకర్త రసాను కూలమైన మార్పులు నాటకవస్తువుగా రచించు కోవచ్చు. కాళిదాసాది మహాకవులు అట్లేచేసిరి. ఈ నాడు మనం దేశచరిత్రలోను, విప్లవ చరిత్రలోను చోటు చేసుకున్న సంఘటనలను గ్రహించి నాటకం వ్రాసుకుంటే అది లక్షణ విరుద్ధంకాబోదు. తప్పక అలాగే చెయ్యాలి మన రచయితలు. కవి కల్పించిన ఇతి వృత్తానికి "ఉత్పాద్యం" అనిపేరు. భవభూతి మహాకవి రచించిన మాలతీ మాధవం, శూద్రకకవి రచించిన మృచ్ఛకటికం, శ్రీ గురజాడ వారి 'కన్యాశుల్కం' వంటి రూపకాలలోని ఇతివృత్తం ఉత్పాద్యం, "మిశ్రం" అంటే, కొంతవరకు ప్రఖ్యాతమై, కొంత కవి కల్పించిన దన్నమాట. "ఈహామృగం" అనబడే రూపకంలో మిశ్రమైన ఇతివృత్తం ఉంటుంది. ఈ విధంగా ఇతివృత్తం మూడు తెగలకు చెందినదై యుండుటచేత, విభిన్నమైన ఇతివృత్తం కలవాటి నన్నిటినీ ఒకే పేరుతో పిలుచుట సముచితంకాదు. గనుక రూపకవైవిధ్యాన్ని అంగీకరించిరి.

ఇకరసం, శృంగార, వీర, కరుణాది భేదములతో ఇది తొమ్మిది విధాలు. విభిన్న రసములుగలవాటి నన్నిటినీ ఒకేపేరుతో వ్యవహరించుట యుక్తంకాదు గదా ! నాయకులుకూడా ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతులని నలుగురుగా అంగీకరింపబడుట, ఉపనాయకులు సైతం పీఠమర్ద, విట చేట, విదూషకాది నామధేయములతో విభజింపబడుటం. ఇంకను ముగ్ధా మధ్యాది నాయికా భేదాలు, అనుకూల దక్షిణాది శృంగార నాయక, స్వాధిన పతికాది శృంగార నాయికాద్యనేక విషయములవైవిధ్యం ఉండడంచేతనే రూపకవైవిధ్యం అంగీకరింపబడింది.

పై కారణములేకాక, మరికొన్ని నాట్యప్రయోజనాలు కారణంగా ఏర్పడిన బహువిధ రూపకములలో ముఖ్యమైనవి, నాటకం, ప్రకరణం, భాణం, ప్రహసనం, డిమం, వ్యాయోగం, సమవకారం, వీథి, అంకం ఈహామృగం, అనే పదీ 'దశరూపకములు' అని పిలువబడుతున్నవి ప్రఖ్యాతోత్పాద్య మిశ్రభేదములతో త్రివిధమైన ఇతివృత్తంకూడా ప్రయోగదశకు వచ్చేసరికి సూచ్యమనీ, అసూచ్యమనీ రెండు విధాలును, మళ్లీ అసూచ్యం దృశ్యమనీ, శ్రావ్యమనీ రెండు విధాలుగాను విభజింపబడింది అంటే రంగస్థలం మీద ప్రధాన పాత్రలచేత ప్రదర్శింపదగినది దృశ్యం, దీనికి ఉపష్టంభకముగా ఉండేవి ఇతర విభాగాలు అనౌత్పాద్యం. సూచ్యార్థాన్ని సూచించడానికి అయిదు పద్ధతులు స్వీకరింపబడ్డాయి. వాటికి "విష్కంభం, చూళిక, అంకాస్యం, ప్రవేశకం, అంకావతారం" అనిపేర్లు. సాగరనంది మొదలయిన లాక్షణికులు ఈ అయిదింటికి "అర్థోపక్షేపకములు" అనిపేరు పెట్టిరి 'అర్థస్యకార్యస్య ఫలరూపస్య ఉపక్షేపకం ఉపస్థాపకం సూచకమ్" అని సాహిత్య దర్పణ వ్యాఖ్యాత అర్థోపక్షేపక శబ్దమును నిర్వచించినాడు. 'విష్కంభం' జరిగినదియు, జరుగబోవునదియు నయిన కథాంశమును సూచించును. పూర్వోత్తర కథా సందర్భ సంగతిని కూర్చుట, రంగస్థలం మీద ప్రదర్శించుటకు వీలులేని సంఘటనలను సూచన చేయుట, కథను సంక్షేపించుట దీని ప్రయోజనములు. ఇది నాటకంలోని మధ్యతరగతి పాత్రల ద్వారా ప్రయుక్త మౌతుంది. ఈ పాత్రలు ఒకటిగాని అనేకముగాని ఉండవచ్చు. భోజుడు ప్రస్తావనకాగానే విష్కంభం ఉండాలన్నాడు. ఇతరులు కాదు, ఏరెండు అంకముల మధ్యనైనను ఇది ఉండవలెనన్నారు. "ప్రకరణం, నాటకం" అనే రూపకాలలో మాత్రమే విష్కంభమును ప్రయోగింపవలెనని నాటక లక్షణ రత్న కోశకారుడు చెప్పెను. శుద్ధ విష్కంభమనీ, మిశ్ర విష్కంభమనీ ఇది రెండు విధములు. సంస్కృత భాషను మాట్లాడదగిన మంత్రి పురోహితాది పాత్రలు కలది శుద్ధవిష్కంభం. ప్రాకృత భాషను మాట్లాడే విదూషక, దూత, దాసీ, భటాది పాత్రలుకలది మిశ్ర విష్కంభం. సంస్కృత ప్రాకృతభాషలు ప్రయోగింపబడుతవి కనుక ఈ విభజన కుదురుతుంది. దేశభాషా నాటకములలో కుదురదు. తెలుగులో ఈ శుద్ధ మిశ్రభేదాలను ప్రవేశపెట్టదలచుకుంటే గ్రాంధిక, వ్యావహారిక, గ్రామ్య భాషలను స్వీకరించి నాటక రచన చేయవలసి ఉంటుంది. శ్రీ వేదం వేంకటశాస్త్రిగారు, మరికొందరు, ఇటీవల ముద్రారాక్షసనాటకం అనువదించిన శ్రీ అవధానం చంద్రశేఖర శర్మగారు అలాచేశారు. ఈ విషయమును ఆంధ్ర దశరూపకకర్త శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు కూడా సూచించినారు. 'చూళిక' అంటే, తెరలో ఉన్న పాత్రలతో అర్థసూచన చేయుటం.

'అంకాస్యం' పూర్వాంకం చివరిలో ఉన్న పాత్రలు ఉత్తరాంక కథను సూచించడం.

'ప్రవేశకం' విష్కంభంవలెనే పూర్వోత్తరాంకముల కథను సూచిస్తుంది అయితే ఇందులో నీచపాత్రలే (దాసి, భటుడు మొ. ఉంటాయి. దీనిని ప్రథమాంకంలో ప్రయోగింపకూడదు. తెలుగు నాటకములలో ప్రవేశకాన్ని ప్రయోగించినప్పుడు గ్రామ్యభాషను ఉపయోగించుటం బాగు.

'అంకావతారం' పూర్వోత్తరాంకములు విష్కంభాదులతో వ్యవహితంగా లేనప్పుడు, పూర్వాంకంలోని పాత్రలు ఉత్తరాంకంలో ప్రవేశించి కథను నడుపుట యే. ఈ పాత్రలే ఉత్తరాంక కథను సూచిస్తాయి

యుద్ధం, దూరప్రయాణం, మరణం, రాజ్యవిప్లవం, స్నానం, అనులేపనం, భోజనాదులు రంగస్థలం మీద చూపుట సాధ్యంకాదు కనుక విష్కంభాదులతో సూచించటమే యుక్తం. రంగస్థలంమీద ద్రౌపదీ వస్త్రాపహరణాదులను చూపుట ఉద్వేజకమేకాని రసపోషకంకాదు. చుంబనం, గాఢాలింగనం మొదలయినవి రంగస్థల ప్రదర్శన యోగ్యములు కావని మన లాక్షణికులు భావించిరి. భారతీయ సంస్కృతికి అవి ఉద్వేజకములేకాని ఆనందదాయకములుకావు. కనుకనే మహాకవి కాళిదాసు, "ముహురంగులి సంవృతాధరోష్ఠం" అన్న శ్లోకంద్వారా దుష్యంతుడు, "శకుంతలను ముద్దుపెట్టుకొనబోయి, భగ్నప్రయత్నుడనైతి"నని విదూషకునితో చెప్పుకున్నట్లు వర్ణించెనేకాని, శకుంతలాదుష్యంతుల చుంబన ప్రక్రియను రంగస్థల దృశ్యంగా చేయలేదు. కనుక నాటకరచనలో అర్థోపక్షేపములైన విష్కంభాదులకు ఎంతో ప్రాధాన్యం ఉంది. దర్శన యోగ్యమై, రసవంతమైన ఇతివృత్తాంశంమాత్రమే అంకములద్వారా ప్రదర్శింపబడవలెనని ప్రాచీన లాక్షణికుల ఆదేశము.

ధర్మార్థకామములలో ఒకటి ముఖ్యప్రయోజనంగా ఉన్న కథాంశమునకు తద్వ్యతిరిక్తమైన ఇతరద్వయంతో కలిగే సంబంధం సంధి. ఇది "ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి, విమర్శసంధి, నిర్వహణసంధి" అని అయిదు విధములు ప్రయోజనసిద్ధికి హేతువులు కాజాలినవి "అర్థప్రకృతులు" ఇవిగూడా "బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యం" అని అయిదు రకములు. ఈ అర్థప్రకృతులు యథా సంఖ్యముగా "ఆరంభము, యత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము" అను పంచావస్థలతో సమన్వయం చెందినప్పుడు ముఖాది పంచసంధులేర్పడును. నాటకకర్త అభివ్యక్తం చేయదలచుకున్న రసంయొక్క బీజం, నాటకము నందలి నాయకాదుల పూనికయే లక్షణంగాకల ఆరంభమనే అవస్థతో సమన్వయించినప్పుడు ముఖసంధి అవుతుంది. నాటబడిన విత్తనం క్రమంగా వృక్షమైనట్లు బీజమనబడు అర్థప్రకృతి మొదట స్వల్పముగా ఉద్దిష్టమై, రానురాను విస్తరిల్లును. అప్రధానమైన కథాంశంవల్ల ప్రధాన కథకు విచ్ఛేదం కలుగ నుండగా దాన్ని నివారించే అర్థప్రకృతి 'బిందువు' ఇది ప్రయత్నమనే అవస్థతో సమన్వయించి నప్పుడు 'ప్రతిముఖసంధి' యేర్పడును. ప్రధాన కథకు అంశమై దాన్ని పోషించుకొనుచు కొంత దూరము దానితోపాటునడిచే కథకు 'పతాక' అనిపేరు. శ్రీ మద్రామాయణంలోని సుగ్రీవుని కథవంటిది. ఈ పతాక ప్రాప్త్యాశతో (అవునో ! కాదో ! అన్న ఉపాయాపాయశంకలతో కార్యసిద్ధి అనిశ్చితం కావడం ప్రాప్త్యాశ) సమన్వయించి నప్పుడు గర్భసంధి. 'ప్రకరి' అనేది ఒక అవాంతరకథయేకాని అది పతాకవలె పెద్దదిగా ఉండదు. చిన్నగా ఉన్నప్పటికిని ప్రధాన కథకు ఉపకరించును. రామాయణంలోని జటాయువు వృత్తాంతంవంటిది. ఈ ప్రకరి, 'నియతాప్తి' (అనగా ఈప్సితార్థం తప్పక సిద్ధింపగలదన్న నమ్మకం) అనే అవస్థతో కూడినప్పుడు విమర్శసంధి అవుతుంది. ముఖ్యప్రయోజనమును

నిర్వహింపగలిగిన కట్టకడపటి కథాంశం 'కార్యం' అనే అర్థప్రకృతి. ఏ ఉద్దేశంతో నాటకం ఆరంభింపబడినదో, ఏదిలభిస్తే నాటకం ఉపసంహరింపబడుతుందో అదీ 'కార్యం' అంటే ఆకార్యం 'ఫలాగమం' అనబడే అవస్థతో కూడినప్పుడు 'నిర్వహణసంధి' అన్నమాట. ఈ పంచసంధులకు ప్రత్యేకంగా ఉన్న అంగాలన్నిటినీ కలిపితే 64 అవుతాయి. నాటకకర్త ఈ చతుష్షష్ట్యంగ సమన్వితంగా కథా వస్తువును నడుపుతూ రసస్ఫూర్తిని కలిగింపవలసి ఉంటుంది.

ఈ చతుష్షష్ట్యంగ సమన్వితమైన రచనకు ప్రయోజనమేమి యనగా "వివక్షితార్థ ప్రతిపాదనము. గోప్యార్థ గోపనము, ప్రకాశ్యార్థ ప్రకాశనము, అభినయ రాగసమృద్ధి, చమత్కార పత్వము, ఇతివృత్త విస్తరము, మొదలయినవి. వీటిలో కొన్నిటిని విడువవచ్చును. కాని 'నాటకం' అనే దానిలో పంచ సంధులు తప్పవు. ఉత్తమగాయకుని గానంలో సప్తస్వరాలు, వాటిమూర్ఛనలు, తాళము, లయ, మొదలయిన సంగీత లక్షణం అంతా అంతర్వాహినియై ప్రవహిస్తూ వున్నట్లు, నాటకంలోని ఆయాపాత్రల సంభాషణములలో ఈ సంధ్యంగములు మొదలయిన లక్షణములన్నీ అంతర్గతంగా ఇమిడివుండవలెను. అప్పుడే అది సహృదయ హృదయావర్జకం అయిన నాటకం అవుతుంది.

'అంకం' అనేదికేవలం కథా విభాగం కోసం యేర్పడిన 'అధ్యాయం, ఆశ్వాసం' వంటిదికాదు. దానికి గూడా కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. అంకంలో 'దృశ్యం' కాతగిన ఇతివృత్తంమాత్రమే ప్రదర్శింపబడవలెను. నాయక చరితం ప్రత్యక్షముగా నుండవలెను. ఎన్నో అవాంతర ప్రయోజనాలకు, కథాసన్నివేశాలకూ వివిధరసాలకూ అంకం ఆశ్రయంగా ఉంటుంది. దూర ప్రయాణయుద్ధాదులను అంకంలో ప్రదర్శింపరాదు. ఏ అంకంలోనైనా మూడు నాలుగు పాత్రలకంటే ఎక్కువ ఉండరాదు. అంకంలోని కథ ఒకనాడు జరుగతగినది గానే ఉండవలె. ప్రతి అంకంలోను నాయకుడుగాని, నాయికకాని కనపడవలెను. అంకాంతంలో పాత్రలన్నీ నిష్క్రమించవలెను. ఇన్నిచూచుకొనిగాని అంక విభాగం చెయ్యాడానికి వీలులేదు.

"ఆముఖం, ప్రస్తావన" అనేవి నాటకం యొక్క ప్రారంభ భాగానికి పేర్లు. భాసనాటకములలో ఇది 'స్థాపన' అనే పేరుతోవుంటుంది. ఇది సూత్రధారునిచేత నడుపబడుతుంది. "అనుష్ఠానం ప్రయోగస్య సూత్రం, తద్ధారయతీతి సూత్రధారః" అని సూత్రధారశబ్దనిర్వచనం. సూత్రధారుడు కవినాయకకథావస్తువుల గుణాలను ఎరిగినవాడును, రంగాలంకరణ చతురుడును, నటబృందనాయకుడును అయి ఉండును. అతడు నటితోగాని, మారిషునితోగాని, విదూషకునితోగాని సంభాషించుచు ప్రస్తావనను నడుపును. ఈ ఆముఖానికి "కథోద్ఘాతము, ప్రవర్తకము, ప్రయోగాతిశయము, అని మూడు అంగాలున్నాయి. ఇవికాక "వీధి" అనబడే రూపకంయొక్క అంగాలన్నీ ఆముఖానికి అంగాలవుతాయి. ఇలాంటి సాంగమైన ఆముఖం, లేదా ప్రస్తావనను, కవి నాటకం మొదట రచింపవలసి ఉంటుంది.

నాటకం మొదటి పద్యానికి 'నాంది' అని పేరు. అందులో నాటకంలోని ఇతివృత్తం సూచితంకావలెను. ప్రస్తావనలోని ఋతువర్ణనం ఐచ్ఛికమైనను అది కథయే ఋతువులో జరుగనున్నదీ సూచించును. శృంగార రస ప్రధానమైన రూపకంలో వసంత ఋతువర్ణనము, వీర రస ప్రధానమైన వాటిలో శరదృతు వర్ణనము ఉండుట సముచితం, ఆ విధంగా మహకవులు రచించిరి.

'నాటకం' అనబడు రూపకములో ప్రఖ్యాతమైన ఇతివృత్తము, వీరశృంగారములలో ఒకటి అంగిరసము, ధీరోదాత్త నాయకుడు, అయిదు మొదలు పదివరకు అంకములు, పంచ సంధులు, నాందీ సహితమైన ప్రస్తావన ఉండవలెను. ఇతివృత్తంలో రసానుకూలంగా మార్పులు, చేర్పులు చెయ్యవచ్చును. నాటకం వ్రాయడమంటే ఇన్ని తెలిసి వ్రాయవలెనన్న మాట.

ఇతర లక్షణములతో పాటు నాటక రచనలో "రసస్ఫూర్తి" అవ్యాహతంగా ఉండేటట్టు చూడడం కవికి ముఖ్యకర్తవ్యం. నాటకకర్త వ్యంజనావృత్తిని చక్కగా ఎరిగిన రచయితయే ఉండవలెను. ప్రధానరసమును అంగరసములు తిరోహితం చేసేవిగా ఉండరాదు. అంటే శృంగారరసప్రధానమైన నాటకములో మధ్యలో వచ్చిన వీరాదిరసప్రధానమైన అవాంతర కథను, లేదా సన్నివేశమును, సుదీర్ఘంగా వర్ణించి సహృదయులు ప్రధానరసాన్ని మరచిపోయే దశకువచ్చునంతవరకు వర్ణింపగూడదని భావము, విభావము, అనుభావము, సాత్త్వికభావము, సంచారి భావము అనబడు భావసామగ్రిచేత సముల్లసితమై, ఆస్వాదయోగ్య దశకువచ్చిన రత్యాదిస్థాయి భావము రసాత్మనా సాక్షాత్కరిస్తుంది. అనగా శృంగార ప్రధానమైన రచనలో స్థాయిగా ఎన్నుకోబడిన రతిభావము అవాంతరంగావచ్చే సజాతీయ విజాతీయ భావములచేత విచ్ఛిన్నంకారాదు. సహృదయ చర్వణ యోగ్యమయ్యేవరకూ నిలిచి ఉండవలెను. ఆ విధముగా నిలిచి ఉండగలిగిన స్థాయి (రతిభావము) భావమే శృంగారరసంగా సాక్షాత్కరింప గలుగుతుంది. అసలు రసప్రపంచమే ఆధ్యాత్మికం. అనగా చిత్తవృత్తులు చిద్రూపమైన ఆత్మను అందుకోవడం. ఉత్తమనటుడు ప్రదర్శించుచున్న నాట్యము వలన సహృదయుని మనోవ్యాపారములు తదాకారాకారితము లౌను. రామాదుల వేషం ధరించిన నటుని చూచిన సహృదయునికి నాట్య ప్రభావంవల్ల ఒకభావనకలిగి, ఆత్మకల్పితమైన (తనలో కల్పించుకొన్న రామాది భావంతో ఆచ్ఛాదిత మౌతుంది. అంటే ప్రేక్షకుడు తానే రాముడైనట్టు భావించును. తరువాత రంగస్థల ప్రదర్శితములైన ఉద్దీపన విభావాదులు, సాత్త్వికాదులు చిత్తరూపాన్ని పొంది ఆత్మీయంగా పరిణమిస్తాయి. అవిచ్ఛిన్నంగా సాగుతూ చక్కగా పరిపుష్టమైన రత్యాదిస్థాయి, ఆవరణ భంగాన్ని కలిగింపగా ఆత్మధర్మమైన ఆనందం అంతటను వెల్లివిరిసి, సహృదయుడు విగళిత వేద్యాంతరమతియై రసాస్వాద నిమగ్నుడౌతాడు. రూపకంలో ఏస్థాయి (రతి, హాస, శోక, క్రోధాది) ప్రయోగింపబడినను సహృదయాస్వాదన దశకు వచ్చేసరికి అది రసాత్మనా పరిణమించి, ఆనందైక హేతువుగానే యేర్పడుతుంది. ఆలంబన విభావములయిన నాయికా

నాయకుల యందు సుఖముగాని, దుఃఖముగాని ఏదిప్రదర్శింపబడినను సహృదయుని యందు మాత్రము అది అమందానం దాత్మమైన సంపూర్ణ రసముగానే గోచరిస్తుంది.

నాటకకర్త రసలక్షణమును నాట్యలక్షణమును చక్కగా తెలిసికొని యుండుట తోపాటు, నాయకభేదములు, నాయికాభేదములు, ఉపనాయకులు, శృంగార నాయికలు, నాట్యోక్తులు, ధీరోదాత్తాదులు, అనుకూలాదులు భద్రకదత్తికాది భేదములు, రసమంజరీకారుడు చెప్పిన మువ్వది యారు నాయికా భేదములు, విటచేట విదూషకాదులు, లింగినీ శిల్పినీ ప్రభృతి చేటీ విభేదములు, తెలిసికొని అవి నాటకంలో ఎలా ఉపయోగపడగలవో చూచుకోవలెను. ఇవికాక ఇంకను ఎన్నో అంశములు నాటకకర్తకు తెలిసి ఉండవలెను. కనుకనే "నాటకకర్తక్లేశం వైరనిర్యాతనం చేయదలచుకొన్న మహామాత్యునిక్లేశ మంతటిది" అని రాజకవియైన విశాఖదత్తుడు తనముద్రారాక్షస నాటకంలో అన్నాడు.

ఇక తెలుగు నాటకాల ప్రసక్తివచ్చినచో యక్షగానాలు, తోలు బొమ్మలాటలు వంటివి మాత్రమే ప్రాచీన రూపక రచనలు. "పాత్రోచితభాష" అనేది నాటకరచనా సామగ్రిలో ముఖ్యమైనదికావడంచేత ఆ చిక్కు సమస్యను విడదీయలేక ప్రాచీన విద్వత్కవులందరును సంస్కృత నాటకములను తెలుగు ప్రబంధములుగా రచించిరి. మలయ మారుత కవుల "ప్రబోధ చంద్రోదయము, పినవీరభద్రుని, శృంగార శాకుంతలము" బిజ్జుల తిమ్మభూపాలుని "అనర్ఘరాఘవము మొదలయినవి ఈ తెగకు చెందినవే. ఇక ఈ శతాబ్ది ప్రారంభమునుంచి మా సంస్కృత నాటకములలో ముఖ్యమైన వన్నింటిని యథాతథంగా పాత్రోచితభాషను ఉపయోగించి కొందరు, ఉపయోగింపక కొందరు అనువదించినారు. అనువదించుచున్నారు, ధర్మవరంవారి 'సారంగధర' వేదంవారి 'ప్రతాప రుద్రీయం' మొదలయినవి తెలుగున వెలసిన స్వతంత్ర నాటకములు నాటకలక్షణముల ననుసరించి కొందరు, అనుసరింపక కొందరు వ్రాసిన తెలుగు నాటకములు కుప్పతెప్పలుగా ఉన్నవి. వాటినన్నిటినీ పరిశీలించి వర్గీకరణము చేయవలసినపని సాహిత్య విమర్శకులు చేయవలసియున్నది.

నాటక ప్రపంచ పరిస్థితి ఈ విధముగానుండగా, శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల వారు పోతన చరిత్ర మహాకావ్యమును వ్రాసి ఆంధ్రదేశమును రసాబ్ధిలో నోలలాడించుటతో పాటు, ఉత్తమ నాటకరచనకూడచేసి సహృదయ హృదయాహ్లాదమును చేకూర్చుటకై యత్నించి 'వైశాలిని' యను సలక్షణ స్వతంత్రనాటకమును ప్రకటించుట తెలుగువారి యదృష్ట మనక తప్పదు. నాటకలక్షణ సామగ్రినంతటిని జీర్ణించుకొని, రసానుకూలముగా కొన్నిలక్షణములను పాటించియు, కొన్నిటిని ఉపేక్షించియు రచింపబడిన శ్రీమాన్ ఆచార్యులవారి 'వైశాలిని' నాటకము ఒక ఉత్తమ రచనయనుట అతిశయోక్తికానేరదు.

## ఇతివృత్తము—మార్పులు :

నాటకమును రచించుటలో కవియెన్నుకొనవలసిన ముఖ్యసామగ్రియితి వృత్తము (Plot) అది ప్రఖ్యాతము అనగా పౌరాణికముగాని, ఐతిహాసికముగాని కావలయును. అందువల్ల ఆచార్యులవారు మహాభారతమునందు స్వల్పముగాను, మార్కండేయ పురాణమునందు విపులము గాను వర్ణింపబడిన, అవేక్షిత వైశాలినుల ప్రణయ వృత్తమును ఇతివృత్తముగా స్వీకరించినారు. శకుంతలాదుష్యంతులకు జన్మించిన భరతుడు భారతచక్రవర్తియైనట్లు, వైశాలినికి అవేక్షితునికిని ఉదయించిన మరుత్తరాజు మహాచక్రవర్తిగా, పుణ్యశ్లోకుడుగా నుండుటచేతనే అతని జన్మమునకు పూర్వభావియైన అవేక్షిత వైశాలినుల ప్రణయగాథను కథావస్తువుగా స్వీకరించుటలోనె మిక్కిలి ఔచిత్యముకలదు. కుమారస్వామి పుట్టుకకు హేతువైన పార్వతీ పరమేశ్వర దాంపత్యమును, భరతుని జన్మమునకు కారణమైన శకుంతలాదుష్యంతుల ప్రణయమును, స్వారోచిషమను సంభవమునకు మూలమైన వరూథినీ ప్రవర శృంగారమును పూర్వకవులు ఇతివృత్తముగా స్వీకరించుటలో నెంతయౌచిత్యమున్నదో అంతయౌచిత్యమీయితి వృత్తమునందున్నది.

మార్కండేయ పురాణమునందలి మూలకథననుసరించి ''బాలాశ్వదను నామాంతరముగల కరంధముడను రాజు వీర్యచంద్రుడను రాజుకూతురైన 'వీర' యనునామెను స్వయంవరమున పెండ్లియాడెను. ఆ దంపతులకు పుత్రుడుకలుగగా, వారు దైవజ్ఞులను పిలిపించి "పుట్టిన శిశువు నక్షత్రలగ్నములు శుభగ్రహావేక్షితములై యున్నవియే కదా!" అని ప్రశ్నించిరి. దైవజ్ఞులు ''శిశువు గురుశుక్రచంద్ర బుధులచేతనవేక్షితుడై యున్నాడు'' అని పలుసార్లు సంతోషముతో వలుకుచు పాపగ్రహ వీక్షణములేదని చెప్పిరి. కరంధముడు జోస్యులను చూచి మీరు పలు మార్లు ''అవేక్షితుడు, అవేక్షితుడు'' అని పలికితిరి కావున ఈ బాలుడు ''అవేక్షితుడు'' అను పేరున వ్యవహరింపబడుగాక యని నామకరణముచేసెను. దీనిని వరదాచార్యులుగారు ప్రకృత నాటకమునకు నాయకుడు కాదగిన వానిపేరు జోతిశ్శాస్త్ర సమ్మతముగాకాక రసానుకూలముగా నుండిన బాగుండునను తలంపుతో ''అవీక్షితుడు'' అనిమార్చిరి. ఆమార్పును, ఆశ్రమమునకు వచ్చుచున్న ఈ రాజకుమారుని జగన్మోహనమూర్తిని చూచిన సువ్రతుడను ముని ''అందము మేల్వయసునుగను, విందుగఁ జతఁగూడె భువి ''నవీక్షితుఁడీ'' దృక్ సుందరుడు విశ్వ విజయిగ, కందమ్ముల వెలుగు దివ్యకాంతులె తెల్పున్'' అని పల్కుటద్వారా నమర్థించినారు. ఇంత చక్కని రాజకుమారు డెక్కడను కనబడలేదని ఒకమునియే ఆశ్చర్యపడగా ఇకనాయిక యైన వైశాలిని ఇతనిని చూచి అనురాగవతియగుట యుచితమేకదా! మూల కథ ననుసరించి కూడ ఇతడు మహా సౌందర్యవంతుడు వనుక ఆచార్యులవారి సమర్థనము బాగున్నది. పెక్కు రాజకన్యలు ఇతనిని వరించినట్లు చెప్పి మార్కండేయ పురాణము ప్రధానముగా హేమవర్మత నూజ 'వర' యనునది. సుదేవతనయయైన గౌరి, బలినందనయైన భద్ర, వీరాత్మజయైన లీలా వతి. వీరభద్ర పుత్రికయైన దారిక, భీముని కుమారి మాల్యవతి, విదర్భరాజు కూతురు సముద్వతి ప్రేమాను రాగములతో వారికై వారే వరించినట్లు చెప్పుచున్నది. కాని ఈ ప్రసక్తి

నంతటిని శ్రీ ఆచార్యులవారు రసదృష్టితో విడిచిపెట్టినారు. వైశాలినీ స్వయంవరమునకేగిన యవీక్షితుని కిందరు భార్యలుముందే యుండిరని నాటకమున చెప్పుట రసభంగ ప్రసంగమే కదా! అందువలన ఆచార్యులవారు నాయకుడైన యవీక్షితుడవివాహితుడై యుండినట్లే యభివర్ణించి మూలకథకు మెఱుగులు దిద్దినారు.

మూలకథాను సారముగా పెక్కండ్రు రాజకన్యల యా స్వయంవరముల యందు గెల్చి తెచ్చుకొన్న అవీక్షితుడు విదిశా పురాధిపతియైన విశాలుడను రాజు తనకూతురు వైశాలిని పెండ్లి చేయదలచి స్వయంవరమును ప్రకటింపగా అచ్చటికి వెళ్లి స్వయంవరమునకు వచ్చిన రాజుల నందఱిని పరాజితులను చేయును. వివర్ణవదనులు, విషణ్ణహృదయులునైన ఆ మహీపతులుకూడ బలుకుకొని యవీక్షితునిపై బడి యుద్ధము చేయుదురు.

ఏడు వందలకు మించియున్న ఆ వీరనరపాలురు ఒక్కడై యున్న అవీక్షితుని నిరాయుధుని జేసి విదిశాధిపతి సహాయమున కారాగారమున బంధింతురు. ఈ వార్తతెలిసిన అవీక్షితుని తండ్రియైన కరంధమ మహారాజు సైన్యసమేతుడై విదిశకు వచ్చి విశాలునిపై యుద్ధము ప్రకటించును. పరంతపుడైన కరంధముని శౌర్యమునకు భయపడి విశాలుడు తనకూతురుతోపాటు అవీక్షితునిగూడ కరంధముని వద్దికి తీసుకపోయి, తనకుమార్తెను వివాహమాడు మని కరంధమునియెదుట నవీక్షితుని ప్రార్థించును. కరంధముడు దాని కంగీకరించును. కాని శత్రువుల చేతిలో ఓడితినన్న పరాభవ చింతతో అవీక్షితుడు వైశాలినిని వివాహ మాడుటకు నిరాకరించును. ఏడువందల వీరుల నెదుర్కొన్న మహావీరుడవీక్షితుని దప్ప మఱియొకని వివాహమాడనని వైశాలిని పట్టుబట్టును. చేయునదిలేక కరంధముడవీక్షితుని దోడ్కొని తన నగరమునకు వెళ్లును. వైశాలిని తన యీ జన్మమున గాకపోయినను రాబోవు జన్మముననైనను అవీక్షితుని పెండ్లియాడెదనని తపస్సు చేయుటకు వెళ్లును. అరణ్యమున తపస్సుచేయుచు, నిరాశాహతురాలైన వైశాలిని ఆత్మహత్యకు పూనుకొనగా ఒక దేవదూత వచ్చి "నీవు మరణింపదగదు సప్తద్వీపశోభితమైన అవనీచక్రమును పాలింపగల చక్రవర్తికి తల్లివి కానున్నావు, శరీరమును కృశింపజేసి కొనకు"మని చెప్పి వెళ్లిపోవును. అవీక్షితుని తల్లిదండ్రులైన వీరాకంధములు, కిమిచ్ఛక వ్రతము నెపమున నవీక్షితుడు పెండ్లిచేసుకొనుట కొడంబడునట్లు చేయుదురు.

తరువాత ఒకనాడవీక్షితుడు వేటకు వెళ్లగానచ్చట నొకస్త్రీ యార్తనాదము వినబడును. ఆదీనాలాపమును వినియచ్చటికి వెళ్లుచుండగ దృఢకేశుడను రాక్షసుడా సుందరిని బాధించుచు "కరంధమాత్మజుని కాంతన్ బట్టికొంచేగెదన్" అనియరచును. ఈ వనమందు నాభార్య యెక్కడిదని యాశ్చర్యపడి వెళ్లిన యవీక్షితునికి ఆ రాక్షసునికి ఘోరమైన యుద్ధము జరుగును. ఆ యుద్ధమునందవీక్షితుడు దృఢకేశుని జంపివేయును. అప్పుడు దేవతలు నీకీ కన్యయందు పుత్రుడుదయించునని వరమిత్తురు. అవీక్షితుడు నేను యుద్ధమున నోడి ఇకదార పరిగ్రహము చేయనని విశాల రాజ తనయను పరిత్యజించితిని. ఆ కన్యయు నన్ను దప్ప మరియొకని వివాహమాడనని శపథము చేసినది. ఇప్పుడా వైశాలినిని గాక మరియొక కన్యనెట్లు వివాహమాడెద

అనగా దేవతలు ఈమెయే వైశాలినియని చెప్పుదురు. అప్పుడు వైశాలిని అవీక్షితునకు తన వృత్తాంతమును జెప్పును. తరువాత తనపూర్వ జన్మమునగలిగిన శాపమును అవీక్షితునికి జెప్పి వైశాలిని అతనిని గంధర్వలోకమునకు దీసికొనిపోవును. గంధర్వరాజు పూర్వజన్మమున "భామిని" యనుపేరుతో తనకూతురై యుండిన వైశాలిని శాపకారణమును, శాపవిమోచన ప్రకారమును జెప్పి అవీక్షితుని నంగీకరింపజేసి. వీరాకరంధమ రాజులను గూడ గంధర్వలోకమునకు రావించి, అందరి సమక్షమున వైభవోపేతముగా అవీక్షిత వైశాలినులకు వివాహము జేయును ఆదంపతులు కొంతకాలము గంధర్వలోకమునందేయుందురు. వారికి "మరుత్తు" పుట్టును. మహాచక్రవర్తికాదగిన ఆ కుమారునెత్తుకొని అవీక్షితుడును వైశాలినియు నిజనగరమునుచేరి వీరాదేవిని, కరంధమ మహారాజును ఆనందపరతురు. ఇదిస్థూలముగా మార్కండేయ పురాణమునందలి మూలకథ.

రసవత్తరమై, అద్భుతములయిన వివిధ సంఘటనములతో కూడిన కథ మహాచక్రవర్తియైన మరుత్తరాజు జన్మకు హేతువైయుండుటచేత ఆనాడు కవి సార్వభౌముడు శ్రీనాథుని నాకర్షించినది అయన కావ్యము వ్రాసి 'చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాడు రచియించితిని మరుత్తరాట్చరిత్ర" అని చెప్పుకొన్నాడు. కాని తెలుగువారి దురదృష్టమువలన శ్రీనాథుని మరుత్తరాట్చరిత్రకావ్యము అదృశ్యమైనది. ఈ నాడు మళ్లీ అదే కథ "అభినవ పోతన" వరదాచార్యులవారి నాకర్షించినది. వారు రసానుకూలములైన చక్కని మార్పులను చేర్పులనుచేసి 'నాటకమును' గా రచించి మన కందించుచున్నారు.

ప్రస్తావన ముగియగనే "శుద్ధ విష్కంభమును" పెట్టి అందులో నాయికయగు 'వైశాలిని' పూర్వ జన్మమున "సునయన"ను గంధర్వరాజుకూతురై యుండి అగస్త్య మహర్షి శాపము వలన మానవ జన్మమునెత్తినట్లు వచించుటవలన కథాకథనమునందు సౌలభ్యము ఏర్పడుటయే గాక నాటకమునందు ప్రదర్శింపబడనున్న యద్భుత సంఘటనములను చదువరియు, నాటకము చూచు ప్రేక్షకుడును వస్తువునర్థము చేసుకొనుటకు వీలుపడుచున్నది. నాటకాదిలోనే విష్కంభమును ప్రవేశపెట్టుట భోజుడు మొదలయిన కొందఱు లాక్షణికులంగీకరించి యుండుటచేత శాస్త్రసమ్మత సరణిలోనే ఆచార్యులవారి నాటకరచన ప్రారంభమైనదని మనము భావింపవలెను.

నాందీ పద్యమును అభిజ్ఞాన శాకుంతల నాటకమునందలి పద్ధతిలోనే యెత్తి సూచ్యార్థ సూచన చేసినారు. "యాసృష్టిః స్రష్టురాద్యా" అన్న కాళిదాస పద్ధతిలోనే "ఎయ్యది యాది భావమగు" అని పద్యము నారంభించినారు. ప్రస్తావన సలక్షణముగా నడచినది. నాటకమునందలి ముఖ్య రసము శృంగారమైన యెడల, 'వసంత ఋతువర్ణనమును' వీరరసమైన యెడల 'శరదృతు వర్ణనమును' ప్రస్తావనయందు నిబద్ధము చేయవలయునన్న సంప్రదాయము ననుసరించి ఆచార్యులవారు "శృంగార" రసప్రధానమైన ఈ నాటకమునందలి ప్రస్తావనయందు "వసంత ఘోషిగానమును చేయించుట సముచితముగా నున్నది.

కణ్వపుత్రాశ్రమప్రవేశము చేయుచున్న అవీక్షితుడు శాకుంతలమున కణ్వాశ్రమమును ప్రవేశించిన దుష్యంతుని స్మరింప జేయుచున్నాడు. అవీక్షితుడెఱుగకయే యతనికి ప్రాప్తించిన సర్పద్వయ శాపము ఉత్తరకథలో విశదపడుట ఒక చమత్కారమైన కల్పన. గురువైన కణ్వపుత్రుని యాశీర్బలమున విశ్వజిద్రణ క్రీడోత్సవములో విజయముగాంచిన అవీక్షితుని గురువునకును జరిగిన సంభాషణమునందు రాజులు, ప్రజలు, వారి పరస్పర సంబంధము చర్చకువచ్చుట నాయకుడైన యవీక్షితుని ధీరోదాత్తునిగా తీర్చిదిద్దుటకే. మూలకథలో నెచ్చటనోవచ్చు 'దృఢకేశి'యను రాక్షసుడు సువ్రతాశ్రమమునందాట పాటలునేర్చుకొనుచున్న వైశాలినిని అపహరించుటకు ప్రయత్నించును, ప్రజాపీడనము చేయుచున్నట్టు ప్రథమాంకమునందే వర్ణింపబడుటవల్లనే, నాయకుడు, నాయికయున్న సువ్రతాశ్రమమునందు ప్రవేశించుటకు వీలయినది. ఇది నాటకీయ ప్రయోజనము నుద్దేశించి యాచార్యులవారు చేసిన చక్కనిమార్పు.

స్వయంవరముకంటే ముందే వైశాలిని సువ్రతాశ్రమమునందు అవీక్షితుని రూపలావణ్య శౌర్యములకు ముగ్ధయై అతనిని వరించుట. అతడును ఆమెయందను రక్తుడగుటయను ఘట్టమును విపులముగా వర్ణించి అందులో నాటకీయములయిన అనేకాంశములను జేర్చినారు. మూలమునందు సూక్ష్మముగాచెప్పిన యంశములను విపులముగాను ఇతరాంశ సమ్మిశితముగాను పెంచిరచించుట చేత ఇతివృత్తములో సొగసువచ్చుటయేగాక నాయికా నాయకుల గుణశీలములకును పారస్పరికమైనగాఢాను రాగమునకును, రసస్ఫూర్తికిని దోహదము కలిగినది. ప్రఖ్యాతమైన యితివృత్తమును నాటకీయవస్తువునుగా ఎట్లు మలచి రచింపవలెనో, ఎక్కడ ప్రారంభించి ఎక్కడముగింపవలెనో చక్కగా యెఱిగి, పరిశీలించి, భావించి, రచించిన ఆచార్యులవారి ప్రతిభ ప్రశంసనీయముగా నున్నదని చెప్పక తప్పదు.

అవీక్షిత విదూషకులు బ్రాహ్మణ వేషములు ధరించినిర్నిరోధముగా వైశాలిని వద్దికివెళ్లుట చక్కని కల్పన. అవీక్షితుడు వైశాలినీ సౌందర్యమును పద్యరూపమున వర్ణించుట, వైశాలిని బ్రాహ్మణవేషమునందున్న అవీక్షితుని యాశీస్సునుకోరి సమీపించుట యను రసవద్ఘట్టమునందే, కవితకు సత్కారము చేయుట మొదలయిన సరససల్లాపములలో సఖులు, నాయికా నాయకులు మునిగియుండగా వచ్చిన గజవృత్తాంతము శాకుంతలమునందలి గజవృత్తాంతమును తలపించుచున్నది. ఆ ఘట్టమునందే వైశాలినియం దనురక్తుడైయున్న అవీక్షితుని యందు వైశాలినికిసైతము అనురాగము కలిగినదనుటకు ''సరళా ! ఈమె మననే మరచి యారాజకుమారు నెంత తమకమున జూచుచున్నదోకంటివా ? ! అను శ్యామలవాక్యము ఉదాహరణము. దీనివలన శృంగార రసస్థాయియైన రతిభావమునకు బీజమైన అనురాగము ఉపక్షిప్తమైనది. ఇది 'ముఖసంధి'కి అంగమైన ఉపక్షేపము. (బీజన్యాసః ఉపక్షేపః అని లక్షణము) నాయికా నాయకుల పరస్పరాను రాగరూపమైన రతిబీజము కళారాధన నెపమున ఉపక్షిప్తమగుట ఈ నాటకము యొక్క విశిష్టతకును, ఆచార్యులవారి ప్రతిభకును నిదర్శనము. సువ్రతుని వర్ణనమువలన అవీక్షితునికి వైశాలిని యందు వాంఛ పొడముటయు, స్వప్నవృత్తాంతమువలన వైశాలినికి

అవీక్షితుని యందు ప్రేమగలుగుటయు, వైశాలినీ గానమునకు అవీక్షితుడును, బ్రాహ్మణ వేషమునందున్న యవీక్షితుని కవిత్వమునకు వైశాలినియు పరస్పరమనురక్తులగుట దోహదము కాగా ఈ బీజము ఉపక్షిప్తమై ఆరంభముతోకూడి 'ముఖసంధి' యగుచున్నది.

బీజారంభముల కలయికచే నేర్పడిన యీ ముఖసంధిలోని నాయికా నాయికుల యను రాగము ద్విజిహ్వాదృఢకేశి రాక్షసుల ప్రవేశమువలన భగ్నమైనది. మరల నవీక్షితుడాశ్రమ ప్రాంత పరిరక్షణము చేయుచుండగా చిలుకపలుకులవలన నెవ్వరో రాక్షసుడొక స్త్రీని యెత్తుకొని పోవుటను గమనించి, నభస్సంవర్తకాస్త్రమును ప్రయోగించుటయు, రాక్షసశవముతోపాటు వైశాలినియునేలపై బడుటయు, అవీక్షిత వైశాలినులు మరల గలిసికొనుటయునను ఘట్టములో బిందు ప్రయత్నముల సంబంధముండుటవలన 'ప్రతిముఖసంధి' యేర్పడినది. (అవాంతరార్థ విచ్ఛేదే బిందు రచ్ఛేద సంజ్ఞికః) చతుర్థాంకమునందు నాయికా ప్రాప్తికై నాయకుడు ప్రకృష్ట మైన యత్నము చేయుట జరిగినది. పంచమ షష్ఠాంకములయందు 'గర్భసంధి' పతాకా ప్రాప్త్యాశల సంబంధమువలన నేర్పడినది. 'ప్రాప్త్యాశ' యనగా నాయికా నాయికులకు స్థిర సంబంధమేర్పడునో లేదో అను ఉపాయ, అపాయ శంకలతో కార్యఫలము నిశ్చయము కాక పోవుట. ప్రకృత నాటకమున నాయికః దోడి పోయి నాగపాశబద్ధుడగుటయు, నాయికయైన వైశాలిని పెండ్లినొల్లననుటయు లక్ష్యము. వజ్రదంత వృత్తాంతమును పతాకగా భావింపవలసి యున్నది. సప్తమాంకమునందు 'విమర్శసంధి' అందులో ఖిల్లినీ వృత్తాంతము ప్రకరి. దృఢ కేశిని అవీక్షితుడు వధించుట నియతాప్తి. నియతాప్తి అనగా కార్యమున కడ్డమువచ్చిన అపాయము తొలగిపోగా ఈప్సితార్థము లభింపగలదను నిశ్చయము. ప్రకృతమున దృఢకేశి వధవలన అది సిద్ధించినది. ప్రకరియన ఖిల్లినీ వృత్తాంతము ప్రధాన కథకుతోడ్పడినది కనుక ప్రకరీ నియతాప్తుల కలయికవలన ఈ 'విమర్శ సంధి' యేర్పడినది.

అష్టమనవమాంకములయందు 'నిర్వహణ సంధి' ఇది అచ్చటచట విప్రకీర్ణమైయున్న అవీక్షిత వైశాలినుల యనురాగ బీజయుక్తములగు ముఖ సంధ్యాద్యర్థములకు ప్రధాన ప్రయో జనము కలిగి కార్యఫలాగమముల సంయోగము గలిగియున్నది. "కుర్యాన్నిర్వహణేద్భుతం" (నిర్వహణ సంధియందు ఒక అద్భుతమును చేర్చవలెను) అను సంప్రదాయాను సారముగా ఈ యంకముల యందు నాయికా నాయకులు గంధర్వ లోకమునకు వెళ్లుట. నాగలోక వృత్తాం తము, విమానయానము మొదలయిన యద్భుతములు చేర్చబడినవి. నాయికా నాయకులకు వివాహము జరుగుటయు బావిభారత చక్రవర్తియైన మరుత్తు పుట్టుటయునను నంశములతో కూడి యీ నిర్వహణ సంధి నైపుణ్యముతో నిర్వహింపబడినది.

ఈ విధముగా ఆచార్యులవారు పంచసంధులు, వాటియంగములు, ప్రవేశక విష్కం భాదులు, పతాకా ప్రకరీ ప్రభృతి అంగములు మొదలయిన నాటక లక్షణ సామగ్రిని యథోచిత ముగా స్వీకరించి రచించిన సలక్షణమైన రసవత్తర నాటకము ఈ 'వైశాలిని'.

## రసము :

ఈ నాటకమునందలి ముఖ్యరసము శృంగారము. దానికి నాయికా నాయకులయిన అవీక్షితుడు, వైశాలినియు, ఆలంబన విభావము అవీక్షితుడు, వైశాలినీ నృత్యగీతసౌందర్యాదుల చేత ఆకర్షింపబడి ఆమెయందనురక్తుడైనాడు, వైశాలిని అవీక్షితుని రూపముచేతను, కవితా కళచేతను అతడు బ్రాహ్మవేషమునందున్నప్పుడు ఆకర్షింపబడి, పిమ్మటతనను రాక్షస బాధ విముక్తురాలిని చేసినప్పటి యతని రాజకుమార వేషమును చూచి విశేషముగా ప్రణయముగ్ధు రాలైనది. అంతటితో స్థాయియైన రతిభావము సుప్రతిష్ఠితమైనది. ఆ విధముగా తావుచేసుకొన్న శృంగార రసమునకు విఘాతము కలుగబోగా వైశాలినీ స్వయంవరమునందును, ఇతర ఘట్టము లందును రేకెత్తి అవీక్షత దృఢకేశ్యాదుల ఆలంబనముగా పెంపొందిన వీరరసము అంగమై శృంగారమునకుదో హదము కలిగించినది. నాయికా నాయకులిద్దరును శాపగ్రస్తులగుటయు, పట్టుదలలు గలవారగుటయు కారణములుకాగా వీరరసమును ఎక్కువగా పోషింపవలసివచ్చినది. వైశాలినిని చేపట్టుటకు తన సౌందర్య సౌశీల్యాదులు చాలక శౌర్యధైర్యాదులను గూడ అవీక్షి తుడు చూపవలసి వచ్చినది. తనకు నచ్చిన వరుడు ఇతరుల వంచనమువలన నిర్వేదముకల వాడై తనను పెండ్లియాడబోనని ప్రతిజ్ఞపట్టుటచేత వైశాలిని తపస్సు చేసియైనను కోరికను సాధింపవలసి వచ్చినది. ఈ చిక్కులను తొలగించి శృంగార రసమును నిలుపుటకై కవివీర రసమును ఒకటి రెండు ఘట్టములలో సుదీర్ఘముగా వర్ణింపవలసివచ్చుటయేకాక అద్భుత రస మునుగూడ నభివర్ణింపవలసివచ్చినది. కనుక ఆపాతముగా శృంగార వీరములకు రెండింటికిని సమప్రాధాన్యమైన ప్రవేశము నాటకమునందున్నట్లు కనపడినప్పటికిని, శృంగారమే ముఖ్య రసము, వీరరసముదాని యంగమే యన్ననిర్ణయము రసజ్ఞుల హృదయమున గోచరింపకపోదు. కేవలగాంధర్వవిధిచే జరుగు వివాహవిషయమున వీరరస ప్రసక్తి అంతగా అవసరముండదు. కాని స్వయంవరాదులవలనను, రాక్షసవివాహాదులయందును నాయకుడు వీరుడుగానుండక తప్పదు, మూలకథకేవలము శౌర్యముపైనేయా ధారపడియుండగా అది రసవత్తరము కాదని భావించి, యాచార్యులవారు శృంగార ప్రధానమైన నాటకమునుగా రచించిరి, ఇతివృత్తము ననుసరించి అపహార్యమయిన వీరమునకు సముచితస్థానము నొసంగిరి. కనుక ఇది వీరాద్భుత హాస్యరసములు అంగములుగాను శృంగారము ప్రధాన రసముగాను వెలసిన నాటకముగా సహృదయులు భావింతురుగాక

ఈ నాటకమునందు శుద్ధ విష్కంభము, మిశ్రవిష్కంభము, ప్రవేశకము అనుమూడు అర్థోపక్షేపకములు నామనిర్దేశముతోను, అంకాస్య, అంకావతార చూళికలు సూచనామాత్రముగను చేర్చబడినవి. రంగస్థల ప్రదర్శన యోగ్యముగాని ఇతివృత్తాంశము సూచ్యము. అట్టిది వీనిలో సూచింపబడినది. సంస్కృత నాటకములందువలె, సంస్కృత ప్రాకృతభాషాభేదములను పాత్రోచితముగా రచించుటకు తెలుగున వీలులేనందున, ఇతివృత్త, పాత్రములను మాత్రమే దృష్టియందుంచుకొని శ్రీ ఆచార్యులవారు వీటిని ఉపనిబంధించినారు.

పాత్రముల సంభాషణాదులలోను, సన్నివేశములలోను సంస్కృతనాటకముల పోకడలు, అందులోను విశేషించి కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలచ్ఛాయలు ఈ నాటకమున గోచరించును: భ్రమరబాధకు గురియైన శకుంతలను రక్షించుటకు దుష్యంతుడు ప్రవేశించుట వంటిది కాక పోయినను ఇంచు మించుగానట్టిదే యున్మత్తగజమునుండి వైశాలినిని విడిపించిన అవీక్షితుని యత్నము. ప్రేమలేఖ వ్రాయుట ఉభయత్ర సమానమేయైనను ప్రకృతనాటకమునందు లేఖవలన విప్రలంభ శృంగారమున కెక్కువ దోహదము కలిగినది. "నాహృదయమే యిపుడు శ్యామలగా మూర్తీభవించి యడుగుచున్నట్లున్నది. నేనీమెకెంతయుఁ గృతజ్ఞుడను. ఈమెనన్ను వరిగ్రహించుట కేయ్యకొనని కారణము చెప్పక మానదు". ఈ వాక్యము "పృష్టాజనేన సమదుఃఖసుఖేన బాలానేయం నవక్ష్యతి మనోగతమాధి హేతుమ్" అన్న దుష్యంత వాక్యమును స్మరింపజేయు చున్నది.

"ఇప్పట్ల నీ యమ సఖియగు శ్యామలగా బోలు ! పిల్చుచునిటకే వచ్చుచున్నది. చేతికందిన ఫలము స్వీకరంపకముంచే చేనున్న కొమ్మచిహలున దప్పించుకొని పైకెగసినది, ఎంతయుఁ బ్రేమమీర మొగమెత్తి రవుల్ తమకమ్ముతోడ వాపొంతకుఁ జెర్చిరాగ రసపూర్ణలసన్మధురాధరమ్ము సేవింతునటంచు షట్పదము వీఁకన మ్రొగ్గితి నాముఖాబ్జ మాయింతటిలోఁ ద్రపాలహరినింతగమున్గుట లేమెరుంగుదున్ ?" అని యవీక్షితుడు వైశాలినీ చుంబనము లభింపలేదని దుర పిల్లుట, అచ్చముగా దుష్యంతుడు తననర్మసఖుడైన విదూషకునితో తనకు శకుంతలా చుంబనము లభింపలేదని చేప్పుకొన్న,

"ముహురంగులి సంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షర విక్లవాభిరామం,
ముఖమంస వివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమప్యున్నమితం నచుంబితంతు" అను.

శ్లోకమునకు రూపాంతరమే. ఈ విధముగా కవికుల గురువైన కాళిదాసు నాటకచ్ఛాయలతోపాటు ఇతర పూర్వకవుల పోకడలు ఈ నాటకమున తొంగిచూచుటకు ఆచార్యులవారి బహుగ్రంథ పరిచయమేకారణము. భావనాపటిమ, కల్పనా చాతుర్యము ఇందులో అడుగడుగునను ప్రతిఫలించుచున్నవి. ఇది భావములు, రసములు చక్కగా చోటుచేసుకొన్న రచన. కేవలము రసాత్మకమై సహృదయుల నాకర్షించుటయేకాక చదువరులైన వారికి హితోపదేశము చేయుట కూడ ఒక లక్ష్యముగా పెట్టుకొన్న రచనయిది. పరిపాలనా పద్ధతులు, దేశభక్తి. సానుభూతి, పీడితప్రజానీకముపై దయాళుత్వము, శౌర్యము మొదలయిన విషయములతోపాటు, ఆత్మజ్ఞానము, భక్తి, వైరాగ్యము, తపస్సు అనువానినికూడ ఆయాపాత్రలద్వారా ప్రవేశపెట్టి ఆచార్యులవారి నాటకమునందు "ఉపదేశయుజే" అన్నకావ్య లక్షణమును పాటించినారు. నాటకము రసవంతమగుటయే కాక ఉపదేశాత్మకము గూడ నగునట్లుచేసినారు. "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అన్నశ్రుతి ననుసరించి పునీతాత్ములైనారు

ఇక శ్రీమాన్ వరదా చార్యులుగారి పద్యరచనను గురించివేరుగా చెప్పనక్కరలేదు. ద్రాక్షా పాకమునందు సాగినవారి కవిత్వము యవదాంధ్ర విదితము. వారి నభినవ పోతనగా వాసికెక్కింప జేసిన వారి యుద్గ్రంథము "పోతన చరిత్రమును" వారికి జరిగిన ఘంటాకంకణ. గండ పెండేర, సువర్ణాభిషేకాది సత్కారములును తెలుగు నేలకంతటికిని సుపరిచితములు. ప్రతి పద్యమునందును ఒక విశేషముండును. ఆది లోకోక్తికావచ్చును, అనుభవము కావచ్చును, హితోపదేశము కావచ్చును, ఎత్తిపొడుపు కావచ్చును. హాస్యము కావచ్చును, రసము ధ్వని విశేషము కావచ్చును, ఒక నూతన భావము కావచ్చును. విశేషములేని నీరసపద్యము గద్యము వారి రచన యందు లభింపదు. కనుక "ఇది మంచి పద్యము, ఇది మంచి వాక్యము" అని యెత్తిచూపుటవారి యందవచారమే యగును. మీముందు నాటకమున్నది, నాటకోపవర్తితము లైన విశేషములున్నవి, సరసములైన ఘట్టములున్నవి, సుందరములైన పద్యములున్నవి. ఒక నాడు మహాభారత భూమికి చక్రవర్తియైన మరుత్తరాజు తల్లిదండులైన అవీక్షిత వైశాలినుల చరిత్రముతోపాటు ఆ చక్రవర్తి వృత్తాంతమున్నది. చదివి యానందించండి. శ్రీమాన్ వాన మామలై వరదా చార్యులవారు తమ యీ నాటకమునకు పీఠిక వ్రాయుట కర్తలైవ వారెందఱో యుండగా నాకీయవకాశము నిచ్చుటవారికి నాయందుగల ప్రగాఢమైత్రికి చిహ్నము. నిజముగా నేను వారి నాటకమునకు పీఠిక వ్రాయుటకు తగినంత శేముషీవిభవము కలవాడనుకాను.

ఇతరకార్యముల వత్తిడియుగల నేను సావధానముగా, సాకల్యముగా గుణపరిశీలనముచేసి విపులముగా పీఠిక వ్రాయుటకు తగిన యవకాశము లేకపోయినది. కాలమువలెనే నాజ్ఞానము కూడ స్వల్పమేయగుటచేత నాటకమును గురించియు, తెలుగునాటవెలసిన నాటకస్వరూపమును గురించియు, ముఖ్యముగా శ్రీ వరదా చార్యులవారి నాటకమును గురించియు చెప్పవలసినంతగా చెప్పలేక పోయితిని.

తెలుగునాటకములలో ముఖ్యముగా పాత్రోచితభాషను ఉపయోగించి అనగా, పౌరాణిక చారిత్రకేతి వృత్తములుగల నాటకములందు ఉత్తమపాత్రలకు గ్రాంథిక భాషను, మధ్యమ పాత్రలకు శిష్టవ్యావహారికమును, నీచపాత్రలకు గ్రామ్యమును (ఆయాప్రాంతీయభాష) ఉపయో గించివ్రాయుచు, సాంఘికేతి వృత్తముగలవానిని నాటకేతర రూపకములుగాను రచించుచు ఒక సంప్రదాయమును పాటించినచో తెలుగున శ్రవ్యకావ్య వాఙ్మయమున కున్నట్లే, దృశ్యకావ్య రచనకుగూడ సమున్నతమైన స్థానము లభింపగలదని మనవిచేయుచు, శ్రీ వరదా చార్యులవారు నన్నీకార్యమున నియమించినందులకు వారి యాదరమును, వారిమైత్రీ భావమును మరొక్కసారి ప్రశంసించుచు రసజ్ఞులీ నాటకమును జదివియు, ప్రదర్శింపజేసియు ఆనందింతురుగాక యని విన్నవించుచున్నాను.

తేది. 2-6-1975,
ఇంటి నెం. 26/8 RT,
బర్కత్‌పుర,
హైదరాబాద్-27.

ఇట్లు
సహృదయ విధేయుడు,
కేశవపంతుల నరసింహశాస్త్రి. విద్వాన్, శిరోమణి,
(ఆకాశవాణి కార్యక్రమ నిర్వహణాధికారి)

## పౌరాణిక స్వతంత్ర నాటకము

# వైశాలిని

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులు వాసికెక్కిన పండిత కవులు. వానమామలై వారి కలము బాల్యమున తప్పటడుగులతో "దాగుడు మూత" లాడినది. పడుచుదనమున భావనా బలముతో కవితామణులను వెలార్చి తెలుగు సరస్వతిని "మణిమాల"తో నలంకరించినది. కలమును గంటముగా మార్చి కవితావేశమునంది భక్త్యావేశముతో భాగవత పురాణమును బండ్లకెత్తిన పరమభక్తాగ్రేసరుడగు బమ్మెర పోతన పవిత్ర జీవిత చరిత్రమును ప్రౌఢ వాక్కులతో ప్రవచించి పంచిపెట్టినది. శ్రవ్యకావ్యరంగముననిటు వలుపోకడలు పోయిన అభినవ పోతన మా వరదన్న కలము తీరికగా కోరికతో దృశ్యకావ్యరంగము వైపు దృష్టి సారించినది. దాని ఫలితముగా అవతరించినదే ఈ 'వైశాలిని' అను పౌరాణిక మహానాటకము. గుణమునందువలెనే రూపమునందును ఇది చాలపెద్దది. 221 పుటలలో తొమ్మిది అంకములలో ముఖ్య కథాంశముతోపాటు ధార్మిక నైతిక లౌకికాద్యనేక ప్రసంగములను సందర్భానుసారముగా పొందు పరచుచు దీనిని కవి యొక మహానాటకముగానే నిర్మించిరి. ఇంత పెద్దనాటకమును ఇది వరలో చదివియున్నట్లు గుర్తులేదు.

"వైశాలిని" ప్రఖ్యాతవస్తుకము. ఇందలి కథాంశమును మార్కండేయ పురాణము నుండి గ్రహించికొన్ని మార్పులు చేర్పులుచేసి దీనినొక మిశ్ర కథానాటకముగా రచించినట్లు నాటకకర్తయే స్వయముగా ప్రస్తావనలో నిట్లు తెలిపిరి. "మార్కండేయ పురాణాంతర్గాథ నొకం డాధునిక కవి కించిత్కల్పనా విశేషంబుల న్రచించెను." అని నటి సూత్రధారునితో నుడువును. పైవాక్కులవలన మార్కండేయ పురాణములోని కథలో 'కించిత్కల్పన'తో ఈ నాటమును వ్రాసినట్లు తెలియును. కాని పురాణకథను ఈ నాటకకథతో పోల్చి చూచినవారికి, ఈ కవి పురాణకథలో కించిన్మాత్ర కల్పనలను మాత్రముగాక సమంచితములగు అనేకానల్పకల్పనల నాటకకళా దృష్టితో కావించి రచించిరనుట తెలియకపోదు.

మార్కండేయ పురాణము రసవంతమైన అనేక కథలకు గనియనుట మనమెఱిగినదే. పెద్దనాది మహాకవుల కెందఱకో యిది కావ్యవస్తువును ప్రసాదించినది. కావుననే నాటకరచనకు బూనిన ఆచార్యులవారి దృష్టికూడ కథాంశము కొఱకు మార్కండేయ పురాణములోనికి ప్రాకి అందలి అష్టమాశ్వాసమునుండి కరంధమ పుత్రుడగు అవేక్షితుని కథను ఎన్నుకొనుట జరిగి నది. ఈ అవేక్షితుని సుతుడే మరుత్తు. మరుత్త రాట్చరిత్రమునే శ్రీనాథ మహాకవి చిన్నారి పొన్నారి చిఱుతకూకటి నాడు రచించెను. అవేక్షిత్తు పురాణనామము. కవిదీనిని అర్థసారస్య దృష్టితో కాబోలు: అవీక్షితుడని మార్పుగావించెను. ఇట్లు పురాణమునుండి అవీక్షితుని కథను గ్రహించియు నాటకకర్త దీనికి కథానాయకుని పేరుతో 'అవీక్షితీయ' మను విధమున నామ

కరణముచేయక విశాల భూపాలుని పుత్రికయు కథానాయికయునగు 'వైశాలిని' పేరు పెట్టుట సుకుమారముగను సుశ్రావ్యముగను నుండుటేకాక నాయికాప్రాధాన్యము ఇందుద్దేశింపబడెననుట స్పష్టము. "వైశాలిని" అను నీ నాటకము పేరునుబట్టి చూడ నిదియొక సతీలలామ చరిత్రము ని తోచుచున్నది" అను సూత్రధారుని మాటయే యిందులకు ప్రమాణము. గ్రంథము వ్రాయుట కన్న ఒకప్పుడు దానికి తగినపేరు పెట్టుట కష్టతరముగా దోచుట అనుభవసిద్ధము. దీని కింత చక్కని పేరుపెట్టగలుగుట ఆచార్యుల దృష్ట్యౌచిత్యమునకు నిదర్శనము. 'వైశాలిని' అనుపేరే ఈ నాటకమునందలి ప్రధానరసము శృంగార మనుటను చెప్పకయే చెప్పుచున్నది.

మార్కండేయ పురాణమునందు అవీక్షితుని పుట్టుక మొదలు అతనికి మరుత్తు జనించు వఱకుగల కథయంతయు 120 పద్యములలో గలదు. అందలి ముఖ్య విషయము లిట్లుండును.

పెక్కురు రాజకన్యలు అవీక్షితుని స్వయంవరమున వరించుట—స్వయంవరాగత రాజ సమూహమును జయించి అవీక్షితుడు అనేక రాజకన్యలను బలిమిని వరించుట—(మూలమునందలి ఈ రెండు విషయములను ఈ నాటకకర్త ఔచిత్య దృష్ట్యా పరిహరించెను) విశాల భూపాలపుత్రి యగు విశాల (వైశాలిని) స్వయంవరమునకై అవీక్షితుడు విదిశాపురికేగి రాజసమూహమును గెలుచుట—రాజులందఱు నొక్కటియై ఏకాకియగు అవీక్షితుని బంధించి విదిశాపురిలో చెఱలో నుంచుట—కరంధముడు శత్రురాజులతో బోరి పుత్రుని బంధవిముక్తుని జేయుట—తన పుత్రికను వివాహమాడుమని విశాల భూపాలు డవీక్షితుని గోరుట—అభిమానవంతుడగు అవీక్షితుడు శత్రు పరాజితుడగు తాను వైశాలినినిగాని మఱియే కన్యనుగాని పెండ్లాడ నిరాకరించుట—అనంతర జన్మమందైన అవీక్షితుడే పతిగావలెనని కోరి వైశాలిని అడవికేగి తపము చేయుచు మరణము గోరి యుండుట—దేవదూత వచ్చి యామెకు చక్రవర్తియగు పుత్రుడుదయింపగలడని నమ్మబలికి మరణమునుండి విరమింపజేయుట—వైశాలిని నాగలోక గమనాది వృత్తాంతము—వివాహ విముఖుడగు అవీక్షితుని తల్లి వీరమహాదేవి "కిమిచ్ఛకవ్రత" మిషతో తనభర్తతో 'మనుమని నిమ్మ'ని అడిగించి అవీక్షితుని దారపరిగ్రహమున కంగీకరింపజేయుట—అవీక్షితుడు వేటకడవి కేగుట దృఢకేశి యను రాక్షసునిచేత బట్టుపడిన స్త్రీ యాక్రందనము విని, వానిని వధించి యామెను రక్షించుట—ఆమెను పెండ్లాడి పుత్రుని గనుమని, వారి వృత్తాంతములు దెలిసి. దేవతలు వారిని పెండ్లికొడంబడజేయుట—గంధర్వరాజు తుంబురునితో విచ్చేసి వైశాలిని పూర్వజన్మమున 'భామిని' యను తన పుత్రికయనియు, అగస్త్యుని శాపమున భూలోకమున జన్మించినదని తెలిపి వారికి తుంబురునిచేత వివాహముచేయించి తన గంధర్వలోకమునకు తోడ్కొని పోవుట—గంధర్వలోకమునందు వారికి 'మరుత్తు' అను పుత్రుడు కలుగుట—భార్యా పుత్రులతో అవీక్షితుడు నిజపురికేగి తండ్రికి మనుమని నొసగుట—వైశాలిని తలిదండ్రులా విషయము విని సంతోషించుట—అను విషయములతో పురాణకథ సుఖాంతముగా ముగియును.

ఈ సమస్త పురాణకథను శ్రీ వరదాచార్యులు పెద్దమార్పులు చేయక యథాతథముగనే తమనాటకమునందు గ్రహించిరి. పురాణకథ ముఖ్యముగా వైశాలిని స్వయంవరమున కవీక్షితు

డేగు వృత్తాంతముతో ప్రారంభమగును. కాని నాటకములో ఈ స్వయంవర వృత్తాంతము చతుర్థాంకము చివరనుండి కూర్చబడినది. ఇక్కడి కథాకల్పనము మూలకథాంశముతో సమన్వయించుచునే కొంత భిన్నమార్గమున నడచినది. పురాణకథలో అవీక్షితునిచేత పరాజితమయిన స్వయంవరాగత రాజసమూహమే అతనిని అధర్మయుద్ధమున బంధించును. దృఢకేశి యనుదైత్యునకీ స్వయంవరముతో సంబంధములేదు. స్వయం వరోదంతానంతరము వైశాలిని యడవిలో తపముచేయుచుండు సమయమున దృఢకేశి యామెనుబట్టుకొని యపహరింపజూచును. అపుడు అవీక్షితుడతని వధించి యామెను గాపాడును. ఇట్లు పురాణమున రాక్షసుడామెను బట్టుటకు ప్రత్యేక కారణము గోచరించదు. అవీక్షిత దృఢకేశుల యుద్ధమునకును ఆర్తరక్షణము కంటె ప్రత్యేక కారణములేదు. పురాణకథలో దృఢకేశికి ప్రాధాన్యము కనరాదు.

నాటకమునందట్లుకాదు. సాధారణ రాక్షసుడైన దృఢకేశిని పురాణమునుండి గ్రహించి, వానికి మాయావిత్వమును, అవీక్షిత్తుని వినా సకలాన్య రాజన్య విజయము మున్నగు వీరగుణములతో పాటు నాయికయగు వైశాలినియందు కామమోహితుడై తదపహరణ పరాయణునిగాజేసి అవీక్షితున కతని ప్రతివీరునిగా కవి చిత్రించెను. కావున పురాణముకన్న భిన్నముగా దృఢకేశి దనుజుడే ప్రతిపక్షి రాజానీకమున కంతకును నాయకుడై, తన పన్నుగడచేతనే సకల శత్రుంజయ సాధనమగు నారాయణాస్త్ర రహితుడును ఏకాకియునైన అవీక్షితుని స్వయంవర సందర్భ జనిత జన్యమున నాగాస్త్ర బద్ధుని గావించును. ఇట్లు కల్పింపబడిన ఈ సంఘటన కనుకూలముగా శ్రీ వరదాచార్యులు తమ యనల్ప కల్పనా శిల్పశక్తితో నాటకరసౌచిత్యపోషణదృష్టితో సంవిధాన వైచిత్ర్యముగా కొంత కథను అనగా మొదటి నాలుగంకముల కథను స్వకపోలకల్పితముగా నొనరించి ఈ నాటకమును నవమాంక విస్తృతముగా రచించిరి. కావ్యరచనమున వీరిది అందె వేసినచేయియే అయినను దృశ్యగుణముచేతను గీతవాద్యాదుల చేతను ఆంగికాది చతుర్విధాభినయముచేతను 'చాక్షుషం యజ్ఞ' మనదగు రమ్యకావ్యమయిన నాటకరచనమున శ్రీ వరదాచార్యులవారిది ప్రథమ ప్రయత్నమే అయినను వారిందు గనబఱచిన కథాకల్పనా యుక్తియు సంవిధానశక్తియును అనన్యసామాన్యమై అద్భుతావహమై ప్రశంస్యములగుచున్నవి.

ప్రతివీరుడగు దృఢకేశి నత్యంత శక్తియుక్తి సంపన్నునిగా నొనరించిన నాటకకర్త నాయకుడగు అవీక్షితుని ప్రథమాంకము ప్రారంభముననే విశ్వజిద్రణక్రీడా మహోత్సవములో సకల రాజన్యమండలిని సర్వయుద్ధ ప్రక్రియలలో నొంటిగా గెల్చిన విశ్వవీరునిగా చిత్రించి నాయకునకు గుణోత్కర్షము నాపాదించెను. ఇంతటి జగదేక వీరుడును దివ్యాస్త్ర సంపన్నుడును కథాగతినిబట్టి శత్రువుచేత బంధితుడు కావలసియుండుటచే కవి మూలాతిరిక్తముగా ప్రథమాంకమునందే అవీక్షితునకు సర్పశాప వృత్తాంతమును కల్పించెను. సర్పఫణామణులను పుష్పభ్రాంతిచే బాణముతో గొట్టుట అనుకల్పనము సమంజసమై, 'ప్రియావిరహ నాగాస్త్రబంధన శాపమును తద్విమోచన మార్గమును' అవీక్షితుని భావికథనంతయు సూచించునదియై, దృఢకేశిచేత నతడు నాగాస్త్రబద్ధుడగుటవలన నతనిపరాక్రమము నపకర్షదోషదూషితము కాకుండా కాపాడినది.

ఇట్లే పురాణ కథాంతమున వైశాలిని పూర్వజన్మ జనకుడగు గంధర్వుడు ఆమె తన తనయ యని తెలుపుటకు అవీక్షితున కెఱిగించిన అగస్త్యశాపమునుకూడ కవి గ్రహించెను. మూలమున శాపఫలము మాత్రమే కలదుగాని శాపహేతువు ఉక్తముకాలేదు. ఈ నాటకకర్త అగస్త్య మహామునిని "అహింసావ్రతులు బ్రహ్మఋషులు సముద్రపాన మొనర్చునపుడు మత్స్యభుక్కులైనారు" అని వైశాలిని సఖి అపహసించినట్లొక హేతువును సమయోచితముగను సుందరముగను కల్పించి సఖి నవ్వడంతోపాటు తానును వైశాలిని నవ్వినట్లుచెప్పిరి. ఈ అగస్త్య శాపవృత్తాంతమును మూలమునందువలె కథాంతమునగాక నాందీ ప్రస్తావనానంతరమున ప్రథమాంకమునకు పూర్వమున విష్కంభరూపమున కవి నాటకమునకు ముఖపట్టమువలె పొందుపఱచి తమ ప్రజ్ఞను ప్రకటించి రనవచ్చును. నాయికా నామముతో నాటకమునకు వైశాలిని పేరుంచిన ఈకవి నాటకావళిలో నాయికా పూర్వప్రస్తుత జన్మవృత్తాంతములను సంగ్రహముగాగూర్చి నాటకేతి వృత్తసారమును ముందుగానే పాఠకులకు ప్రేక్షకులకును దెలిపినట్లును అయ్యెను. ప్రస్తావనకు పిమ్మట మొదటి యంకముననే విష్కంభము ప్రయోగింపవలెనను భోజరాజు మతమనుసరించి యిచ్చటను ద్వితీయ తృతీయాంకములకు నడుమ అన్యలాక్షణికుల ననుసరించియు వరదాచార్యు లిందు విష్కంభములను కల్పించిరి. చతుర్థ పంచమాంకములనిట్లే లక్షణానుసారము సూచ్యమగు దృఢకేశ్య పీక్షితుల యుద్ధ వివరములను దెలుపు ప్రవేశకము సంఘటింపబడినది. ఆశీరూపకమైన నాందీ పద్యమును నాటకాదిని ఘటించి చివరి చరణమునందలి 'నిత్యవిశాలరసాబ్ధి' అను పదబంధమున విశాల (వైశాలిని) అను నాయికా నామమును సూచించెను. ప్రస్తావనమున కవి సూత్రధారునిచే మొదట పారిపార్శ్వకునితోడ నాటకకళకు త్రివేణీ సంగము వంటివగు సంగీత సాహిత్య నాట్యములను గూర్చి ముచ్చటించును. ఆ పిదప నటితో ప్రస్తుత నాటకమును తత్కవితాశాస్త్ర పాండిత్యాది యోగ్యతలను మఱియు నాటక కథాదులను గూర్చియు ప్రస్తావించి తమ నాట్యశాస్త్ర సంప్రదాయజ్ఞతను వెల్లడించిరి. ఈ ప్రస్తావనము చివర వసంత ఋతువును గూర్చిగానముచేసిన అనంతరమునటి తనమిత్రుని రాకకై అవీక్షితునివలె మన నాటక ప్రదర్శనమునకై పారిషదులు వేచియున్నారని వలుకుటతో ప్రస్తావన సమాప్తమగును. సాధారణముగా ప్రస్తావనాంతమున సూత్రధారుడు సూచించిన పాత్రప్రవేశముతో ప్రథమాంకము ప్రారంభమగుట సంప్రదాయము. కాని యిందట్లుకాలేదు. నాయికా వృత్తాంతముతోడి విష్కంభము కూర్పబడియున్నది. ఈ నాటమున నీ కూర్పు అసమంజసముగా దోపదు. ప్రస్తావనాంతమున అవీక్షితనామ గ్రహణము సూత్రధారునిచేగాక నటిచే జేయబడినది. 'పారిషదులు నాటక ప్రదర్శనము కొఱకు వేచియున్నా' రన్నదాని కనుగుణముగా ఈ నాటక ప్రదర్శనము విష్కంభముతో బ్రారంభింపబడినది. విష్కంభమున ప్రధాన నాయక పాత్ర ప్రవేశమునకు నిషేధము కలదుగావున విష్కంభము వెంటనే ప్రారంభింపబడిన ప్రథమాంకాదిని నాటకకర్త అవీక్షితుని పాత్రకు ప్రవేశము కల్పించెను.

ఈ నాటకమునందలి మొదటి నాల్గంకముల కథాంశము కవికల్పితముగా దెల్పియుంటిని. ప్రథమాంకము మొదటి విష్కంభమున నాయిక పూర్వ ప్రస్తుత జన్మ వృత్తాంతము సూచింప

బడుట తెలిసి యుండిని ఇందలి అగస్త్య శాపహేతువు కవి కల్పితము. పురాణకథలో అవీక్షితుడు కణ్వపుత్రుని యొద్ద శస్త్రశాస్త్ర విద్యలభ్యసించినట్లు మాత్రము చెప్పబడినది. ఈకవి కణ్వ పుత్రుని పాత్రను సృష్టించి అతని యాశ్రమమును ప్రథమాంకమునందలి సగము కథకు రంగముగా చేసెను. ఇట్లే యిందలి మిగిలిన సగముకథకు కథానాయికయగు వైశాలినికి సంగీత నాట్యవిద్యాగురువును వారికి రాజపురోహితుడునైన సువ్రతుని ఆశ్రమము రంగస్థలముగా గావింపబడినది సువ్రతుని పాత్రగాని వైశాలినికి గురువుగాని ఆమె తండ్రికి పురోహితుడు గాని పురాణమునందులేడు. మూలకథలో నాయకునకు కణ్వపుత్రుడు గురువుగా పేర్కొనబడి యుండుటచే' నాయిక పేరుతో నున్న నాటకమునందు ఆమెకు గూడ నొకగురువుండుట సముచిత మని భావించి కవి సువ్రతుడగు ముని నామెకు గురువుగా కల్పించి, ప్రథమాంకము సగము నుండి ఇంచుమించు చతుర్థాంకము చివరవఱకును సువ్రతాశ్రమమునే కథాస్థానముగా నొన రించెను. 8వ అంకమున కొంతకథకు పాతాళమును, తక్కిన కథకు (స్వయంవర వృత్తాంతము) విదిశానగరమును, 6వ అంకము చివరకథకును 8వ అంకము మొదటి సగము కథాభాగమున కును నాయకుని తండ్రియగు కరంధముని అంతఃపురమే కథాస్థానముగా కల్పింపబడుట చూడగా ఈ నాటకమునందలి విశేషకథాభాగము నాయిక సంగీత నాట్యవిద్యా గురువగు సువ్రతా శ్రమమునందో తత్ప్రాంత ప్రదేశమునందో నడుచుటచే సువ్రతాశ్రమ మీకథకు ప్రధానకేంద్ర స్థానముగా కల్పింపబడినదనుట స్పష్టము. ఈ వైశాలిని నాటకకథను ప్రస్తావనానంతర విష్కంభమున నాయికా భూలోక జన్మవృత్తాంతముతో గంధర్వ లోకమునందు ప్రారంభించి, నాయికకు మరున్నామకుమార సంభవముతో గంధర్వలోకమునందే మంగళాంతముగా ముగించుటెంతయు సమంజసముగా నున్నది.

ఇట్లీకవి ప్రథమాంకమున కల్పించిన కణ్వపుత్రాశ్రమమునందు గురువగు కణ్వపుత్రుని యెదుట అవీక్షితునిచే "ప్రజాపీడన పరాయణుడగు దృఢకేశి రాక్షసుని వధించి ప్రజలకు సుఖ శాంతులు చేకూర్చు వఱకును రాజ్యాధికారము స్వీకరింప''నని ప్రతిజ్ఞ చేయించును. ఇట్లే యీ యంకమునందే తర్వాత వైశాలినికి విద్యాగురువగు సువ్రతాశ్రమమునందు సువ్రతులవారి "యెదుట దృఢకేశిని వధించి కాని వైశాలిని చేపట్ట'నని అవీక్షితునిచే ప్రతిజ్ఞ చేయించును. ఇట్లే దృఢకేశిని వధించి తన తండ్రికిని ప్రజలకును మనశ్శాంతిని గూర్చిన వీరపురుషునే వరింతునను వైశాలిని నిర్ణయముకూడ నిందే యవీక్షితున కెఱిగింపబడును. ఈ యన్నింటి వలనను రాజ కుమారి రాకుమారు శాపవృత్తాంతకథనమువలనను నాటకకథయంతయును ముందుగానే సూచింప బడెను. వీరిరువురే కాబోవు దంపతులనుటయు రూఢి యయ్యెను. మూలమునందు విడిగా నున్న దృఢకేశి వధకు వైశాలిని (అవీక్షితుల) వివాహమునకు కవి విడదీయరాని బ్రహ్మముడి సంఘ టించెను పురాణకథలో వైశాలినీ అవీక్షితుల పరిణయము ప్రధానము. దృఢకేశివధ అప్ర ధానము నాటకమునందు రెండును ముఖ్యములే. ప్రధానేతివృత్తము వైశాలినీ అవీక్షితుల పరి ణయమును మరుజ్జననమే అయినను దానికి ముందు దృఢకేశివధయు ప్రజలకు సుఖశాంతులు కలిగించుటయు ముఖ్యములే. ఇట్లు దుష్టశిక్షణము శిష్టరక్షణమను ఉత్తమాశయములు నాయకున

కాపాడించి అతని ధీరోదాత్తత్వమున కుత్కర్ష కలిగించినవాడై కవి నాటకమును ప్రథమ తృతీయ పురుషార్థ ఫలప్రదమగు ఉత్తమనాటకముగా రూపొందించెను.

ద్వితీయాంకము కథయంతయు కవి కల్పితమే. ఇందు అభిజ్ఞాన శాకుంతలమున శకుంతలకువలె నాగానందమునందు మలయవతికివలె నాటకకర్త వైశాలినికి చేదోడువాదోడుగా నుంటకు శ్యామల సరళయను సఖుల నిరువుర కల్పించెను. నాయకునకు విదూషకుడను నర్మ సఖుని నాటకాదినే కవి కల్పించెను. ఈ కల్పనముచేత కవి ఈ యంకమునందును తర్వాతి మూడు నాలుగంకములందును నర్మహాస్య చతుర సంభాషణలను విరివిగా విరచించి ఈ యంక ములను శృంగార రసప్రధానముగా నొనరించెను. ఇందు అవీక్షిత్తు విదూషకులయు, సరళా విదూషకులయు సంభాషణములందు పోషింపబడిన హాస్యము సర్వత్ర సభ్యతా మర్యాదల కధీనమై ఆచార్యులవారి అమోఘసరసహాస్య రచనాసామర్థ్యమునకు గీటురాయి యనదగియున్నది - ఇందలి శృంగార పోషణము మిక్కిలి సభ్యముగ గావింపబడినదని చెప్పబనిలేదు. సంభోగ శృంగార మిందు నాయికా నాయకుల వివాహానంతరముకూడ వర్ణితముకాలేదు. వారికి సుతజననము మాత్రముచెప్పబడినది. నాటకమంతటను నాయికా నాయకులకు విప్రలంభ శృంగారమే వర్ణితము. ఈ విప్రలంభమైనను పూర్వరాగ రూపమయినదే. ఈ ద్వితీయాంకమున నాయికా నాయకులకు ప్రథమావలోకన ప్రథమాను రాగములు వర్ణింపబడినవి. అనంతరము తృతీయమున నాయికకు ఈర్ష్యామానమును తదనంతరము శాపవశమున నిరువురకును ప్రవాస విప్రలంభమును వర్ణింప బడుటచే నిందలి శృంగారము సభ్యతా గుణలక్షితమని వేరేచెప్పనక్కఱలేదు. అంగిరసమగు శృంగారరసమునకు ఇతరములగు రౌద్రవీర భయానకాద్భుతాద్యంగరసములును యథాసందర్భ మిందు బాగుగా పోషింపబడినవి.

ఇందలి ద్వితీయ తృతీయాంకమునందలి కథాసన్నివేశకల్పనమునకు శ్రీ వరదాచార్యు లకు నాగానంద అభిజ్ఞాన శాకుంతములనుండి ప్రేరణ లభించినట్లుతోచును. ద్వితీయాంకము నందు సువ్రతాశ్రమములందలి గౌరీదేవాలయము నొద్ద సఖులు వీణామృదంగములు వాయింప వైశాలిని పాడుచు నాట్యముచేయు చుండును. అపుడు విదూషకునితో నా యాశ్రమము ప్రవే శించిన అవీక్షితుడాగానమును విని ప్రశంసించుటయు, తర్వాత (బ్రాహ్మణవేషమున) నచ్చట కేగినట్లును నాయికా నాయకుల ప్రథమావలోకనము వర్ణింపబడినది. నాగానందనాటకమునందును ప్రథమాంకమున విదూషకునితో జీమూతవాహనుడు మలయ పర్వతమునందలి కులపతి తపో వనమునంగల గౌరీ దేవాలయము కడ మలయవతి చతురికయను సఖితోనుండి వీణాగానము చేయుచుండగా జీమూతవాహనుడు విదూషకునితో నా యాశ్రమమున బ్రవేశించి గానమును బ్రశంసించి పిమ్మట నచ్చటికేగి మలయవతిని జూచినట్లును వారు పరస్పరానురక్తులయినట్లు వర్ణింపబడినది. ఈ రెంటికిని సామ్యాము స్పష్టము. నాయికకు వివాహ సూచకములయిన శుభ స్వప్నములీ రెండు నాటకములందును గలవు. తృతీయాంకమునందు విదూషకుని సలహా ప్రకారము ''వైశాలిని నాకేమియు నచ్చుటలేదు'' అని అవీక్షితుడు పలికిన మాటలను చాటుగా విన్న వైశాలినికి అతని యెడవై ముఖ్యమును గలిగినట్లొక సన్నివేశమును కవి చమత్కారముగా

కల్పించెను. ఇట్లే జీమూతవాహనుడు తన స్వప్నగత కాంతను గూర్చి విదూషకునితో పలుకు చుండగా విని మలయవతియు దుఃఖితయైనట్లు కొంతభిన్నమైన సన్నివేశము కలదు. నాయికకు గజబాధ–నాయకుడు నివారించుట–శ్యామలా సరళల నర్మసంభాషణము వైశాలినితో మున్నగు నవి కొన్ని శాకుంతలము ననుసరించినవనితోచును. తృతీయాశ్వాసమునందే కవి గౌర్యాలయ మున వైశాలినికి శ్యామల 'గౌరీ కల్యాణ' కథను వినిపించినట్లు కల్పించి సంగ్రహముగానా కథను శ్యామలచే వినిపింపజేయుట ఇందెంతయు సమంజసముగా కూర్పబడినది. గౌరీ కల్యాణ కథలో ఈశ్వరుడు మొదట గౌరిని నిరాకరించుట–గౌరీ తపస్సు–అనంతరము పరమేశ్వరుడు వివాహమున కంగీకరించుట–తారకాసుర భంజనుడగు కుమార సంభవముతో ఆకథ మంగళాంత మయినట్లే వైశాలినీ తపోనుష్ఠానంతరము దృఢకేశివధతో నామె వివాహము సంఘటిల్లి కుమారుని వంటి మరుత్ సంభవముతో నీకథయును మంగళాంతము కాగలదన్న భావికథాసూచనము ఈ గౌరీకల్యాణకథచే భావింపబడుట గమనింపదగినది.

చతుర్థాశ్వాసమధ్యమునుండి రంగప్రదేశము పాతాళ లోకమునకు మార్చబడినది. ఇందు ప్రతినాయకుడగు దృఢకేశి ద్విజిహ్వునితో అపీక్షితుని జయించి వైశాలినిని నపహరించు టకు చేసిన పన్నుగడయంతయువారి సంభాషణారూపమున చిత్రింపబడినది. దృఢకేశి అధర్మ పరాయణత్వమును రాక్షసనీతియు కార్యసాధనాపరత్వమును అతని మాటలలో వ్యక్తమగును– ఈ సందర్భమున అమోఘశక్తివంతములయినట్టి మాయామారుతాస్త్ర, ఘన సమీరావర్తక, నభస్సంవర్తక నారాయణాస్త్రాదులను అమూలకముగా కవి సృష్టించివానిచే కొంతకథ అద్భుత ముగా నడిపించిరి. ఈ చతుర్థాంకమున కవి మూలమునలేని ద్విజిహ్వ శిరశ్శృంగాది దృఢకేశి అనుచరుల పాత్రలను, వజ్రదంతుడను గంధర్వుని పాత్రను క్రొత్తగాకల్పించెను. నాయకుని చేత ఉపకృతుడయిన ఈ గంధర్వ కుమారుడు తుదివరకును నాయక సహాయకుడుగా నుండి ప్రాసంగిక కథానాయకుడుగా గోచరించును. చతుర్థాంకము చివర స్వయంవర ఘట్టమునందు దృఢకేశి సైన్యములతో అపీక్షితుడు నారాయణాస్త్ర సహాయమాత్రుడై తలపడ సిద్ధముగా నుండెను. అట్టియెడ వజ్రదంతుడు శరణము కోరగా స్వార్థమును త్యజించి నారాయణాస్త్రమును బంపి అతని ప్రియురాలిని రక్షించును. ఇట్లు నారాయణాస్త్ర విరహితుడయిన అపీక్షితుని సర్ప భావము నెఱిగిన దృఢకేశి నాగపాశబద్ధునిజేసి కారాగారమున బెట్టించును.

పంచమాంకమునుండి గ్రంథాంతము వఱకును మూలములోని ముఖ్యకథ నాటకోచిత ముగా సంభాషణాశైలిలో విస్తరింపబడినది. ఇట్లు పురాణమునందలి సామాన్యమగు చిన్నకథను గైకొని నూత్నకథాకల్పనము విశేషముగా కావించి, కథాదృష్టితో జూచిన నిదియొక్క ''పిల్ల కళాపూర్ణోదయ'' మనురీతి అద్భుతముగా నాటకీకరించిరి. ఇందలి కథరమణీయమై అద్భుతా వహముగ సంఘటింపబడినది. నాయికానాయకుల పాత్రములుదాత్తగుణ శోభితములు. తదితర పాత్రపోషణము రసపోషణమును ఔచిత్య విలసితము. భాషాశైలులు ప్రౌఢ గంభీరములయ్యును సరళములు. శ్లేషచమత్కార మనోహరములు. శ్రీ ఆచార్యులవారిందు సందర్భాను సారముగా

తమకుగల బహుశాస్త్ర విజ్ఞానమును లోకానుభవమును పాత్రల సంభాషణారూపమున నందించుచు పౌరాణికేతివృత్తమునుగూడ ప్రస్తుత దేశకాలముల కుపకరించునట్లు దీనిని రచించిరి. ఇందలి కవితా రీతులనుగూర్చి ప్రత్యేకముగా చెప్పబనిలేదు. అభినవపోతన విరచితమగు ఈ వైశాలిని నాటకమునందలి గద్యపద్యములన్నియును మృదుమధుర పదబంధములై మధురోదాత్త భావ పూరితములై నానాలంకార శోభితములై 'పోతనచరిత్ర' మహాకావ్య కవితకు దీసిపోక కొన్ని యెడల నంతకన్న మిన్నగను నున్నవనుటకు దగియున్నవి. ఇందాచార్యులవారు 200కు పైగా పద్యములు రచించినను వానిలోనధిక సంఖ్యాకములు సీసములు, గీతములు ఆటవెలదులు కందములే యగుటచే నిందలి ఛందము వచనమువలె నాటకోచితమై యొప్పుచున్నది. వేయేల ఇదియొక పెద్దనాటకము. దీనినిగూర్చి ఎంతవ్రాసినను తక్కువే. వైశాలిని సలక్షణలక్షితమైన సర్వాంగసుందరమైన రసవత్తర పౌరాణిక మహానాటక మనజెల్లును.

ఈ నాటకము విశ్వవిద్యాలయములందలి బి.ఏ., ఎం.ఏ. తరగతులకు పాఠ్యగ్రంథముగా నుంటకు సర్వవిధములనెంతేని తగియున్నది.

ఒకమాట. వైశాలిని నాటకము 250 పద్యములతో కొన్నిదీర్ఘ వచనములతో గూడి 221 పుటల విస్తృతిగల తొమ్మిది యంకముల పెద్దనాటకము. దీనిని రంగస్థలముపై ప్రదర్శించి రక్తి గట్టించుట సామాన్యనటులకుచేతకానిపని. అతి సమర్థులయిన ఉత్తమనటబృందమునకే అది సాధ్యమగును. అట్టివారు సర్వత్రలభించుట అరుదు. కావున ప్రదర్శనా దృష్టితో దీని కొక సంగ్రహప్రతి సిద్ధముచేయుట మిగుల యవసరమని నాతలంపు. అట్లొనర్చిననిది ప్రదర్శనా యోగ్యమై బహుళ ప్రచారమునకు రాగలదని నమ్ముచున్నాను.

శ్రీమాన్ వరదాచార్యులవారి గ్రంథములకు పీఠికలుగాని అభిప్రాయములుగాని అనవసరములు. వారిరచనలు స్వయంప్రకాశ భాసురములు. అయినను మావరదన్నకును నాకును గల మైత్రీభావమును పురస్కరించుకొని నన్నేదో వ్రాయమని కోరినందుకువారికి నాకృతజ్ఞతలు తెలుపుచు ఇట్టేదో కొంతవ్రాయవలసినవాడనయితిని. అంతే.

బహుగ్రంథకర్తయైన 'అభినవపోతన'కు ఈ నాటకకర్తకు భగవంతుడు ఇతోధికాయురారోగ్య ఐశ్వర్యాదుల నొసంగ ప్రార్థన.

ఇట్లు

ది. 11-8-1975,
నారాయణగూడా హైదరాబాదు.

ఆచార్య డా॥ పల్లా దుర్గయ్య M.A.P.H.D.

# విజ్ఞప్తి

అమరఝరీతరంగ సలిలార్చిత సస్యఫలాన్నపూర్ణశ్రీ
సుమహితభారతావనియె సుస్థిర సుందర మాతృధాత్రిగా
నమృతము కన్నదియ నగునాంధ్రమె మామక మాతృభాషగా
రమణదలిర్ప సత్కృతులవ్రాయనె కోరెదజన్మజన్మలన్.

"రచయిత"

పై పద్యములో నామనోభీష్టమును దెలియపరచితిని. "తథాస్తు" అని సహృదయశేఖరులైన పెద్దలు నన్నాశీర్వదించండి. సర్వాంగ సుందరియై సరసురాలగు కావ్యకాంతతో నేకాంతముగా కాలక్షేపముచేయుటలోని యానందము తదితర విషయాలలో నాకులభించదు. అదేనాకు బ్రహ్మానందము. అదే నాజన్మజన్మాలయను బంధము. విత్తము విభవములేకున్నను చిత్తములో కావ్యచింతనమున్నచాలును. "దీనివిడిచిన త్రిలోకాధిపత్యమిత్తు"మనినను నాకువలదు. నాకుగల ఐహికాముష్మిక సుఖసర్వస్వమిదియే.

ప్రతిభనాగురువు. ప్రకృతినా పాఠ్యపుస్తకము. ఆంధ్రకవిత నాయభిమానసతి. ఈ దివ్యజ్యోతి ప్రకాశములో మాతృభూమియగు నా నిలయము తీర్చిదిద్దుకొని సోదరులగూడికొనిశాంతి సౌఖ్యములనను భవించుటే నాధ్యేయము. మనోవేదనను చెప్పుకొనుటకు మాటలు చాలని నాతమ్ములకు గళమునాకలము. నాగానమువారి శ్రేయస్సులకు ప్రాణము. నారాగమువారి యభ్యుదయమునకు కనువిప్పగు ఉదయరాగము. పలుకనేర్చిన పదము పాటేట్ల ప్రాయమునుండి పలురకాల కృతులపాడు చునేయున్నాను. త్యాగరాజులగు సహృదయులు నన్నాశీర్వదించి ప్రోత్సహించుచునే యున్నారు. ఆ కృతులలో కొన్ని మాత్రమే ముద్రణాకృతుల దాల్చి ఆంధ్రసోదరుల సేవాభాగ్యమునకు నోచుకొన్నవి.

ఈ తడవ ఆంధ్రసహృదయుల సన్నిధానములో సాహిత్యప్రక్రియలమేలుబంతియనదగు రూపకరూపములోనున్న "పైశాలిని" యనునాటకమును సవినయముగా సమర్పించుకొనుచున్నాను. దీనిపైతమదయాదృష్టిం బ్రసరింపజేసి యాశీర్వదింప నాంధ్ర సోదరుల ప్రార్థించుచున్నాను.

"నాటకాంతహికవిత్వం" అను ప్రసిద్ధ శ్రీసూక్తిననుసరించి కవితాభ్యాసమునకై ఖండకావ్యములకొన్నిటిని వ్రాసి, మనోజ్ఞమగు పాత్రౌచిత్యరస పోషణాదులకు మహాకావ్యమునొకటి రచించి, యనంతరమీ నాటక ప్రక్రియా నిర్వహణమునకు సాహసించితిని. సంప్రదాయనియమాను గుణ్యముగ చక్కని నాటకలేఖన మొనర్చుట సామాన్య కార్యముకాదని తెలియును. పండితమండలి నాయీసాహసమును మన్నించి నన్ను ప్రోత్సహించగలరని వినమ్రుడనై విజ్ఞాపన మొనర్చు కొనుచున్నాను. కాళిదాసాదులును నాటకరచనమునకు ముందు నమ్రవదనులై

''అపరితోషా ద్విదుషాంనసాధు మన్యేప్రయోగ విజ్ఞానమ్ బలవదపి శిక్షితానామాత్మన్య ప్రత్యయం చేతః'' అని యనవలసివచ్చినదన నస్మదాదులెంత ? ఇట్లనిభయపడి ప్రయత్నమే మానుకొనుట కార్యసాధకుని లక్షణముకాదుగదా !

ఈ వైశాలినీ నాటకకథ మార్కండేయ పురాణాంతర్గతము. ఇందలి నాయకుడు ధీరోదాత్తుఁడగు నవీక్షితుడు. నాయిక ముగ్ధయగు వైశాలిని వీరికి ''మరుత్తు'' అనుకుమారుడు దయించుటతో నిదిమంగళాంతముగా ముగియుచున్నది. ఈ మరుత్తరాట్చరిత్రమే చిన్నారిపొన్నారి చిరుత కూకటినాడు శ్రీనాథకవి రచించితినని చెప్పుకొన్నాడు.

నేనీనాటకమును వ్రాయునపుడు ఆంధ్రనాటకముల కన్నను సంస్కృతనాటకములతోనే ఎక్కువ ప్రభావితుడనైతినని మనవిజేసికొనుచున్నాను. సంస్కృతనాటకకవులీ ప్రక్రియా నిర్వహణమందు ప్రపంచ ప్రఖ్యాతులగాంచి రనుట విశ్వవిదితమే.

వారు అలంకారశాస్త్రప్రక్రియలను రసాను గుణముగ ననుసరించినడచినారు. కళగూడ నొకశాస్త్రనియమము ననుసరించుట [లాత్మశోభనినుమడింపజేసికొనగలుగును. నియమబద్ధముగనడచికొను శరీరారోగ్యానందము లధికాభ్యుదయమును వడయుట సహజమే. కళమరియు శాస్త్రము జిజ్ఞాసువులకు పితరులవంటివై విడదీయరానివిగానుండుననిపించును.

కళతల్లివంటిది. శాస్త్రముతండ్రివంటిది. సమాజము సంతానమువంటిదనవలెను. బిడ్డకు తలిదండ్రులిరువురు నవసరమే. బిడ్డకు తల్లియొద్దనున్న చనువు తండ్రియొద్దనుండుటరిది. కళ భావప్రధానమైనది. భావము సముచితేతి వృత్తము నాధారముజేసికొని నవరస ప్రధానమై సుఖదుఃఖమూర్తి మత్వముతో నడయాడును.

శాస్త్రమువిచారవాహినిని పెంచివస్తుతత్వమును వివరించిజ్ఞాననేత్రమును వికసింపజేయును. కళహృదయా కర్షకమై పరసుఖదుఃఖాలు నావేయనుకొను మమతాగుణ వివృద్ధినొనర్చి పరసుఖదుఃఖాలలో తెలియకుండగనే మననుభాగస్వాములుగ నొనర్చును. ప్రతిభావంతుడుకానివాడు శాస్త్రజ్ఞుడును కవియునుగాజాలడు. శాస్త్రముగురూ పదేశమువలన లభించునేమోకాని కవిత సహజముగా నుద్భవించ వలసినదే.

''గురూపదేశాదధ్యేతుం శాస్త్రంజడధియోప్యలం కావ్యంతుజాయతేజాతుకస్య చిత్ప్రతిభావతః'' అనికావ్యాలంకార నిర్వచనము. శాస్త్రమునకొక గురువవసరమైయుండును. కవితకు గురువులేడు. అది స్వయంవ్యక్త భగవానుని మూర్తివంటిది. అట్టి ప్రతిభావంతులు వ్రాసిన కావ్యములేయమరములై యుండి విబుధశిరోధార్యములగును.

కావ్యాళిలో శ్రవ్యకావ్యములనియు దృశ్యకావ్యములనియు నిరుతెరగులు. అందు శ్రవ్యకావ్యములు ఖండకావ్యములనియు మహాకావ్యములనియు రెండువిధములు. రెండువిధముల కావ్యములును రసవంతములేకాని ఖండకావ్యములలో ఇతివృత్తములేదు కనుక రసముస్థా యీ

భావపర్యవసితమై భావశబలతను జేకూర్చు స్థిరతను గడించలేదు. "వాక్యంరసాత్మకంకావ్యం" అనునంతరసమొక్క వాక్యముననే జనించిస్థాయీ భావమునుస్పృశించదు. విభావాను భావవ్యభిచారీభావసంయోగమున నిష్పత్తిజెందిస్థాయి భావపర్యవసితమైననే పాఠకుడు స్వీయానుభూతియను నాత్మసాక్షాత్కారము నాకావ్యాదర్శమున జూచుకొని తనుదాను సంస్కరించుకొనగల్గును. అటులది విశ్వశ్రేయము నొనగూర్చును. కావున రససాక్షాత్కారము కథాసంవిధానములేని ఖండకావ్యాదులలో స్థిరగతినిలువజాలదు. అందులకే వామనుడు ఖండకావ్యముల విస్ఫులింగములతో బోల్చి కథా విధానముగల మహాకావ్యమును జ్యోతితో బోల్చితారతమ్యము నిరూపించినాడు మహాకావ్యకర్తయే మహాకవినామమున కర్హుడని తెలియజెప్పినాడు. విస్ఫులింగములు తామే ప్రకాశించగల్గునుగాని తిమిరమును బారదోలి పథమును జూపజాలవు. జ్యోతితానాగమ్య పథముజూపగలుగు నంతవరకు నిలిచివెలుగును. రసముకథా విధానసంబద్ధమైనవుడేయది యన్యాపదేశమై కాంతా సమ్మితమగు, నుపదేశమొనర్చ గలుగును. కావ్యము శాస్త్రమువలె ముక్కుసూటిగాచేదునిజము నుపదేశింపదు. ఒకకాంతతానెట్లు వినోదమొనగూర్చుచు అనుద్దేశముగా సంతతివంటి సత్ప్రయోజన కారిణియగునో కాంతా సమ్మితోపదేశకారిణియగు కావ్యాంగనయు నంతియే.

ఇకదృశ్యకావ్యములందైనను శ్రవ్యకావ్యములందైనను కవిసమకాలీన సమాజమునుమరచి చరించుటభూమి విడిచిసాముసేయుటవంటిదే. ఏనాడును స్వార్థపరులు రాక్షసభావమున మంచిని వంచనసేయ మాయోపాయముల సంచరించుట సహజమే.

బలవంతుడు బలహీనుల తలదన్ని బలియైతిరిగి త్రివిక్రముని తన్నుతో పాతాళముబట్టి చనుటక్రొత్తకాదు. బాధితులకు ప్రతినిధియైన వామనుడు ప్రజాబలముతో విశ్వరూపమూని విక్రమించి బలినితలనణచుట ఆదినుండివచ్చుచున్నదే. చరిత్రయు ధర్మవిజయమునే చరిత్ర చర్వణమొనర్చుచున్నది. మానవస్వభావము కామక్రోధాదులతో స్వార్థదూషితరాక్షసత్వమూనుటయో శమదమాదులతో స్వార్థత్యాగమొనర్చిదేవత్వమున బ్రకాశించుట యోతరతరాల చరిత్రలో మనకు దర్శితమగు చుండుట క్రొత్తకాదు. అటులే ఏకావ్యములోనైనను మంచిచెడులకు ఘర్షణ ముగలిగి మంచి జయించి చెడు నశించి తీరవలసినదే. అదే విశ్వశ్రేయః కావ్యమను ధ్యేయము. అటులుకానికేవల శృంగార వినోదకావ్యములు "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అని నిరసించుట జరిగితీరవలసినదే. ఎవడో ఎవతెనో ప్రేమించిన చరిత్రతోజగత్తున కొరిగిన లాభమేమి? దాని నేలచదువవలెను? వారి సౌందర్య సౌభాగ్యములెంతగొప్పవైననేమి ప్రయోజనము? ప్రయోజనము లేనివినోదము గొడ్రాలి దాంపత్యసుఖమువంటిదే.

కామినీ కాంచనములు కామమునకు నర్థపురుషార్థమునకును ప్రతీకలు. అర్థకామము లక్రమములైన చౌర్యవ్యభిచారములై సమాజశాంతికి బాధాకరములగును. రామాయణ భారతముల లోనివి యేమనకు కనబడును. రావణుడు రాముని భార్యను సీతనపహరించుట వాలి సుగ్రీవుని భార్యనపహరించి యతనిదన్ని తరిమివైచుట, శూర్పణఖ సీతభర్తయగు రామునిపై కన్ను

వేయుటమొదలగునవి అక్రమ కామవృత్తములు. అవిదుర్గతిని పొంది నశించినట్లు మనమా కావ్యములో గాంచగలము. భారతములో పాండవుల ధనసర్వస్వము రాజ్యముజూదమున గెల్చి కొనుటఅక్రమము. ఇదినసహింపరానిది. అక్రమమగు అర్థపురుషార్థము ఒకవిధమగు చౌర్యముగానే పరిగణింపబడును. ఆయైశ్వర్యము చిగురింతవలె తక్షణమే పెరిగి మరుక్షణములో నశించవలసినదే. ఈ రెంటిని అనగా అర్థకామముల అదుపులోనుంచెడి విధినియమసమామ్నాయమే ధర్మ పురుషార్థము. కాలముతానెల్లప్పుడీ ధర్మమునుగెలిపించి సమాజశాంతి సౌఖ్యముల పరిరక్షించును. అదే విశ్వశ్రేయము. అదేకావ్యధ్యేయము. అర్థకామోపాసనములాదర్శ ప్రాయములుగా తీర్చి దిద్దుటేకావ్యలక్ష్యము. అదే అభ్యుదయ కాముకత్వము. అందులకే కావ్యకారులగు కవులు తమ కావ్యాదిలో "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కావ్యమునకు కథాక్రమం బెట్టిదనిన" అనివార్యయుచుండుట ఆచారమైయొప్పినది. కష్టసుఖముల ఘర్షణలోనే కథపుట్టుచున్నది. అదే అందచందాలు నంతరించుకొని కావ్యరూపము దాల్చుచున్నది. అట్టికావ్యమును కాదికవినన్నయ్య నిర్వచనమిట్లున్నది. "విశ్వశ్రేయః కావ్యమ్ తదదోషౌపరిష్కృతౌ చవాగర్థౌ సావాగ్వ్యారసవృత్తిః సాధ్యోహిరసో యథాయథంకవిభిః" కావ్యము విశ్వశ్రేయస్కరమగుటే కాక యందలి వాగ్ధరములు దోషవర్జితములై గుణయుక్తములై రసాలంకార పూరితములై ప్రసన్నగంభీరవైఖరితో నలరారవలెనట. ఈ తనకావ్యలక్షణమునకు భారత సంహితాంధ్రీకరణమును లక్ష్యమొనర్చివారైనెను. ఆదికావ్యమగు భారతము పద్యగద్యమిశ్రితమై చంపూపద్ధతిలోనడచినది.

పద్యమైనను గద్యమైన నదిరసయుక్తమైన చోకావ్యమేయగును. గద్యముకన్న పద్య మెక్కువ ప్రయోజనకరమై పూర్వకవులదృష్టి నాకర్షించుటలో నాశ్చర్యములేదు. పద్యము పాడుకొనవీలగును. పద్యము సంగీత సాహిత్యకళా ద్వయమునొకచో గూర్చుటకునై యుత్తమ సాధనముగా నొప్పారుచున్నది. పద్యములోలయయున్నది. లయగలచోట సంగీత సుందరి నాట్యమాడును. పద్యములో భావానందముతో పాటు సంగీతాకృతిగలుగునాదానందమును గూడాగద్యములో కన్ననధికముగా ననుభవింపవచ్చును. లయయుంటచే పద్యమునందు గతి సౌందర్యముమెండుగానుండును. సంగీతనాదము పిల్లలనుగూడ నాకర్షించుటేకాక తనయాకర్షణతో పామరజనులకు నైతము సాహిత్య భావమువైపు మరలించును.

పద్యార్థ సౌందర్యములు అన్వయమొనర్చుకొనగల పండితపాఠకులకే విందొనర్చును. గద్యసౌందర్యము అన్వయమొనర్చు కొననవసరములేనిదగుట పామరజనమునకునందుబాటులో నుండియున్నది. అందులకేనేమో నాటకకళపద్యగద్యముల ప్రయోగించిరెంటికిని సమానాదరణ మొసంగెను. అవసరమైనచోట్ల గేయముల ప్రయోగించి మాత్రాఛందస్సునకు స్థానమిచ్చును. ఈ దృశ్యకావ్యమును పండితపామరులును రంగస్థలముపై దర్శించి రసానుభూతిని పొంది యానందించెదరు. అందువలననే కావ్యేషునాటకం రమ్యం" అని పండితులీ విశ్వజనీనమగు సాహిత్యప్రక్రియను ప్రశంసించినారుకాబోలు.

ఇది పూర్వసాహిత్య ప్రక్రియయని ఆధునికులు పేక్షించ నవసరములేదు. ఇదిసర్వజన సుబోధకమగు రంగస్థల ప్రదర్శనమునకు బనికివచ్చుట అందరును దీనినాదరించవలసినదే. ఈ ప్రక్రియతో సాహిత్యమును ఆ బాలగోపాల మర్థముచేసికొనుటకు వీలుగలుగుచున్నది.

పూర్వులధునాతన సాహిత్యములన నాధునికులు పూర్వసాహిత్యములన నీసడించుకొనుటలు సాహిత్యమునకుపట్టినయొక దుర్గతియేయని చెప్పకతప్పదు. గుణదోషము లిరువురియందును గలవు. పూర్వులలో కొందరికి శబ్దాడంబరమధికమని పించును. అధునికులలో కొందరికి భావాస్పష్టతమెండుగానుండునని పించును. ఈ యిరువురును తమలోనుండు ఈలోపాలసరిదిద్దుకొను సహృదయత గల్గివారివారి కావ్యముల విలువలదెలిసికొని యానందించి యభినందించుకొన వలసిన యవసరమెంతైనాకలదు. శాస్త్రకారులు కవులనుతాము "పాండిత్యహీనాఃకవయోభవంతి" అని చిన్నచూపుచూచువారును లేకపోలేదు. అదినరికాదు. శాస్త్రకారునివలన లభించుమే ధస్సులోని విచారశక్తి కవివలనలభించు మనస్సులోని వినోదరక్తియనురెంటి కలయికతోనే సమాజములోని యజ్ఞాన విముక్తికాగలదు. కావున కావ్యము శాస్త్రమురెండునుగూడ తల్లిదండ్రులైసమాజమును నయభయముల జూపితీర్చి దిద్దగల సాధనములని తెలియదగును. నాటకప్రక్రియ సమాజములోనికి వేగముగా జొచ్చుకొని పోగల్గి దాని తీర్చిదిద్దగల సమర్థవంతమైనది. దీనినిర్వహణమనుకొనినంత సులభముగాదని తెలిసికొన్నాను. ఇంతటి మహత్తరప్రయోగ నిర్వహణమునకునై పూనుకొని దోషజ్ఞుల మెప్పించుట నాచేతకానిపని. ఐనను నాచాపల్యదోషముతా నీకృతి నిర్వహణమునకు ప్రేరేపించుటచే వ్రాయకతప్పినదికాదు. గుణదోషములు సహృదయులకే వదలితిని.

ఇందుపాత్రోచిత సంభాషణలలో నీచపాత్రలకు గ్రామ్యభాషను మధ్యపాత్రలకునై శిష్టవ్యవహారమును ప్రయోగించవలసినదిగా కొందరి పండితా ఖండలులమతమైయున్నది. ఈ ప్రజాస్వామ్యయుగములో కొందరిని నీచులని గొప్పవారని విభజించి భేదదృష్టి గలిగించుట మంచిదికాదే మోయనిపించి వదలివైచితిని. ఒకమండలములోని గ్రామ్యభాషమరియొక మండలమునకు తెలియ వీలుకాదనుటలూహింపవలసినది. శిష్టవ్యవహారమునకు ప్రాకృతములకువలె చక్కని వ్యాకరణ నియమనిర్దిష్టతలేకుండుటచే యేదిశిష్టమో యేదిదుష్టమో తెలియుటకష్టము. అది ప్రయోగించుటయు సకల సరసజనసమ్మతముగా గూర్చుటయు కష్టమూలమైనదే యని పించును. మనతెనుగున శిష్టవ్యవహార భాషా నిర్ణయము జరిగినచో నాభాషనేవాడుట సమంజసముగానుండును. నేనడిగినంతనేతమ తమవిపుల పీఠికలను అమూల్యాభిప్రాయములను వ్రాసి పంపిన శ్రీ కేశవపంతులవారికి శ్రీ అవధానిగారికి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి శ్రీ వోణంగి శ్రీరామ అప్పారావుగారికి శ్రీ పాటిబండ మాధవశర్మగారికి శ్రీ పల్లాదు దుర్గయ్యగారికి శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యముగారికి శ్రీ దాశరథి రంగాచార్యులుగారికి నాఅనంతకృతజ్ఞతలు.

ఈ నాటకముద్రణకై శ్రీ పెద్దపల్లి మురళీధర్‌రావు డిప్టీకలెక్టర్‌గారు ఒకనాటక ప్రదర్శనతో డబ్బు ప్రోగుచేసి అయిదువేలు 5000 రూపాయలు నాకు ఘనసన్మానముగా నిచ్చి తోడుపడిన మహాసహృదయ శిరోమణులు. వారికి ఆజన్మము ఋణపడియున్నాను. వారికివే నాహార్థికకృతజ్ఞతాభినందనలు. అట్లే దీనిముద్రణకై శ్రీ ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ 1000 రూపాయల ద్రవ్యసహాయమొనర్చినది. సంగీత నాటక అకాడమీ వారుగూడా 1000 రూపాయలు ఆర్థిక సహాయమొనర్చినందులకు ఉభయ అకాడమీలకు నాకృతజ్ఞతలు.

ఇట్లు

వానమామలై వరదాచార్యులు



# వైజయంతి

'కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిపుట్టురత్నము లవారితసత్కవికల్పనావిశేషా
వహపూర్వవృత్తములు సానలుదీరిన జాతిరత్నముల్'

ఈమాట రామరాజభూషణు డన్నను రామాయణకాలమునుండి వచ్చుచున్న సంప్రదాయము. ఈవస్తు వివేచనము శ్రవ్యకావ్యములకు వలెనే దృశ్యకావ్యములకును వర్తించును. మూడువిధములైన కావ్యవస్తువులలో మిశ్రమున కంత మిన్నయైన స్థానమిచ్చుటకు కొన్ని హేతువులుండవచ్చును. కావ్యము కథకొఱకే వ్రాసినచో కల్పితేతివృత్తమున కున్న గౌరవము మిగిలినవాని కుండరాదు. అపరిచితమైన వస్తువు నామూలాగ్రముగా తెలియునంతవఱకు సామాజికు డూపిరి త్రిప్పుకొనలేడు. నాటకమున కథాగతితో పాటు కథార్థములను భావనము చేయవలసియుండును సామాజికుడు. కల్పితేతివృత్తమున ఆసక్తి కున్నంత అవకాశము ఆలోచనమున కుండదని ప్రాచీనుల అభిమతముకాబోలు! ఇక ప్రసిద్ధేతివృత్తమేయైనచో కథయందు చమత్కారముకంటె కవియుక్తియందలి చమత్కారమే దానికి ప్రాణము పోయుచుండును. మఱల చెప్పినకథ ఎంతచమత్కారముగా చెప్పబడినది యను అంశమే అందు ఆలోచనాంశమగుచుండును. మూలముకన్న ముచ్చట గొల్పకున్నచో ఆ వస్తువు మొగము మొత్తినట్లుండును. మిశ్రేతివృత్తమునందు కొంత మెళకువ కలదు. మూలవస్తువు సామాజికులకు తెలియును. అది సహజముగా రమణీయమైనచో కవికల్పనలా రామణీయకమును ద్విగుణీకృతము చేయవలెను. మూలకథ లోపభూయిష్ఠమైనచో కల్పనలు దానిని పుటముపెట్టిన బంగారమువలె వన్నెకెక్కించవలెను. మొదటిపద్ధతికంటె రెండవది చమత్కారతరము. కథాగతి చమత్కారము ఆసక్తిని పెంపొందించును. ఆశ్చర్యముతోపాటు ఆలోచనము కలిగించును. కాళిదాసాదు లందువలననే మిశ్రేతి వృత్తమును స్వీకరించి నాటకములు రచించి విఖ్యాతులైనారు. వరదాచార్యులవారును ఆ యొరవడిలోనే ఈ నాటకమును నిర్వహించినారు.

ఈ నాటకేతివృత్తము మార్కండేయ పురాణమునుండి గ్రహింపఁబడినది. ప్రాచీన మహాపురాణములలో మార్కండేయ మొకటి. తిక్కన శిష్యుఁడైన మారన మహాకవి దానిని తెలుగున మొదటిసారి యనువదించినాడు. తెలుగున వెలసిన మహాపురాణములలో నది మొదటిది. దేశి పురాణసంప్రదాయమునకు ప్రతిగా మహాపురాణ సంప్రదాయమున కది తెలుగు సాహిత్యమున శ్రీకారము చుట్టినది. మార్కండేయమున కున్న మిగిలిన గుణములన్నియు నట్టుంచినచో నది 'నూతన కథావిస్తార' మైనదను గుణము ముఖ్యముగాఁ బేర్కొన దగినది. అందలి కథలెన్నియో ఆంధ్ర ప్రబంధములకు వస్తువులైనవి. మరుత్తచరిత్రము, స్వారోచిషమను సంభవము, హరిశ్చంద్ర మహారాజుచరిత్రము, కువలయాశ్వ చరిత్ర-మొదలగు కథలన్నియు కావ్యములుగా కాలాంతరమున నవతరించినవి. మరుత్తరాట్కథ మహాకవి శ్రీనాథునంతటివాని నాకర్షించినది. మహాకావ్య

మాతనిచే వ్రాయించినది. కాని, మనదురదృష్టవశమున నాకృతి నేడు లభించుటలేదు. ఆలోప మును శ్రీపాదవారికృతి కొంత తీర్చుచున్నది. శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు మరుత్తరాట్ జనన వృత్తాంతమునిందు గ్రహించినారు. ఆంధ్రమార్కండేయ పురాణమూర్తికిఁ బాదద్వయ మనఁదగిన కథాద్వయి అవేక్షిత మరుత్తరాట్చరిత్రములు. సూర్యవంశజులైన ఈ రాజు లిరువురును అభిమానధనులు, అవక్రపరాక్రములు, అకళంకధర్మమూర్తులు. శ్రీనాథుఁడు వారిలో పుత్రుని కథకు ప్రబంధగౌరవము కల్పింపఁగా, వరదాచార్యులవారు జనకుని కథకు దృశ్యకావ్యగౌరవము కల్పించి ధన్యులైనారు.

మార్కండేయము నందలి అవీక్షిత మరుత్తరాట్చరిత్రములు శక్తిమంతములైన జంట కథలు. ఒకదానినుండి మరియొకటి తీగసాగినట్లు వ్యాపించి పఠితల కాశ్చర్యానందములు కలిగించును. కార్యకారణ సంబద్ధమైన కథాకథన శిల్పమువలనను, పూర్వపూర్వసన్నివేశలము లందు అనంతరసన్నివేశములందలి కథార్థములకు బీజములను నిక్షేపించెడినిర్మాణశిల్పమువలనను ఆకథలకు కథోన్మీలనశక్తి సహజముగా నలవడినది. పురాణగాథ చదివిన సామాన్యుడే పుల కాంకురిత గాత్రుఁడగు నన్నచో రసహృదయుఁడైన కవిమాట వేరుగాఁ జెప్పవలెనా? వరదా చార్యులవారి రసహృదయమున బడియీకథ కల్పవృక్షముగా విస్తరిల్లినది.

పురాణకథ నాటకేతివృత్తముగా విస్తరింపవలసివచ్చుసరికి కొన్ని వివరణలు, సవరణలు, కల్పనలు. అవసరమగును. అవియన్నియు మూలకథకొక సమగ్రవ్యక్తిత్వమును గల్పించుట కును, రసపోషణమునకును దోడ్పడవలసియుండును. వరదాచార్యులవారు వైశాలిని నాటకము నాదృష్టితోఁ బెంచి రచించిరి.

ఇతివృత్తకల్పనలో నౌచిత్యపోషణమున కెంత ప్రాధాన్యముండునో, అనౌచిత్యనివారణ మున కంత వైశిష్ట్యముండును. మూలకథను కావ్యదృష్టితో శోధించినగాని ఔచిత్యానౌచిత్యముల నిర్ణయించుటకు వీలులేదు. మూలకథా ప్రవృత్తికి భిన్నమైన కల్పనలను ప్రాచీనులు హర్షింప లేదు. అవి రసద్రష్టుల నాకర్షింపలేదు. మూలకథాప్రవృత్తికి రసవృత్తిని కూర్చుటయే కల్పనల సార్థక్యము. అట్టికల్పనలకు రూపకజగత్తున రమణీయరూపమును దీర్చిదిద్దిన కవికులగురువు కాళిదాస మహాకవి. అతని నాటకములలో నాయకమణి అభిజ్ఞానశాకుంతలము. అతడానాటక మున మూలకథాప్రవృత్తికి రసవృత్తిని నందించుటకు చేసిన కల్పన లనల్పశిల్పవిశిష్టములు. వాని నొరవడిగాఁ బెట్టుకొని వరదాచార్యులవారు వైశాలిని నాటకవస్తువున కొక విశిష్టవ్యక్తి త్వమును, సమగ్రతను సంపాదించి పెట్టినారు.

కాళిదాసునకు వలెనే వరదాచార్యులవారికి నాయకపాత్రపోషణము ప్రధానాంశమైనది. శాకుంతలమున దుర్వాసుని శాపకల్పనము దుష్యంతుని శీలసవచమైనది. వైశాలిని నాటకమున అవీక్షితుని విశ్వజిద్వీరశీలమును నాగశాపము రక్షించినది. శాపకల్పనము వస్తువునకు వర ముగుట వరదాచార్యులవారి ప్రతిభావిశేషము.

మూలమునందలి [1] అవేక్షితుని పాత్రను వరదాచార్యులవారు ఉదాత్తీకరించిన తీరు ప్రశంసావహమైనది. అవేక్షితుడు అసమవీరుడు. స్వయంవరసభలకేగిరాజ సమూహముల నోడించి కన్యలను వీరభోజ్యలుగా గ్రహించుట యతని క్రీడ. అట్లాతడు గ్రహించినవారిలో హేమవర్మ తనూజయైన వీరయు, సుదేవతనయ యగు గౌరియు, బలినందనయగు భద్రయు, వీరాత్మజ యగు లీలావతియు, విరభద్రపుత్రికయగు దారికయు, భీమప్రసూతియగు మాల్యవతియు, వైదర్భ నృపప్రభవయగు కుముద్వతియుఁ బేర్కొనఁ దగినవారు. ఇఁక పేరుపేరున సూచించుటకు వీలులేని రాజకన్యలెందరో కలరని మార్కండేయము చెప్పుచున్నది. వారందరిని లెక్కించకున్నను వైశాలినితోఁ గలిసి యాతనికి అష్టమహిషు లుండిరనియు, దానివలన నతడు అపర గోపాలుఁడనియుఁ దెల్లమగుచున్నది ఇందరుభార్యలున్నను అతనికి సంతతి లేదనుట మూలమునందలి కథాధ్వని. వైశాలినివలన గలిసిడి పుత్రుఁడే అతని వంశోద్ధారకుడనుట మూల తాత్పర్యము. శాకుంతలమున దుష్యంతుని స్థితియు నట్టిదియే. అతని కెంతమంది రాణులున్నను వంశాంకురము నిచ్చినది శకుంతలయే. కాని, కాళిదాసు దుష్యంతుని బహుభార్యాత్వమును గౌణముచేసి నాయకపాత్రగౌరవము కాపాడినాడు. వరదాచార్యులవారు అవీక్షితుని ఏకపత్నీ వ్రతునిగా మార్చి నాయకుని నుదాత్తునిగాఁ దీర్చి దిద్దినారు. ఈ మార్పు శ్రీకృష్ణని రామునిగా మార్చునంతటి మహనీయమైనది.

మూలమున నవేక్షితుడు విశ్వజిద్వీరుఁడనెడు తాత్పర్యము వ్యంగ్యము. ఆ లక్షణము స్వయంవర సభలయందే ప్రకటితమైనది. ఆచార్యులవారు అవేక్షితుని వీరమునకు హేతువైన కామమును తొలగించి ఆస్థానమున ధర్మమును స్థాపించినారు. నాయకశీలపరిపోషణమునందీ మార్పు మట్టిని బంగారము చేయుట వంటిది. మూలకథయందు కామమోహితమైన వీరమునకు ఓటమికలుగుట ఔచిత్యపోషకము. ఈ నాటకమున ధర్మప్రేరితమైన వీరమునకు సహజమైన ఓటమి కలిగినతో రసభంజకము కాగలదు. అందువలన రసపోషణకు శాపమనెడి రాజౌషధము కావలసివచ్చినది.

శాకుంతలమున శాపమిచ్చుటకు దుర్వాసుఁడే కావలసిన యవసరములేదు. కాని, అతఁడు కోపనుఁడగు మహర్షియని ప్రసిద్ధికెక్కినవాఁడు కావున నతనిని ప్రవేశపెట్టుటలో సహజత్వము సాధింపఁబడినది. ఈ నాటకమున నాగశాపము కథతో పెనవేసికొనిపోయినది. సర్పసమాగమ విచ్ఛేదమువలన నవీక్షితుఁడేడు మడియల కాలము నాగపాశబద్ధుడగుట ఈ శాపప్రభావము. శాపము ప్రమాద మూలమగుటచే నాయకుని ధర్మస్థితికి భంగములేదు. వైశాలినీ స్వయంవరమున నవీక్షితుఁ డోడింపఁబడుట యీకథలోని ఆయువుపట్టు. కథయంతయు నాసన్నివేశ కేంద్రము నాధారముగాగొని పరిభ్రమించును. ఆ ఆయువుపట్టును సంరక్షించెడి నమర్థమైన హేతువు మూలమునలేదు. ఆచార్యులవారీ కథకు మూలబలము నీశాపకల్పనమువలనసాధించినారు.

---

1. మూలము ననుసరించి మారన అవేక్షితుఁడని పేర్కొనెను. వరదాచార్యులవారు కథకనువైన వ్యుత్పత్త్యర్థమును భావించి అవీక్షితుఁడని పేరుమార్చిరి.

అవీక్షితుఁడొకబాణమున రెండుపాముల తలగలమఱు లెగురగొట్టినట్లు—ఆచార్యులవారి కల్పనముచేత రెండు ప్రయోజనములను సాధించినారు. ఒకటి నాయక పరాక్రమ ప్రతిష్ఠను రక్షించుట; రెండు : నాగప్రతీకార హేతువును కల్పించుట. ఈ రెండును మూలకథకు వన్నె దెచ్చు ముత్తెములవంటి కల్పనలు. మొదటి దానిని గురించి యిదివరకే కొంత చెప్పితిమి. ఇఁక రెండవది రెండింతల విలువ కలిగినది. మూలమున నాగవిరోధమునకు బలమైన హేతువులేదు. అసలు నాగవిరోధము మరుత్తరాట్కాలమున ప్రవర్తించునది. ప్రమత్తులైన నాగుల దుశ్చర్యల వలన నేర్పడు సన్నివేశమది. పాముపగకుకూడ ఒక ప్రయోజన ముండవలెను గదా ! కార్య కారణసంబద్ధమైన రూపక వస్తునిర్మాణములో యాదృచ్ఛిక సన్నివేశ కల్పనము కవిప్రతిభలోని బలహీనతను బయటపెట్టునని జాగరూకత ప్రకటించినారు ఆచార్యులవారు. నాగసంగమ విచ్ఛేదము నాయికా నాయకుల స్వయంవర విచ్ఛేదహేతువగుటకంటె నౌచిత్యమేమికలదు ? ప్రథమాంకములో ప్రవర్తిల్లెడి యీసన్నివేశము భావికథా ఫలమునకు బీజమగుట కంటె రూపక శిల్పము మరియొకటి యేముండును ? కల్పనచేయుటయే గొప్పకాదు కవికి. దానిని బహుళార్థ సాధకముగా సంవిధానము చేయుటయే సామర్థ్యము !

జీవభూతమైన కల్పనము కథాప్రవృత్తినే కమనీయ మొనర్చును. ఒక్కొకసారి తీగకదిపినచో డొంక యంతయు కదల వలసి వచ్చును. ఈ నాటకమున నాగశాపకల్పనము నానావిధ కథాసన్నివేశ కల్పనలకు మూలకందమైనది. మరుత్తు పుట్టుట నాటకఫలము. ఫలోన్ముఖమైన బీజనిక్షేపము నాటకరచనలో శిల్పరహస్యము. నాగులకు మరుత్తులు విరోధులు. నాగశాపము మరుత్తుల ఆగ్రహమునకు ఆలంబనమైనది. మరుద్రూపుఁడైన వాయువు నాగులను శపించినాఁడు. 'మీరు నన్నెవుడు మెసవుదురు. నాయంశ మతని సుతుఁడై మిమ్ముహత మొనర్చు'నని హుంకరించినాడు. నాగశాపము నాటకక్రియాప్రవృత్తికి మూలముకాగా వాయుశాపము నాటకఫలోత్పత్తికి దోహదమైనది. ఈ రెండింటికిని కారణకార్య సంబంధము ముడివైచి మొదటియంకము నందే నిలుపుట వరదాచార్యులవారి ముఖసంధి సంధానములోని మెరుపువంటి ప్రజ్ఞ కృత్యారంభ శిల్పమునందు కృతకృత్యుఁడైన నాటకకవికి కృతినిర్వహణము నల్లేరుపై బండినడక కాగలదు !

ప్రథమాంకము ప్రారంభమగుటకు పూర్వమే శుద్ధవిష్కంభమొకటి ప్రవర్తిల్లినది ఇందు వైశాలిని పూర్వజన్మవృత్తాంతకథనము కలదు. ఆమెపుట్టుకకు అగస్త్య మహర్షిశాపము హేతువు. వైశాలిని పూర్వజన్మలో గంధర్వరాజగు సునయుని పుత్రిక. సునయునింటికి అగస్త్య మహర్షి వచ్చెను. అతఁడా మునిపుంగవుని సపర్యలకు తన తనయను నియోగించెను. ఆమెకొక చెలికత్తెకలదు. ఆమెహాస్యచతుర. ఆరాధ్యుఁడైన అగస్త్యుని నామె హాస్యమాడినది. చెలికత్తెతో లిసి రాజకుమారియు పరిహసించినది. అగస్త్యుని కది ఆగ్రహకారణమైనది. చెలికత్తెను నీచయోనియందుద్భవించి నిశాచరునిచే నశింతువుగాత'' అని శపించినాడా మహర్షి. గంధర్వ రాజపుత్రిని 'నీవును మనుష్యజన్మము నుద్భవ మంది నీప్రియుని విరహముతో కలకాలము తాపపడెద'వని శపించినాఁడు. సునయుఁడా సంగతివిని మునిని శరణువేడినాడు. అగస్త్యుఁడు

శమించి 'పాతాళదర్శనముతో నామెశాపము విముక్తియగు'నని అనుగ్రహించినాఁడు మూల మున అగస్త్యశాపమునకు బలమైన హేతువులేదు. గంధర్వరాజతనయ యామహర్షి యాశ్రమ మున నొకపరి విహారార్థమేగినదట. తపోవనమును విహారవనిగా మార్చినందుల కాముని కోపించి మనుష్యయోనియందు జన్మింపుమని శపించెనట! ఇది మూలకథ. మూలకథకంటె వరదా చార్యులవారి కల్పనము ప్రశస్తముగా నుండుటయేకాక ప్రతిభావంతముగా రాణించుచున్నది. మూలమున గంధర్వతనయాసఖిలేదు. అప్రాప్త ఆచార్యులవారి కల్పనయే. ఈకల్పనచూచుటకు చిన్నదిగా నున్ననుఁ కథలో బ్రహ్మాండమంత ప్రయోజనము సాధించినది. అగస్త్య శాపమున కేకైక హేతువు మూలమున గంధర్వపుత్రికయే. కాని, ఈ నాటకమున ఆ హేతువు ద్విధా విభక్తమైనది. ఇందు ప్రధాన హేతువు సఖి. అనుబంధ హేతువు గంధర్వ తనయ 'ఇనుముతోఁ గూడిన యగ్నికి సమ్మెట వ్రేటులు తప్పవు గదా!' యని ఆచార్యులవారి అర్థాంతరన్యాసమున కీకల్పన తావాసంగినది. చేసిననేరము చెలిదగుటచే చెంతనున్నదోషమే నాయికను గట్టికుదిపి నది. ఈ మార్పు పఠితకు నాయికపై సానుభూతి కలుగుటకు సహాయపడుచున్నది. మూలమున శాపోపసంహార నియమము లేదు. నాయికా పాతాళలోక గమనమునకు పటిష్ఠమైన కారణము లేదు. ఈ నాటకమున నీరెండును సాధింపబడినవి. అవి నాటక కథాగతికి పోషకములగుట విశేషము. అగస్త్యుఁడు చెలికిచ్చిన శాపమునకు తరణోపాయము చెప్పలేదీ నాటకమున. అట్లుచేయకుండు టయే ఔచిత్యము. శిల్పదృష్టితో నది నాటకమున కర్తప్రకటించిన గడుసరితనము.

"అందరునంతో యింతో కథాభావము తెలిసి యానందింపఁ గలరేమోకాని, ఆలోచనా మృతమగు మహోన్నత కావ్యశిల్ప సౌందర్య మది యెవ్వరే క్రొత్తఫక్కి రచించినను నందఱి కందుబాటులో నుండుట కష్టమే! సహృదయులు మాత్రమే దానిని సమగ్రముగా నాస్వాదింపఁ గలరేమో!" యని ప్రస్తావనలో నాచార్యులవారు నటిచేత నిజము పల్కించినారు. నాటక మునకు వస్తువు శరీరము. 'శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్' కావ్యధర్మము, ధ్యేయము రస ప్రసవము. మదుత్ప్రసవమునకు కృశాంగియైన వైశాలిని సమర్థముకాదని నాటకవస్తువు సూచించినది. మహోజ్జ్వల పుత్రఫలావాప్తికి మాతృశరీరము సమర్థవంతము కావలెనను సూత్రము ఈ నాటకవస్తువే బోధించుచున్నది. అట్లే సహృదయుఁడాస్వాదించు రసానందము నందించు ఆలోచనామృతమునకు నిలయమైన వస్తువు నిండుకుండవలె నుండవలెను. ప్రాచీనులు పంచసంధియుతమైన యితివృత్తమును నాటకములందవశ్యముగా నిర్దేశించుటలోని అంతరార్థ మిదియే మూలమున కృశించియున్న నాటక శరీరమును ఆచార్యులవారెట్లు కల్పనా గౌరవముచేఁ బుష్టి మంతమొనర్చినారో గమనించినచో వారి ప్రతిభా ప్రకాశము తేటతెల్లము కాఁగలదు.

నాయికా నామము నధికరించి నాటకనామ ముంచుట యొక విశేషము. 'వైశాలిని' యనెడిపేరు నిజమునకు పేరుకాదు. 'విశాలుని అపత్య' మనెడి అర్థము నిచ్చుశబ్దము. ఆమె పూర్వజన్మనామముకూడ తెలియరాదు. లోకములోగూడ నొక్కొక సారి యిట్టి పేళ్లు గోచరించు చుండును. కొందరికి తల్లిదండ్రులు పెట్టినపేళ్లున్నను లోకమున వ్యాప్తిగాంచెడి పేళ్లు మరొక

విధముగానుండుట కాంచెదము. ఇక్కడ వైశాలిని నామ మట్టిది కావచ్చును. అయినను పేరులోనేమున్నది? అది నిలిచెడి వస్తువులో నున్నది కాని, నాయికానామ ముంచుటచే నొండు రెండు ప్రయోజనములు సూచింపఁబడుచున్నవి. ఒకటి వస్తువులో నాయికకుఁగల ప్రాధాన్యము. రెండు నాటకమున శృంగార రసమున కేర్పడు పుష్టిమత్వము. మూడు: పంచసంధి సంవిధాన సౌలభ్యము. వీనిని సంగ్రహముగాఁ బరిశీలింతము.

నాటకమున నాయకు శీలము కవిచే రక్షింపఁబడినది. నాయిక శీలము తన్నుతాను రక్షించుకొనినది. నాగపాశబద్ధుఁడై శత్రువుల కోడిన నాయకుఁడు వివాహ విముఖుఁడయ్యెను. నాటకకార్యమునకు విచ్ఛిత్తి యేర్పడినది. ఆవిచ్ఛిత్తినుండి రక్షించినది, నాయికా చిత్తవృత్తి. అపేక్షితుని కొఱకు అడవులకేగి తపోదీక్ష పూనినది వైశాలిని. ఆమె తపఃఫలమే కార్యమును నిర్వహణమువైపు మరలించినది. వైశాలిని మరియొకవరు నెన్నుకొనుట కంగీకరించినచో కథ లేదు; దానివెంట ఫలసిద్ధియు, రససిద్ధియులేదు. అందువలన నాటక ప్రాణము వైశాలినీ వృత్తముపై నాధారపడినది అట్టిప్రాణము నధికరించి నామమిడుట పరమౌచిత్య మనుటలో సంశయములేదు.

మూలమున నాయకుని యభిమానవీరమున కున్న దీప్తి శృంగారమునకులేదు. సంభోగాంతమగు శృంగారమునకు పూర్వరాగ విప్రలంభము పుష్టిని చేకూర్పవలసియున్నది. మూలమున నీవిప్రలంభమునకు శక్తినిగూర్చు సన్నివేశకల్పనములేదు. నాయకునకు నాయికవలన ననురాగోదయము కలిగినట్లు మూలమునందాధారములేదు. స్వయంవర విజితయైన వైశాలిని అపేక్షితునకు భోజ్యమగు ద్రవ్యమగునేకాని మనసు కెక్కిన మగువకాజాలదు. ఆమె యతని పరాక్రమమును గాంచి ప్రేమించినను ఏకత్రైవాను రాగ సూత్రముచే రసాభాస శంక కవకాశము కలుగుచున్నది. నాయిక యొనర్చెడి తపస్సువలన నాయకునియందు సానుభూతియు, దానివలన ననురాగమును గలిగినట్లు చిత్రించుట మూలకథాతాత్పర్యము. అది అయోగ విప్రలంభపోషకము కాఁజాలదుకదా! ఈరస శిల్పసూక్ష్మమును గాఢముగా భావించి శ్రీమాన్ వరదాచార్యులవారు నాటకమున నైదంకముల కథను స్వోపజ్ఞతో కల్పనానిబిడముగా నిర్మించి శృంగార రసపోషకముగా నొనరించిరి.

శృంగారపోషణమున నాచార్యులవారు కాళిదాసుని ప్రమాణముగా నెన్నుకొనినట్లు భావింప వీలగుచున్నది. శాకుంతలమువందలి శృంగార రస సమన్వయమునిందు సూత్రించుకొనుటకు వీలగుచున్నది. శాకుంతలమున శకుంతలా దుష్యంతుల కణ్వాశ్రమ సమాగమము భౌతికమైనది; విషయోపభోగ ప్రధానమైనది. మారీచాశ్రమ సమాగమము ఆధ్యాత్మికమైనది, విశుద్ధాత్మల అద్వైత సిద్ధివంటిది. విషయవాంఛా విలుప్తమైన విశిష్టమైన శృంగార మద్వైత ప్రేమగా సిద్ధిపొందుట దాంపత్యజీవిత పరమార్థము. అదియొక యోగసాధన వంటిది. విప్రలంభ మా యోగ మార్గమున సాధనము. దీనిని కాళిదాసు అనన్యసామాన్యముగా నిర్వహించినాడు. కాని, ఆనాటకవస్తు స్వభావము వేరు. ఈ నాటకవస్తువు వేరు. అయినను ఆ తత్త్వమును

అంతర్లీనముగాఁ జిత్రింపదలచినారు ఆచార్యులవారు. అచ్చట సంభోగానంతరము విప్రలంభము ప్రవర్తిల్లినది. ఇచ్చట సంభోగాత్పూర్వమే విప్రలంభము ప్రవర్తిల్లవలసియున్నది ఇట్టి సన్నివేశము కాళిదాసుని కుమార సంభవకావ్యమున గలదు. పార్వతీ పరమేశ్వరుల సమాగమమునకు పూర్వమే యిట్టి యవస్థ యేర్పడినది. పార్వతి తన సౌందర్య విశేషముచే పరమేశ్వరుని నాకర్షింప యత్నించినది. పరమేశ్వరుఁడు కామబాణ మోహితుఁడయ్యు నిగ్రహించుకొని కామదాహము చేసినాడు. కామారియైన ముక్కంటిని కఠినతపో దీక్షతో బ్రసన్నుని చేసికొనినది పార్వతి. జగత్పితరుల పరిణయమున విషయవాసనలేదు. విశుద్ధాత్మల విశిష్టసంయోగము భాసించినది. ఇట్టి శృంగారము ఉజ్జ్వలమై ఆదర్శప్రాయ మగుచున్నది. వరదాచార్యులవారు వైశాలిని నాటకమున కాళిదాసకావ్యద్వయ శృంగారరసపోషణ శిల్పమును సమయోచితముగా రంగరించి సాంగమున ప్రవర్తింపఁజేసినారు. ఇది నంవిధాన చక్రవర్తియైన మహాకవి చేయ గలిగినపని.

శృంగారమునకు స్థాయిరతి. రాగోదయమునకు నాయకుల ప్రథమసమావేశము శ్రీకారము. దృష్ఠ్మేలనముతో మొదలైరాగము దొంతరలు పెట్టినట్టు నాయికానాయకుల చిత్తముల నల్లుకొని పోవలయును. తొమ్మిది అంకముల ఈ నాటకమున కథావల్లరికి పాదువంటి దానన్నివేశము. ఆచార్యులవారు ద్వితీయాంకమున నీసన్నివేశమును గల్పించిన విధము అద్వితీయము. ప్రథమాంకమున శాపముల వృత్తాంతము ముగిసిన పిమ్మట సుప్రతునిచే నాయికా సౌందర్య వర్ణనము గావించి నాయకునకు వినుకలివలన వలపు జనించునట్లు చిత్రించినారు. నాయకునకు వినుకలిని కల్పించి, నాయికకు కలలో కనుకలిని కల్పించుటలో శిల్పవైవిధ్యముకలదు.

ఆచార్యులవారు వివిధసంస్కృతాంధ్ర నాటకకావ్య శిల్పరహస్యము లెఱిగిన విద్వన్మణులు వారి సంస్కారమునుండి పల్లవించిన ప్రతిభా సామర్థ్యమే నాటక పూర్వార్థమున అపూర్వకల్పనా శిల్పవిలాసములను భోగినీలాస్యమువలె వెలార్చినది. ద్వితీయాంకమున తెరయెత్తగనే సువ్రతాశ్రమము కణ్వాశ్రమమువలె ప్రత్యక్షమగును. వైశాలిని శకుంతలవలె కానబడును. అమెవెంట అనసూయాప్రియంవదలవలె నిద్దరు నెచ్చెలులు నిలిచియుందురు. వారు శ్యామలా సరళలు. మరియొకవైపు అపీక్షితుఁడును, అతని నర్మసచివుడైన విదూషకుడును తారసిల్లెదరు. శాకుంతలమునందలి ప్రథమాంకము మనయెదుట ప్రత్యక్షమైనదని భ్రమించెదము. కాని, దాని నిర్వహణమువేరు; దీని నిర్వహణముపేరు. చెలికత్తెల మాటలలో వైశాలినీ స్వప్నవృత్తాంతము ప్రకటితమగును. నాయిక తన స్వప్నమును చిత్రాకృతిగా మలిచి చూపించును. నాయకునకు వినుకలి తరువాత చిత్రరూపమున కనుకలి. నాయిక గౌరీదేవాలయమున నాట్యారాధనము చేయుచుండును. నాయకుఁడు విదూషకునితో కలసి విప్రవేషమున నామె నాట్యమును దర్శించును. కవితోపాయనమును వలపుకానుకగా నామెకు ప్రసాదించును. చెలికత్తెల చాతుర్యమువలన రాజరహస్యము బయటపడును. నాయికా నాయకులకు ప్రథమ వీక్షణముతోపాటు రాగోదయమగును. అంతలో నాయిక లజ్జాతిశయమున నాయకుని నెదుట నుండ జాలక అర్ఘ్యోదకము తెచ్చుటకై అమృత సరస్సుకేగును. మార్గమధ్యమున మదగజ మామెపై దాడి చేయును.

నాయకుఁడామెను రక్షించి గజమును సంహరించుటకు దానిని వెన్నంటి పోవును. ఈ సన్నివేశములను గమనించినచో నొక్క శాకుంతల నాటకమున కిది పుత్రికయని భ్రమించుటకు వీలు లేదు. పాత్రల సంవిధానమునకును, గజసన్నివేశకల్పనమునకును కాళిదాసు నాటకము ప్రేరణ యిచ్చియుండవచ్చును నాయికా స్వప్నవృత్తాంతమునకే ప్రభావతీ ప్రద్యుమ్నకథయో దోహదము చేసియుండవచ్చును. నాయికా నాయకుల దేవాలయసన్నివేశమునకు నాగానందము స్ఫూర్తి నిచ్చియుండవచ్చును. నాయికానాట్యకల్పనకు మాళవికాగ్నిమిత్రము పరోక్షమూలముగా నూహింపవచ్చును, చిత్రకల్పనకు హర్షకృతులు కొంతవరకు హేతువులు కావచ్చును. రాజాంగుళీ దర్శనమునకు శాకుంతలమే మూలమై యుండవచ్చును, ఇట్లు ప్రతిసన్నివేశమున కెక్కడో యొకచోట మూలమున్నదని విమర్శించుటకు పూనుకొన్నచో వస్తు సౌందర్యము నిలువదు. ఎన్ని కల్పనలకెన్ని గ్రంథములేనియు తోడ్పడవచ్చును గాని వాని సంవిధానము మాత్రము ఈ నాటకకర్తదే. నానాసుమ గర్భములనుండి పూదేనియ లెన్ని తెచ్చిననేమి మధుకరము తాను మధురమైన తేనెను కల్పించుటలేదా! తేనెలోని పాకము ప్రధానముకాని దాని ధాతువిమ్పత్తి ప్రధానముకాదు. ప్రథమాంక మేనాటకకల్పనమునకు ప్రతికల్పనముకాదు. బహునాటకశిల్పవ్యుత్పత్తి కల్పించిన మహనీయరంగము.

వైశాలిని నాటకమున విదూషక పాత్రకల్పనము వివిధప్రయోజనములను సాధించినది. విదూషకుఁడు సహజముగా భోజన ప్రియుఁడుగా, తబ్బిబ్బుల తడబాటువాడుగా, హాస్యప్రియుఁడుగా చిత్రింపఁబడు చుండును. ఆపాత్రను కథాగతికి హేతువుగా తీర్చి దిద్దుకొనిన సంస్కృత కవులే వేళ్లపై లెక్కపెట్ట దగినట్లున్నారు. ఆచార్యుల వారాపాత్రను ద్విగుణీకృత శోభతో నిర్వహించినారు. ఎట్లన: సాధారణముగా సంస్కృత నాటకములలో విదూషకుఁడు నాయక శృంగార రససిద్ధికి తోడ్పడునే కాని తానొక సమాంతర శృంగారేతి వృత్తమునకు పతాక నాయకుఁడు కాడు. వైశాలినీ నాటకమున విదూషకుఁడు సరళా హృదయచోరుఁడు. నాయకుని వలె నీతఁడును కామబాణములకుఁ జిక్కినాఁడు. కాని, నాయకుఁడు నాయికను బొందఁగలిగినాఁడు. విదూషకుఁడు పొందలేకపోయినాఁడు. అయినను తన ఉపగాథచేఁ బఠితలను ఉపరంజింపఁజేయఁ గలిగినాఁడు. ఆచార్యులవారి ధర్మమాయని నాయకునితోపాటు విదూషకుఁడు కూడ ఈ నాటకమున కవియైపోయినాడు. అతఁడు శృంగారరసమును కవితలో వర్ణింప నీతఁడు హాస్యమును జిలికించినాఁడు. విదూషకునకు అవీక్షితుఁడు వ్రాసిన లేఖ యతని తెలివితక్కువతనమువలన వైశాలిని చేతిలోపడును. ఈ విదూషకుని మూర్ఖమ్మకములవలననే నాయకుఁడు నాయికపై ననురాగము లేదని పేర్కొనవలసి వచ్చినది. ఈరెండు సన్నివేశములా నాయికా నాయకుల యనురాగ జీవితమున గొంత విషాదము కల్పించినవి. వైశాలిని అవీక్షితుని నపార్థము చేసికొని, కళ్యాణకౌతుకమున కన్నీరుపెట్టుకొనినది. అవీక్షితుఁడు చతుర్థాంకమున వైశాలినిని రాక్షసబాధనుండి తప్పించినపుడు నిజహృదయ మెఱిఁగించుకొనుట జరిగినది. తొలివలపులో చిఱుమబ్బువలె నడ్డపడిన యీసన్నివేశము భావికథా వ్యంజకము. నాయికా నాయకుల వివాహమున కొక అంతరాయము కలుగుననియు, కారణాంతరమువలన నది తొలగి వారికి పునస్స

మాగమము సిద్ధించుననియు నీసన్నివేశమునందుగల వస్తుధ్వని. ఇట్టి ధ్వనిశిల్పమును సాధించుకొనుటకు వరదాచార్యులవారు విదూషకుని పాత్రను సార్థకముగా వినియోగించుకొనినారు. తొలి విరహమునఁ దొంగలించిన యీయనుతాపము నాయికా హృదయగతమైన యనురాగవల్లరిని దృఢతరము గావించినది. పార్వతీ తపోదీక్షాకథా శ్రవణ (తృతీయాంకము) కల్పనమామె భావి తపస్సం కల్పమునకు బీజావాపన మొనర్చినది.

నాయికా నాయకుల యనురాగమునకు పరస్పర రూపగుణ మాధుర్య దర్శనాదు లాలంబనములుగా నిలిచినను వారి శీలమునందు క్రమపరిణామ రూపమున భాసించిన ధర్మదీప్తి, సహనశక్తి దాని కుద్దీపనములుగాఁ దీర్చి దిద్దఁబడినవి. ఉదాత్తశీలుర యుత్తమ శృంగారకథ కిట్టి శీలపరిపోషణ విధానము ఉత్తమశిల్పసుందరమైనది. మహాకవులకుగాని యిట్టి రచనయలవడదు.

నాయికా నాయకు లిరువురును మహర్షుల శిష్యులు. వారి గురువులెంత లౌకికులో యంత అలౌకికులు. కణ్వపుత్రుండు తపస్వియయ్యును ధనురాచార్యుఁడు. శిష్యుని విశ్వజిద్వీరునిగాఁ దీర్చి దిద్దినవాఁడు. సువ్రతుఁడు తపశ్శక్తియుక్తుఁడైనను సంగీత నాటక నాట్యకళాకోవిదుఁడు, పైపెచ్చు రాజపురోహితుఁడు. వీరిశిక్షణచే శిష్యులకు శాస్త్రపాండితితోపాటు సంయమనము సహజాలంకారముగా నలవడినది. అందుచేవారు—శృంగారమైనను, వీరమైనను, విషాదమైనను, విప్రలంభమైనను—వివేకమును వీడి విశృంఖలముగా వర్తించలేదు. ధర్మమును మరచి దారి తప్పలేదు. ఈ నాటక శృంగార రసపోషణమున నాయికా నాయకుల శీలసంస్కారమే ఔచిత్యమునకు నొరవడియై నిలిచినది; ఔదాత్యమునకు ఉజ్జ్వల దీపమై వెలుగొందినది.

స్వయంవరమునకు పూర్వమే సువ్రత తపోవనమున కలిసికొన్న నాయికా నాయకుల యనురాగము అనుమానాగ్నిచే పుటము పెట్టబడి వన్నెకెక్కింపబడినది. అవేక్షితునియందు గాఢానురాగము వైశాలిని కేర్పడుటకు పూర్వరంగము పుష్టిమంతముగా కల్పింపఁబడినది. అవేక్షితుని చిత్తమున ప్రణయబీజములు స్థిరముగా నాటఁబడినవి. అవీక్షితుఁడోడిపోయిన తరువాత వివాహయత్నము విఫలమైనది. కాని, వారిచిత్తములందలి ప్రణయబీజములు మాత్రము నశించుటకు వీలులేకపోయినది. వారిప్రణయసిద్ధికి తోడ్పడినవి నాయికా తపశ్శక్తి, నాయకుని ధర్మానురక్తి. వారి పునస్సమాగమము ధర్మరక్షితమైన నియమశీలములకబ్బిన నిండుఫలము. అందువారి విషయవాంఛలకు మోహమునకు తావులేదు. గుణములకు, అకళంకశీలములకు పట్టము కట్టఁబడినది. ఉదాత్తుల చరిత్రములలో ధర్మమునకు మించి శృంగారము వర్తింపదను మహోపదేశమును రసమార్గమున వ్యంగ్యముగా లోకమున కందించుట యీనాటకశిల్పము.

ఇఁక వైశాలినీ నామగ్రహణమునందు పంచసంధి సంవిధానశిల్పము సూచితమని యంటిమి. నాయికా తనూసౌష్ఠవకల్పనమునందు వస్తుసౌష్ఠవ సూచనము ధ్వనియని భావించితిమి. ఈ నాటకమున సగముభాగము వైశాలిని పెంచినది మిగిలిన సగము ప్రతినాయకుఁడగు దృఢకేశి పెంచినాఁడు. మూలమున దృఢకేశి పాత్రస్వల్పము. వైశాలినీ తనూవిలాసములనుగాంచి

యరణ్యమున నామెను బలాత్కరింపఁబోయి, అవేక్షితునిచేత మృతుఁడైనాఁడు మూలమున. నాయక ప్రతినాయకులకు బద్ధవైరములేదు మూలమున. స్వయంవరమున రాజులవలన నోడిన అవీక్షితుఁడు రాక్షసవిజయమును సాధించి, యభిమానమును సమాధాన పరచుకొనినాడు మార్కండేయమున. అవేక్షితుని పరాక్రమమునకు రాక్షసవిజయము గీటురాయి కాఁజాలదు. అది అవేక్షితుని మనసులో శల్యమై యొకమూల బాధించుచునేయుండెను. తండ్రికిచ్చిన మాట లేకున్నచో అవీక్షితుఁడప్పటికిని వైశాలిని వివాహమాడి యుండెడివాఁడు కాడు. ఆయంశమతఁడు రాజ్యాధికారము గ్రహింపకుండుటలో పురాణకర్త సూచించినాఁడు. ఇది పురాణకథసంగతి. ఈ నాటకకథవేరు. దృఢకేశి విశ్వజిద్వీరుఁడైన అవీక్షితుని కోడిన రాజలోకమునంతటిని తన నాయకత్వమున సమీకరించి, యతనిపైఁ బగసాధించి, విశ్వజిద్వీర బిరుదముతోపాటు, వైశాలినీ పాణిగ్రహణముచేయ నమకట్టిన రాక్షససంకల్పుఁ డాతఁడు, రామాయణమున రాముని యెదుట రావణునివలె నీనాటకమున నవీక్షితుని కెదురునిలిచిన ప్రతివీరుఁడాతఁడు. నాయకుఁడుదాత్తుఁడు; ఈతఁడుద్ధతుఁడు. అతఁడు ప్రజాహితపాలకుడు; ఇతఁడు లోకకంటకుఁడు. విశ్వజిద్వీరుని ధ్యేయము దృఢకేశి నోడించుట; అప్పటికిగాని యతని బిరుదము సార్థకముకాదు; వైశాలినికి రాక్షసబాధపోదు; తపోవనములు నిరామయములుకావు; కణ్వాశ్రమ్మని కలలు నిజముకావు. దృఢకేశి యెంతమాయా బలవిశారదుఁడో అంతటి కుటిల నీతికోవిదుఁడు. నాయకుని గుట్టులు చారుల చేత తెలిసికొనినవాఁడు; నారాయణాస్త్రమును వమ్ముచేయుటకు తంత్రము పన్నినవాఁడు; నమ్మిన మిత్రునినట్టేట ముంచినవాఁడు; అధర్మయుద్ధమున అవీక్షితుని బంధించినవాఁడు. ముని రక్షా కవచమున నిర్భయగా నుండు నాయికను తరిపొంచి కబళించుటకు యత్నించినవాఁడు. ఎదుట పడని యీ మాయావి కొరకై అవీక్షితుఁడేండ్లు పూండ్లు వెదుకవలసినవాఁడయ్యెను. చివరకాతఁ డరణ్యమున తారసిల్లనాఁడు. అవీక్షితుఁడాతనిని సంహరించినాఁడు. ఈ కల్పనచే నాయకుఁడు దృఢకేశిని జంపినచో స్వయంవరమున నాతని యోటమికి కారకులైన రాజులనందరిని జయించి నట్లేయగును. ఆచార్యులవారు దృఢకేశికి ప్రతినాయక ప్రతిపత్తి కల్పించుటతో మూలకథలోని పెద్దలోపము వారింపఁబడినది. దృఢకేశి యత్నమంతయు వైశాలినీ కరగ్రహణ లక్షితమగుట చేతను, అవీక్షిత యత్నమును దాని నుపలక్షించి సాగుటచేతను కథలో సంఘర్షణ సమగ్ర రూపము తాల్చినది. పంచసంధి సంవిధానమున సంఘర్షణ మొక అంతస్సూత్రము.

నాయకుఁడుచేయు దృఢకేశి సంహారమునకును వైశాలినీ పాణిగ్రహణమునకును హేతువులైన బీజములను ప్రథమాంకమున నిక్షేపించుటయైనది. 'నేనా దురాత్ములవధించికాని యామెను చేపట్ట'నని అవీక్షితుఁడు ప్రతినచేయుటలో నారంభావస్థ వ్యక్తమగుచున్నది. బీజసముత్పత్తి ప్రారంభముతో గూడుకొని యున్నచో నది ముఖసంధి. ముఖసంధ్యంగములు ప్రథమ ద్వితీయాంకములలో భాసించుచున్నవి, కించిల్లక్ష్యా లక్ష్యముగ నుండు బీజముయొక్క వ్యక్తిప్రతి సంధి. దృఢకేశుని తంత్రములును, నాయికా హృదయతాపహేతువును కలిసి నాయక యత్నము నందు భాసించు బీజమును అగపడియు నగపడకుండచేయును, వాని నధిగమింప నాయకుడు చేయు తీవ్రయత్నములో ప్రయత్నావస్థ గోచరించును. బిందు యత్నముల కూడికయే ప్రతి

ముఖసంధి. ఇది తృతీయ చతుర్థాంకములలో వ్యాపించియున్నది. 'నాయెత్తునేడు చక్కగా సాగినదని ప్రతినాయకుఁడు విజృంభించుటలోను, వజ్రదంతుని కొఱకు నాయకుఁడు నారాయణాస్త్రమును రాక్షసునపై ప్రయోగించుటలోను బీజము ద్యోతమానమగుచున్నది. నాయకుఁడు నాయికను నభోమార్గమున రాక్షసమాయనుండి రక్షించుటయందును, ఆమె యెదలోని యనుమానమును తొలగించుట యందును ప్రయత్నావస్థకలదు. దృష్టనష్ట బీజాన్వేషణము గర్భసంధి. నాగాస్త్రబద్ధుఁడైన నాయకుఁడు వివాహ విముఖుఁడగుట. యందును వైశాలిని తపోదీక్షగైకొనుట యందును దృష్టమైన బీజముయొక్క నష్టముకలదు. వజ్రదంతుఁడు పతాక నాయకుడై నాయకుని యత్నమునకు తోడ్పడి బీజరక్షణముచేయును. నాయిక యరణ్యములకేగినను శుభము కల్గునని ఆశీర్వదించు సువ్రతుని పలుకులలో ప్రాప్త్యాశ పొటమరించును. ఇట్లు గర్భసంధి పంచమాంకమునందుకలదు. క్రోధముచేగాని, విలోభనముచేగాని, గర్భనిర్భిన్నబీజార్థములగూర్చిన విమర్శ అవమర్శసంధి. కిమిచ్ఛకవ్రతము ప్రకరి. వైశాలినీ తపోవన క్లేశము, దేవదూత భావి కథార్థసూచనము, అవీక్షిత వరప్రదానము కణ్వపుత్రుని నాగలోక వృత్తాంత కథనము—ఇవి యన్నియు గర్భనిర్భిన్న బీజార్థముల విమర్శసూచకములు. "రాకుమారా! ఆసాధ్విని పెండ్లియాడి నీజననీజనకుల యాజ్ఞ పాలించుటయేకాక దృఢకేశిని జంపి పరిణాకల్యాణ మొనర్చి నాగురుదక్షిణ నొసంగుము"—అను కణ్వపుత్రుని ఆశీస్సులలో నియతాప్తి నిశ్చితమైనది. కావున షష్ఠాంకమున అవమర్శసంధి ప్రవర్తిలినది. సప్తమాంకమునుండి నవమాంకమువఱకు నిర్వహణసంధి. అడుగడుగున నద్భుతములతో సాగునీకథాఘట్టములు సంధిని సార్థకమొనర్చుచున్నవి. వైశాలిని నవమానములు మోసి సుతుని గనినదేమో యనునట్లు తొమ్మిదంకముల యీ నాటకము పూర్ణఫలమును ప్రసవించినది. ఎన్ని దృక్కోణములతో గాంచినను ఈ నాటకమునకు 'వైశాలిని' యను నామ మన్వర్థ మగుచున్నది.

మూలాతిశయముగా నీ నాటకమున గల నూత్నకల్పనలు మఱికొన్ని;

1. వజ్రదంతోపాఖ్యానము – ఈ నాటకమున వజ్రదంతుఁడు పతాకా నాయకుఁడు. రామాయణమున సుగ్రీవునివంటివాఁడు. స్వప్రయోజనము సాధించుకొను నాయక కార్యసిద్ధికి కార్యసిద్ధికి తోడ్పడిన యుపనాయకుఁడు. ఈ పాత్రసృష్టి ఆచార్యులవారి ప్రతిభాజన్యమైనది. ఈతని వృత్తాంతములేనిచో నాటకమున గర్భసంధిలేదు. విచ్ఛిత్తిచెందిన బీజార్థములకు సమాహారములేదు. నాయికకు రక్షలేదు. నాయకునకు సహాయములేదు. ఇన్నిలేములను దీర్చినాటకమునకు కలిమికూర్చినాడు. ఇతఁడు తన భార్యను రక్షించిన మిత్రుని కతనిభార్యను రక్షించి యిచ్చినాడు. ప్రియురాలికొరకు దివినుండి భువిదిగివచ్చియిడుముల గుడిచిన రసికుడు. నుపకారికి నుపకారియై ఉజ్జ్వలకీర్తినందినాడు వజ్రదంతుఁడు.

2. అవీక్షితుని ఆత్మహత్యాప్రయత్నమును వైశాలినిమాన్పుట—దీనివలన నాయకుని గాఢానురాగము నాయిక యెఱుఁగుటకు వీలైనది. భావికథలో నాయికా తపోదీక్షకిది ఉద్దీపకమైనది.

3. సుప్రీతుఁడు వైశాలినికిచ్చిన రక్ష—దీనివలన ఛిల్లిని పాత్రకల్పన మేర్పడినది. మాయా విప్రైన రాక్షసుఁడనవరత మామెకొఱకై యన్వేషించు చున్నట్లీ నాటకమున కల్పింపఁబడినది కావున దాని కనుబంధముగా నీకల్పన మవసరమైనది. వైశాలిని కొఱకు ప్రాణముం నర్పించిన ఛిల్లిని పతితల సానుభూతి నొందగలిగినది.

4. బంధుపునస్సమాగమము—మూలమున నాలుకా నాయకులు గంధర్వలోకమునవసించినట్లు వారిరువురి తల్లిదండ్రులకుఁ దెలియదు. కాని ఈ నాటకమున నాసంతోషమునందరికి పంచిపెట్టించినారు ఆచార్యులవారు. గంధర్వుల విమానముచేతిలోనుండగా వారిని రంగముపైఁ దెచ్చుట యెంతసేపు!

5. సమకాలీన సమాజచిత్రణము—కవియెంతటి పురాణవృత్తమునుగైకొనినను తానునివసించు చున్న సమాజ పరిస్థితుల ప్రభావమును దాటిపోలేడు. భౌతికమైన అనుభూతి భావన కాక ఆలంబనమగుచుండును. మచ్చునకు కొన్నివాక్యములను ఉదాహరింతును.

1. 'ఆర్యపుత్రా! ఈలోకమేలకో కవిబ్రదికియున్నప్పుడు వానిని సన్మానింపదు'—(పుట 8) ఇది ఏలోకమో కాదు తెలుగుదేశము ఈ యంశముపై నేకాంకికులు కూడ తెలుగునవచ్చినవి.
2. "చిత్రాంగదా! ధనికుడు దరిద్రులను దోచుకొని తిని మరింత ధనికుడగుచున్నాడు. బలిబలహీనులతలలఁ బాతాళమంటఁ ద్రొక్కుచు మరింతపైపదవి నదిరోహించుచున్నాఁడు. విద్యాధికుఁడు విద్యావిహీనుల వంచనోపాయములతో మోసపుచ్చి విశేషసుఖములఁ జూరగొనుచు నతిచతురుఁడనిపించుకొనుచున్నాడు. అవకాశవాది యీ ముగ్వురి ప్రళయ తాండవములకు ననుకూలగతిలయ వేయుచున్నాడు. ఇంతియేకాదు దేవునిపేరిట మతభేదములనియు, జాతివిభేదములనియుఁ బ్రాంతీయ విభేదములనియు, భాషావిభేదములనియు, భాషావిభేదములనియు మిషలిడుకొని యొకరినొకరు ప్రాణశత్రువులుగా ద్వేషించి కొనుచున్నారు. బడితగలవానిదే లోకము! పైసగలవానికేనాకము. అచటి ప్రజలతత్త్వమిట్లున్నది. ప్రభుత్వముదానికి లయవేయుచున్నది". ఇవి మణికంధరుడు మానవ లోకమునుగూర్చి చెప్పినమాటలు. "నరజాతి చరిత్రసమస్తం పరపీడన పరాయణత్వం" అన్న శ్రీశ్రీవాక్కులకిది వ్యాఖ్యవలెనున్నవి.
3. 'ప్రజలధనముల రాజులు దోచుకొనుటయా! చీమలుపెట్టినపుట్టలుపాము లాక్రమించిన నా చలిచీమలచేతఁ జిక్కి తాను సర్పముఁగూడ నొకనాడు చావవలసివచ్చునుకదా! (పుట 21) వర్గపోరాటములోని వాస్తవము నీవాక్యము చాటుచున్నవి.
4 "ఇచట (గంధర్వలోకమున) ధనికదరిద్రభేదములులేవు. ప్రతికారుడు విద్యావంతుఁడే, ధనవంతుఁడే; శక్తివంతుఁడే; స్వతంత్రుఁడే. ఎవరికిని నన్నవస్త్రములకొదువలేకేలేదు. ఇచట సకల ప్రజలకు సాంఘిక మర్యాదలు సమానముగా లభించును. ప్రజలెల్లరును దేవజాతివారే జాతిభేదములు మచ్చునకైన గానరావు. అటులే యిచట సకలవిధదైవో

పాసనల నొకే మర్యాదతోఁజూతురు. వీరందరిది యొకే దేవభాష. వీరిలో వీరికే విషయములయందును పరస్పరవైషమ్యములులేవు. అందరునందరుమేలుకై కలిసి కట్టుగాఁ బాటుపడెదరు. ఒకేతల్లిబిడ్డలవలె సకలప్రజలును ప్రేమనుగలిగి మెలఁగెదరు''. నేటి అధునికున కిట్టి లోకము మరోప్రపంచముగా దర్శనమిచ్చినది. సమసమాజములో సంక్షేమరాజ్యముండుట స్వర్గమని ఆచార్యులవారి దర్శనము. వీరి సమదర్శనము నేటి ప్రజాతంత్ర వ్యవస్థసాధింపవలసిన పరమప్రయోజనము. దానిని వస్తువునందు వ్యంగ్యముగా నిబంధించి జాతివార్తా విశేషములను వెలయించినారు.

దృఢకేశి యనుయాయులు ప్రజలను కొల్లగొట్టి స్వాధికారమును సాధించు నియంతలు. వారి మంత్రతంత్రములను ప్రజాక్షేమదృష్టితో నెదురించు ప్రజాపాలకుడు అభీక్షితుడు. అతని పరిపాలనను తీర్చిదిద్దు మేధావులు కణ్వశిష్యాదులు. వీరుప్రజాతంత్రముపై విశ్వాసము కలవారు. సమసమాజముపై దృష్టికలవారు; విశ్వశ్రేయము వీరిలక్ష్యము. వీరిప్రయత్నవిజయమే సమసమాజవ్యవస్థతో విలసిల్లెడి సంక్షేమరాజ్యకల్పనము. ఇది భారతీయదృష్టికి ప్రతిబింబము. నేటి సామాజికదృష్టికి చక్కని యాదర్శము! ఇట్టి యాదర్శము నీనాటకము ద్వారమున బోధించుచు ఆచార్యులవారు ఆధునికత్వము నారాధించినారు; సామాజిక స్పృహను సాహిత్యమున సంతరించినారు. పురాణప్రతికలలో సమకాలీన సమాజ సమస్యలను సమన్వయించు దృక్పథము ప్రపంచసాహిత్య ప్రక్రియలలో విశిష్టగౌరవము నందియున్నది. వైశాలిని అట్టిశిల్పమున విశిష్ట ప్రయోగము!

6. గండములు—కథార్థసూచనలు—కాళిదాసాది మహాకవుల నాటకములలో విమర్శకుల దృష్టి నాకర్షించిన రూపకశిల్పములలో గండములు, కథార్థసూచనలు ముఖ్యములైనవి. ఇవి కథను భావనామయమొనర్చుటకు తోడ్పడు శిల్పసూత్రములు. వీని నాచార్యులవారా యాపాత్రలముఖమున నత్యంత సహజసన్నివేశములందనుసంధించి రూపకరచనా కళాకోవిదులనిపించికొనినారు. ఉదాహరణమునకు—

1. 'సంపదన్వితు నొరుని సహింప లేక
చెఱుపఁ దలఁచుట తనుదానె చెఱుపుకొనుట
పాలతోఁ గూడు నీరము న్బాపనెంచి
పొంగుఁ దెప్పించు నగ్ని యె పొలియదొక్కొ'. (పుట 33)

ఇదిపైకిచూచుటకు సూక్తి. ప్రాచీననాటకకర్తలు కథాసూత్రమున కొదిగిన సూక్తులను మౌక్తికములుగా నాటకములందు నిక్షేపించు రచనాశిల్పమును బాటించినారు. ఇవి కావ్యవస్తువునకు విశ్వజనీనతను సంతరించుటలో తోడ్పడు ఆలోచనామృతసింధువులు. వీనిలో భావికథార్థ సూచనముచేయుట బంగారమునకు తావి కల్పించుట. ఆచార్యులవారి నాటకమున నిట్టి ఉభయ శిల్పమండితములైన సూక్తులు కుప్పలు తిప్పలు. వారి మహాకావ్యరచనలోని మనోజ్ఞశాఖయొకటి

దృశ్యకావ్యక్షేత్రమున మహనీయఫలములనిట్లు ప్రసాదించినది. పైసూక్తి లోకవృత్తము నొక వైపును, నాటకవస్తువు నొకవైపును ధ్వనింపగల పద్యరత్నము.

2. "అయిన నిది నీయపీక్షిత ఫల మనపలెను". (పుట 87) సహజవాక్యసరళిలో శ్లేష వలన కథార్థములను వ్యంజింపజేయు నేర్పు.

3. "దృఢకేశి బంధనాధీనుఁడు గామి మారాజకుమారుడు మీవద్ద స్వయంవరమున నుండఁ జాలఁడని తెలియవలెను"–ప్రమాదజనిత వాక్యమునుండి భావి అమంగళ ధ్వనిని సూచించు గండమిది. దీనిని విదూషకుని నోటపల్కించుట సార్థకము, శిల్పసుందరము.

4. "ఔరా; ఈ మరుత్తు మితిమీరి చరించుచున్నట్లున్నాడే? కాదు. ఈ పిల్లమరుత్తు తల్లి స్తన్యము గ్రోలు స్తనంధయునివలె పయ్యెదఁ దొలఁగఁ జేయుచున్నట్లున్నాఁడు" ఇది కవిప్రౌఢోక్తి కల్పితమైన సూచనము. అపీక్షితమైన యదృష్టమును నాయకుని పల్కుల నుండి వెలయించుట విశేషము. ఇదియొక పతాక స్థానము. నాటకఫలవ్యంజకము.

5. తృతీయాంకమునందలి గౌరీతపశ్చర్యగాథ యంతయు భావికథార్థవ్యంజకమే. అంతర్గాథను అంతసార్థకముగా వాడుట అపూర్వరూపకశిల్పము.

6. చతుర్థాంకమునందలి గండముల రచనాశిల్ప మనల్పము. ఈ క్రిందివానిని గాంచుడు.
అపీ: "ఆమెనన్నువరించునను విశ్వాసమే మున్నది. విశ్వసించినను విధియను కూల పడవలదా!" (పుట 113)

అపీ "ఇప్పుడు నేనొక శిలనైతిని నాకేమియుఁ దోచకున్నది". (పుట 117)

విదూ: "ఒకవేళయేదేని జలవంతమైన యడ్డే సంప్రాప్తించిన......" (పుట 119)

విశ్వజిద్వీరుని విజయగాథలో వినవచ్చెడి విషాదశ్రుతులివి. వీనివలన పఠితకు నాయక పాత్రపై సానుభూతితోపాటు, భావికథలో నుత్కంఠ యతిశయించును. నాటకములో ప్రకృతిని, విధిని చైతన్యరూపపాత్రలుగా పోషించుట మహాకవుల శిల్పము. కాళిదాసు శిల్పములో నది యుత్తమమైనది. ఆచార్యులవారీ రెండింటిని తమ నాటకమున సాధించిరి. దానివలన పాత్రచిత్తవృత్తుల యొక్కయు, ప్రకృతి యొక్కయు గాంభీర్యము వ్యక్తమగుటయేకాక, జీవితమున కొక జీవితమున కొక తత్త్వావ్యాఖ్యానము సమకూరుచున్నది. ఇట్టిదృష్టి ప్రస్తావనలోనే ప్రత్యక్షమగుచున్నది.

"నూ" అయిన నీనాటక ప్రియ జన మేమైయుండును?

నటి–లలిత సహజ సుందర విశాల ప్రకృతికి
పౌరి ననంగవి భావిక్ష్య పురుష నీద

నఖిల ప్రాణికోటికిఁ బ్రాణమౌ మరుత్తు
కలుగ సత మీ జగన్నాటకం బలరెడి''. (పుట 9)

వైశాలిని శక్తి; అవీక్షితుఁడు పురుషుడు; మరుత్తు సృష్టి—ఇది (దార్శనిక) తత్వము.

వైశాలిని స్త్రీ; అవీక్షితుఁడు పురుషుడు; మరుత్తు గార్హస్థ్య ధర్మఫలము—ఇదిజగత్ తత్వము.

వైశాలిని శబ్దము; అవీక్షితుఁడు అర్థము; మరుత్తు అక్షరజగత్తుకు ప్రాణము—ఇదిసాహిత్య తత్వము.

వైశాలిని శృంగారము; అవీక్షితుడు వీరము; మరుత్తు ధర్మము—ఇది రసతత్వము.

వైశాలిని పార్వతి; అవీక్షితుడు శివుడు; మరుత్తు కుమారశక్తి—ఇది పురాణ తత్వము.

వైశాలిని జడము; అవీక్షితుడు చైతన్యము; మరుత్తువాని సమాహారము—ఇదిసృష్టితత్వము.

వైశాలిని సగుణము; అవీక్షితుడు నిర్గుణము; మరుత్తు సమాధి—ఇదిభక్తితత్వము

వైశాలిని సౌందర్యము; అవీక్షితుడు ఉపాసనము; మరుత్తు కళాభివ్యక్తి—ఇదికళాతత్వము.

వైశాలిని సంకల్పము; అవీక్షితుడు సాధనము; మరుత్తు సిద్ధి—ఇదియోగతత్వము.

వైశాలిని ఇచ్ఛాశక్తి; అవీక్షితుఁడు క్రియాశక్తి; మరుత్తు జ్ఞానశక్తి—ఇదిహృదయతత్వము.

ఇట్లు భావించిన కొలది యీ నాటకతత్వము భాసింపగలదు. రససిద్ధి తత్వచింతనకు రాజబాట యగునట్లు కావ్యతత్వమును భావించుట భారతీయ సంప్రదాయము. ఈలోతు నాందీ పద్యమునగలదు. 'ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్' అను లక్షణము నాందికి వర్తించును.

''ఎయ్యది యాదిభావమగు నెద్దియనంత విచార పూర్ణమౌ
నెయ్యది యక్షరాకృతిగ నెన్నియు రూపులుగాగ మారుఁదా
నెయ్యది నిత్యనిష్ఠ వసియించు శ్రుతిస్వరశబ్దితంబుగా
నెయ్యది యాదిమూర్తి కవియే మయి కైతగమారి మార్చునా
నెయ్యపు బెత్తికోలు మిము నిత్యవిశాల రసాబ్ధిఁ దేల్చుతన్''

ఇందు కీర్తింపబడునది రసబ్రహ్మ. అది అది వికారరూపమైన భావమయి, భావనా శక్తిచే విస్తృతి గాంచును. అక్షరాకృతి దాల్చి అనంతరూపమగును. శబ్దము నాశ్రయించి సాకార మగును, అర్థము నాశ్రయించి యనుభూతియగును, మూర్తమైన అనుభూతి కవిత; కవితకు కవి యాలంబనము; విశాలమైన కాలము విహారరంగము; అనంతసహృదయానుభవరూపమైన రసము దాని జీవనము. రసాబ్ధిఁదేలియాడు అనంతశయనుడే బ్రహ్మము. దానినుండియే బ్రహ్మచైతన్య

మైన సృష్టియ దయించినది. సృష్టికిద్రవావస్థరసము. ద్రవావస్థలోని ఆనందస్థితి బ్రహ్మము. 'రసోవై సః' అన్నశ్రుతివాక్యమునకు కవితాకృతి యీనాంది. 'విశాల రసాబ్ధి'యైన యీ నాటకమున భావింపవలసిన 'రసాత్మ' అది. నాటకమునకు జగన్నాటకమునకు అభేదప్రతిపత్తిని దర్శించుట ఆలోచనము. ఆ ఆలోచనమున అఖండసత్యమును వ్యంజింపజేయుట రసయోగము. దానినే ప్రాచీనులు సాహిత్య లోకమున దర్శన మనిరి. శ్రీమాన్ వరదాచార్యులవారట్టి ఋషి కల్పులైన ద్రష్టలు. వైశాలిని రసబ్రహ్మోపాసన కమర్చిన రమణీయ సాధనము :

'సదమలాక్షర పదముల కధిపుఁడగుట
మహిత నవరసామృతపాన మత్తుఁడగుట
విబుధ జనసేవ్యుఁడగుట నీవిశ్వమెల్ల
నతనిఁగని కవీంద్రుఁడని యాడుచుండు'          (పుట 68)

ఆచార్యులవారిపట్ల కవీంద్ర పదము సార్థకము. 'వీరి నభిజ్ఞులేమని వినుతించిరి ?'

'సరవి నన్నయ సమాసంబు శబ్దపుఠంబు
 తిక్కనార్య చిత్యంపు తెనుఁగు సొంపు
శ్రీనాథ కవి ప్రౌఢ సీసంపు హరువును
 పోతన వైదర్భిరీతి మురువు
రామరాజభూషణు రసరంజితశ్లేష
 పెద్దన జిగిబిగిఁ బెనఁగు భాష
చేమకూర కవీంద్రు చెలువారు చమత్కృతి
 కూచిమంచి సుశబ్దగుంఫ నిరతి
కాళిదాస భావోపమా గౌరవంబు
భవ్యభవభూతి కరుణ నిర్భర రసంబు
నవకవుల సొంపు నీచేత నాట్యమాడు
సరస కవితా కళారూపి ! వరదసుకవి !'          (పుట 6)

ప్రాచీనాంధ్రగర్వాణ మహాకవి వాక్పాకములను తమకవితయందు రసమంజరిగా నలంకరించుకొనిన విద్వత్కవు లాచార్యులవారు. ఎంతమంది కవితల సౌగంధ్య మీ మహాకవి వాక్సుమములలో పరిమళించుచున్నను–అందు పోతనకవితాప్రాణమైన వైదర్భిరీతి వీరికృతులలో విశాల రసాబ్ధివలె వ్యాపించినది. అందువలననే వీరికవితాకన్య ప్రాశస్త్యము పండితులిట్లు ప్రశంసించిరి.

''లలితపదారవింద బుధలక్షణ లక్షిత భావజాత కో
మలసుమ సుందరాంగి, గుణమాన్య, సువృత్త, సువర్ణ వర్ణసం

విలసదలంకృతియా కలిత, విశ్రుతపూతచరిత్ర, మంజుశ
య్యల నలరారురాణి, బహుళార్థ వరప్రదవాణి యీ మెకాన్'' (పుట 5)

వీరికవితాకన్య ఈ నాటకమున ప్రతిపదమున లాస్యము చేసినది.

వీరికవితాలలామ శ్రవ్యకావ్య ప్రక్రియను వరించి పోతన మహాకావ్య ఫలమును బొంది నది; దృశ్యకావ్య ప్రక్రియ ననుసరించి వైశాలినీ నాటక వైజయంతిని సాధించినది. మహాకావ్య రచనమువలన ఆచార్యులవారు 'అభినవ పోతన' బిరుదాంకితులైనారు. ఈ నాటకరచనమువలన 'అభినవ కాళిదాస' బిరుదమున కర్హులగుచున్నారు. ప్రసిద్ధకావ్యప్రక్రియలలో పరమోత్తమ కృతులను నిర్వహించి ఉభయకావ్యశిల్పప్రౌఢిని ప్రకటించిన ఆధునిక మహాకవులలో అగ్ర శ్రేణి నలంకరించినారు.

పోతన-కాళిదాసుల కొక భేదమున్నది. ఇరువురు శృంగారమును పోషించిన వారయ్యును పోతన శృంగారమును భక్తియందు లయింపజేసినాడు; కాళిదాసు శృంగారమును ధర్మనియతిని దోహదముగా ననుసంధించినాడు. పోతనలో శృంగారము తరంగితమై భక్తచిత్తము నున్మత్త మొనర్చి భగవద్రతిగా పరిణమింపజేయును. కాళిదాసు శృంగారము పద్మమువలె వికసించి రవికిరణదీప్తిచే తప్తమై ఉజ్జ్వల మగును. దేహధర్మమైన శృంగార మాత్మధర్మముగా రూపొంది నట్లు ప్రకాశించును. ఆపరిణామమునకు దాళిదాసు ప్రయోగించు అవాంతర రసము వత్సలము కణ్వమహర్షి యొక్కయు, మారీచమహర్షి యొక్కయు వత్సలము శాకుంతలములోని శృంగార మును ధర్మతేజమువైపు నడిపించినవి. కాళిదాస కృతులలో శృంగారము శమమునందు లయిం పదు. కాని శమలక్షణవిశిష్టమై సముజ్జ్వలమగును. అట్టిశిల్ప మాయనకే చెల్లినది ఆచార్యుల వారాశిల్ప రహస్యమును పట్టినారు నాటకములో సమర్థముగా ప్రయోగించినారు. కణ్వపుత్రుని అనురాగము, సువ్రతుని కారుణ్యము: వజ్రదంతుని సౌహృదము నాయికా నాయకుల శృంగార రస పరిణామమును సాధించిన శక్తిత్రయము.

భాగవతమున శృంగారము ఆత్మనివేదన రూపమున ఆముష్మిక మార్గమున గమించి భగవద్రతిరూపమైన రససిద్ధిని గాంచును కాళిదాస కృతులలో శృంగారము వియోగతాపమున కృశించి ఆధ్యాత్మిక తేజస్సును గడించి అద్వైత ప్రేమగా పరిణమించును. ఆచార్యులవారి పోతనచరిత్రలో భాగవతమార్గముకలదు వైశాలిని నాటకములో కాళిదాస మార్గముకలదు. అందువలననే వీరు నాడు అభినవ పోతన 'లైనారు; నేడు' అభినవ కాళిదాసు' లైనారు.

ఆధునిక నాటకములలో వైశాలిని స్థానమేమి? అను ప్రశ్న సహజముగా నేర్పడును. ఆధునిక నాటకమనగా సామాజిక స్పృహకలిగిన నూత్నప్రయోగమని భావించుచున్నాము. అది సాంఘికమైయుండుట మొదటి లక్షణము కొన్నియెడల ప్రతీకాత్మకము కావచ్చును. ప్రతీ కాత్మకమైన నాటకములో పురాణపాత్రలుండవచ్చును గాని అవి అడుగడుగున ఆధునిక భావ ములకు సజీవకల్పనలుగా నిలువవలెను ప్రయోగవైవిధ్యమునందు పురాణవస్తువును గ్రహింప

వచ్చునుగాని, ప్రసిద్ధరూపక ప్రక్రియకై పురాణవస్తువును గ్రహించుట ఆధునిక ధర్మముకాదని భావించుట జరుగుచున్నది ఈ దృష్టితో ఇది ఆధునిక నాటకము కాకపోవచ్చును.

ఆధునిక దృష్టి యనగా సంప్రదాయ విచ్ఛేద మొక్కటియే యనుకొనుట పొరపాటేమో ! పూర్వశిల్పప్రక్రియలలోని విశిష్టలక్షణములను, నవ్యప్రక్రియలలోని వినూత్న దృక్పథములను మేళవించి రచించుటయు ఆధునిక కృతులలో నొకశాఖ కాకపోదు. వైశాలిని పూర్వప్రసిద్ధ నాటకకల్పనలకొక నూత్నరూపమును కల్పించినది, ఆధునిక సాంఘిక స్పృహకు చోటు కల్పించినది; సంప్రదాయ నాటకశిల్పమునకు అభినవవిస్ఫూర్తి నిచ్చినది. ఇట్టి విశిష్టలక్షణములు గల నాటకములు నేడు చాల తక్కువ. సంప్రదాయ మార్గమున తెలుగుకవులు అనువాదముల యందు చూపుచున్న ప్రజ్ఞ స్వతంత్రనాటకరచనయందు నేడు కనబరచుటలేదు. అట్టిలోపమును దీర్చి ఆచార్యులవారు ఆంధ్రరూపక సాహిత్యమున అజరామరముగానుండు ఈ నాటకమును రచించి తెలుగువారి కృతజ్ఞతలకు పాత్రులైనారు.

కావ్యవిమర్శకంటె నాటకవిమర్శ కష్టతరమైనది. లలితకళా సమాహారరూపమైన తత్ సంశ్లిష్టశిల్ప జగత్తును వివరించుటకు వ్యుత్పత్తితో పాటు, శక్తియు కావలెను. నేనారెండును లేని వాడను. నేనీ పీఠిక వ్రాయుటలో ఆచార్యులవారు నాపట్ల ప్రచరించెడి వాత్సల్యమే వ్యుత్పత్తి. వారి పట్ల నాకున్న భక్తియే శక్తి. ఇందు చెప్పిన దానికంటె చెప్పవలసినదే యెక్కువగలదు. భావుకులైన పఠితలకు దానిని వదలుచున్నాను.

''కతల గద్యపద్యకృతులనెల్ల రొనర్ప
రమ్యశిల్పకావ్య రచన మరిది
కన్ను ముక్కు మూతి గల స్త్రీలు పెక్కురు
చక్కదనపులేమ చిక్కునెటనొ !''

ఇట్లు

జి. వి. సుబ్రహ్మణ్యం.

హైదరాబాదు.
తేది 25-8-1975.

# వైశాలిని నాటక కథ-ఒక పరిశీలన

వరదాచార్యులవారు విద్వాంసులు-కవులు. విద్వత్కవులు-కాదు-విద్వన్మహాకవులు. చాలమందిని మహాకవులంటున్నాం. కాని ఆచార్యులవారు మహాకావ్యం-పోతన చరిత్రము-రచించినారు కాబట్టి మహాకవులు.

వరదాచార్యులవారికి సంప్రదాయం అంటె మక్కువ. వారు సంప్రదాయవాదులు. అట్లని ఛాందసులుకారు. ఛందస్సువారికి వశవర్తి. వారు ఛందస్సు కువశులుకారు. వారు సంప్రదాయజ్ఞులయ్యు ప్రగతిశీలురే. అనేక మంది ఆధునిక కవులవలెవారికీ ప్రగతిశీలమైన ఆలోచనలున్నాయి - అభిప్రాయాలున్నాయి

వరదాచార్యులవారు తమ మహాకావ్యానికి వస్తువుగా పోతన జీవితాన్ని ఎన్నుకోవడంలోనే వారి అభ్యుదయం కనిపిస్తుంది. ఈకాలంలో మహాకావ్యాలు రాసినవారు మరికొందరున్నారు. వారు వీరుల చరిత్రను ఎన్నుకున్నారు. ఆచార్యులవారు కవిజీవితమును ఎన్నుకున్నారు. పోతన రాజులను ధిక్కరించిన కవి. పోతనను మించిన విప్లవకవిని ఆనాడు మనం చూడలేం. ఆచార్యులవారిది విశాల దృక్పథం. మతాలకు అతీతమైన మానవతవారిమతం. వారి "విప్రలబ్ధ" అందుకునిదర్శనం.

వరదాచార్యులవారు అనేకప్రక్రియల్లో సమర్థవంతంగా రచనలు చేశారు. వారు ఇప్పుడు నాటకరచనకు పూనుకున్నారు. 'నాటకాంతంహి సాహిత్యం'అని కదా ఆర్యోక్తి. వారి "వైశాలిని" సకల లక్షణ లక్షితమైన నాటకరాజము, "వైశాలిని" నాటక కథాపరిశీలనం ఈ వ్యాసం లక్ష్యం.

వైశాలిని మూలకథ మార్కండేయ పురాణంలోఉంది. ఇది 'మరుత్తరాట్చరిత్రం రచించానని చెప్పుకున్నాడు. శ్రీనాధుడు మూలకథకు మెరుగులు దిద్ది మహానాటకం రచించారు వానమామలై వరదాచార్యులవారు.

అవీక్షితుడు ఇందలి నాయకుడు. "విశ్వజిద్రణక్రీడా మహోత్సవంలో సకల యుద్ధప్రక్రియల యందును నఖిల ప్రత్యర్థి రాజమండలిని" జయించిన వాడు. అయినా గర్వమన్నది ఎరుగనివాడు. దృఢకేశి రాక్షసుడు. మున్యాశ్రిమాలను నాశనంచేస్తున్నాడు. అతని బాధనుండి ప్రజల్ని కాపాడాలి. అదే తమకు గురుదక్షిణ అన్నారు. కణ్వపుత్రుడు. అతడు అవీక్షితునికి గురువు. దృఢకేశిని చంపేదాకా రాజ్యం స్వీకరింపనన్నాడు అవీక్షితుడు. ఇక్కడ బీజంనాటారు ఆచార్యులవారు. సరి. ఇగదీనికి పూర్వరంగం ఎంత ఏర్పాటుచేశారో పరిశీలింతాం.

ఆచార్యులవారు అగస్త్యశాపం కల్పించారు. వైశాలిని పాతాళానికి వెళ్లాలి. అప్పుడుగాని శాపవిముక్తికాదు. ఇదిలా ఉండగా అవీక్షితుడూ శాపానికి గురిఅవుతాడు. ఇక్కడ రెంటిని సాధించారు రచయిత. ఒకటి అవీక్షితుని ధనుర్విద్యాకౌశలం. రెండవది నాగుల శాపం. దానికి విముక్తి ఎట్లా? అవీక్షిత్తు భార్యనాగుల్ని రక్షించాలి. అంతటితో ఆగలేదు. వాయుదేవుడు శాపంపెడ్తాడు - అవీక్షితుని సుతుడు నాగుల్ని హతమారుస్తాడని! ఇంతటితో ఆగలేదు. వైశాలిని ఒక నిర్ణయం చేస్తుంది. రాక్షసులను చంపి, తనతండ్రి మనశ్శాంతిని కాపాడినవాణ్ణే పెళ్లాడ్తానని!

ఇహ చూడండి రచయిత కథాకల్పనా చాతుర్యం. అగస్త్యుని శాపానికీ నాగులశాపానికీ ముడివేశారు. అంటే వైశాలినీ అవీక్షితులను ముడివేశారు. ఈజంట శాపాల విముక్తీ నాగలోకానికి కలిపాడు. సరిపోయిందా! ఇంకాచూడండి. వైశాలిని దీక్షకూ ముడిపెట్టారు. మరుత్తు పుట్టడానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసేశారు!

వైశాలిని కలగంటుంది. కలలో అవీక్షితుని చూస్తుంది. వలస్తుంది. అవీక్షితుడు వైశాలిని చిత్రాన్నిచూస్తాడు. వలస్తాడు. వీరిద్దరి కలయిక విచిత్రం. ఆమె నాట్యకత్తె. అతడు కవి. అతడు నాట్యాన్నిమెచ్చాడు. ఆమె కవితను మెచ్చింది. ఆమె ఉంగరం బహూకరించాలనుకుంది. అప్పుడు

తెలిసింది అతడు అవీక్షితుడని. అప్పటిదాకా అతడుబాపడు! ఇలా జరిగింది ప్రథమ సమాగమం.

వైశాలినీ అవీక్షితులది కామంకాదు-విలక్షణ ప్రేమ. ఆచార్యులవారి వైలక్షణ్యం ఇక్కడే కనిపిస్తుంది. ఒకరికొరకు ఒకరిని తపింపచేస్తారు. ఒకరికోసం ఒకరు త్యాగాలకు సిద్ధపడ్డారు. కాని కామవాంఛ తీర్చుకొడానికి అఱ్ఱులుచాచరు. గాంధర్వ వివాహం చేసుకుందామా అని అడుగుతాడు. వైశాలిని వప్పుకోదు. శకుంతలవలె కాలుజారలేదామె!

అపార్థాలుకూడా చాల చక్కగా కల్పించారు ఆచార్యులవారు. విదూషకుడు అనమన్నట్లు అంటాడు అవీక్షితుడు. అది వింటుంది వైశాలిని. అపార్థంచేసుకుంటుంది. అంతేకాదు. ఒకపద్యం ఆమె చేతబడింది. అది అవీక్షితుడు వ్రాసింది. శ్లేషప్రయోగించి గమ్మత్తుచేశారు వరదాచార్యులవారు.

"గాత్రము పుల్కలెత్త నిటుగాంచదు రెప్పలనప్పళించియో మిత్రమ! యీవిశాలసుత మిన్నక యుండునదెన్నిపల్కినన్ చిత్రముగా గనంబడును చేతమె యున్నటు తోచదామె యే మాత్రము నచ్చలేదవటె మానినియే కడు నచ్చెనాకికన్".

"చిత్రము" పదంతో గారడిచేశారు. ఇంక అపార్థం చేసుకొక ఏంచేస్తుంది?

వైశాలినిని రాక్షసుల బారినుండి కాపాడ్తాడు అవీక్షిత్తు. అప్పుడు అసలు విషయం వివరిస్తాడు. అప్పుడుగాని గ్రహించదామె. మనమూ అంతే. గారడిలో పడిపోతాం.

ఆచార్యులవారి ఎత్తుగడలు గమనించండి. దృఢకేశి వైశాలినిని మోహిస్తాడు. ఆమె దక్కాలంటే అవీక్షిత్తు ఓడాలి. అవీక్షితుని దగ్గర నారాయణాస్త్రం ఉంది. దాన్ని వేరేచోట ప్రయోగింపచేయాలి. ద్విజిహ్వుణ్ణి ఉసి

కొల్చాడు. వజ్రవంతుని భార్యను అపహరించమన్నాడు. వజ్రదంతుని ఉరీ కొల్చాడు. అవీక్షితుని శరణువేడమన్నాడు. వజ్రదంతుడు శరణువేడాడు, అవీక్షితుడు నారాయణాస్త్రం ప్రయోగించాడు. ఆశ్రితుని కాపాడుడు. తాను నాగపాశబద్ధుడైనాడు! ఇక్కడ ఒక్కదెబ్బతో రెండు పిట్టల్ని కొట్టారు ఆచార్యులవారు. ధృఢకేశి కుట్రనూ, అవీక్షితుని ఔదార్యాన్ని ఒకే ఉదంతంలో సాధించారు.

అవీక్షితుడు నాగపాశబద్ధుడవుతాడు. శాపం ఉందిమరి. తప్పదుగా! అతడు వీరుడు. ఓటమి తలతీసినట్లయింది.

"ప్రాణమేగుట మృత్యువుకానెకాదు.
పరుడు అభిమాన హతియైన నాడెచచ్చు.
మేను పుట్టుట జన్మము కానెకాదు.
కీర్తియుదయించునాడె యామూర్తి పుట్టు.

రాజకుమారీ! నాపైయాస విడువుము. ఏరాజకుమారునైన వరించి సుఖించుము" అంటాడు అవీక్షితుడు.

"శూరశిరోమణీ! మనోలగ్నమే నిజమైన లగ్నము" అంటుంది వైశాలిని. ఆమె తనను అతనికి అంకితమొనర్చుకుంది. ధృఢకేశిచావాలి. అప్పుడు తన ప్రతిన నెరవేరుతుంది. అవీక్షితుని ప్రతినచెల్లుతుంది. తనపెళ్లి జరగుతుంది. వైశాలిని తపమునకు పూనుకుంటుంది. ఇక్కడ మనకు పూర్తికుమార సంభవం re-everct అయినట్లు కనిపిస్తుంది-ధృఢకేశి వృత్తాంతం తప్ప. ధృఢకేశి ఖిల్లిని వధిస్తాడు. శుద్ధవిష్కంభంలోని శాపంవిముక్తి అయింది. ధృఢకేశి మధ్యాతన మధ్యాగడ్డిపరక వేస్తుంది వైశాలిని. ఇది రామాయణాన్ని తలపిస్తుంది.

వైశాలిని తపస్సుఫలిస్తుంది.

అపీక్షితుడు అడవికి వస్తాడు. దృఢకేశితో యుద్ధంచేస్తాడు. దృఢకేశి నిహతుడౌతాడు. నిహతుడయినవాడు దృఢకేశి మాత్రమేకాదు. అతని రాక్షస వాదం. అవినీతి. ప్రజాకంటకత. అవినీతి పరులు, ప్రజాకంటకులు హతులు కావాలనేది ఆచార్యులవారి అభిమతం. దృఢకేశి వాదాన్ని ఇలా వివరించారు వరదాచార్యులవారు :—

"ఈనీతులు నియమాలు పుణ్యపాపాలు సస్యరక్షణ కేర్పరచిన బెదురు బొమ్మల వంటివి. వానిని గాంచి పశువులు బుద్ధిలేనివి కావున వెరచుకొనును బుద్ధిగల మానవుడెవడును భయపడుడు. మన యాయుః పరిమితియే స్వల్ప మననట్టి గ్రుడ్డి నియమాలతో సుఖదూరులమగుట లిచటనే నరకవాసమగును"

ప్రస్తుత సమాజాన్ని వివరిస్తూ ఆచార్యులవారు :—

"ధనికుడు దరిద్రుల దోచుకొనితిని మరింత ధనికుడగు చున్నాడు... ................ఇంతియెకాదు. దేవుని పేరిట మతభేదములనియు, జాతి భేదములనియు, ప్రాంతీయ విభేదములనియు, భాషావిభేదములనియు మిష లిడుకొని యొకరి నొకరు ప్రాణశత్రువులుగా ద్వేషించుకొనుచున్నారు. బడితగలవానిదే లోకము. పైసగలవానిదేనాకము"

ఆచార్యులవారి అవగాహన ఎంతటిదో గమనించండి.

సునయుడు వైశాలినీ అపీక్షితుల పెళ్ళిచూచిమురిసిపోతాడు. ఇంతకూ అది పూలదండల పెండ్లి !

సునయుడు నవదంపతులను గంధర్వలోకానికి తీసికెళ్తాడు. అక్కడి సమాజం ఎలాఉందో వివరిస్తారు ఆచార్యులవారు :—

ఈ రాజ్యమున బరికింప నొకబిచ్చగాడైనను గానరాడు. పేరునకైన బూరిగుడిసెలేదు. ఇచట ధనిక దరిద్ర భేదములులేవు. ప్రతిపౌరుడు విద్యా వంతుడే, ధనికుడే, శక్తివంతుడే, స్వతంత్రుడే. ఇచట సకల ప్రజలకు

సాంఘిక మర్యాదలు సమానముగా లభించును..........జాతిభేదములు మచ్చుకైన గానరావు. అటులే యిచట సకల విధదైవోపాసనలు నొకే మర్యాదతో జూతురు............వీరిలో వీరికే విషయములందు వైషమ్యములు లేవు.........ఒకేతల్లి బిడ్డలవలె సకల ప్రజలు ప్రేమగలిగిమెలగెదరు''.

ఇది ఎలా సాధ్యపడింది అనివారు అడుగుతారు. ఆమాటే అవీక్షితుడు అడిగాడు. ఆచార్యులవారు జవాబు చెప్పారు.

"ఇచటగూడ ధర్మాత్ముల కన్న దౌర్జన్యపరులే యిమ్మడిగా నుండిరి. అంతరంగిక విప్లవము చెలరేగినది. ప్రజాశక్తి సముద్రమును మథన మొనర్చుటలో ధర్మరూపిణి విజయమోహిని ప్రత్యక్షమై దేవగుణులకమృతము పోసినది. అసురగుణుల నణచివేసినది''.

"సంక్షేమ రాజ్యమేదియైనను స్వర్గమే'' అంటారు మహాకవి వరదాచార్యులవారు. శ్రేయోరాజ్యస్థాపన వరదాచార్యులవారి అభిమతం అది సాధించడానికి దుష్టసంహారం శిష్టరక్షణ అవసరం. అది బోధించడానికే ఈనాటకం రాసినట్లున్నారు

మరుత్సంభవంతో నాటకం ముగుస్తుంది.
మనకూ ఒక మరుత్తు కావాలనే మహాకవి

వానమామలై వరదాచార్యులవారి సందేశం.

ఇట్లు
దాశరథి రంగాచార్య.

## శ్రీ వాగీశ్వర్యై నమః

### నాంది

ఎయ్యదియాది భావమగు నెద్దియనంత విచారపూర్ణమౌ
నెయ్యదియక్షరాకృతిగ నెన్నియొరూపులుగాఁగ మారుఁదా
నెయ్యదినిత్య నిష్ఠవసియించు శ్రుతిస్వరశబ్దితంబుగా
నెయ్యదియాది మూర్తికవియేయయికైతగ మారి మార్చునా
నెయ్యపుటెత్తి కోలుమిము నిత్యవిశాలరసాబ్ధిఁదేల్చుతన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును]

**సూ :-** (సవినయముగ సభనుగాంచి పుష్పాంజలిం జల్లినమస్కరించి) (స్వ) ధన్యోస్మి. ఈ సభాకృతిలో సర్వజ్ఞుని విరాడ్రూపము సాక్షాత్కరించుచున్నది.

వరవిజ్ఞాన సమష్టియేయిటువలెన్ వ్యష్టీకృతంబందియా
పరతత్వమ్మనకంటె నెంతొపరమై ప్రత్యక్షవాగ్రూపగో
చరమై మాదృశచేతనోద్ధరణ నాచార్యాభమై యీసభన్
బరివేష్టించుటఁ బారిషద్గణమె సంభావ్యమ్ము మాకియ్యెడన్.

**ఓహో !** ఈ సహృదయశేఖరులందరును సకలశ్రమలకునోర్చి యీయల్పజ్ఞుని నాట్యకళా కౌశలమునాలోకింపఁ బుత్రవాత్సల్యమును వహించియరుదెంచిరి. జన్మాంతర పుణ్యపరిపాకాతిశయముననే యీసజ్జన సంగతిఘటించును. ఎందును బలువురార్యులముందే ప్రతివాని పాత్రతా పాత్రతలచందము నిర్ణీతమగును. ఈ భాగ్యమును బ్రసాదించిన భారతినేమని వినుతింతును ?

తనమనోభావములె కవితలయివెలయ
వాగ్విధానమె గానమై వరలుచుండ
నంగవిన్యాసమే నాట్యమైచెలంగ
నలరు వరకళాభారతి నాశ్రయింతు.

(అంతమారిషుఁడు ప్రవేశించును)

**మా :-** ఆర్యులకభివాదములర్పించుచున్నాను. (అని నమస్కరించును)

సూ :- శుభమగుఁగాక ! మారిషా ! సమయమునకు వచ్చితివి. లోకకల్యాణ కరమగు మన నాట్యకృషి యిపుడెట్లు సాగుచున్నది.

మా :- గణనీయమగు క్రమాభ్యుదయము గలిగియున్నది.

సూ :- నటసంతతికి జననీ జనకులనదగు సంగీత సాహిత్యములు చక్కఁగా సేవింపఁబడు చున్నవి కదా !

మా :- శారదాజననీ స్తనద్వయమని కొనియాడఁబడు సంగీత సాహిత్యకళల సుధారసపానమొనర్చి మన నటసంతానము పుష్టివంతమై పూర్ణవికాసము గల్గియున్నది.

సూ :- మారిషా ! సంగీతసాహిత్యములు శారదాజననీ స్తనద్వయమనుటలో నా కొకింత మతభేదము గలదు.

మా :- ఏమా భేదాభిప్రాయము ?

సూ :- వాగ్జననీ స్తనద్వయమునందొకటి సంగీతము, మఱియొకటి సాహిత్యమను పోలికలు భిన్నప్రయోజనములుగల యీ కళల విషయములో నంతగాఁ బొసఁగుటలేదు. ఇక వీనిఁగూర్చి నాయభిప్రాయము వినుము.

నశ్వరా నందంబు నాదసంగీతంబు
సాహిత్య మక్షర సౌఖ్యదమ్ము,
సంగీత సాహిత్య సత్కళా ద్వితయమ్ము
తగ శారదా కుచ దళలు రెండు,
నాభు నాకర్షించు నవదళ సంగీత
మాపాత మధురమై యలరుచుండు,
తనయు సాకు ద్వితీయ దళయొ సాహిత్య
మదాలోచనా మృతమగుచు నెగడు,

దారయై తల్లియై కళల్ చేరఁదీసి,
యెందు నలరించుఁ బెంచు నానందవార్ధి,
ముంచుఁదేల్చు నన్యము మఱపించు సరస,
సంతతులు రతింబాల్గొని శాంతిఁగాంత్రు.

ఆత్మయే పుత్రరూపుడనుటఁబితయే పుత్రుఁడుగాఁ బుట్టునుగదా! మొదటి హృదయాబ్జ మిత్రత, రెండవ గర్భకమలగతపుత్రత యీరెండును నాత్మబ్రహ్మయే.

మా :- బాగు బాగు! మీ సమర్థన మౌచిత్యవంతమై శోభిలుచున్నది.

సూ :- మారిషా! మన నాటక ప్రయోగమునకు సంగీత సాహిత్యములేకాక నాట్యముగూడ జతపడినగాని పూర్ణరూపముదాల్చదు. రంగస్థలి సంగీత సాహిత్యనాట్యములు త్రివేణీ సంగమువలె సమైక్యమైననే నటలోకమునకు సేవ్యమైయలరారును. సాహిత్యము భావమై సంగీతమురాగమై నాట్యము తాళమై భరత శాస్త్రభారతి రూపొందెను.

మా :- మేల్మేలు! చాల చక్కని నిర్వచనము.

సూ :- కావుననే యీభరత నాట్యశాస్త్రము కవికిని. నటకునకును, ప్రేక్షకులకును సదా సేవ్యమై యానంద సంధాయక మగుచున్నది. మారిషా! యిపు డేనాటకము మనపాత్రలకు సమ్యగభ్యసితమై యేపారుచున్నదో వివరముగా నెఱింగించుటకు నటినిందుఁ బ్రవేశపెట్టుము.

మా :- మంచిదటులేయొనర్తును. [అనిచనును]-[నూపురధ్వని వినఁబడును]

సూ :- [ప్రక్కతెరగాంచుచు సస్మితుఁడై] సఖీ! రారమ్మ! సకలమున సహభాగినివై యెప్పు నిన్నువిడిచి యీ యమూల్య తరుణముఁబుచ్చపెట్లు?

నటి - [సత్వరముగాఁ బ్రవేశించి] ఆర్యపుత్రా! మీరంతటి యకార్యము సేయనొల్లకయే నాకునద్దానిలో భాగమీయం బిలిచితిరి.

సూ :- సఖీ! నేఁబిలిచిన వెంటనే వచ్చితివి. నీవే కార్యాంతరమగ్నవై యుంటివో; దాని విడిపించిననా యకార్యము నొక్కింత సహింపుము.

నటి :- ఆర్యపుత్రా! ఆ కార్యము కన్నను మీయాజ్ఞయే ప్రధానమనివచ్చితి.

సూ :- ప్రేయసీ! సాధ్వులకుఁబతియాజ్ఞకన్నను ప్రియమగునదేది; కావుననే వారిచరిత్రములా బాలగోపాలాదరణీయములు,సకలలోకకల్యాణకరములు.

[స్మృతినభినయించి] ఇదో మన సంభాషణావసరమున వీరినిట్లు వ్యర్థముగాఁ బ్రయాసపెట్టఁజనదు.

నటి :- ఎవరిని ? [ముందున్న సభనుగాంచి] నేడీ విశేషమేమి ?

సూ :- నేడమూల్య తరుణ మననేమనుకొంటివి ? నీ వింతవఱకు వీరిని దర్శించుచునేలేవా యేమి ?

నటి :- నా ప్రమాదముక్షమార్హము.

ఉల్లమంతయునీమ్మ మధురోక్తియందె
మగ్నమై ప్రకృతిని నిటు మరచియుంటి
అల "విశాల" "యవీక్షిత" నందెలగ్న
మానసస్థితి నితరమ్ము మరచినటులు.

సూ :- ఎట్టెటూ ? ఏమంటివి ? యెవరా సాధ్వి ? శ్రమయనక నొకమారెఱింగింపఁగోరుచుంటిని.

నటి :- ఇంతకుముందే వైశాలినీ నాటకమును పాత్రల కభ్యసింపఁ జేయుచుండఁ జప్పుననిప్పుడా సాధ్వి విషయమే ప్రస్తావనగా వచ్చినది.

సూ :- మేలుమేలు ! ఎచటిదీగాథ? ఎవరు నాటకమును వ్రాసిన యాసమర్థుఁడు?

నటి :- మార్కండేయ పురాణాంతర్గతగాథ నొకఁడాధునిక కవికించిత్కల్పనా విశేషంబుల రచించెను.

సూ :- నాటకరచనమున కుపక్రమింప సమగ్రనాటకాలంకార శాస్త్రపరిచయమును గలిగియుండుటేకాక, పరిణతరసవత్కవితా ప్రతిభాపాటవముగల మహానుభావుఁడు వలయుఁగదా ! "నాటకాంతంహి సాహిత్యం" "కావ్యేషు నాటకంరమ్యం" అను నిర్వచనములు తెలిసినవే కదా ?

నటి :- ఆర్య పుత్రా ! మీరనినట్లు ప్రతిభా పాండిత్యాభ్యాసములుగల కవి రచనమేవలయు.

కతల గద్యపద్యకృతుల నెల్లరౌన్నత్య
రమ్య శిల్పకావ్య రచన మరిది
కన్ను ముక్కు మూతిగల స్త్రీలు పెక్కురు
చక్కదనపు లేమ చిక్కునెటనొ.

సూ :- నటీ ! ఉన్నత శిల్పశోభితములైన ప్రబంధములయ్యు నందరికి నందుబాటులో నుండిన మరింతశోభించును.

నటి :- అందఱు నంతో యింతో కథా భావము దెలిసి యానందించఁగలరేమో కాని ఆలోచనామృతమగు మహోన్నత కావ్యశిల్ప సౌందర్య మది యెవ్వరే క్రొత్త ఫక్కి రచించినను నందఱికందు బాటులో నుండుట కష్టమే! సహృదయులు మాత్రమే దాని సమగ్రముగా నాస్వాదింపఁగలరేమో?

సూ :- అది నిజమే! కష్టమొనర్పక ఫలము నాసించుట కసుగందులకే తగును. చనుబాలు త్రావువాఁడు చక్కిలాలరుచి గ్రోలగల్గునా; దానికి దంతపుష్టి వలయును. ఆపుష్టినే సంస్కార మందురు.

నటి :- దేహమెదిగిన పలువరుస దానంత నదే సంభవించును గాని యాంతరంగిక సంస్కార మెదవి యాత్మయెదుగుటెట్లు?

సూ :- దానికిఁదగిన యాహారమిచ్చిన నదియు నెదుగును.

నటి :- ఆ యాహార మేది?

సూ :- అది కవి పండితుల సాహచర్యమున లభించు విద్యావివేకములే. కొందరు విలువనివ్వలేరని స్వర్ణరత్నాదికము లందరి కందుబాటులో నుండునా? అందరి కందు బాటులో లేవని ఫలము లున్నత శాఖల నలరారకుండునా? ఏ విషయములోనైనను సౌందర్య జగతియందరి కందుబాటులో లేనిదేయనితోచును.

నటి :- ప్రస్తుతమీ కవీంద్రుని కావ్యకన్యయు మిక్కిలి చక్కనిదని పలువురు పండితులు వేభంగుల వినుతించుటచే నీ నాటకము ప్రయోగింపఁ దలచితిమి.

సూ :- వీరి కవితా కన్యాప్రాశస్త్యమును బండితులేమని వినుతించిరి?

నటి :- లలిత పదారవింద, బుధలక్షణ లక్షిత, భావజాత కో
మలసుమసుందరాంగి, గుణమాన్య, సువృత్త, సువర్ణ వర్ణ సం
విలసదలం క్రియాకలిత, విశ్రుతపూత చరిత్ర, మంజుశ
య్యల నలరారురాణి, బహుశార్థవరప్రదవాణి యీమెతాఁ.
అని వర్తమానకవి పండితులు బహువిధములఁ బ్రశంసించిరి.

సూ :- ఇంతకు నీవర కవీంద్రుఁడెవరు?

నటి :- వరదన కవీంద్రుఁడే యీ వరకవీంద్రుఁడు.

సూ :- వానమామల వంశ సంజాతుఁడగు వరదార్య కవీంద్రుఁడేనా ?

నటి :- ఔను! పోతన చరిత్రమను మహాకావ్యమును రచించి, "అభినవపోతన" యను నన్వర్థ బిరుదమువడసిన యీ వానమామలై వరదార్యుడే. ఈతని పోతన చరితమను మహాకావ్యమును గూర్చి యనేక కవిపండితుల యభిప్రాయములే యితని పాత్రతను దెల్పును.

సూ :- వీరినభిజ్ఞులేమని వినుతించిరి ?

నటి :- "సరవి నన్నయ సమాసంబు శబ్దపుడంబు
తిక్కనౌచిత్యంపు తెనుఁగు సొంపు
శ్రీనాథ కవి ప్రౌఢ సీసంపు హరువును
పోతన వైదర్భిరీతి మురువు
రామ రాడ్భూషణు రసరంజిత శ్లేష
పెద్దన జిగిబిగిఁ బెనఁగు భాష
చేమకూర కవీంద్రు చెలువౌ చమత్కృతి
కూచిమంచి సుశబ్ద గుంఫనిరతి
కాళిదాస భావోపమా గౌరవంబు
భవ్యభవభూతి కరుణ నిర్భర రసంబు
నవకవుల సొంపు నీచేత నాట్యమాడు
సరస కవితా కళా రవీ వరద సుకవి".

అని ప్రసిద్ధ కవి పండితులు బహు విధముల వినుతించిన నీ కవి తనను తానా మహాకవులఁ దేఁ దాల్చువాడననునే కాని గర్వించి యెఱుంగఁడు.

సూ :- విద్యయొసఁగును వినయంబు కాని గర్వంబు కాదు కదా ?

విద్యయుపకృతి ప్రస్తుతి విబుధుల యెడ
ధేనువునకు గ్రాసమ్మిడు తీరులగును
కుటిల మతులకు నివి యొసఁగూడె నేని
పామునకుఁ బాలువోసిన పగిది యగును.

చిత్తసంయమనము గల్గిననే కవి ఋషియై కావ్యముల నౌచిత్య వంతములుగా రసవంతములుగాఁ దీర్చి దిద్దఁ గలఁడు. ఋషి హృదయములో గర్వము మొదలుగాఁగల దుర్గుణములకు తావుండరాదు.

అట్టిదైన సీమహాకవి విరచించిన యీ నాటకము సహృదయా మోదము నందగలదని విశ్వసించుచున్నాను. "వైశాలిని" అను నీ నాటకము పేరును బట్టిచూడనిది యొక సతీలలామ చరిత్రమనితోచుచున్నది

నటి :- సతీమతల్లుల గర్భఖనిలోనే సుతులై శూర శిరోమణులుదయింతురు. ఆ వీరశిరోమణులు తామన్యాయాంధ కారమును బాపి జగదభ్యుదయమును జేకూర్చెదరు. శ్రుతి ప్రసిద్ధ చరిత్రుఁడగు మరుత్తు తాసీయమ గర్భశుక్తి ముక్తాఫలమై ప్రకాశించుటలే దీనికి నిదర్శనము.

సూ :- బాగు! మరుత్తు తానీలతాంగి పవిత్రగర్భకమలమున నుద్భవమొందుటచే గాఁబోలు తన యజరామర కీర్తిసౌరభముల దశదిశలగుబాళింపఁజేసి యఖిల ప్రజలకుఁ బ్రాణదుఁడైనాఁడు. కష్టముల నుసహించి యిట్టి శూరసంతతిని గనిపెంచు స్త్రీకి ప్రపంచము సర్వదా ఋణపడియున్నదన వచ్చును.

నటి :- మీరు మరుత్తునే యింతగాఁ గొనియాడు చుంటిరి. అన్నిటనతని యయ్యయనబడు నవీక్షితుని గూర్చియేమన వలెను ? అతడు లోకమునకు ప్రాణమరుత్తైన నితడవీక్షితుఁడగు నాత్మయనవలెను.

సూ :- అతఁడింత కెక్కుడు లోకకల్యాణ కారియని తెలియుచునే యున్నది. అతని భార్యయగు వైశాలినీ దేవిగారి పుణ్యములగణ్యములనవలెను.

నటి :- అంతియె కాదు. స్త్రీతానటు భార్యయై లాలన ప్రేమను మరియునిటు తల్లియైపాలన ప్రేమనువర్షించి యీశుష్క ప్రపంచమును రసవంత మొనర్చుచున్నది.

సూ :- ఇల్లాలు లేని యిల్లువలె నారిలేని యీ జగన్నాటకము శోభించదు.

నటి :- రమయు నుమయును భారతీ రమణి యగుచు
నర్థబల మంగబలము విద్యాబలమ్ము
లొసఁగి స్థితిలయ సృష్టులనొనరఁ జేయు
విశ్వచాలక శక్తియవ్వెలఁ దియెకదె.

సూ :- అది నిజమేకాని యీ నాటకమును దోషజ్ఞులెట్లాదరింతురో చూడవలసి యున్నది. "ఆపరితోషా ద్విదుషాం" అని కదా కవికులగురూక్తి.

నటి :- చిరుత(డగు కళానిధినైన శిరమున దాల్చు సర్వజ్ఞునివలె సహృదయ కవి పండితుల విమర్శలెందును నిష్పాక్షికములై కళలకు దోహదకారులగును. దోషజ్ఞులు సహృదయులు కారేని తద్వ్యతిరేక ఫలితము చేకూరును.

భవ్యకావ్యము గుర్తింప(బడక యుంట
జ్ఞానహీనుల రసికత లేని తనమొ!
సాటి పండిత కవుల యీర్ష్యా గుణమ్మొ!
ఐన నిశ్శ్యంబుదములర్కు నణచ వెపుడు.

కుటిల సమకాలిక విమర్శకుల విమర్శ
లవమతి నొనర్ప(గుందు మహాకవులను
నేడు నిర్మల కీర్తి చన్ద్రికల మధ్య
అమరులై యుంట(గని ధైర్యమందు సుకవి.

కువిమర్శల సరకు(గొనక యాత్మ ప్రత్యయన బుద్ధిగల మహాకవులెన్నడు నైరాశ్యమునకు లోను గాక మేరునగ ధీరులై యుందురు.

ఆర్య పుత్రా! ఈ లోకమేలకో కవి బ్రదికి యున్నపుడు వానిని సన్మానించదు?

సఖీ! ఏవస్తుగౌరవమైనను నది జగతినున్నంత సేపు తెలియదు. అది పోయిననేకాని దాని నిజమైన విలువ గుర్తెరుగ(బడదు.

నటి :- జీవితానంతరమెవరెన్ని తీర్లనుతించిన నత(డు వినవచ్చునా?

సూ :- దేవునకు ముందు వ్యక్తికి వెనుక స్తోత్రము చేయవలె నందురు. ఉత్తము లూరక తమ స్తోత్రముల వినుట కిష్టపడరు. వారు ప్రతి ఫలమాసింపకయే సేవాభావముతో ఘనాకృతి నుపకృతు లాచరించు చుందురు.

నటి :- బాగు బాగు! మనమువారిని వినుతించుట లేరీతిగను వారియుత్తమ కృతులకు విలువలు కానేకావు. నిందించకున్న నంతే చాలు.

జగతి నీర్ష్యాళురైన దోషజ్ఞులౌర !
కావ్య సుధలను గ్రోలియు కవి సుధాంశు
నమల కీర్తి చంద్రికల దోషాప్తిం బులిమి
మరుంగు పరుచం జూచెడి రాహు సరణినుంద్రు.

సూ :- సఖీ ! చాల అపచారపడుచుంటివి. అటులనరాదు. వీరందరు నట్టివారు కారు. నీవనినట్లే గరళము గళమున దాచి కళానిధిని శిరమునదాల్చు సర్వజ్ఞులు వీరు.

నటి :- అప్పుడు కాని ఆకళానిధులతోం బుట్టువులై. లోకకల్యాణ కరకావ్య శ్రీలుదయించి కవి ముఖకమలాల నలంకరించవు.

సూ :- అయిన నీ నాటక ప్రయోజనమేమై యుండును ?

నటి :- లలిత సహజసుందర విశాలప్రకృతికి, పౌరిననంగని భావీక్ష్యపురుషునీడ నఖిలప్రాణి కోటికిం బ్రాణమౌమరుత్తు, కలుగ నతమీ జగన్నాటకంబలరెడి.

సూ :- వేదప్రసిద్ధ గాథాన్వితుండును నపర శతక్రతు వనదనరి సురలను గూడ భూలోక నివాసాసక్తులం జేసిన మరుత్సంభవ మీ పుణ్యాదంపతులకే కదా ! బాగు బాగు ! ఇకత్వరగా ప్రదర్శనము ప్రారంభించిన బాగుండును.

నటి :- మీయాజ్ఞ తలందాల్చెదను,

సూ :- ఉల్లము పల్లవించి మననాట్య కృషి రక్తింగాంచ నొకమారా వసంత ఘోషిగానము గానిమ్ము.

నటి :- మహాప్రసాదము ! (వసంతఋతువును గూర్చి పాడును).

వనిలతాంగులు పుష్పవతులై తనర్చుట
మనసైన వాసనల్ మత్తుంగొల్పె
కొమ్మలకెల్లను గోర్కులు ననలెత్త
రాగ దృశ్యంబులు రమణ మీరె
పగలూన గాఢ తాపములు హెచ్చుటచేత
సంధికాలములు ప్రసన్నతంగొనె
ప్రకృతికాంతయుం గ్రొత్త పచ్చకోకధరించి
చిలుకయై మరుని తేజియననొప్పె.

ఆమ్రములు పల్లవాకృతి నవతరించె
భృంగ నిచయమ్ము మధుపాన భోగియయ్యె
వినిచెమోహన రాగగాయనము పికము
రహిని మదన వసంత సామ్రాజ్యమందు.

ఆర్య పుత్రా ! ఇంతటితో విరమింతునని స్వతంత్ర పడుచున్నాను

మునువని మిత్రుఁడు రానం
దునవే చెడియాయ వీక్షితునివలె నిచటఁ
మననాటక ప్రదర్శన.
మునకై బుధపారిషత్సమూహము వేచుఁ.

సూ :- ఔనౌను ! త్వరగాఁ బోదము పద. (యిరువురు నిష్క్రమింతురు).

ఇది ప్రస్తావన.

# శుద్ధ విష్కంభము

[గంధర్వ లోకము ప్రవేశము చిత్రాంగద, మణికుండల నామక గంధర్వ కుమారులు]

చిత్రా :- మణి కంధరా ! నేటివార్తా విశేషమొకటి వింటివను కొందును.

మణి :- ఏమా విశేషవార్త ?

చిత్రా :- గంధర్వరాజగు సునయునింటికి నగస్త్య మహర్షులు విచ్చేసిరి.

మణి :- ఊరకరారు మహాత్ములు. వారువచ్చు కారణము మంగళములకె.

చిత్రా :- అదినిజమే కాని యిచటనది యన్యథాపరిణమించినది.

మణి :- చిత్రాంగదా ! ఏమాయన్య థాపరిణామము ?

చిత్రా :- మణి కంధరా ! మహాత్ములగు మహర్షులఁ బరిహసించుట మన శ్రేయములకును మన కాయములకును వినాశహేతువని తెలియవలెను. మహారాజులైన నేమి ! మంత్రులైన నేమి ? అధికారమధుపానమత్తులై నిజకర్తవ్యమును విస్మరించుచోఁదమ సమాధినిదామేత్రవ్వుకొనుటలగును.

మణి - చిత్రాంగదా ! నీ వాక్కులు నిష్ఠురములైనను నిజములు. ఆత్మసంయమనము గల్గునొ చిత్యవర్తనుల కధికారమబ్బిన సహజ సౌందర్యమున కలంకారమువలె వ్యక్తిత్వశోభనిను మడింపఁజేయును. మునిని సునయుఁ డవమానించెనా యేమి ?

చిత్రా :- కాదు కాదు. సునయుఁడతి థిగావచ్చిన యగస్త్యుని తన కూతునకును నామెచెలికినిఁ బరిచయ మొనర్చెను. సముద్రపాన మొనర్చినట్టి యపరిమిత శక్తిసంపన్నుఁడని వినుతించి చెప్పెను.

మణి :- దీనివలన నామునికి జరిగిన యవమానమే మున్నది ?

చిత్రా :- వినుము సునయ మహారాజ తనయ సఖి, యది విని అహింసా వ్రతులు బ్రహ్మ ఋషులు సముద్రపాన మొనర్చునపుడు మత్స్య భుక్కులై నారు. పాపము, వాతాపిని జీర్ణించుకొనిన వారికి వనధి మత్యము లేమి లెక్క, అని విరుగఁబడి నవ్వినది. అదిగని సునయుని తనయయు నవ్వెను.

మణి :- అధికార, ధన, రూప, మదములవలెనే యౌవన మదముగూడననే కానర్థములఁ దెచ్చిపెట్టునుగదా ! ఇవి జ్ఞానులఁగూడన జ్ఞానులఁ జేయును.

చిత్రా :- అదియట్లే జరిగినది. అంతనగస్త్యుఁ డలిగియారా కుమారి సఖిని "నీచయోని యందుద్భవించి నిశాచరునిచేన శింక్షువు గాత !" యని ఘోర శాపమొసంగెను.

మణి :- ఆమెతోఁబాటు పరిహసించిన సునయదుహితను గూడ శపించెనా ?

చిత్రా :- నీవును మనుష్య జన్మయందుద్భవ మందినీ ప్రియుని విరహముతో కలకాలము తాపపడెదవు గాక ' అనిమనరా కుమారిని శపించెను.

మణి :- ఇనుమును గూడిన యగ్నికి సమ్మెట ప్రేటులు తప్పవుగదా ! అందులకే కోట్లువ్యయించియైన గుమతి స్నేహమువదులు కొనుమందురు, తుదకుఁ జరిగినదేమి ?

చిత్రా :- మణి కంధరా ! అపుడు సునయుఁడు 'తన తనయ యొనర్చిన యజ్ఞాన కృతాపరాధము కరుణామయులగు గురువులచే క్షమార్హమని పదములఁ బడి ప్రార్థించి యాబిడ్డను గూడ యంఘ్రుల'ఁబడవైచినాఁడు.

మణి :- సునయుని మొరవిని యామౌని క్షమించెనా ?

చిత్రా :- 'బ్రాహ్మణస్యక్షణం కోపమ'ని నారు గదా ! కావున మునిరాజు వారి ప్రార్థనల కలరి ప్రసన్నుఁడై సునయాత్మజంగని "బిడ్డా ! నీవు కాలవశ మున సముద్రాంతర్గత పాతాళ దర్శనమొనర్తువు. అపుడు నీశాప విముక్తి యగును. నీపతి నిన్నుదరిఁజేర్చి యనుగ్రహించగలఁడు. నీవలన లోక కల్యాణ మగును" అనెను.

మణి :- చిత్రాంగదా ! ఇక మన గంధర్వ రాజుకూరిమి కూతురు భూలోకమున నరజన్మమెత్తగానేఁగుట తథ్యము. నేను కామరూపధారినై మొన్ననే భూలోకము దర్శించి వచ్చితిని.

చిత్రా :- అదియు మన నాకమువలెనే సుఖప్రదముగా నుండునను కొందును. అచ్చట గూడ ప్రకృతి రామణీయకము మెండుగా నుండునని విందును.

మణి :- ప్రకృతి ప్రతి లోకమున సుందరముగానే యుండును. కాని యీ భూలోకమున పీడిత ప్రజానీకమును దర్శించుట దుర్భరము.

చిత్రా :- అచటి విశేషముల నెఱింగింపుము !

మణి :- చిత్రాంగదా ! ధనికుఁడు దరిద్రుల దోచుకొనితిని మరింత ధనికుఁడగుచున్నాఁడు. బలి బలహీనుల తలలఁ బాతాళమంటఁ ద్రొక్కుచు మరింతపైపదవి నధిరోహించుచున్నాఁడు. విద్యాధికుఁడు విద్యావిహీనుల వంచనోపాయములతో మోసమొనర్చి విశేష సుఖములఁ జూరగొనుచునతి చతురుఁడనని పించుకొనుచున్నాఁడు. అవకాశవాది యీముగ్వురి ప్రళయ తాండవములకు ననుకూల గతిలయవేయుచు వంతఁబాడుచు నవసరములఁ దీర్చికొనుచు హాయిగా జీవించుచున్నాఁడు. ఇంతియె కాదు దేవుని పేరిట మతభేదములనియు జాతివిభేదములనియుఁ బ్రాంతీయ విభేదములనియు భాషావిభేదములనియు మిషలిడుకొని యొకరి నొకరు ప్రాణ శత్రువులుగా ద్వేషించుకొనుచున్నారు. బడితగలవానిదే లోకము పైసగలవాని కేనాకము. అచటి ప్రజల తత్వమిట్లున్నది. ప్రభుత్వము దానికి లయవేయుచున్నది.

చిత్రా :- మణి కంధరా ! ప్రభుత్వ శక్తియంతయుఁ బ్రజలందరకును సమాన సుఖసంపదల నందించి శాంతిని రక్షిఁచనెంచియే కాని ప్రజాపీడనకై కాదు.

మణి :- పండ్లెంతటి పదనుగలవియైనను నాలుకకు రుచియైన పదార్థముల నమలిపెట్టుటకే కాని నాలుకనే కఱచిగాయ మొనర్చుటకుఁగాదు. అట్లే ప్రభుతా శక్తియును. జ్ఞానబద్ధులగు జీవులే విబుధులగు చున్నారు. అజ్ఞాన వశంగతులు నిశాచరులై నిఖిల ప్రపంచముతో ద్వేషింపఁబడు చున్నారు, అట్టి నిశాచరులి పుడచట నుండి ప్రజల క్షోభపెట్టి బహు సుఖములనను భవించుచున్నారు. ఒకనాడీ లోకముననుగూడ వారితో మనము కననివినని బాధలు పడినవారమే కదా.

చిత్రా :- రాక్షస ప్రకృతిగల రాజులు దూరదృష్టి శూన్యులై యాత్మ నాశమును గొని తెచ్చుకొందురు.

మణి :- చిత్రాంగదా ! మనసునయ మహారాజు తన తనయ విషయములో నెంతగాఁగుందు చున్నాఁడో ?

చిత్రా :- "బిడ్డా ! నీవు ధరణి జన్మించినను నీ పుణ్య విశేషమున ద్వారగా మరలగంధర్వలోక సందర్శనము గావించగలవు. సకలప్రజలను స్వపర భేద వివక్షలేక సమానదృష్టితోఁ గాంచి పీడిత తాడిత ప్రజానీకమును దయఁ జూచి సర్వదా వారి దుఃఖ నివారణమునకై యుపకరించు పుత్రుని గాంచి వసుంధర కిడిరమ్మ! పరదుఃఖ దుఃఖిత్వజాత పరోపకారమే మహాపుణ్యము. అది యిహపర సుఖ సాధనమగు ధనము" అని యోదార్చెనని తెలిసినది.

మణి :- ఇంతకీ సునయాత్మజకు కష్టదాయకమైన నీయగస్త్యుని శాపము పీడిత ప్రజానీకమునకు సుఖదాయకమై వెలయునని నీ వాక్కుల వలన విదితమగుచున్నది. మహర్షుల కోపమైనను మంగళములకేననుట సత్యదూరముకాదు.

చిత్రా :- మనమింక సునయుని దుఃఖములోఁ బాలు గొననేఁగుటు చితము. పద ! (యిరువురు నిష్క్రమింతురు).

శ్రీవాగీశ్వర్యై నమః

# ప్రథమాంకము

[సమయము సాయంత్రము—ప్రదేశము కణ్వపుత్రాశ్రమము]

అవీ :— (స్వ) ఓహో సంధ్యాసమయమాసన్న మగుచున్నను వయస్యుఁడు రాని కారణమేమో తెలియరాకున్నది.

కాంత సంధ్యాభ్రముల దాఁగురింతలాడు
నాయవీక్షిత రవి సంగమాసఁగొనుచు
రాగరక్త సుందరి విశాల ప్రకృతియొ
విహగకలరు తమ్ములఁబాడు విరహగీతి.

ఇదియిటులుండ మరియొకవైపు విడంబిం బ ముదయింపనున్నది.

పగలొనరించి సాముతమిఁబా పునహస్కరుఁడంతఁ బోకయా
తొగవలకానినుంచు తన తోరపుకాంతులతో నిశార్ధముఁ
సగముఁ బొనర్చుచుఁ బ్రజకు సత్పథముల్దగ జూపునీగతిఁ
దగవునొనర్చు నిద్ధరణి ధర్మమధర్మమునైయ హర్నిశల్

గురుదేవుని యాశీస్సులఁగొని చనిదివిలోని రణక్రీడోత్సవములో సర్వప్రథమునిగా గెలుపొందిన వానివలె నితఁడును దారకలనుండి వెల్గుచున్నాఁడు. మిత్రునిరాకకై యింత తడవేలయైనదో ? అశ్వములలసి నడువలేకున్నవో ? లేకదారిలో, నేదేనియపాయము సంభవించినదో ! నేనేల త్వరపడి వచ్చితిని. ఒక వంకగురు దర్శనోత్సుకతయు మరియొకవంక విశ్వజిద్రణ క్రీడలో సకల రాజమండలిని దిరస్కరించినన్ను వరించిన విజయలక్ష్మి యానందావేశమును నా యిరుగాళలఁ ద్వరపెట్టినవి. ఐననేమి? సూతున.పి యతవిజాడ వడయుదుఁగాక ! (ప్ర) సూతుఁడా ! (సూతుఁడు ప్రవేశించును)

సూ :— దేవా ! ఏమిసెలవు ? (అవీక్షితుఁడు ప్రక్కయవని కంజూపుచు)

అవీ :— చెమ్మట గ్రమ్మస్నానములు చేసినయట్టు లునశ్వయుగ్మదే
హమ్ములుడస్సి పోయెను మితాధిక మయ్యెనుశ్వాసముల్ శ్రమఁ

సొమ్మలు వోయి నోట నురుసుల్ వడిఁ గ్రక్కుచునుండె నింద్రువా
హమ్ములు వృష్టితో మెఱపుటంచియల న్చకిలించుచాడ్పునన్.
వానివదలించి తరుకాండమునంటగట్టి నీరిడుము.

సూ :- చిత్తము ! (అనితలన్ వంచిలోనకుఁ బోవును)

అవీ :- ఆహా ! ఏతదాశ్రమ పరిసరము లెంతయు సహజ సుందరములు. నిరంతరము వీనిదర్శించి యానందమునొందు మునిరాజులు ధన్యులు. రాజులనుగూడ తలవంచఁజేయు మునిరాజు లప్రతిహతశక్తి సంపన్నులు. గంగచల్లనిదైనను గట్లనుభేదించు శక్తిగలది.

తత్వవిదుల్ మునుల్ నృపులతామసరాజస శక్తినంతటిన్
సత్వముతోనెగెల్చెదరు చండతరం బగుదావ వహ్నిక్రూ
రత్వమువారిఁ జిక్కియె పరాస్తమొనర్చు ఘన ప్రదీప్తి నీ
సత్వమె భౌతికాభ్యుదయ సత్వయుతంబయి క్రాలునెల్లెడన్.

ఔరా ! వీరు ధరామరులగుటనేమొ భూతల స్వర్గమై యీయాశ్రమము కనుపండు వొనర్చుచున్నది.

మంజుల హోమధూమ ప్రసారంబులు
నీ లాభ్రముల వింతలీల లీన
ఆరఁగట్టిన వల్కలాంబర కాషాయ
వర్ణముల్ సాంధ్యశోభల రచింప
యజ్ఞకుండమ్ముల నగ్నిహోత్రంబులు
నస్తమించెడి భాస్కరాకృతిఁగొన
నిరత బ్రహ్మానంద దరహాస సందీప్త
ముని ముఖాబ్జము చంద్రముని సృజింప
సుందరాశ్రమ తరులతా సూనరాజి
తారకా వితానంబయి కోరకింప
సంయమీంద్రుల సత్తపశ్శక్తి కలన
భువి పయింబ్రతి దివమొకండవ తరించె

ఔరా ! వీరుఖండించు కఠోర కుఠారములకుఁ బరిమళములర్పించు హరి చందన తరువులు, రాలఁగొట్టిన ఫలాలరాల్చు రసాల సాలంబులు. ఏమియీ కారుణ్యము. ఏవంకఁగాంచినను దిర్యగ్జంతు జాలంబులును వాత్సల్యము నొలకఁబోయుచున్నవి.

మెడద్రోచ్చి పాల్ద్రావుబుడుతమై నాకు చు
కనుద్రోచ్చి యర్లొందు కపిలగోవు
అరద్రాల్గనుల బిడ్డదురదవో శృంగా గ్ర
మునగీరు మమతరూపౌనరు హరిణి
ముకు పచ్చలారని ముద్దు నిసుంగుల
నోట మేఁతనుబెట్టు గూటిపతగి
తనదు పక్షముల మాటున బిల్లలను దాఁచి
గ్రద్దతాపులనుండి కాచునెమలి.
బిడ్డనొడిఁజేర్చి వానరి ప్రేమమీర
లీలమైఁదలలోపలి పేలనేరు
అమితవాత్సల్య మొలికించి యలరుచుండె
ఔరశాంత్యాలయములు ఋష్యాశ్రమములు.

ఇందు మద్గురుదేవునిదర్శించివారి యమోఘాశీస్సులంగొని మరిపోయెదఁ

గాక ! (ప్రకాశముగా) సూతుఁడా ?

సూ :- (ప్రవేశించి) దేవా ! ఏమిసెలవు ?

అవీ :- సూతుఁడా ! గురుపూజార్థమమ్లానసుమంబులు వలయును.

సూ :- (వనమును గలయఁజూచి) ప్ర-అల్లదో ! ఆ దూరమున దరువరమును జుట్టుకొనియున్నలతలపై సౌరభముల వెదఁజల్లుచు తెల్లని మల్లియలు రెండుగాన వచ్చెడిని. ఆ సూనములు చెదరనట్లు మీబాణములతో నేల రాల్చుడు. నేనేరికొని వత్తును.

అవీ :- (ఆ లతలపైపుఁ గాంచుచు) (ఆశ్చర్యానందములతో) ఔనౌను. సౌరుల నీనుచివురుటాకులపైఁ బువ్వులురెండు నవ్వియాడు చున్నవి. అవి యే

మాత్రముఁ జెదరనట్లు నేలరాలఁ జేయుదును. నా శర ప్రయోగనైపుణిఁ గాంచఁగలవు. (అని బాణమును గురిచూచి విడుచును. ఆ దెబ్బకు శిరో పరిమణుల దనరుఫణియుగమునేల వ్రాలిపడును)

ఫణి :- (కోపముతో) మాసంగమునకు భంగము గల్గించినవాఁడెవఁడా దుర్మార్గుఁడు ? నాగపాశబద్ధుడై వాఁడు నిల్లే తన ప్రియురాలి విరహ తాపముచే వనట నొందుఁ గాక ! మును ముందు మాజాతి వాని వంశముపై పగదీర్చు కొనక పోదు. పాము పగశమించు నదికాదు.

(పూలేరికొని వచ్చుటకై యచటికి వెడలిన సారథి ఆశ్చర్యమున గాంచును)

సారథి :- (దుఃఖితుఁడై) ఓ ఫణిరాజములారా ! మీ ఫణములనాకులుగా మీ జిహ్వలఁ జివురుటాకులుగా మరియు మీ శిరోపరిమణుల బూవులుగా నల్లే మీసుకుమార శరీరముల లతలుగా భావించి మా యవీక్షిద్రాజ కుమారుఁడు గురుపూజార్థము పూలఁగాంక్షించి బాణమును బ్రయోగించెను. అంతియెకాని మీ కపాయమును మదినెంచికానేకాదు. ఈ యజ్ఞాతాపచార మునకునై యింతటి కఠిన శిక్షనొసంగుటలు భావ్యమగునా ?

ఫణి :- ఓహో ! అజ్ఞాతాపరాధమైన నవశ్యముక్షంతవ్యమే యగును. అటు లైననీతని ప్రియురాలు మునుముందు మా నాగజాతికి దాపరింపనున్న ప్రళయా పదనువారింపఁ జేయుదునని వాగ్దాన మొసంగుట సంభవించును. అట్టివేళ నతనికిని నతని ప్రియురాలునకును సమాగమ మొదవి సుఖించ గలఁడు. మాశాపమమోఘమగుటచే నెటులైన నతఁడేడుఘడియలు మా నాగపాశబంధితుఁడు గావలసివచ్చును.

సారథి :- మీదయకుఁ గృతజ్ఞతలు. ఇంక నా మనముకుదుట వడినది.

ఆశరీరవాణి :- "మీరు నన్నెపుఁడు మెసవుదురు. నాయంశ మతని సుతుఁడై మిమ్ముహత మొనర్చును". (అని వాయువుశపించును)

ఫణి :- ఈ శాపరహస్యములొరుల కెఱింగించినవాఁడు తలపగిలి నిధనత్వము గాంచును. మా నాగుల వాక్కులప్రతిహతములు (అని పోవును.)

సారథి :- అహో! ఎంతటి దారుణమగు సంఘటనమిది. మహారాజు పూలే వియన నేమనవలెను? (కొంచెమాలోచించి) "గాలిఁదూలి సమీపనదీ ప్రవాహమున బడినవై యుండవచ్చును. ఆ పూవులచ్చట నెంతవెదకిన గానరావయ్యె"నని తెల్పెదఁగాక!

(అనుకొని సారథి యారాజ కుమారుని సమీపించును)

అవి :- సూతుఁడా! పూలేవి? రిక్తహస్తముల నరుదెంచితివేల?

సారథి :- దేవా! అవిరాలిపడునపుడు వాయు హతిఁదూలి సమీపనదీ ప్రవాహమున బడిపోయియుండినవేమొ? నే నేఁగివెదకి చూచితిని గానియచట పూలేవియుఁ గనఁబడలేదు.

అవి :- సరేమంచిది. నేనేవో పూలుగోసికొని చనెదను. నీవువయస్యునిజాడ నరసికొని రమ్ము! గురుదేవునకు సుమముల కన్నను సుమనోర్పణమే శ్రేష్ఠతరము.

బడిని నాత్మ జ్యోతి గుడిని నాజ్యజ్యోతి
వెలిగించి తమసమ్ము వెలికిఁ ద్రోసి
బడిలో వివేకమ్ము గుడి నీశ్వరైక్యమ్ము
ప్రాపింప జిజ్ఞాస పాదు కొల్పి
జ్ఞాన సారపదమ్ము గాంగ నీర పదమ్ము
తగుశ్రద్ధ బడి గుడిన్ దలను దాల్చి
గురుని వౌ, హరివి యౌ వర త్రయీ తను కలా
నిధిదర్శన ప్రసన్న విధము లెఱిఁగి
బడి, గుడియు నొక్కటని పరబ్రహ్మయైన
దేవుఁడే గురువని యాత్మఁ దెలిసి కొలిచి
భక్తితో పత్ర సుమ ఫలార్పణము గాఁగఁ
దమిని జిహ్వాంత రంగ మూర్ధము లిడఁదగు.

సారథి :- చిత్తము! విశ్వ జిద్రణా చరణమున రథ ప్రయాణ విహారణమున నత్యంత పరిశ్రాంతులై యున్న సుకుమారులగు దేవరయు నీ పచ్చిక

బయటకులఁ గొంతవడి విశ్రమింతురు గాక ! నే బనివినెదను. (అని చనును.) (తెరయెత్తి కణ్వ పుత్రాశ్రమము. ధ్యానమగ్నుఁడగు ఋషి)

అవీ :- గురుదేవా ? అభివాద శతములర్పించు వాఁడీ యవీక్షిత్కుమారుఁడు।

గురు :- (కనులు తెఱచి) ఆయుష్మాన్ భవ ! రా కుమారా ! నీ విశ్వ జిద్రణ క్రీడోత్సవవిశేషముల వివరింపుము. మనమ్ము వినుటకై కుతూహల పడుచున్నది.

అవీ :- పూజ్య చరితా ! మీ యమోఘ వాత్సల్యమున విశ్వ జిద్రణ క్రీడా మహోత్సవములో సకల యుద్ధ ప్రక్రియల యందును నఖిల ప్రత్యర్థి రాజ మండలిని నే నొకఁడనే పోటీపడి జయించితివి. ఆ విశ్వ విజయా నందములో పూజ్యపాదులగు గురువులకు గురుదక్షిణ సమర్పించుకొన బుద్ధి వొడమినది. తమ యభీష్ట మెద్దియో ? యానతీయఁ బ్రార్థన.

గురు :- వత్సా ! ఈ విశ్వ విజయము నీకుఁ గాక మాకే లభించి నట్లానంద పారవశ్యమును భజించు చున్నాము. ఇంక నే గోరున దేమున్నది ?

ఆశలేనివాఁడే గురు వన బరంగు
లోభరహితుండె శిష్యుఁడై రూఢి మెరయు
ఆశలేని వానికి లొంగు నీశుఁడేని
విగత లోభుండు వైకుంఠ జగతిఁ గెల్చు.

కాని యా విశ్వజిద్రణ క్రీడలో నా దృఢకేశి పాల్గొనలేదేమి ?

అవీ :- ఆ మాయావి తానందుఁ బాల్గొనలేదు. వాని పేరు వింటినే కాని వాని నింత వఱకు నేఁజూచియెఱుఁగను.

గురు :- వాఁడీ మధ్య ఋష్యాశ్రమములలో నమాయకులగు ముని జనములను మఱియు జన పదములలోఁ బ్రజానీకమును నుడువ రాని కడఁ గండ్ల పాలుఁ గావించుచున్నాఁడు.

అవీ :- ఐన వాని పాపము పూర్ణముగా ఫలించిన దనవచ్చును. తత్పాప ఫలమైన వానితల నేల రాలు తరుణము సమీపించిన దనవలెను. (తెరలో కలకలము) (వినుట నభినయించి) అదేమి ! ఆ యార్త నాదములెచటివి!

గురు :- ఇదియా జన పదములనుండు పీడిత ప్రజల యార్తనాదము. ఆ దృఢకేశియు వాని యనుయాయులు తామీ ప్రజానీకమును దోచుకొని తినుచున్నారు. వారి స్త్రీలనుఁ బట్టి మానభంగ మొనరించు చున్నారు. ఎదురాడిన వారిఁ జంపుచున్నారు. వారు తమ గోడు నీతోఁజెప్పుటకై వచ్చినట్లు తోచును. [తెరలో] [రాకుమారా! విశ్వవీరా! "రక్షింపుము, రక్షింపుము" అను మొఱ వినవచ్చును.] "ఈరాజులు మాక్షేమమును పేక్షించు చున్నారు. సార్వభౌమ కుమారులగు మీరైన మమ్మీ రాక్షసుల బారి నుండి తప్పించి కాపాడుడు".

అవీ :- (ప్రక్కయవనికం గాంచుచు) గురువర్యా! వీరి శల్యావశిష్ట దేహములు జీవచ్ఛవములై కనఁబడుచున్నవి. చింపులైన జీర్ణ వస్త్రములతో సరిగా మానరక్షణ మేనియుఁ జేసికొన లేని వీరి పరిస్థితి హృదయ విదారకముగా నున్నది. విశ్వ జిద్రణ క్రీడలో నోడి చనిన రాజులా దృఢకేశికి తొత్తులై ప్రజల యోగ క్షేమములను పేక్షించుచున్నట్లున్నది.

గురు :- అవకాశవాదులగు స్వార్థపరులు తమకన్న బలశాలియగు వాఁడు ఖలచర్య లొనర్చినను సమర్థింపఁ జూచుట సహజమే.

అవీ :- రాజులు ప్రజల సేవలకై నియమితులైనారుఁ గాని ప్రజలే తామీ రాజులకు భాగ్యభోగ్యముల నొనఁ గూర్చుటకై లేరని వీఱికిఁ దెలియదు.

గురు :- "రాజు" అను నొక్కవ్యక్తికై సమాజమేర్పడలేదు. సమాజ రక్షణకై యేర్పడిన వ్యక్తి రాజు. అతఁడే వారిక్షేమమును విస్మరించినచో నెక్కిన కొమ్మను గొట్టి వేసికొను మూర్ఖుఁడనఁబడు.

అవీ :- ప్రజల ధనముల రాజులు దోచుకొనుటయా? చీమలుపెట్టిన పుట్టలు పాములాక్రమించిన నా చలి చీమల చేతఁ జిక్కి తాను సర్పముఁ గూడ నొకనాడు చావవలసివచ్చునుఁ గదా!

గురు :— నిజము : ప్రజలకు నందుబాటు లేక వారి నేడ్పించుకొని తిను మంత్రియైన నేమి, మహారాజైన నేమి? తన సంతానమునే తాను దిను పులి వంటివాఁడై వధార్హుఁడగు చున్నాఁడు. వారు రాజులైనను, రాక్షసులే!

ఏ పేర నున్న నేమి ? సుకుమారియని పిల్చినను గోమారి గోర_క్తముఁ బీల్చకుండునా ?

అపీ :- ఈ రాజు లిస్లేల యాచరించు చుండిరో తెలియుటలేదు.

గురు :- వారటులుపేక్షించుట వలననే, అనతికాలములో జనకుని నుండి సార్వ భౌమాధి కారము చేపట్టనున్న విశ్వ వీరుఁడవగు నీతోఁ బ్రజలు తమ మొఱఁ జెప్పు కొను చున్నారు.

అపీ :- ఆ యసురుల నుక్కడంచి వారికి సుఖ శాంతులఁ జేకూర్చిన పిదపనే పూజ్య పాదులగు జనకుల నుండి సార్వ భౌమాధికారము స్వీకరింతునని ప్రతిజ్ఞ నొనర్చు చున్నాను. ఇది వారికిఁ దెల్పి సమాధాన పెట్టఁ గలరని మనవి నొన ర్తును.

గురు :- మేల్మేలు : వీరోచితమగు నీ ప్రతిజ్ఞ నెంతయు మెచ్చఁదగును. కీర్తి కాముఁడవై చిరకాలము వర్ధిలుము. రాష్ట్రప్రజల సుఖ దుఃఖములే తనవని యెంచు రాజే...రాజు.

నృపుఁడు రాష్ట్ర రూపమునకు నెపుడు కన్ను
అంగమేది నొచ్చినను, నయనమె యేడ్చు
నృపుఁడు రాష్ట్ర రూపమునకు నెపుడు నోరు
అంగమెది సుఖించినను నాస్యమ్మె నవ్వు.

అపీ :- గురువర్యా ! రాజ ధర్మమును గూర్చిన యీ మీ యుపదేశములు వేద వాక్యములు. ఇవి నా జన్మలో మరువలేను.

బ్రదుకనన్ మాతృ భూదేవి పాలుఁగుడిచి
యామె చేలాంచలంబంటి యాడు కొనుట
చావనఁగ నామె యొడిలోన సకల జగము
మఱచి నిదురించుటేయని మదికిఁదోచు.

నా మాతృ దేశముపై నన్యుఁడు చేయివేసి యవమానించుటలే మాత్రము చూడరానిది. రాక్షస జాతి మాతృభూమిని పీడఁ బెట్టుట లింక నోర్వ వశముఁ గాదు. ధర్మదారిద్ర్యము కన్న ధర్మమున ఘటిల్లు దారిద్ర్యమే కీర్తిదముఁ గాదా ?

గురు :- బాగు బాగు : మాన ధనులకుఁ గీర్తిని మించిన సుఖ సంపద లేముండును ?

మహి నధర్మాప్త సౌఖ్య సంపదల కన్న
ధర్మ ఘటిత దుఃఖ దరిద్రతలె యశమిడు
మంచి కీర్తి జీవితమును మించు సుఖము
దుష్ట కీర్తి మృత్యువు కన్న దుఃఖ తరము.

అవీ :- గురు దేవా ! ఆ కుటిలుఁడు దృఢకేశి తానీరాజులనెల్ల తన చెప్పు చేతలలో నుంచుకొని ప్రపంచమునే జయించితినని విఱ్ఱవీగు చున్నాఁడు.

గురు :- రాకుమారా ! పరస్త్రీల పరధనముల నపహరించి యదొక ప్రపంచ జయమనుట వెఱ్ఱి గాదా ! ధన, వనితలన బడు నర్థ కామములే ప్రపంచము. వాని యెడాఁటమున గల సహజ హృదయ చపలతను వ్యపన యించు ధర్మపాలకుఁడే ప్రపంచ విజేతయై ప్రజారంజకుఁ డగును.

అవీ :- ఆచార్య వర్యా ! ప్రజలెందును ప్రజారంజకుని పక్షమే వహింతురు. దోషాకరుఁ డగుట నేమొ చంద్రునితో వేరుపడి తారలతనిని స్నేహ నొనర్చును. అతఁడు రాను రాను తన వ్యక్తిత్వమునే కోల్పోవును.

గురు :- ఔను ఆ తారలే నిష్కళంకుఁడగు సూర్యునితో నైక్యత భజించి యతని తేజముఁ బెంచి జన వంద్యు నొనర్చును అతఁడే ప్రజాహృద యాబ్జ మిత్రుఁడై ప్రకాశించును.

అవీ :- గురు వర్యా ! ఆ దృఢకేశి యెందుండు వాఁడో తామెఱుంగు దురా?

గురు :- వాఁడీ మధ్య సువ్రతాశ్రమములో విదిశా పురాధీశుని కూరిమి కూతు రగు వైశాలిని హ్వారింప నరుఁదెంచెనట. సువ్రతుఁడా శ్రమమున నుంటచే వీలుపడదయ్యేను.

అవీ :- వైశాలిని సువ్రతా శ్రమమున నేల నివసించు చున్నది ?

గురు :- సంగీత. సాహిత్య, నాట్యాది కళల నభ్యసించ నెంచి చెలులతో నందు వసించు చున్నది. ఆమె భువన మోహనకర సౌందర్యముఁ గాంచి వానికిఁ గన్నుఁ గుట్టెను. అర్థకామములు, ధర్మభ్రష్టత నొందిన చౌర్య వ్యభిచారములనఁ బడి సమాజ సుఖ శాంతుల సమయఁ జేయును.

అరయఁగ ధర్మమోక్షములు నద్దరి యిద్దరియై తనర్చఁగా
వరుసజల ప్రవాహమయి వర్ధిలు చుండును నర్థకామముల్
ఉరవడివాః ప్రవాహమది యొడ్లను మించి చరించె నేనియో
నరవర ! యూళ్ళకూళ్ళ జన నాశమొనర్చక యుండు బెట్లికన్.

ఆవీ :- మహాభాగ్యము. మూర్ఖు లింద్రియ సుఖములకై ధర్మమును బలి నొసఁగి యాత్మశాంతిఁ గోల్పోవుదురు. అట్లే ప్రపంచ సుఖ శాంతుల పాడొనర్తురు. తమ యాజ్ఞాను సారము తప్పక యీ దుర్మార్గులదును మాడెదను. మీ యాశీస్సులున్న నదెంత కార్యము ?

గురు :- నా యాశీస్సులే కాక నీ యస్త్ర విద్యా చాతుర్యమునన్యప్రతి మాన మైనదే నీ వీరీతి విశ్వ విజయము నంది నా శస్త్ర శిక్షణమునకు వన్నెఁ గూర్చితివి.

అవీ :- గురువుల మహాప్రసాదము.

గురు కృపాపాత్రుఁడై శిష్యుఁడెఱుఁగ కున్న
అఖిల విద్యా వివేకము లబ్బుటెట్లు ?
తఱుచుగా శాణ శిల తోడ నొరయకుండ
జాతి మణియుఁ దానెటు ప్రకాశమును గాంచు.

గురు :- వత్సా : గొప్పగా బోధించినను గ్రహించు ప్రతిభకావలయును.

కళలు ప్రతిభాన్వితుని లోన ఘనత మీఱి
వెలుఁగునవి మంద బుద్ధిలో మలుగు సూవు
లలి శరత్తులో శశికళల్ వెలుఁగు లీను
అటులె వర్షర్తువందు మాంద్యమునుఁ జెందు.

అవీ :- అది యంతయు దైవకృప; మఱియు దక్షిణలతోఁ గొల్వలేని మీ శిక్షణ:

అక్షర ధనమ్ము నొసఁగెడి యమర రూపి
యొజ్జకేరీతి ప్రతి ఫలమ్మొసఁగఁ గలము
స్వాదు సుధలను వర్షించి సాకువేల్పు
గిడ్డికై యొక విల్వయె గడ్డి మేఁత.

మీ యాజ్ఞానుసారమా సువ్రతాశ్రమమేఁగి యచటి పరిసర ప్రాంతములవెదకి వాని బట్టి ప్రల్లార్చెద నాశీర్వదింపుడు.

గురు :- విజయీభవ : దీన జనుల యాపదలఁ బాపి వారి యాశీస్సులందిరమ్మా. కాని రాత్రించరులు కడు క్రూరులు, మాయావులు. విధివికటించిన మన జయాపజయ నిర్ణయము తల క్రిందులు కావచ్చును. సమయములు చెప్పిరావు నీవు విశ్వపీరుఁడవైనను నప్రమత్తుఁడవై మెలంగ వలయును. ఇట్లంటినని వేఱుగా భావించ రాదు.

అవి :- దేశికోత్తములటు లానతీయఁ జనదు.

గురువు శిష్య జనులఁ గోపించి చెప్పినన్
మదికి హితముఁ గూర్చు మాన్యుఁడెందు
ఉఱుము, మెఱుము లదరు నురు నీల మేఘము
ధర సువృష్టిఁ గురిసి తాప ముడుపు.

గురు :- ఇంక నేను నదికేఁగి సాయం విధుల నెఱవేర్ప వలెను. పోయి వత్తును. (అని చనును.)

విద్యతోఁ గ్రమ శిక్షణన్ వినయ గుణము
గురువరుని సన్నిధినె యొన గూడు నెందు
ఫల భర వినమ్ర తరు శీర్ష భవ్య గుణము
లొదవు ఋతు దోహద క్రియా విధులతోనె

(స్వ) సారథి యింకను రాఁడయ్యెను, నింత తడవేలయైనదో ? కొంత సేపు ప్రతీక్షింతుఁ గాక ! ప్రస్తుత సంధ్యా రామణీయక మెంతో పారవశ్యమును గొల్పు చున్నది.

ప్రభువుకై పఱచిన పట్టు తివాచియై
సంధ్యారుణిమ వింత సౌరులీన
రాజాగమనవేళ రహిఁ గట్టు తోరణ
పంక్తులై ఖగముల భ్రమణమున నేఁగ
స్వాగత తూర్య నిస్వానమై తరులపైఁ
గల కలారావాల పులుఁగు లలర

మలయ మారుత శైత్య మొలయ వీవనలూఁచు
పరిజనమ్మై వృక్షపాళి యూఁగ
మన్నియం గొల్వ నిల్చు సామంతులగుచు
తారకా సంతతులు చుట్టుఁ జేరు చుండ
తనదు చల్లని శ్రీపాద మునిచి యల్లఁ
దోఁచెరేరాజు సంధ్యా ప్రదోష వేళ.

(ఏమో : వినుట నభినయించి) (పథము వంకఁ గని రథము దిగి కుంటుచు వచ్చెడి విదూషకున్గని) (ప్రకాశముగ)

సఖా ! నన్నుంద వత్తునంటివేల, నీ రథము నింత యాలసింపఁ జేసితివి? ఆకాలు పట్టి వేయుచుంటి వది యేమి ?

విదూ :- (దీనముఖుఁడై ) ప్రభూ ! ఏమని చెప్పవలె నాదుస్థితిని ? ఎంత దుర్ముహూర్తమున నింటి నుంటి బయలు దేఱితినో కాని, మీ రారాజ పుత్రు లందఱితో విశ్వజిద్రణ క్రీడా సమయములోఁ బోరాడి గెల్చు చుండఁగనే నా ప్రాణములు పోయి వచ్చిన వన వలెను. మార్గ మధ్యంబున నెవరో కొందఱు రాచ కోడె గాండ్రు ధనుర్ధారులై .........

అవీ :- (అతని భాషణము మధ్యలో నాపి) ధనుర్ధారులై యుద్ధ మొనర్చిరా ?

విదూ :- యుద్ధము...చే...చేసి

అవీ :- యుద్ధము చేసిరా ! నీవును యుద్ధము చేసితివా ? చెప్పవేమి ?

విదూ :- అంతకుముందే మీరు నా విల్లమ్ములివి నీ విట్లు పట్టుకొని యుండుము, నాకవసర పడినపుడు నేనడిగి తీసికొందును. అని యిచ్చితిరి. ఆ విల్లమ్ములు నాచేతిలో నుంటఁ జేసి యుద్ధమొనర్చుటకు వీలులేక పోయినది. అవియే నాచేతిలో లేకున్నచో నేనేమి యొనర్చు వాఁడనో ! నాపరాక్రమము తమకు దెలియనది కాదు.

అవీ :- (నవ్వుచు) బలేమొనగాఁడవు. అవియే లేకున్న దల క్రిందొనర్చెడి వాఁడవు గాదా ! గురు శుశ్రూషచేసి నీవేల శస్త్ర విద్య నభ్యసించలేదు ?

విదూ :- పిన్ననాడు నా జనకుఁడు "వృధాకాలహరణమేల ? శస్త్రాస్త్రవిద్య నభ్యసించరాదు. వీరు మీ గురువుగారు" అనియొక మహాత్మునిఁ జూపి.

చనెను. నే నతనిఁ గాంచి వృధా కాలహరణ, మేల. శస్త్రాస్త్ర విద్య నభ్యసించరాదు. మీరు మా గురువు గారు. అని పితృ వాక్య పరిపాలన మొనర్చితిని.

అపీ :- నిన్ను సాకిన తలిదండ్రుల ఋణమునిట్లు తీర్చుకొంటివేమి ?

విదూ :- నాకేమి తెలియని పిన్ననాడు తలిదండ్రులు నన్ను సాకుట సంభ వించినదిఁ గాన వారిమేలు నాకుఁ దెలియదయ్యెను. తెలిసినచో నింకెంత యాజ్ఞాపాలన మొనర్తునో ?

అపీ :- (నవ్వుచు) బలేవాడవు. నీ పితృవాక్యపాలన ప్రశంస నీయమే. కాని నీవా వీరు లెవరో తెలిసికొననైన లేదే ?

విదూ :- ఎట్లు తెలిసి కొనఁ గలను మహారాజా ! వారందరు ఛెక్కున ధనుర్బాణ ముల మెఱపించ కనులు మూతవడి యెక్కడనో ప్రాణము లెగసి పోయెను. ఆ శంఖాది, రణ, వాద్య నిస్వనాలు పుంఖాను పుంఖములైన సైనికాట్ట హాసాలు, పిక్కటిల్లినంత దగ్గఱ నున్న పొదలోని క్రూర మృగము బెగ్గిలి నారథము వంక కరుదెంచునంత గుఱ్ఱంబులు దిగ్గన బెదరి ప్రగ్గంబుల నుగ్గునుగ్గొనరించి పంచతిలి, యొక్క పరువునఁ జని యొక చెట్టునకుఁ బెట్టి రథము నొగలు విరుగునట్లు విసరికొట్టి విదిలించుకొనెను. అమ్మో ! చెప్పనిచ్చుట లేదు. (అని నడుముఁ బట్టుకొని మూల్గును.)

అపీ :- మిత్రమా ! చింతిల వలదు. కష్టమనక యా విషయ మంతయు సవిస్తరముగా వివరింపుము. (కొంతాగి) ఇదేమి ? పలుకఁ బ్రాణములేక యున్నావు ? ప్రొద్దున నాతోఁ గూర్చొని తట్టెడు పండ్లు తవ్వెడు పాలు కాఁ జేసితివే ?

విదూ :- పసి బిడ్డలు త్రాగే పాలు మన యాహారములో నెన్నవ పాలు ? పాల, పండ్ల యాహారములు పాల పండ్లూడని బాలల యాహారములు గదా!

అపీ :- మఱి పగలు నాతోఁ బాటు గూర్చొని మీఁగడ పెరుగుతో దాఁగరె డన్నముఁ గాఁజేసితివే ?

విదూ :- "వాములఁ దినెడి స్వాముల వారికి పచ్చిగడ్డి ఫలాహార" మని నట్టులాగడ్డి కూడన్నమేమూలకు సరిపడును ?

బ్రాహ్మణుఁడగ్ని హోత్రమనిన మాట తమ రెఱుఁగనిదా ?

అవీ :- అందులకే దేదీప్యమానముగా నింత వెలిగిపడు చున్నావు. మరియిపుడే మందువు ?

విదూ :- బ్రాహ్మణుల పొట్ట తమల పాకుల కట్ట యెప్పుడు తడుపు చుండవలె నందును. అనగా బ్రాహ్మణుఁడు కడుపు నిండిన చాలునని పించు భోజన ప్రియుఁడు గాని యెంత యిచ్చినను నంతులేని యాసపురి కొల్పు ధన ప్రియుఁడు కాఁడందును.

అవీ :- ఐన నిపుడు మన రథము మీది పెట్టెలోనిరువది లడ్వాము లున్నవి. అవి సరిపడునా ?

విదూ :- ఎవరి దృష్టి సోకినదో కాని నాకీ మధ్య నాహారమే సైపుటలేదు ఈ యాహారము సైపనందుల కాయిరువది లడ్వాము లెంగిలివడి యిన్ని నీళ్ల త్రాగుదునులెండి. ఎట్లో సరిపుచ్చుకొనెదను. నాతిండి తిప్పలు తరువాత చూచుకొందును గాని మొదలేలిన వారి కా విషయమంతయుఁ బూస గ్రుచ్చినట్లు చెప్పక తప్పదు గదా ! ఏమి జెప్పవలెను ? గుఱ్ఱము లిట్లు రథమును విదిల్చుకొని చెవులు నిక్కిడి తోకలు చక్కఁ జాపి చెట్టనక చేమయనక మిట్టనక పల్లమనక క్షణములో మెఱపుగతి మఱుఁగు వడెను. పడిన సందర్భములోనే లోనున్న నేను ముళ్లె కట్టవలె దిబ్బన నేలఁ గూలి పొరలుచుఁ బొరలుచుఁ బ్రగ్గపు పెట్టునబడితిని. ఒంటినిండ నొరసికొని పోయిన గీఱలే చూడుము. (అని వీపుఁ జూపును)

అవీ :- ఔను వయస్యా ! చాల యొరసికొని పోయినది. చింతిలకుము. నిను ముట్టడింప నెవరో రాచకోడె గాండ్రరు దెంచినా రంటివే ! వారిని నీవు సరిగాఁ జూచితివా ?

విదూ :- వారిని సరిగాఁ జూచిన నీవు నన్నుడుగుటయే సంభవింప కుండెడిది. ఇదివరకే పరలోకమునఁ బ్రాతబడెడివాడను. ఆ పడిన సందర్భములో నాకేమియుఁదోచకవచ్చి పోయెడి ప్రాణముల నేరంధ్రము గుండఁ బోవునో యని కండ్లు మూసిపండ్లు బిగించి లోనికిఁ బంపితిని. అంతవానికిఁ

బోను దోచక వీనులకు వచ్చి గిల్లు మన సాగెను. అపుడు నాకు చెవులు మూత మనఁ జేతులు రాక పాత రాడ నా సమయమునకు సారథి వచ్చి చెవులు మూసెను. మూసిన గడియకు ప్రాణములు చననోడి స్వస్థానముం గూడి పరలోక ప్రయాణము వీడి మరల నీ ప్రపంచమును గనులు విప్పికాంచఁ గల్గితిని.

అవీ :- తదుపరియేమయ్యెను ? వర్ణనా విస్తార మొనర్పకుము. క్లుప్తముగాఁ జెప్పుము.

విదూ :- అపుడా సారథి వచ్చి రథము నెక్కుదురా యన బ్రదుకు జీవుఁడా యని వెన్నుఁ జరచుకొని యొంటి మన్ను దులుపుకొని కన్నులు నులుము కొనుచు సొక్కుచు సోలుచు ముక్కుచు మూల్గుచు నొక్కింత తాళికాలుఁ జేయి సవరించుకొని కడకు బడలిక దీర రథముపైన మర్చిన పడుకలో వెన్నంటింపగనే కన్నంటు కొసెను మరచితి. వర్ణన మరల విస్తార మొనర్చితిని. క్షమింపుడు.

అవీ :- (స్వ) ఈ చమత్కారి యింత లంతలుగఁ జేసి చెప్పును. ఏదియె నైనను నాపదల వేళల నాదరించుట విధి. (ప్ర) పిదపనేమి జరిగెను ?

విదూ :- పిదప సారథి గతియేమయ్యెనో ? రథమెట్లు సాగెనో ? నాకే మాత్రము తెలియదు. తుదకుఁ జచ్చి పుట్టియెట్లో ఒకట్లు నిన్ను సమీపించి తిని. ఈ శత్రువులఁ గాంచి పారి వచ్చిన పరాభవమునకు ప్రక్కయేటిలోఁ బడి చత్తమను కొని ఏటి దరికిఁ బోయి ధైర్యము చేసి ప్రాలితిని. కనులు మూత వడెను. ఎట్లో చేసికనులు తెరచి నీటిలోఁ బడితినా లేదా యని చూచుకొను సరికి ప్రత్యక్షముగా నందుఁ గనఁబడితిని. మానధనులకు నపకీర్తి కన్న మరణమే శరణ్యము.

అవీ :- ఆ నదీ జలాలలోఁ గనఁబడినది నీవా ! నీ ప్రతిబింబమా ?

విదూ :- మనమే లేనిది ప్రతిబింబ మెచటి నుండి వచ్చును ? నేనే ప్రతి బింబము. ప్రతిబింబమే నేను.

అవీ :- నీటిలోఁ బడితివేమొ ! మరి చావలేదేల ?

విదూ :- చచ్చితిని. చచ్చి స్వర్గమునకు బోవనమృతము వినాయన్య పదార్థములు చిక్కకుండుటచేరేయంతకంటిపై రెప్పబడకుంటచే సౌఖ్యమే మాత్రములేదని తెలిసికొని బ్రదికి బయటఁ బడినాను. అబ్బా నా కాలు మరీకదల నిచ్చుట లేదు మహారాజా!

(అని మూల్గును) (అపీక్షితుఁడు నవ్వును)

అపీ :- వయస్యా! ఆ కాలు జాడింపుము పట్టు విడిపోవును. లేకున్న నేనైన సాగదీతు నుండుము. (అని కాలులాగఁ బోవును)

విదూ :- మిత్రమా! నీ పుణ్యముండును గాని నన్ను జంపకుము. (అని అరచును)

పరియాచకపుంబాపని
నటిముటి యొక తేలుగుట్టి యరచుచునుండఁగా
పరియాచకమని నవ్విరి
మరణంబును బొందె నతఁడు మంది దకుంటఁగా. (అని కుంటును)

అపీ :- (కుంటఁగా) అని కుంటుచున్నా వేల సఖా! ఏలయిట్లు చంటి బిడ్డని వలెనర చెదవు. దీని కుపచారమును జరిపింతము గానియా సైన్యంబు లెవరివో చూచి రాకుండుట తప్పొనర్చితివి.

విదూ :- రాకుమారా! ఇప్పుడు స్పృహకు వచ్చుచున్నది. దారిలో నొకఁ డెవఁడో కలిసికొని, "నీవు మాదృఢకేశి పక్షరాజ సైన్యములో నివాఁడవా" అని యడిగెను. నే నవీక్షితుని నెయ్యుఁడనని యని వంత నాల్కఁగఱచు కొనుచు నన్నోరగాఁ జూచుచు వెడలి పోయెను. ఏమిచేయవలెను? (అని యారాటపడును)

అవీ :- ఆరాటపడెద వేల? ఆ దృఢకేశి తానీయాశ్రమ పరిసరములలోనే సంచరించు చున్నాఁడని తెలిసినది. నీవు వానిని సరిగాఁ జూచి రాకుండుట పొరపాటే.

విదూ :- (స్వ) రెక్కలు విరిగిన పక్షివలె నున్ననేనారాటపడవలదట. వారిని దెలిసికొని రాకుండుట తప్పొనర్చితినట.

అరయ ధనికులు తమదగు నవసరమ్మ
గలిగియున్నంతవరకెపోచెలిమి కాండ్రు
అవసరము దీరనవల వాఁడెవఁడో యేమొ ?
కేలుఁగాలఁ బట్టినయాకులేల ? పిదప

అధిపు కడవారితప్పైనను మనతప్పైనను మనతప్పే. మనకే శిక్ష వడును. ముల్లు తానరఁటాకుపైఁ బడినను లేక యరఁటాకు దాముల్లుపై బడినను బాధ లరఁటాకునకే కదా ! (ప్ర) మిత్రమా !

కష్టపరవశునగు నాకు సృష్టియంత
తద్విధముగనె తోఁచు రథస్థుఁడైన
శీఘ్రగామికి గుట్టలు చెట్లు గూడ
తోనె వచ్చు విధమ్మనదోచునటులు.

అబ్బా ! నాకీ కాలు కదల నీకుండుట లేమియుఁ దోచుటలేదు. నేనింక నిలువలే కున్నాను.

అపీ :- మిత్రమా ! ఏలయీ రాటపడెదవు ? రథములోనున్న పిండివంటలఁ గడుపునిండ నారగించి యీ రథముపై కొంత విశ్రాంతి గొని రమ్ము ! (విదూషకుఁడు వచ్చు చుండును) పొమ్ము ! (పోవుచుండును)

విదూ :- (సంబర పడుచు) మీకెంతయుఁ గృతజ్ఞుఁడను. (అని విదూషకుఁడు వెడలును)

అపీ :- (ప్రక్కయవనికంజూచి) అదో ? ఆ వంక నరుదెంచు నతఁడొక నైష్ఠికాచార సంపన్నుఁడగు ఋషి సత్తముఁడని యీ రూపము చెప్పక చెప్పు చున్నది. ఈ మహాత్ముఁ డెచటి నుండి యెచటికేఁగు చుండెనో ఇట్టి తత్వజ్ఞుల దర్శనముననే పాపపంకిలము కడిగి వేయఁబడును.

సువ :- (ప్రవేశించుచు) (తనలో) ఈ యరదంబు నిప్పట్ల చెట్ల నీడల విడిసి యీపసరిక బయళుల స్వైర విహార మొనర్చు నా జగన్మోహన మూర్తి యొక గొప్ప రాచపిండ మట్లుస్ఫురించు చున్నాఁడే ? ఔరా ?

పొడవును లావుగల్గు మెయి పొంకములై వడిఁ దిర్గి జానులం
బడి యెడి కేలు దోయి యెడఁ బారిన వక్షపు హాయి గోటికం

దెడి నును మీసకట్టు మెలిద్రిప్పఁగఁ బూనెడి చేయి చూడ సొం
పడరెడి వాయి పంచునటు లంగము లివ్వడి కోడె యెవ్వడో!

(ఇంక కొంత ముందరిగి విస్మయముతో)

అందము మేల్వాయ సునుగను
విందుగఁ జతఁ గూడె, భువి నపీక్షితుఁడీ దృక్
సుందరుఁడు "విశ్వవిజయి"గఁ
గందమ్ముల వెలుఁగు దివ్యకాంతులె తెల్పెన్. (అని సమీపించును)

అవీ :- (స వినయాభి ముఖుఁడై) ఋషికుల తిలకా! ఈ విధేయుని భక్తి పూర్వక నమస్కృతుల స్వీకరించి ధన్యునిఁ జేయఁ గలరని ప్రార్థన.

సువ్ర :- (స్వ) ఔరా! ఈ నిర్గర్వ శిరోమణి వినయ భాషణములు శ్రవణ భూషణములై ప్రశంసార్హములగు చున్నవి. (ప్రకాశముగ) రాకుమారా ఆయుష్మాన్ భవ!

అవీ :- ముని సత్తమా! పూజ్యమగు మీ యమృతనామమే యక్షరములఁ బవిత్ర పఱచు చున్నదో! మఱియు మీ హితోప దేశములనే ధరాధి పతినిర్ధూత కల్మషుఁడగు చున్నాడో? తెలిపి నన్ను ధన్యుం జేయఁ గలరని ప్రార్థన.

సువ్ర :- (స్వ) ఏమి యీ నిరాడంబరాధి కారము! ఆ గంభీర వాక్యవిచారము,

ఘనులు గంభీర బుద్ధి భావనల తోనె
యర్హులగుదు రున్నత పద మధిగ మింప
మూలముల నెంతొ లోఁతుగాఁ దోలు కొనిన
నంత యున్నతి నెదుగు వృక్షాళి యటులు.

(ప్రకా) నృప నందనా! నా పేరు సువ్రతుఁడు. నేనీ సమీప పర్వత సాను ప్రదేశమునఁ గల పర్ణశాలలో నుండి తపః క్రియా కలాపముల నెఱ వేర్చుకొనుచు విరామ సమయములలో సంగీత, సాహిత్య, నాట్యకళా శిక్షణము నొసంగు చుండెదను.

అవీ :- విదిశా పురాధీశుఁడగు విశాలుని కూరిమి కూతురగు వైశాలినికి నిపుడు సంగీత సాహిత్య నాట్య శిక్షణము లొసంగుట లింతకు మున్నే మద్గురువులు కణ్వ పుత్రులు చెప్పఁగా వింటిని.

సుప్ర – ఔను ! నేను వారికి రాజ పురోహితుఁడను. వారి కూతురు వైశాలిని నీవనినట్లు యిపుడు నా యాశ్రమములోనే చెలులఁ గూడి కళల నభ్యసించుచున్నది. కాని నీ దర్శనాతిశయము నన్ను నీ పవిత్ర చరిత్రముఁ దెలియనపేక్షితు నొనర్చు చున్నది.

అవీ :– ఆర్యా ! మిమ్మటులొనర్చునది మీ వాత్సల్యాతిరేకమే కాని నా యందట్టి పాత్రతలేదు.

సుప్ర :– శూర శిరోవతంసమగు కరంధమసార్వభౌముని కుమార సింహ మనజెల్లియవీక్షితాభిధానమున నొప్పువాఁడవీవేయని నా యాశయము.

అవీ :– మహాత్ముల యాశయముల ప్రతిహతములుగా వేల ?

సుప్ర :– ఇపుడు నీవు మా యాశ్రమమునకే వచ్చునట్లూహింతును. దృఢ కేశిని నిర్జించి నిఖిల ఋషిగణమును నిర్భీకమొనరింప నెంచుటలే నీ ప్రస్తుతాగమనోద్దేశ్యమని యెంతును.

అవీ :– సర్వజ్ఞుల యాత్మ ప్రకాశము ముందు దాఁగి యుండునదెద్ది కలదు? కాని మీరులేని వేళల నేనాశ్రమమునకేఁగుట లెట్లో తెలియఁ జాలకున్నాను. తమ శుభ ప్రయాణ మిటులెంతవరకో తెలిసికొన వచ్చునా ?

సుప్ర :– రాకుమారా ! విదిశాపురంబునకుంజని కతిపయదినంబుల కరుదెంచఁ గలను. ధర్మకార్య నిర్వహణ తత్పరుఁడవగు నీకు మేము లేకున్నను, మా యాశ్రమంబు స్వగృహము. నీకు సరియైన యాతిథ్యమచట లభించఁ గలదు. విశ్వజిద్రణక్రీడా మహోత్సవములో నెల్ల వీరులఁగెల్చి విశ్వ విజయివైతివని విని మిక్కిలి సంతసించితిమి.

అవీ :– సంయమీంద్రా! నేను విశ్వవిజయినగుటచే మత్సరమున నారాకుమారు లెల్లరును దృఢకేశితోఁగూడి నను నిర్జించుటకు మాయావ్యూహములఁ బన్నుచున్నట్లు తెలియవచ్చు చున్నది.

సుప్ర :–– సంపదన్వితునొరుని సహింపలేక
చెఱుపఁ దలచుట తనుదానె చెఱుపుకొనుట
పాలతోఁగూడు నీరమున్నాపనెంచి
పొంగుఁ దెప్పించు నగ్నియె పొలియదొక్కొ.

నేను త్వరఁగా నరుఁగవలసిన వాఁడనై యున్నాను. నాకును మా మహారాజునకు నీ వైశాలినీ స్వయంవరము నెరవేరువఱకు నూపిరి నెలుప కున్నది. ఆమెయును నీ వంటి యొక చక్కని వరుని వరించినఁ గాని మా మహారాజునకు మనశ్శాంతిఁ గలుఁగదు.

అపీ :- మీ వాత్సల్యాతిరేక మట్లు పలికించినదే కాని నేను మాత్రమా జగదేక లావణ్యవతికిఁ దగిన వరుఁడ ననిపించుకొనఁ గలనా ?

సుప్ర :- రాకుమారా ! నిజముగా నీవా యతిలోక సౌందర్యవతియగు వైశా లినికిఁ దగిన వరునిగా నున్నావని నా మనస్సేలకో నిర్ణయించుచున్నది. మీరీ రక్షాబంధముల రెంటిని మీవెంట నుంచుఁడు. ఆశ్రమ పరిసరముల నష్టదిగ్బంధనము మిమ్మడ్డువెట్టకుండును.

అపీ :- మహాభాగ్యము. మునివర్యా ! తానా రాజకుమారి యతిలోక సౌందర్య వతియని నేనును వింటిని. మహర్షుల మనోనిర్ణయము తానది విధి నిర్ణ యమునకు పూర్వరూపముఁ గదా !

సుప్ర :- అన్నివిధాల మీ యిరువురకును నీడుజోడు సరిపోయినది. రత్నము సువర్ణము నాశ్రయించుటకే సానలఁదీటి వెలుగొందునుఁ గదా! నిజముగా నామె సౌందర్య మపూర్వము నప్రతిమానమైన దనిపించును.

కోరిక లూరఁజేయు జిగి కుందనపుందను వెంతఁ జూచినన్
దీరని ముద్దుమోము మొనదీరిన నాసిక సోగకన్నులున్
దీరగు దంత పంక్తులును దీరిచినట్టులు బొమ్మలందముల్
గూరిన చెక్కులున్ మరులఁగొల్పు కురుల్ కుదురైన యంగముల్॥

అక్కట నాల్గు శీర్షముల యందలి బుద్ధిని వెచ్చపెట్టి పే
రెక్క సృజించనేని బ్రజలేదియొ దిద్దులు వెట్టుచుందు రా
యొక్క శిరంపుటూహల నిదోపని తీరని చూపధాత తా
నెక్కడ వంకలేని యటులీరమనంపె జయధ్వజమ్మనన్॥

అపీ :- మీ వాక్యవర్ణనమున నేనామెను బ్రత్యక్షముగాఁ జూచినట్లున్నది. మీకు నాయందుఁ గల వాత్సల్యమునకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. దీనికి తోడు మీ యాశీస్సులును గల్యాణప్రదములై తోడ్పడక పోవు.

సుశ్ర :- కాని ఆమె యొక నిర్ణయమును గల్గియున్నది. దానిగూడ నీవు దక్క నితరు లొనర్పఁజాలరు.

అవీ :- ఏమా నిర్ణయము ?

సువ్రి :- కొందఱు రాక్షసులు రాజ్యప్రజలపట్ల పైశాచిక, హింసా చర్య లొనర్చి తన జనకుని మనశ్శాంతినిఁ జెఱచుచున్నారు. రాక్షసుల నాశ మొనర్చు మహావీర పురుషుని వరించవలయుననునదే యా నిర్ణయము. అట్టి పురుషుఁడు నీవినా మఱి యెవరున్నారు ? ఇంక నే వెడలవలయును.

అవీ :- ఇంత త్వరగా మిమ్మొడఁ బాయఁజాలకున్నాను. నేనా దుర్మతుల వధించికాని యామెను చేపట్టను.

(ఇరువురు నిష్క్రమింతురు)

( ఇ ది ప్ర థ మాం క ము )



# ద్వితీయాంకము

తెర యెత్తగా సువ్రతాశ్రమము

[ప్రవేశము: శ్యామల పూలుగోయుచు] — [సమయము: అరుణోదయము]

శ్యా :- (స్వ) ఈ వనసీమలెంతయు నిసర్గసుందరములు !

ఆనందజలధి నీదాడుచుండినవేమొ
చల్లగాడ్పుల నూగు పిల్ల లతలు
కడుపారఁ దేనె పాల్గుడుచుట వల్లనో
హసియించి యాడెడి కుసుమ బాలురు
ఆత్మవాంఛా ఫలావాప్తి నొందుటనేమొ
ఖగముఖమ్ముల బాడు కమ్రతరులు
కడఁగొట్టు బిడలొటఁ గడురాగమున జూడఁ
బడుచు నొప్పారెడి పల్లవములు
రాత్రి సుముహూర్తములయందు రాజుతాను
మంచు ముత్యాల తలఁబ్రాలముంచిపోయ
వనవధువు నిత్యకల్యాణ వైభవముల
నగుచు వెలుగొందు నోషధీనాథుఁ గూడి॥

(సరళా వైశాలినిలు ప్రవేశింతురు)

శ్యా :- రాకుమారీ ! వైశాలినీ ! సఖీసరళా ! నేను మిమ్మిపుడనుకొనుచుండగనే వచ్చితిరి. మీకు నిండనూరేండ్లాయువు.

సర :- సఖీ! శామ్యలా! మేమెపుడో వచ్చువారము కాని వైశాలినీదేవి తాను పెంచికొనిన రాజశారికతో కొంత తడవు ముద్దులు సేయ నింత యాలస్యమైనది.

వైశా :- (అదరిపడి) సఖులారా ! ఇపుడీ వృక్షముక్రిందఁ గాఁబోలును, ఏదియో ధ్వని యయ్యెనేమి ?

సర :- (అట జనీ, కాంచి) సఖీ! ఏమియులేమ. నీ యాగమనము గుర్తెరింగి యీ తరుకాంత తానొక ఫలము నీకై రాల్చినది.

వైశా :- నేనది కాంచనైతిని.

శ్యా :- అయిన నిది నీయపేక్షిత ఫలమనవలెను.

సర :- ఔనౌను! అది యామె యదృష్టఫలమనవలెను. ఇది నీవే గ్రహింపుము. (ఆ ఫలమును వైశాలిని కేలనొసంగును - శ్యామల వైశాలినీ కురుల స్పృశించును.)

వైశా :- అదేమి శ్యామలా! వెనుక నిల్చి శిరోజములనేమియో చేయుచుంటివి? (వెనుదిరిగి చూచును.)

శ్యా :- ఏమియు లేదమ్మా! నీవా యుద్యాన ముఖద్వారపుజాతీవితానము క్రిందనుండి వచ్చునపుడు కాంబోలును; ఆ లతాతన్వి తాను సౌందర్యసామ్రాట్టునకు నీలాలతుజాయి నిడు నెఱికురులకు స్వాగతము చదివిన దనఁ బూలపూజ యొనర్చినది చూడుము.

సర :- నిజముగానా! ఏదీ? (వైశాలినీ శిరముంగనుచు) శ్యామలా! నీవని నటు దేవి కురుల నెగసియాడు మత్తమధుకరములని భ్రమించి స్వయం వరించి, యీయమ ముందటి స్వయంవర కార్యక్రమమును సూచించుచున్నది.

వైశా :- (లజ్జ నటించుచు) సఖులారా! నాపైనున్న యనురాగము వలన మీరటులనుకొనెదరేకాని మరేమియులేదు, పూలు రాలిపడుట సహజమే.

సర :- దేవీ! ఏల యిటులందువు? ఈ లతాతన్వికిఁ దరతమ జ్ఞానమే లేకున్నఁ బ్రత్యేకించి నీ శిరమునే పూలతో నలంకరించనేల?

వైశా :- (సంతసమున వనభూమింగనుచు) అటులననేల? సరళా! ఈ వనలక్ష్మి తాను-

నవసుమ కోమలమ్మగు తృణస్థలినంటి యలంకరించి యా
రవరవనచ్ఛ మౌక్తిక తిరస్కృతి నేసెడి మంచునీటి బిం
దువులిడి ప్రీతిమై యతిథి తుల్యులమౌ మనయంఘ్రులన్ను గౌ
రవమున నర్చచేసి ఫలరమ్య సుమాళినిఁ దన్పునెల్లరన్॥

కావున నిష్పక్షపాత మనస్కయగు నివ్వనాంగనకు మనమెంతయుఁ గృతజ్ఞులము.

సర :- ఈ తరుకుమారుల నాలతాంగన లాలింగన మొనర్చుకొని తమ ప్రణయముల నెట్లు సూచించుచున్నవో చూచితివా ?

శ్యా :- నిజము సరళా ! నాకు నీ సూర్యోదయావసరమున మన వనకాంత తన సహజ సౌందర్యము నొలకఁబోయుచు విలాసవంతములగు దృశ్యములతోఁ బ్రణయమును బంచిపెట్టుచున్నట్లున్నది, పరికింపుము !

ఓషధీనాథు సంయోగ శ్రమాంబు సం
 తతులన బత్త్రిశిఁ దనరు హిమము
పిల్లవాయువుల కౌగిళ్ల మత్తిల్లి యాం
 దోళించు వల్లీవధూగణమ్ము
గండుతేటుల మృదుగాన లాలితలయి
 తీపిముద్దులనిచ్చుఁ దేరివిరులు
శుకముఖక్షత జాత సుఖబాధలందేలి
 పడినవ్వుదాడిమీఫల యువతులు
క్రమతరువర భోగ సంగతుల నలఁగి
రాలిపడు కొప్పుపూలతోఁ గ్రాలుచున్న
వనలతాంగనా శయ్యాలోయనసుమయుత
పాదపాలవాలమ్ములు మోదమొసఁగు॥

వైశా :- సఖీ ! ఈ రసాలతరుమూల ప్రదేశములు సజీవ పర్ణశాలలై చలువల విలువలఁ దెలియఁజేయుచున్నవి. ఈ మాధవీ లతాంగనలు కౌగిళ్ళ నీ తరువరుల కదలనీకుండఁ గట్టివైచి విజయగర్వమున విఱ్ఱవీఁగుచున్నవా యనినట్లు ప్రసూనముఖముల హసించుచున్నవి. నీవనినటులీ సుందర దృశ్యముల మైమరపించుచున్నదీయుపవని. శ్యామలా! నీతో నొక చిన్న మాట చెప్పవలసియున్నది. (తలవ్రాల్చి దరస్మితముతో సలజ్జయై) ఏమియులేదు సఖీ !

శ్యా :- ఏమి దేవీ! చెప్పుటకెంతయు నుత్సహించి నగుచు మిన్నకుంటివి? ఏమది సరళా! అదేదియో తెలిసినచో నీవైన జెప్పరాదా! (వైశాలిని సరళవైపు కన్నులతో నిషేధముఁ జూపును).

సర :- (వైశాలిని కనుసన్నసరకు గొనక) ఏమంత గోప్యముకాదు. (అని చెప్పఁబోవుచుండగా)

వైశా :- (సరళ నోటిపై చేయివైచి యాపుచు) ఆఁ! సఖీ! చెప్పితివా నాపై యొట్టు (అని తర్జించును).

శ్యా :- నేవిననర్హురాలిని గానప్పుడేల ప్రియత్న మొనర్పవలెను? పూజవేళ యతిక్రమింప దేవి యాగ్రహమునకుఁ బాత్రురాలి నగుదును. (కోప ముతోఁ బోవుచుండును.)

వైశా :- (కేల్పట్టి యాపి) సఖీ! తెలిసినది. ఏలయిట్లు మమ్మిరువుర విడిచి పోఁజూచెదవు? అచట నిన్ను దేవి యాగ్రహించుట కల్లగాని నీవు నిజముగా మాపైఁగినుకఁ బూని మమ్మన్యధా తలంచి చనుచుంటివి కదా!

శ్యా :- నిజమే కాదా; తమ యత్యంత రహస్యభావముల నైతము నెచ్చెలు లతోఁ జెప్పవలదనుట యన్యధాదృష్టిగాక మరేమి?

వైశా :- సఖీ! యెంతవెఱ్ఱిదానవు. నిన్నన్యునిగా నెంచితిననుకొంటివా? నీవును విని సరళవలె నెక్కుడ పరిహాసింతువో యని చెప్పనోడితిని.

సర :- శ్యామలా! నేను మన దేవినిఁ బరిహసించితినట. నీవును దీని నొప్పు కొనెదవో లేదో చూడు! (వైశాలిని దిక్కై) దేవీ! ఇప్పుడు నీయొట్టు గిట్టు నెట్టివైతు నందులకు క్షమింప వేడుకొనుచున్నాను.

వైశా :- పిచ్చిపిల్లా! అందులకే నీహృదయమున మాటదాఁగదని నేనందును.

శ్యా :- అందులకే సరళ సరళయైనది. నీ హృదయమో యెన్నెని మాటలఁ దాపనోపు వైశాల్యముగలది గాన వైశాలినివైతివి.

వైశా :- మీరేమేని యనుకొనుడు. నేనా లతాకుంజము నొద్దకుఁ జని పూలేనిఁగోసికొందును. (చిడిముడిపాటుతోఁ జనును.)

శ్యా :- సరళా ! ఆమె చననిమ్ము, ఇంకనైన నా విషయము నిరాతంకముగఁ జెప్పుము.

సర :- వినుము ! ఇదో ! నేడు ప్రాతస్సమయమున నిదిరించుచున్న వైశాలినీదేవిని మేల్కొలుప వీణియంగొని శ్రుతిగూర్తమనిన నాదేవి నిదురించుచునే "సరళా! సరళా!"యని కలవరించుచుండెను.

శ్యా :- ఆమెనొక కల వరించుచుండెనేమో ?

సర :- నీవనినది నిజమే సఖీ ! అంతనేనీమెకు మెలఁకువయయ్యేనేమో యని పిలిచితిని. అలబ్ధోత్తరనైడాయంజని తట్టిలేపితిని.

శ్యా :- తదుపరి యేమయ్యెను ?

సర :- అపుడామె నిదుర కనులను నులుముకొనుచు లేచి, "నేను కలవరించితి నేమి ? యేమని ?" అని నన్నేయడిగి తెలిసికొని, తన కలను దెల్పెను.

శ్యా :- ఏమా కల ? త్వరగా వచింపుము.

సర :- తానాశ్రమములోని గౌరీదేవాలయమునకేఁగి గౌరీ దర్శనమొనర్చుచుండెనఁట. అచట తరుణుఁడొకఁడుండి గౌరీపూజ నేయుచుండెనఁట.

శ్యా :- చేయుచున్న నేమయ్యెను ?

సర :- అతఁడు మన రాజకుమారినిగాంచి దేవీకంఠసీమ వెలయు రెండు పూలహారములను దీసి మందహాసమొలయఁ జూచి "సుందరీ !" యని పిలిచి, "ఈ వాడనిదండలు రెండు నీ గళము నాశ్లేషించి మంగళమును గూర్ప నారాటపడుచున్నవి" అని పాణి గ్రహించెనఁట.

శ్యా :- ఎంత చక్కని స్వప్నమది. గ్రహించి యేమనెను ?

సర :- ఓసీ ! అమాయకురాలా ! అతఁడేమనెనో, యేమాడెనో మనకామె చెప్పునా ! (అని నవ్వుచుండును — శ్యామలయు నవ్వును.)

శ్యా :- అపుడేమి జరిగెను ? (తమకమున నడుగును)

సర :- అంత మన రాజకుమారి భయలజ్జాపీడితయై యతని చేయి విడిపించుకొనఁ బెనఁగుచు సరళాయని పిలుచుచుండెనఁట !

శ్యా :- తదుపరి యేమయ్యెను ?

సర :- అంతలో నా వీణాగానము వినఁబడ మేల్కొనెనఁట. ఆమెకల సత్య మని భ్రమింపఁజేయ నేనును దన ప్రక్కనుండుటగాంచి యచ్చెరువొంది స్వప్నమును నుడివెను.

శ్యా :- నీవా స్వప్నఫలితము నేమంటివి ?

సర :- కల్యాణకర పుష్పమాలాలంకృతవుగా నీస్వప్నము గాంచితివంటిని

శ్యా :- మేలుమేలు! ఇందులకా యెలనాగతానేమనియెను ?

సర :- అంతనాయింతి లజ్జావనతవదనయై నన్నుఆచుఅఁ జూచుచుఁ దుఱ్ఱునలేచి నీయొద్దకు వచ్చి నిన్నడుగుదునని వచ్చి నీతోఁ జెప్పుటకును సిగ్గిలెను

శ్యా :- ఇది స్త్రీసహజమే! ఇందాయమ నననేల ?

సరసమధుర యౌవన సరోవర నిమగ్న
యైన పద్మినివదనాబ్జమది త్రపాంధ
కార ముకుళితమై మిత్ర కరమపాణి
నెరపు గిలిగింతలకె నవ్వి మురిసియాడు॥

సర :- శ్యామలా ! ఈ శుభస్వప్నము మునుగల్గు కల్యాణావాప్తికేనేమో ?

శ్యా :- ఏమోయేమి ? అది యందులకే.

జరుగఁగల శుభమ్ములకు సూచనములగుచు
మొదల సుస్వప్న సుశకునములు గననగు
ముందుగల సుమమ్ములఁ దెల్ప నిందెవీచు
శీతల సుగంధవాయు వీచికల యటులు॥

చూచితివా చెలీ! ఇపుడాయమ మొగముపై నొక విధమగు పెండ్లి కళ యుట్టిపడుచున్నది.

సర :- అదియుఁ గాక యీ సువ్రతాశ్రమమునకు వచ్చిననాటినుండి యామె హృదయ మదియొక విధముగా మారినట్లగపడుచున్నది. సరిగాఁ గని పెట్టితివా ? (వెనుకనుండి వైశాలిని వచ్చి సరళను గిలిగింత సేయును.)

సర :- (ఉలికిపడి వెనుకఁ జూచి) అదో! చూచితివా సఖీ! ఈయమ మన వాక్కులు పొంచులుండి వినుచు నీపరిసర ప్రాంతముననే దాఁగియున్నది.

వై శా :- లేనామరి! మీరు నన్నాడిపోసికొనున దంతయుఁ బూసఁగ్రుచ్చినట్లు వినఁబడుట లేదా?

శ్యా :- మా మాటలు విని లోలోన సంతసించుచుంటివా?

వై శా :- ఇక సంతసించుటొక టేనట్టు మీరెపుడీ యనవసర ప్రసంగముల తోనే ప్రొద్దుఁ బుచ్చెదరా?

శ్యా :- మాకు నై యిల్లేల యేవగించుకొనెదవు? మునముందు మమ్మేమరతువు

సర :- సఖీ! నీ వనినదంతయును నిజము.

రసికహృదయాల నలరించు ప్రణయకాంక్ష
దాఁచిపెట్టగా లజ్జదో బూచులాఁడు
ఉదయమందెడి బాలార్కు నదిమిపెట్టఁ
గ్రమ్ముకొనివచ్చు నీలమేఘమ్ము వోలె॥

శ్యామలా! దేవిగారికత్యంత ప్రియములగు నీ చంపక ప్రసూనములఁ గోసికొనివచ్చితిని. దీనికిఁ గానేమి బహుమాన మొసంగెదరో మన వై శాలినీదేవిగారు? (అని వై శాలినీదేవికి, చంపకప్రసూనములిచ్చి) శ్యామలా! ఇంకొక చిత్రమైన విషయమును మీకెఱిఁగింతును.

శ్యా :- ఏమా చిత్రమైన విషయము?

సర :- ఆ విషయము చిత్రమే! (అని వై శాలినీ శ్యామలలగొని యవనికకు నావలిచివరఁ జని చిత్రము చూపుచు) దేవిగారు గాంచిన స్వప్నగత వృత్తాంతము నీ చిత్రముగా వ్రాసిపెట్టితిని. ఇందు వై శాలినీదేవి యా సుందరుఁడు మందహాసముతో నొసంగుచున్న చంపకసూనమాలను గై కొని సిగ్గులు చిందింపఁ జేయుచున్నది చూడుము! (వై శాలిని లజ్జతోఁ బాటు సంతోషమును నటించును).

వై శా :- నీవెపుడు నేవేవో యిట్టి పిచ్చిపను లొనర్చుచుందువు.

సర :- కళాకౌశలమును రాకుమారికిఁ గానుకగా నిచ్చుట! పిచ్చివారి పనీ యేనా సఖి!

వైశా :- సరళా! నీ చిత్రశిల్ప కల్పనానల్ప కౌశలమున కివే నా జోహారులు.

శ్యా :- నీకల కామె కళాస్వరూపమిచ్చినది. దేవీ! నీ కల్యాణమును కాంక్షించు మాకు ఇంతకన్న గీయఁదగిన చిత్రమేది? పాణి గ్రహించిన ఈ సుందరుఁడేనా నీ స్వప్నగతుఁడు? అటులు సిగ్గిలు చుంటివేమి?

వైశా :- పో! సఖీ! అవేమి మాటలు! (అని లజ్జాపూర్వక చంచల దృష్టితోఁ దలనేల వ్రాల్చును.)

శ్యా :- దేవీ! చెప్పఁ బనిలేదు. మఱి నీ యీ చిత్రమును రచించినందులకు సరళ కేమి బహుమానము నొసంగెదవు? (వైశాలిని మౌనమును సూచించును.)

శ్యా :- చిత్రమేదైన నేమి? ఇందలి కళా ప్రావీణ్యము సన్మాననీయమే కదా! బహుమానమేమీయ నెంచితివి?

వైశా :- సరళ యేమడిగిన నది యిత్తును.

సర :- వైశాలినీదేవీ! అటులైన నొకసారి మీ జగన్మోహనకర గాన, నాట్యములను వినఁ గన వాంఛింతును. అనుగ్రహింపుడు.

వైశా :- ఇంతేకదా! సఖీ శ్యామలా! నీవు నీ వీణ గొనిరమ్ము. సరళా! నీవు నట్లే నీ మృదంగమును దీసికొని రమ్ము. ఆ పార్వతీదేవి సన్నిధిలో నాట్య మొనరింతును. (ఇరువురు సఖులు చెప్పినట్లు చేయుదుమందురు, అందరు నిష్క్రమింతురు) [తెరలో: వైశాలిని తాను నాట్య మొన ర్చుచుఁ బాడుచుండును] (ప్రక్కనుండి విదూషకునితోఁ బాటు నవీషి తుఁడు ప్రవేశించును.)

అవీ :- మిత్రమా! ఆశ్రమోపాంతమున గల యా సరస్సును దిలకింపుము, ఎంత యందముగా నానంద ప్రదముగా నున్నదో?

సరసీ చంద్ర శిలాభ వేదికల భాస్వత్పద్మ పత్రాళీ వి
స్తరులన్ వైచి విలాస హాస ముఖులబ్జ వ్యోమ సీమంతినుల్
హారి వడ్డించు రసామృతోర్మి, మయికమ్మల్ మాధురుల్ లేమి నా
వరభృంగాళి సుమాంగనాధర మధువ్రాతంబె సేవించెడిన్॥

విదూ :- మీ వర్ణన మెంతయుఁ దగియున్నది. ఇదో ! ఈ విశాల శిలా ఫలకమున సువ్రతాశ్రమ చిత్రమును కాబోలు విలిఖించినారు. ఇందలి హరిణములు, మయూరాది శకుంతములు, తరు లతా కుటీరములు సజీవములైనట్లు కనఁబడుచున్నవి చూడుము.

సంగత రేఖలన్నియును చారు కళావని సీర పంక్తులా
రంగులు రామణీయక సురమ్య సుధారస పూరకుల్యలిం
దుంగళలీను చిత్ర వితతుల్ వరనందన వాటి, శిల్పివా
బంగరు వ్రేళులైదు నలపంచ సురద్రుమ పాళి వేరులా॥

అవీ :- వయస్యా ! నిజము. ఓహో ! ఏమి యీ చిత్రకళా వైభవము. ఆ శిల్పకళా ప్రాభవము అనూహ్యము, అదృష్ట పూర్వము. ఆశ్చర్యమును గొల్పుచున్నవీ చిత్రములు. ఇవి యెవరో రాజశిల్పి దీర్చినట్లున్నవి. వీని వర్ణింప నలవికాదు.

రేఖలో యవికాక లోకాలనే కేలఁ
బట్టి యిచ్చెడి జాలబంధచయమొ ?
రఁగులోకాక నేత్రగత తారకల ని
త్యావాసములగు చిత్రాంబరములొ ?
కుంచయో యదికాక కోరు వస్తువులెల్లఁ
దగ నిచ్చు వరమంత్రదండ ముఖమొ !
ఫలకమో కాక యీ ప్రకృతిదౌ ప్రతిబింబ
ములఁ జూపఁ బట్టిన ముకుర తలమొ ?
ఎడమ కుడి చేసి కుడి నితానెడమఁ జేసి
ఎదుటి వస్తువు దూరమై యేఁగునంత
శూన్యమై తోచు నాదర్శ జన్యములగు
తప్పులను జెప్పఁగల మేటి దార్శనికుఁడౌ॥

విదూ :- రాకుమారా ! ఈ విశాలఫలకమున దీర్చిన యీ చిత్రమును దిల కింపుడు. స్వయంవరమాలికను గేల్గొని సిగ్గులు చిందులాడ నిగ్గయిన సంపెఁగ మొగ్గవలె రామణీయకము నొలకవోయుచున్నదిఇందీ యువతీ చిత్రము.

చదువుకొననట్టి పామర జనులకైన
అఖిలభాషా విభేదములవలఁ ద్రోసి
రంగురూపుల సౌందర్య రసజగత్తుఁ
గనులఁ దార్చివించు నీ చిత్రికావ్యఁసము॥

అవీ :- (ఆ చిత్రమును దర్శించి తనలో) ఆహా ! ఏమి యీ సౌందర్యము! అప్రతిమానము.

ఔర ! మాటాడకుండ మాటాడుఁ దాను
ఒకట గత జీవమయ్యు జీవకళలొలక
వంత మిట్టల సమపీర వసతిఁ జూపు
చిత్రికళమించు భువిఁగల చిత్రిమేది ?

నవ్వులు నెదఁ గవ్వించెడి
మవ్వపు చూపులును నన్ను మాటాడించుఁ
ఇవ్విధి చిత్రమె యొనరుప
నవ్వేలది యికెట్లు నన్ను నాడించునొకో॥

మిత్రిమా ! ఇది చిత్రికారుని హస్త కౌశలమేకాని, నిజముగా నొక కన్య యిట్లుండు ననుట కల్ల. నేనింత చక్కని చిత్రము నెచ్చటను గనలేదు. ఈ శిలపై దీని వ్రాయుటచే నిది వెంటఁ గొనిపోరానిదయ్యె నేమిసేయవలె ? వయస్యా ! ఇది సువ్రతుఁడు వర్ణించినట్లున్నది. ఇది వైశాలినీ చిత్రము కాదుగదా ! (కొంతాగి) సఖా ! ఈ పురుషచిత్రి మూహించి వ్రాసిన నించుమించుగా నా పోలికలే విశేషముగాఁ గానఁ బడుచున్నవేమి ?

విదూ :- రాకుమారా! నిజముగా నిది ముమ్మూర్తులు మిమ్మఁ బోలియున్నది. ఇది మీ చిత్రిమే. మీకు నా రాకూమారికిని బ్రిహ్మ తానిట్లు జంటను వ్రాసిపెట్టెనేమో యనఁజేయుచున్నది.

అపీ :- అంతటి యదృష్ట మీ యపీక్షితునకు లభించునా ? (అని చెవియొగ్గి) (ఏమో వినుట నభినయించి) సఖా ! ఇచ్చట నేదో సుమధురగానము వీనులవిందొనర్చుచున్నది. తానే గంధర్వకన్య పాడుచున్నదో యని పించును.

విదూ :- నిజమే ! ఈ సువ్రతాశ్రమములో గాన నాట్య శిక్షణముఁ బొందు చున్న వైశాలినిదే యీ గానమని శంకవొడముచున్నది.

అపీ :- (కొంచెము ముందు నడచి) ఐయుండవచ్చును. అదో ! ఆ దూర ములో నీ తపోవన రసాలసాలమూలమునఁ గొందరు మునిబాలురు గుమి గూడియున్నట్లున్నది. అచట నేదో గానకార్యక్రమము సాగుచున్నది కాఁబోలు. ఆ ధ్వని యీ వైపున నింకకొంత స్ఫుటముగా వినవచ్చు చున్నది.

విదూ :- వయస్యా ! మనమచటి కేఁగి యీ గానమును వినవలెనని యాస గల్గుచున్నది.

అపీ :- మిత్రమా ! ఆ రాగ మనురాగ జనకమై నన్ను నాకర్షించుచున్నది. మనమేఁగకున్నను మనమేఁగుచున్నది. మనమేఁగిన వారా గానము నాపి వేయుదురని శంకవొడముచున్నది. ఆ యమను వీక్షింపవలెనను తమక ము హెచ్చుచున్నది. ఈ చిత్రమును గాంచుచు నా గానమును వినెదఁ గాక !

విదూ :- సఖా ! అటులైన నీ కోరికదీర మనమచటి కేఁగుటయే యుచితమను కొందును. శ్రోత్రములకన్న నేత్రములు ప్రధానములు గదా !

అపీ :- (తన్మయతతో నా చిత్రమునుగాం చుచుండును).

విదూ :- (కొంచెము ముందరిగి కాంచుచు,) — (అపీక్షితుని దరికి వచ్చి) మిత్రమా ! నీవిందు చిత్రవిచిత్ర లోకమున నున్నావు. ప్రత్యక్ష చిత్ర దర్శన కార్యక్రమమును మరచినట్లున్నావు. అదో ! ఆ యతిలోక సౌందర్య వతిని జూచితివా ? సఖుల మధ్య చిగురాకుల నడుమనున్న చిన్నారి విరి

మొగ్గవలె వన్నె మీరుచున్నది. అల్లదో! వీణామృదంగ నిక్వాణములు వీనులవిందు సేయుచున్నవి. ఆ ప్రక్కఁ గాంచుడు!

అన్నెలత నాట్యవిద్యుల్లతాకృతిఁగొని
ధరణి గానామృత సువృష్టి గురిసి మెఱయు
కర్ణ గగనవీధులరస కంధిముంచు
నేత్రలోకాల వెల్గించి నెమ్మిగాంచు॥

**అపీ :-** (ముందుకుఁ జని కాంచుచు) చెలికాఁడా! నీవనిన దశరాశర సత్యము. రూపమున రతియై గాననాట్య భారతియై బహుళాలంకార శోభిత శ్రీసతియై యీ పార్వతీదేవి ముందు భరతశాస్త్రమే రూపుఁగొని యభినయించు చున్నట్లున్నది.

అలకలే కావవి నలినాక్షి ముఖదివ్య
పద్మమ్ము నమ్మాగు బంభరాలు
కన్నులే కావవి క్రమాస్య సౌందర్య
కాసారమునదేలు కల్వచాలు
నవ్వులే కావవి నవయౌవన వసంత
మోహన తనువల్లిఁ పూచుపూలు
వయసుపొంగులు గావు వదనచంద్రముఁ గాంచి
లావణ్య సాగరోల్బణ విధాలు

భువనమోహన సౌందర్య పూరవారి
విలసనముగాక నర్తకీ విగ్రహంబె
తరుణియే కాలు నిల్వని మరుని తేజి
యింతియే కంతుచేతి పూబంతిగాక॥

(ప్ర) సఖా! యీ జగన్మోహనకర గానము వీనులవిందొసంగు నమృత పానము. మున్నెన్నడు నిట్టి రూపుగానము, రూపయౌవన వారాశి మథన మొనర్చునవసరంబున నవతరించిన రాకాశశాంక బింబమనదగు రూప రేఖావిలాసము, ఆ రూపమునకు మెరుఁగులుదిద్దు గానకళాభ్యాసము,

ఆ గానమ్మునకు వన్నెబెట్టు నాట్యకళావిన్యాసము. ఇటులన్నియు నొక్కచోట సమైక్యమై యుండుట లెన్ని తపమ్ముల పంటయో, యెంతచక్కని దంటయో తెలుపఁజాలను. రూప గాన నాట్యము లిందుఁ త్రివేణీసంగము వలె సమైక్యమైనవి.

రతనము సానదేరి కపురంపు సువాసన గాంచి యింకనుఁ
జతనమొనర్చి కంఠ నును చక్కరమాధురినంది యెంతొ మా
నిత మధనమ్ముగాంచి నవనీత లసన్మృదుతన్గడించి యు
ద్ధితిని బయోర్ణవోదిత సుధాజలపాత విహారతంగొనెఁ॥

విదూ :- ఔను ! నీ వర్ణనమందతిశయోక్తి యావంతయు లేదు. అదో కాంచితివా ?

ఈ గానాంబుదవృష్టిఁ దోఁగి నెమిళుల్ నృత్యంబు గావించెడిఁ
దీఁగల్ మ్రాకులు పూవులాకులవి సందీప్తిఁ శిరాలూఁచెడిఁ
మూగల్వోయెడిఁ గోకిలల్ దశదిశల్ ముగ్ధమ్ములై తోచెడిఁ
యే గంధర్వ లతాంగనామణియొ తానీయింతి మున్బుట్టువుఁ॥

అవీ:- ఊరెడి జవ్వనంపు జిగి నొన్నువసౌధుల పైడితీఁగ యా
నారి శరీరవల్లి లలినవ్వుల రవ్వల పూసరాల శృం
గారపు కమ్మవాసనల కైపుల రేపుచు మచ్చుఁజల్లి తా
నేరని యట్లు నా మనసు నిల్వున దోచు నిదెంత చోద్యమో ?

విదూ :- రాకుమరా ! సమీపమునుండి యా ప్రదర్శనము తిలకించిన నీవింకెంత దివ్యసుందరముగా వర్ణించువాఁడవో చెప్పఁజాలను. సమీపింతమా!

అవీ :- మనము వారిని సమీపించినంత లజ్జాపరవశయై యామె తానెక్కడ నాట్యప్రదర్శనము నాపివేయునోయను శంకగల్గెడిని. నీవొక బ్రాహ్మణుండవుగాన నిన్నుగాంచి యేమియు ననుకొనరు. కాని నాయీ రాజవేషము వారినిఁ దప్పక భయపెట్టఁగలదు.

విదూ :- వయస్యా ! నీవొక బ్రాహ్మణ వేషధారివైనచో నిర్నిరోధముగా వారిని నమీపించి యింక నెక్కువ యా ప్రదర్శనానందముఁ బొందుట కవకాశముగలదు.

అవీ :- నిజము సఖా ! చాల చక్కని యాలోచనము. ఈ రాజు దుస్తులీ సమీపలతాకుంజమున దాఁచి నేనును బ్రాహ్మణ వేషధారినై క్షణములో వత్తును. నీ రుద్రాక్షమాల నొకటి నిటులిమ్ము. ( లోనికిఁ జని బ్రాహ్మణ వేషము దాల్చును ) (ఇరువురును మునిబాలురు బ్రాహ్మణ లుండుచోటఁ జని కూర్చుందురు) (తెరయెత్తగా గౌరీమందిరము) (వైశాలిని నాట్య మొనర్చుచుండును)

అవీ :- (తనలో) ఓహో !

మత్తనయనాబ్జములు రాగమధువులు మియ
పిల్లనవ్వులు మల్లెపూజల్లు గురియ
సిగ్గువలపులు నెదఁగల్వమొగ్గ లీన
నారిసుమ శరమ్ములఁ బూన్చినాట్యమాడు.

(ప్రకాశముగా) నే నిప్పుడు పొందు నానందము మేరలేనిది. నీవద్ద నున్న తాటాకుల పొత్తము నిటు లిమ్ము. ఈ సన్నివేశము మూగనేని వాగను శాసను నొనర్చుచున్నది. ఈ యానందావేశము నాపఁజాలకున్నాను.

(అని పత్రముగొని యేమియో వ్రాయును)

విదూ :- చెలికాఁడా ! ఆ లావణ్యవతి నాట్యమువలె నీ కవితయు మృదుపద గతమనోజ్ఞధ్వనులతో సరసభావములఁ జతుర వృత్తముల నడయాడ వలెను. ఆమె చతుర్విధాభినయములు చతుర్విధకవితలలో, నామె త్రిస్థాయీ స్వరప్రస్తారములు త్రివిధరీతులలో నామెసరసాలంకారముల నలంకార ములలో వ్రాయవలెనని మనవి.

అవీ :- సహజ సౌందర్యవతియగు కావ్యకన్యక తా నలంకారములకే యలం కారము. సరసకావ్యసుందరి తానేజాతికి జెందిననేమి ? కనులకు విందు గొల్పకుండునా ? బహుళార్థ ప్రదాయినిం బాటించి గౌరవించనివారెవరు ? ( నేపథ్యమునశ్యామల ) రాజకుమారీ ! నీవీ గాననాట్యప్రదర్శనముతో నలసినదాని వలెనగపడుచున్నావు. నీ కళావిన్యాసములకుఁ బ్రసన్నయై కాత్యాయిని వరదానమొనర్చు చున్నట్లగపడుచున్నది. ఆ జగన్మాతకు

మ్రొక్కి, యా ప్రక్కనున్న భూసురులకు నమస్కరించి వారి యాశీస్సులఁ బడసిరావలెను.

విదూ :- మిత్రమా ! అదో ! తన సఖివాక్యానుసారము తానా రాకుమారి శివం కరియైన శాంకరికి మ్రొక్కి యీవంకకే వచ్చుచున్నది. నేను నాలయమ్ము కడకేఁగి ప్రసాదముగొనివత్తును.

అవీ :- వయస్యా ! నీకెందును బ్రసాదచింతనమే ?

విదూ :- రాకుమారా ! "బ్రాహ్మణో భోజన ప్రియః" అని కదా ఆర్యోక్తి.

అవీ :- (క్రోధముతో) నన్ను "రాకుమారా" యనుచుంటివేమి? నీ వెప్పుడును నారాకుమారుని సహవసతిలోనుంటచే నా పల్లవియేయిచట పునరావర్తిత మగుచుండెనేమి ?

విదూ :- ప్రమాదపడితిని క్షమింపుము. (రహస్యముగా) ఎవరునువినలేదులే. (శ్యామలతో వైశాలిని ప్రవేశించిగౌరికి నమస్కరించి ప్రసాదముగొని నిర్మాల్యము కనులకద్దికొని తలధరించును)

అవీ :- ఓహో ! ఈమెతనువు సౌందర్య సామ్రాజ్యమునకు రాజధానియై విరాజిల్లు చున్నది గదా !

సౌందర్య వారాశి సంభవించు సుధాంశు
గోము తానదిగాని మోముగాదు
మీనకేతనుధ్వజాగ్రాన నాటాడెడి
మీలవిగాని నేత్రాలుగావు
మోహాబ్దవర్షాన ముంచుతటిల్లత
యౌనుదానదిగాని మేనుగాదు
బంగారు నాకాన బొంగారు నందన
వనమదిగాని యౌవనముగాదు
పసిడిలోమార్దవము వేసి ప్రతిమచేసి
జీవములువోసి శృంగార భావరాశి
అంగములుదాల్చి వచ్చుట లతనురతికి
సవతియగుఁ గాని సామాన్యయువతిగాదు.

విదూ :- మిత్రమా ! కమ్మ నా కొమ్మకేలఁ బ్రసాదించుము.
అవీ :- (కవితాపత్రము నామెకేల నుంచి తాదాత్మ్యమున గాంచుచుండును)
శ్యా :- (తదేకదృష్టితో నవీక్షితునిగాంచు వైశాలినింగని) సఖీ ! అటులు గాంచెదవేమి ? వారికి నమస్కరింపుము.
వైశా :- కవిసార్వభౌములకృతికిఁ బ్రతికృతిగా నమస్సృతులర్పించుచున్నాను.
అవీ :- (చిరునవ్వుతో మౌనముగాఁ జూచుచుండును.)
విదూ :- అటులుచూచెదవేమయ్యా ! ఆశీర్వదింపుము !
అవీ :- నినువలచితినను సరసుని

మనసిజసము వీరమౌళిమాన్యు వివాహ

మ్మొనరిచికొని సుఖజలధుల

మునుకలిడుచు విరహతాపమును బాయగదే. (ఆమె నాశీర్వదించును)

విదూ :- ఎంత చక్కని యాశీర్వాదమొసంగితివి సఖా ! (నేపథ్యములో) (రాజకుమారీ వైశాలినీ ! మునిమాత మిము వైశమెరావలసినదిగా నాజ్ఞాపించుచున్నారు. మీకు దృష్టిదోషనివారణార్థము మంత్రపూతభూతితిలకము నొసంగెదరట.)
వైశా :-- కంటిదారి నాహృదయంపుటింటఁ జొచ్చి

ఆక్రమించితి వీ కోర్కులన్ని నీవె

నాదనెడి స్వాంత సదనమ్మ నీదెయగుట

నేను నీలోన లీనమైనిలువవలసె.

(అవీక్షితుని వంక లజ్జాస్మేరములఁ గాంచుచుండును.) పోయివత్తును, నెలవొసంగుడు (స్వ) ఏలకో ! నాకిచటినుండి చన కాలాడుటలేదు.
అవీ:-(స్వ) మానిని మందహాసముల మంజుల రాగలతా ప్రసూన సం

తానము పూసి వాసనలఁ దన్పి మొగుడ్చును మౌనలజ్జతో

నీ నగుమోము రాగముల కేలయవేయు ననంగ నేత్రముల్

చాన యపాంగ సంగతుల సత్వరతన్ గని వ్రాలు సిగ్గునన్.

ఈ యుభయలోక పరిధుల నిట్టె వీడి

ప్రణయ లోకాల విహరించు మనసదేమొ

నాతి సౌందర్య దివ్యాను భూతి యందుఁ
గాంచు ప్రతియంగమునను స్వర్గాలు వేలు.

శ్యా :- రాజకుమారీ ! మన మిచటినుండి త్వరగాఁ జనవలెను.

వైశా :- (స్వ) ఇంక జనమివిధిలేదు. (ప్రకాశముగా) వచ్చుచునేయున్నాను.
(అని చనలేక చనుచు వెనుజూచి యాగిపోవును)

శ్యా :- మరల యాగి వెనుజూచుచుంటివేల సఖీ !

వైశా :- నీవు వచ్చుచుంటివో లేదోయని వెనుదిరిగి చూచుచుంటినంతియే.

శ్యా :- పోదము పదయని నిన్నుగొనిచను నేను రాకుండ నుందునా ?

వైశా :- అట్లుకాదు సఖీ! ఈ కవితాపత్రము నీ యొద్దనుంచుమని యిచ్చుటకు నాగితిని. (అని యా కవితాపత్రము వెనుదిరిగి శ్యామల కొసంగు మిష నవీక్షితుని జూచును)

అవీ:-(స్వ) ఇచటినుండి నేనయేఁగుచున్నటు తోచు
ఆమెచనుచు నున్నయటులె తోచు
మనసువేరుచోట మనియుండు తరిఁజేయు
కార్యములకుఁ దానుకర్తయెవఁడొ ? (చనువైశాలినింగనుచు)

సరసత రాకుమారి యొకసారి కనంబడితక్షణమ్మెతా
నరుగుట స్వాంతమందు విరహాంధతమస్సులె వ్యాప్తమయ్యె వే
మెఱసియదృశ్యమైచనిన మించుమిటారి దృగంచలమ్ములన్
బరపెడివెల్గుకన్న దమిఁబంచెడి చీకటులే మరింతలౌ.

విదూ :- (అవీక్షితుగని) సఖా ! మనముగూడ నమృతసరస్సున సంధ్యవార్చి వత్తము పద ! (అని యిద్దరును నిష్క్రమింతురు)

సర :- (శ్యామల వైశాలినింగూడి చనుచుండ శ్యామలనాపి) శ్యామలా ! వైశాలినీదేవి పోయి తానుతిరిగి రాగలదు. నీ వటులాగుము. (అని యాపి) సఖీ ! నీకేలనున్నదిదియేమి కమ్మ ?

శ్యా :- (వైశాలినిని లోనకుఁ జనుమని పంపి తానునిల్చి) ఇదియా ? శ్రీయవీక్షిత్ సార్వభౌములు (నవ్వుచు) కాదు కాదు ప్రమాదము ! ఇదివారి

స్నేహితులు, పురోహితులు, కవిసార్వభౌములు వ్రాసీ మన దేవికినాశీః పురస్సరముగాఁ బ్రసాదించిన పద్యపారిజాతముల కమ్మ.

సర :- ఆ కవీంద్రుని పవిత్రనామమిందు పొందు పరచిరా ? తెలియఁ దమకించుచున్నాను.

శ్యా :- ఆ కవీంద్రునినామమిందు వ్రాయఁబడలేదు. అదిగోప్యమేమో ?

సర :- అయిన నాపద్యరత్నము లిటులిమ్మా. చదివియిత్తును. (అంత వైశాలినివచ్చును)

శ్యా :- ఇంతవరకు వైశాలినీ దేవికూడ వినలేదు. మేము వినునట్లుగాఁ జదివి వినిపింపుము. సరళా !

సర :- అయిన వ్రాయుట వారివంతు చదివి వినిపించుట నావంతునా ? వారికి జెందఁజేయు బహుమానములో నాకునుగొంతఁ జెందఁ జేసినచోఁ జదివి వినిపింతును. (అని నవ్వుచుఁ జదువును)

జీవములుపడి కదలాడుశిల్పలోక
సుందరివొ నిజసౌందర్య సుధలబంచి
యనిమిషులఁజేయు భువనమోహినివొలేక
ముద్దగట్టిన సత్కళామూర్తివేమొ ?

శ్యా :- నిజసౌందర్య సుధలఁబంచి యనిమిషులఁ జేయు భువనమోహినివొ ! ఈ భావమద్భుతము ! అపూర్వము ! మోహిని సురల ననిమిషులఁ జేయుటకునై వేరే సుధలను బంచవలసి వచ్చినది. కాని యీమెతాను తన సహజ సౌందర్య సుధలఁ బంచియే, కాంచువారి ననిమిషులఁ జేయుచున్నదట! ఎంత సరసముగా, సముచితముగా నున్నదీ కల్పనము! (వైశాలిని లజ్జనభిన యించును)

శ్యా :- తరువాత చదువుము. విన నువ్విళులూరుచున్నది మనము.

సర :- నందనవన వీధిమందమారుతగతిఁ
గదలియాడెడి చారుకల్పలతవొ
నీలనీరదప్రతినీరను ద్రోసిరాఁ
జని నాట్యమాడు చంచలవొ నీవు

సరసమానస సరోవర వీచికల నూయె
లలనూగు మదమరాళమవా నీవు
చిన్నారి పురివిప్పి వన్నెవిసనకట్టి
వలెనటించెడి శిఖావళము వీవా
హావ భావాలఁగ్రైతలు హస్తపాద
గాత్రవిన్యాసముల శిల్పచిత్రకళలు
కంఠమధుర స్వనమ్ముల గానసుధలు
వలచివచ్చెదేవీ ! నినుబిలిచినట్లె

శ్యా :- ఈ యుత్ప్రేక్ష లత్యంతరమణీయములును, రసవంతములునై యున్నవి. నీలనీరద ప్రతీనీరను ద్రోసిరాఁజను చంచలవై నాట్యము నొనర్చితివట ! సరసమానస సరోవరవీచికల నూయెలలనూఁగు మద మరాళమువటదేవీ ! నీ వెంతరూపవతివో, నట్టువరాలివో, అతఁడంతటి మహాకవి.

వై శా :- నా నాట్యరూపములేమోకాని, వారికవిత యపూర్వరమణీయము.

సర :- ఈ పద్యములపై నీ వ్యాఖ్యానము విననింపైనది శ్యామలా ! ఈ చదువబోవు పద్యమింకను విచిత్రకల్పనలతో నొప్పారినది. ఇది మన దేవి గారిగాన మాధుర్యమును గూర్చిన వర్ణనము. వినుము ! (చదువును)

ద్రమోళ్లుచివుర్చి నీదయిన ముద్దగు పాటకుఁ దంబురాశ్రుతిఁ
నోళ్లనువిప్పి జీవములు నూల్కొనగా శ్రుతివోయుచుండెనో
రాళ్లు కఱంగి నీ సుమధుర ధ్వనికిఁ లయవేయుచుండెనో
వ్రేళ్ల రవమ్మొనర్చుచు స్రవించుమృదంగ చలత్కలాఝురిఁ.

శ్యా :- అద్భుతము. "చక్కని గానము విన్నచో ద్రమోళ్లుచిగుర్చును, రాళ్లు కరఁగును" అని వినినానేకాని, చూడలేదు. ఈ కవిశేఖరుఁడది నిజమే యని నిరూపించినాఁడు. తంబుర ద్రమోడయ్యు శ్రుతులఁ జిగుర్చినదఁట మృదంగముఖమునఁ గల శిలాలేపము కఱఁగి లయవిన్యాస కళాఝురియై ప్రవహించినదఁట. ఇట్టి యఘటనాఘటక సామర్థ్యముగలవాఁడు కావు ననే కవి యీశ్వరుఁడన బరగినాఁడు.

వై శా :- సఖులారా ! యింతటి సుందర కవితలఁగూర్చి మనడెందముల స్పందింపఁ జేసిన యీ మహాకవీంద్రులకు నా నవరత్నాంగుళీయకము సన్మానమొసంగ నిశ్చయించితిని.

సర :- బాగు బాగు! ఈకవీంద్రుగూర్చి నీ నిర్ణయము ప్రశంసనీయము దేవీ!

శ్యా :- మిక్కిలి ప్రశంసనీయము సరళా! కవినింద్రుఁడనుటలోఁగల విశేషము?

సర :- నీకుఁ దెలియనిదేమున్నది ? ఐన నా నోటవినఁగోరుచుంటివి, చెప్పెదవినుము.

> సదమలాక్షర పదముల కధిపుఁడగుట
> మహిత నవరసామృతపాన మత్తుఁడగుట
> విబుధజనసేవ్యుఁడగుట నీ విశ్వమెల్ల
> నతనిఁగని కవీంద్రుండని యాడుచుండు.

శ్యా :- అంతియెకాదు! కవులు-బ్రహ్మలు, శిల్పులు-మయుడు త్వష్టమొదలగువారు, గాయకులే తుంబురునారదాదులు, కళాజగత్తే స్వర్గము !

వై శా :- నీ నిర్వచనమెంతయు బాగున్నది శ్యామలా !

సర :- ఎందులకో సఖీ! ధీరగంభీరమూర్తియగు నాకవీంద్రుని గనిమాటాడుదమననేమో భయమనిపించును. (అంత నవీక్షితుఁడు విదూషకునితోఁ బ్రవేశించును. ముగ్గురు కన్యలు నమస్కరింతురు. అవీక్షిత విదూషకులు వారి నాశీర్వదింతురు)

శ్యా :- (విదూషకునిగని) భూసురోత్తమా ! తమ యాగమనమునకుఁ గారణమేమో తెలిసికొనవచ్చునా !

విదూ :- ఏమియులేదు. పూజ్యపాదుల మహర్షుల దర్శించ వచ్చితిమి. కాని వారాశ్రమమునలేరని తెలిసినది.

శ్యా :- వారు రేపోమాపో రాగలరు. మీరంతవరకిచటనే వసించి వారిని దర్శించ వచ్చునని యభ్యర్థనము.

సర :- వసుధామరా ! మీ యవీక్షిత్కుమారుల పురోహితులగు కవీంద్రులను మా రాకుమారి తానుసన్మానింపఁదలచినది. మామనమ్ముల నలరించు

వారి కవితా నిర్మాణ కౌశలమునకు మెచ్చివారి కరాంగుళులలో నవరత్న స్థగితాం గుళీయకము సమర్పించనెంచినది. వారి పూజ్య నామాక్షరములా యంగుళీయకముపై విలిఖించుటకు నన్నాదేశించినది. దయఁజేసివారి ప్రసిద్ధనామధేయము నెరింగింపఁ బ్రార్థన. (అవీక్షితుఁడు మరియు విదూషకుఁడొకరిమో మొకరు చూచుకొందరు)

శ్యా :- ఏమటులు సందేహించుచుంటిరి? మేమూ నామ శ్రవణమున కనర్హులమా? (అవీక్షితుఁడు విదూషకుని చెవిలోనేదో రహస్యముగాఁ జెప్పును)

విదూ :- శ్యామలా! మీరు బహూకరించఁ బోవు కవీంద్రులు మరెవరోకారు. వారు శ్రీ శ్రీ యవీక్షిన్మహా రాజులుగారే! (అందరు నాశ్చర్యముఁ బ్రకటింతురు)

సర :- మరి యీ విప్రవేషధారణలోని......(అర్థోక్తి)

విదూ :- రహస్యమేమియులేదు. రాజవేషమున బ్రవేశించిన మీగాన నాట్య కార్యక్రమమునకు భంగము గలుగునేమోయని ద్విజవేషమున నిచటి కరుదెంచిరి.

సర :- వారిందువచ్చుటకు ప్రధానకారణము?

విదూ :- ఈ ఋష్యాశ్రమయోగక్షేమములారయుటకు మాత్రమే. ఇట చుట్టుపట్ల చరించు నిశాచరులనుండి వారి యధిపతియగు దృఢకేశినుండి యీ ప్రాంతమును రక్షించుటకు మహర్షులు దారిలో దర్శనమొసంగి యాదేశించిరి.

వైశా :- (లజ్జాపరవశయై పర్ణశాలలోనికేఁగుచు శ్యామలంగని) సఖీ! నే బోవుచున్నాను.

శ్యా :- (పోఁజూచెడి వైశాలినికేలు గొనియాపుచు) అతిథులరుదెంచినపు డాశ్రమవాసుల మగు మనమువారిని విడిచి పోవుట సంప్రదాయముకాదు. (అవీక్షితుని విదూషకుని గాంచి) పూజ్యులు సువ్రతులు లేకున్నను మాన్యులు మహారాజకుమారులు మాభక్తి పూర్వకాతిథ్యమును స్వీకరించి మమ్ము ధన్యులనొనర్పఁగలరని యభ్యర్థించుచున్నాను. ఈ యాసనము నలంకరింపుడు.

వై శా :- (లజ్జతో) సఖీ ! శ్యామలా ! నే నమృత సరస్సునకేఁగి యర్ఘ్యో దకమును గొనివత్తును. (జలకుఁడిక గొనిపోఁ జూచును)

సర :- (శ్యామల చెవిలో గోప్యమును జెప్పుచు) ఈ రాజకుమారుఁడు మన దేవినెంతటి తమకమున జూచుచున్నాఁడో చూచితివా !

శ్యా :- ఉష్ ! (అనినోటిని వ్రేళ్లతోఁ గప్పికొనుచు ముక్కున వ్రేలిడి తర్జించును) (గోప్యముగా) సఖీ ! సరళా ! ఆ చూపుల వేఁటకు నిటనిలువ లేక నీటినెపముతో నీ ముద్దరాలీ ప్రదేశమును వీడిపోఁ జూచుచున్నది. ఉండనూలేదు. పోనూలేదు. అదేమో ? (అని వ్రేళ్ల నడ్డునిడిని శబ్దముగా నవ్వును)

వై శా :- సఖులారా ! నేను పోవుచున్నాను.

శ్యా :- సఖీ ! నీ వేలపోవలయును ? నేనరిగి యర్ఘ్యోదకమును గొనివత్తును.

వై శా :- లేదు నేనే పోయెదను. (అని పోఁబోయి వెనుదిరిగి చూచుచు) సఖీ ! వారిని......(అని యాగును)

శ్యా :- (ప్రశ్నార్థకముగా) వారిని......వారినేమి ?

వై శా :- ఏమియులేదు. వారినిఁ గొనివత్తును.

శ్యా :- ఎవరిని ?

వై శా :- అర్ఘ్యమునకై వారిని గొని వైశమెవత్తును.

శ్యా :- మంచిది. పోయిరమ్మ !

అవీ :-(స్వ) నిగనిగలాడుచు నిండుపారెడి మేన

నమరెడి యప్రస్ఫుటాంగకములు

ఊటలూరు తలంపులోట మిన్వెలిఁ బుచ్చ

జాలకలజ్జించుబేల మనము

తేరిపారంజూడఁ దెలియక దిగులంది

యట్టిట్టువెదకాడు నక్షియుగము

మారుత్తరంబిడు మార్గంబు తెలియక

మొదలిడియాగెడి ముగ్ధవాక్కు

అంతరంగవాసనల రవ్వంతగూడ
మోము విప్పితెల్పగలేని మొగ్గవోలు
మౌగ్ధ్య సంజాతలజ్జాప్త మౌఢ్యమందు
లగ్నయోగంబు లెటుగల్గులలనతోడ.

సర :- ఈతఁడనన్యసౌందర్యముచేఁ బ్రియముచే మన సఖికనువగు వరుఁడౌటకుఁ దగియున్నాఁడే !

శ్యా :- మణితో వలయము వలయముతో మణివలె పరస్పర మలంకార ప్రాయముగా నున్నారే మనసఖి యదృష్టమెట్లున్నదో చూడవలెను.

(నేపథ్యమున నార్తధ్వని వినవచ్చును)

సఖులారా ! ఈ యున్మత్తగజము నన్ను దరుముచున్నది.

చచ్చితి-చచ్చితిని. రక్షింపుడు.

సర-శ్యా :- ఈధ్వని వైశాలినీ దేవిదే. ఇఁకెట్లు? రాజకుమారా ! రక్షింపుడు! రక్షింపుడు ! (అని భయవిహ్వల వదనముల కంపింతురు)

విదూ :- వీరసింహము మా యవీక్షిత్కుమారుఁడుండ నీ గజము మీ సఖి నిపుడేమియుఁ జేయలేదు. ఏ మాత్రము భయమువలదు.

అవీ :- ఈక్షణమే పోవుచున్నాను వెరువకుడు. (అని శరశరాసనములతో విదూషకుని వెంటగొని పరువిడును)

శ్యా :- సఖీ ! సరళా ! మనదేవి సురక్షితముగాఁ దిరిగివచ్చునా ?

సర :- వీరవిక్రమార్కుఁడవీక్షితుఁడుండ మన సఖియరకాలునకును ముల్లు నాటదు, నీవు భయపడకుము.

వైశా :- (పరువెత్తుకొనివచ్చి సరళను గౌగిలించుకొనును) ఈ మహావీరుని వలన బ్రదికిబయటబడితిని. ఈతని కెంతయు ఋణపడియున్నాను. సఖులారా ! (అని తీవ్రముగా శ్వాసముదీయును)

శ్యా (వైశాలిని నాలింగనమొనర్చికొని) (వీపుదట్టినిమురుచు) (నెఱికురు లెగఁదోయుచు, చుబుకము ముట్టి) భయమేఁగినది. మాయదృష్టమున మహారాజ దంపతులయనేక జన్మల పుణ్యాతిశయమున నీ మహాపదను

గడచి గట్టెక్కితివి. (సరళదిక్కై) మనదేవిని మృత్యుముఖమునుండి రక్షించిన యీ రాజకుమారునకెంతేని ధన్యవాదము లర్పించఁ దగియున్నది. (వైశాలిని దిక్కై) సఖీ! వెఱచుకొంటివి. ఈ విభూతినింత ధరించుము. (అని హోమకుండ విభూతిని తిలకముదిద్దును)

వైశా :- (భీతితోఁ బ్రక్కయవనికంజూచుటలోఁ దమకము వ్యక్తపరచును)

శ్యా :- (గోప్యముగా) (సరళతో) సరళా! ఈమె మననేమరచి యీ రాజకుమారునెంత తమకమున జూచుచున్నదో కనుచుంటివా?

సర :- ప్రథమ ప్రణయాలోకనమునసే యీ రాక్షసిగజమెచటి నుండి దాపురించినది. మంచిపనులకే మించిన విఘ్నపరంపరలు.

వైశా :- సఖులారా! మీరునన్నపార్థమొనరించు కొనుచున్నారు. ఆ వీరకుమారుఁడా గజముతోఁ బోరాడు చుండనేమి యాపదవాటిల్లునో యని చూచుచుంటిని.

శ్యా :- ఆ వీరుఁడు దాని కుంభస్థలముపై నిశితబాణ పరంపరల వర్షించి తరుముచున్నాఁ డింకపీడ విరుగడయైనది.

వైశా :- ఆ వీరునామద గజమెంత దూరము కొనిపోయినదో యింక దృష్టికిఁ గనఁబడుటలేదు. మనకు వారి కాతిథ్యమిచ్చు భాగ్యమున్నదోలేదో?

శ్యా :- మనసున్న మహారాజు తానేవేళకైన నీ యాతిథ్యమును ద్రోసి పుచ్చునను మాటకల్ల

కొమ్మ యరవిరినగవులఁ జిమ్ము మధుర
మధుసుధారసమ్ములఁ గొని మనసుతోడ
తరుణ కందమూల ఫలాలఁ దన్వినీవు
జీవనమ్మును గొని చెలీ! సిద్ధపడుము

(అని సరళతోఁ గూడి నవ్వుచుండును)

వైశా :- సఖులారా! మీ నర్మాలాపములు నాకుఁ దెలియవను కొనకుడు. నాకును మిమ్మెత్తి పొడుచుటకొక మంచి సమయము దొరుకకపోదు.

సర :- నీ వప్పటికేయంతఃపుర సౌధాగ్ర సీమల నేయవీక్షిత రాజకుమారుని బాహుపంజర శుకమువై బంధింపబడి ముద్దులు సేయుచుందువో ?

శ్యా :- సఖులారా ! నిశాచరు లీసమీప విపినమ్ములఁ దిరుగుచున్నారని మన యాశ్రమ పరిసరములలో గురువు లష్టదిగ్బంధన మాచరించిరి. నీ వది దాటి యమృత సరస్సీమల కరుగుట నింతయైనది.

వైశా :- రాజకుమారు లిటనున్నారు గదా ! యనుధైర్యముతో నేఁగితిని.

శ్యా :- పర్ణశాలకేఁగుట మంచిది. పోదము పద సఖీ !

(అందరు నేఁగుదురు తెరవ్రాలును)

ద్వి తీ యాం క ము



# మిశ్రవిష్కంభము

ప్రదేశము ఆశ్రమోపాంతము-ప్రవేశము విదూషకుఁడు

విదూ :-(స్వ) ఆ పాడు గజము ముండ్లలో రాళ్లలో బహు దూరముగొని పోయినది. నా గ్రహ చారముచాలి లేక నేనీ రాజకుమారునితో నరుదెంచితిని. రాత్రులంతయు నా రాక్షసుల వెదకుటలోఁ గంటిపై రెప్పవ్రాల్చలేదు. అనవరతము తెరచుచున్నను నాగకుండ మూఁతవడు మరతలుపుల వలెఁగనురెప్పలు వద్దన్నను వ్రాలిపోవుచున్నవి. ఇంతకు నా మాయావి దృఢకేశి మాత్రముచేఁ జిక్కలేదు. తెలవారు జామున నీ సువ్రతాశ్రమమునకు వచ్చి నిదురింతమనుకొన నీ ఋషి కుమారుల వేదపఠనములు, అబ్బబ్బ! తొలకరిలోఁ దలవగులునట్లు దండిగానరచు మండూకశబ్దములవలెఁ జెవుల గూబలఁ బవుల్చుచున్నవి. కోడికూఁతకు ముందే నన్నీ యాశ్రమ రక్షణార్థమిటనుండ నియోగించి యారాక్షసాన్వేషణము లోనటవీ స్థలినెల్ల గాలించుచుండు నా మహారాజు తానెప్పుడు వచ్చునో తెలియుటలేదు. (అని త్రోవవంకగాంచుచు) అదో! ఇంతలో నీవంక వచ్చుచున్నది రాకుమారికి సఖిగానోపును. ఈ మెతోఁ గొంత తడవు వినోదకాలక్షేపమొనర్తుఁ గాక! (అని యామెచిత్తరువు నొకటి వ్రాయుచు గూర్చొనును) (అంత సరళ విదూషకుని సమీపమునఁ బ్రవేశించి విదూషకునిగని)

సర :- రాకుమారుని కూరిమి చెలికానికినమస్సుమనస్సు లర్పించుచున్నాను. (అని నమస్కరించును)

విదూ :- శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు! రమ్మా! సరళా!

సర :- మీ రాకుమారులును మీరును నీ ఋష్యాశ్రమ పరిసరములఁ దిరుగుచున్నంతవరకు మా కల్యాణములకుఁ గొదువలేదని తోచుచున్నది.

విదూ :- కల్యాణ మన జ్ఞాపకమువచ్చినది. ఏమేసరళా! నీ యరచేతినిటు చూపింపుము! నీకు నేను హస్తసాముద్రికమును జెప్పి నీ భవిష్యద్వృత్తాంతమునెఱింగించెదను.

సర :- తమకు సమయానుకూలము సమస్త శాస్త్రములు స్ఫురించునన్న మాట. మీ శాస్త్రపరిచయ మదెంత యథార్థమో చూడవలెను. (అని చేయిచూపును)

విదూ :- (కరమును గ్రహించి రేఖలఁ బరీక్షించుచు హస్తమును నలుపుచు) నీ హస్తము మృదువగుటచే నిన్నేరాజకుమారుని మిత్రుఁడో పాణి గ్రహించి సుఖించును.

సర :- అదా మీ సాముద్రిక శాస్త్రరహస్యము. మీ కన్నులపైఁ గొంచెము పొరలు గ్రమ్మి అంధకార మావరించినట్లున్నదే ?

విదూ :- అట్లనుచుంటివేల ?

సర :- అట్లులేవు. కుడుములునులేవు. మీరు స్పర్శించియేకాని దర్శించి వస్తువును బరిచయమొనర్పఁజాలకున్నారు కనుక. మంచి మాటకుఁ జేయి విడువుడు. ఇకచాలు మీ సాముద్రికము. (అని బలిమికిఁ జేయిలాగు కొని) అది సరేకాని.

విదూ :- సరిలేదు బేసిలేదు. అదేదియో సూటిగాఁ జెప్పరాదా !

సర :- ఇదేమి ! మీరిటు లొంటరిగా వచ్చితిరి ? మొన్న మీ మహారాజులును మీరును నీ ఋష్యాశ్రమ పరిసరముల వీడి యామదగజమును దరుముచు నెంతవరకుఁ బోయితిరి ? మీరు వత్తురని మే మాతిథ్యము నేర్పరచివేచి యుంటిమి. (విదూషకుఁడు మౌనముగా చిత్రమును గీయుచుండును)

సర:-మీరేదోచిత్రమును గీయుచుంటిరి. అదియెవరిదోయొకసారిచూడవచ్చునా?

విదూ :- నిస్సందేహముగా. ఇదో ! (అని గీయుచున్న సరళ చిత్రమును జూపును)

సర :- ఐతే మీరు నా చిత్రమునే గీయుచున్నారన్నమాట. కాని దానికి మీసమును గడ్డమునుంచి పురుషునేల చేయుచుంటిరి ?

విదూ :- నీవు పురుషునివలె నిర్భయముగా నా పజ్జమాటాడుచుంటివి కావున నిజముగా నీవు పురుషుఁడవైనచో నెట్లుండునోచూడనెంచి యిట్లు వ్రాయు చుంటిని.

సర :- నాముందర స్త్రీవలె నంగిమాటాడు చుంటిరి గాన, మీరు మిమ్ము స్త్రీగాఁ జిత్రించుకొని కూడ చూడరాదా !

విదూ :- నన్ను స్త్రీగాఁ జిత్రించుకొని చూపిన నీ వెచట వరింతువో యను భయముతోనట్లు చేయకుంటిని.

సర :- వరింతునను భయమా ? లేక వెలిచుకొందునను శంకయా ?

విదూ :- నీవు వెలిచుకొనుటకు నేను భూతమునను కొంటివా లేక రాక్షసినను కొంటివా ?

సర :- నరభక్షక వ్యాఘ్రములగు రాక్షసులు మీరేల యగుదురు ? మరచితిని. యా మాయలమారి గజము మిమ్మెంత దూరము గొని చనినది ?

విదూ :- ఆ మాయలమారి గజము మమ్మరణ్యములో బహు దూరముగొని చనినది. అచ్చటనది రాక్షసాకారము ధరించి రాకుమారునితో సంగర మొనర్చి మడిసినది.

సర :- బాబో ! వాఁడు మదగజాకారములోనున్న మహారాక్షసుఁడేనా ? మే మనుకొనినంతయైనది. మా రాకుమార్తెకెంత ముప్పువాటిల్లు చుండెడిది ;

విదూ :- ఔను. వాఁడొక మా యావియైన నిశాచరుఁడే. మా రాజకుమారుఁడు వానితోఁ బోరొనర్చుచుండ నా యసురునకు సాయము సేయుటకై వచ్చిన నూర్గు రాక్షసాధములు మడిసిరి. బాణమున కొకఁడు ప్రాణమును వీడి పరలోక ప్రయాణముఁ జేసెను. ఆజిలోనేనతనికపుడు తోడునీడనై వర్తించితినను కొనుము.

సర :- మీరు నా శూరసింహమునకుఁ దోడునీడలై యా రక్కసుల నుక్కడంచితిరేమి ?

విదూ :- నిజముగా వారినందరిని వధించుటలోఁ దోడునీడనై చరించితిని. నీకు పరిహాసముగాఁ దోచుచుండెనేమి ?

సర :- ఆ వీరుఁడేయా దైత్యుల హతమార్చెనుగాని, యతనినీడ వధించుట నభినయించునది మాత్రమేకదా ! మీరట్టి ఛాయాశూరులన్నమాట.

విదూ :- నీవు చాలాగడుసుదానివలెఁ గనిపించుచున్నావు. నన్ను ఛాయా గ్రహమను కొంటివేమి ? లేక నీడవలె నభినయించు కోతల రాయనిగా భావించితివా? ఛాయాగ్రహములు మాత్రము శశిసూర్యులఁ గబళించుటలేదా!

సర :- లేకేమి! మీరే మిమ్మా రాకుమారునికిఁ దోడునీడనంటిరికదా! మరి యిప్పుడా రాకుమారు లరుదెంచకున్నను వారి నీడ మాత్ర మరుదెంచినదే. ఇదికడు విచిత్ర సంఘటనమే.

విదూ :- నీవెంతటి జాణవే! నేను నేనే యతఁడతఁడేయని నిరూపించుచున్నావు. నేను మాత్రము శూరుఁడను గానను కొంటివా ?

సర :- నేనట్లనలేదు. మీరే వారివెంట నిరర్థకమగు నీడవలె నున్నానని యంటిరి. అది సరేకాని యావధింపఁబడిన రాక్షసుఁడు దృఢకేశియేనా ?

విదూ :- వాఁడెవఁడో దృఢకేశి యనుయాయిగానోపును. ఆ దృఢకేశియు నతని పరివారమును తామీ రాకుమార్తె నపహరింప రాత్రింబవళ్లు పొంచి తిరుగుచున్నారు.

సర :- మొన్ననొకమారిట్లే మాదేవిని హరింపయత్నించి యాదనుజాధములు విఫల ప్రయత్నులై వెడలిపోయినారు.

విదూ :- అదెట్లు ? ఏ వీరుఁడు వారిని దరిమివైచెను ?

సర :- ఎవరోకాదు. మా సువ్రతుల వారీ యాశ్రమము చుట్టునొనర్చిన యష్టదిగ్బంధన మహిమ. మొన్నమా సఖి యర్ఘ్యోదకముందేర యా మేర మీరుట నంతచేటు మూడినది.

విదూ :- అదేమోకాని మా రాకుమారుఁడ రుదెంచిన నాటినుండి యాదృఢకేశి యనుయాయులేకాని వాఁడు మాత్రమీ ప్రాంతమున గనబడుట లేనేలేదు

సర :- ఈ విశ్వవీరుని పేరాదనుజాధమునకు గుండె హడలై కూర్చునిన దనవలెను.

విదూ :- అది సరేకాని నేనిప్పుడు నీపైనొక పద్యము వ్రాసి నీ సౌందర్యమును వర్ణించితిని. (ఒక కమ్మనేదో వ్రాసి యొసఁగును) ముందు మా మిత్రుని కవితయేవిని నీవు ముగ్ధవైతివి. ఇపుడు,

సర :-ఇపుడు ప్రౌఢననియా మీయభిప్రాయము? జ్యోతిషము, చిత్రకళచాలై యిక కవిత్వము మొదలైనది. వెట్టివేయి విధాలన్నట్లు ఏమిటీ వెట్టిగోళలు ?
(అని బొమముడివెట్టి ముక్కువిరుచుచు పద్యమును జదువు చుండును)

కుసుమములఁగొని నీ విట్లు కుసుమశరుని
నారిపై చూపు తూపులఁ బోరుచుంటి
పాయిఁడను నన్నునొంచుట పాడియగునె
వాంఛితార్థమ్ము లిడుము సుఖించఁ గలవు.

(అని రెండవ మారును చదువును) (నాల్కతేలవైచును)

విదూ :- ఏమే సరళా ! అటులు బొమముడివెట్టి పెదవి విరిచి నాల్కఁదేల వేయుచుంటివి ? నా కవితలోఁ దప్పులు వెదుకు చుంటివేమి ?

సర :- ఈ మహాకవితలోఁ దప్పులెన్న నెవరికిఁ జేతనగును. బాబో !

విదూ :- మరేమి చేయుచున్నావు ?

సర :- అబ్బే ! ఒప్పులే వెదకు చున్నానండి. (అని నవ్వును)

విదూ :- భేష్ ! నన్ను దిట్టినను వ్యంగ్య వైభవమొల్కవోయుచుఁ దిట్టితివి. బలే బలే ! నిన్నభినందించ వలసినదే. (సరళ విదూషకుని పద్యపు కమ్మనుగొని దానివెనుకవైపున నేదియో వ్రాసియిచ్చును) (విదూషకుఁడు కమ్మనుగొని దాని వెనుకవైపు వ్రాసిన పద్యమునుగాంచి) ఓహో ! పద్యమునకు ప్రత్యుత్తరముగా నొకపద్యమునే వ్రాసితివే! (చదువును)

కుసుమశరునారి యస్త్రముల్ గుప్పినంత
ఓడిపోనువాఁడు తానొకబాడబుండె
మనుపు నిర్జించునంబక స్ఫురణగల్గు
హాయిఁడెకదె నిక్కమైన భూసురుఁడనంగ.

సరళా ! ఈ నీ పద్యము చదివి నా వాంఛ ఫలించలేదని తెలిసికొంటిని.

సరళా ! నీయెడ నీ పాత్రలోఁగల ద్రాక్షనారంగాది ఫలములఁ బదిలముగా నెవరికై దాఁచి కొని పోవుచుంటివి ?

సర :- ఇవి దేవీ ప్రసాదము. ఇవి ఋషి కుమారున కొసంగుమని యిచ్చెను.

విదూ :- జపతపములనుపవసించు ఋషి కుమారునకీ ఫలములేల ? నాకు ఆకలియగు చున్నది. (అని బుట్టలోని ద్రాక్షపండ్లఁగొని తినుచు) నల్ల ద్రాక్షలైననివి పుల్లగాలేవే (అని విత్తులుమియును)

సర :- ఈ పవిత్ర ఋషి వాటికనిట్లేలయుమియు చుంటిరి? మిమ్ముఁ జూచి యందరిట్లే యుమియుదురు.

విదూ :- ఓహో! నీ మాటలంతకంతకు శుశ్రూమించి రాగమున బకుచున్న వే! బాగున్నది వరుస. నిన్నే మోయను కొంటిని. నీవింత సరసముగాఁ జతురముగా మాటాడుదువను కొనలేదు. కాని నీవు నమస్సుమనస్సు లర్పింతునని నమస్సుల మాత్రమొసంగితివి. సుమనస్సు నీయవేమి? (అని బుట్టలోని పూలపై చేయివేసి తీసికొను చుండును)

సర :- అయ్యయ్యో! ఈ పూలలో సూక్ష్మ కీటరాజి గానవచ్చెడిని. అటు లాగుఁడు. (అని యతని చేతిలోఁ దీసికొనిన పూలనూదును) (విదూషకుని కన్నులలో సుమపరాగము పడును)

విదూ :- (బాధ నొందుచు) అబ్బా! యెంతగడుసుదానవే. చూచుటకును నోచకుండఁ జేసితివి. నీవు నేజూచుచుండగనే నా కన్నులలో దుమ్ము గొట్టిపోఁ జూచుచుంటివి. ఈ పుప్పొడి నీవూదుటచేఁ గన్నులఁబడి నన్ను గ్రుడ్డివాని జేసినది. దారియేది?

సర :- మీరీ పుప్పొడి కనులఁ బడకముందే యంధులై సరియైన దారి మరచితిరి. ఇపుడట్లే యున్నారిందునే జేసినదేమున్నది?

విదూ :- ఈ యంధునిపై ననుకంప ప్రసరింపఁ బాణి గ్రహించి యిలు సేర్చి పుణ్యము గట్టుకొనుము. నా కవిత నీకు రుచించలేదేమి?

సర :- గ్రుడ్డివాని బాణిగ్రహించునంతటి గ్రుడ్డిదానినిగాను నేను. అది నా వలన గాదు. మిము గ్రుడ్డిఁ జేసిన కుసుమ శరములఁ గసరుకొను చుండుడు. ఇక మీ కవిత నచ్చుట లందురా! నా కవిత మాత్రము మీకు నచ్చినదా?

తలలూపించెడి సత్కవి
తలనిడు పుష్పము సరస తలఁ జవిగొనిము
న్గల వారల కూపుటకై
తలయుండగ వలదె పుట్టుఁ దలయొకతలయే?

మరచితిని. మీకిచ్చిన మాసఖి స్వయంవరాహ్వాన పత్రికను దోడ్తో నామెచిత్రమును మీ మిత్రుని కందc జేసితిరా ?

విదూ :- ఎప్పుడో పంపించితిని ? దృఢకేశి బంధనాధీనుcడు గామి, మా రాజకుమారుcడు మీ వద్దస్వయం వరమునసుండc జాలcడని తెలియవలెను.

సర :- ఛీ ఛీ ! యమంగళము ప్రతిహతమగుగాక ! (స్వగతము) క్రిందటి సారి యా్రశమమునకు వచ్చినపుడీ విదూషకుcడు నాసఖి, వ్రాసిన నా చిత్రపటమును దొంగలించుకొని పోయినాcడు. దానికి బదులిపుడీతని యీ పద్యపు కమ్మను నేcగొని చనుదును. దానికిది చక్కని ప్రతిఫలము. (అని యచట నున్నలేఖను దనపూల బుట్టలోనిడుకొని చనుచుండును)

విదూ :- సరళా ! నీవునే వ్రాసిన పద్యపుకమ్మగొని చనుచుంటివా ? బ్రాహ్మణ ద్రవ్యాపహృతి పాపముగదా !

సర :- నీవు ననుగురించి వ్రాసిన పద్దెముగల కమ్మకావున నిదినాదేకాని నీ దెట్లగును ?

విదూ :-నీదేకాని నీవాకమ్మనింకెవరికిని జూపింపకుము. నీకు పుణ్యముండును. చూపితివా నాపై యొట్టు. పార్వతీదేవిపై యొట్టు.

సర :- ఇంకనెవరికి నీ సరసకావ్యము చూపనని వాగ్దానముచేయుచున్నాను. నిశ్చింతగానుండుము.

విదూ :- అయ్యో ! ఇవి రెండొక చోట నుండుటచేత సరళ తొందరలో మిత్రుcడు వ్రాసిన పద్యలేఖను తీసికొనిపోయి నేరచించిన కమ్మనుంచి చనినది. ఇపుడేమి చేయవలెను ? దానినే జదువ గూడ చదువలేదు. ఇపుడే సూతుcడా లేఖనిచ్చి చనెను. చదువు దామనుకొను సరికి నింతలో నీ సరళ ప్రత్యక్షమైనది. ఇక నిదేపురాణములోc బడి దాని మరచితిని. అందు రాకుమారుcడే రహస్య విషయమును వ్రాసి పంపెనో ! ఇపుడేమి చేయుట? "విప్రాః పశ్చిమ బుద్ధయః" అని అందుకే యనినారు (అని గ్రుడ్డిగా మార్గము తడవుకొనుచు బోవుచుండును)

మి శ్ర వి ష్క ం భ ము

శ్రీవాగీశ్వర్యైనమః

# తృతీయాంకము

[ప్రదేశము ఆశ్రమోపవని—ప్రవేశము అవీక్షిత విదూషకులు]

విదూ :- వయస్యా ! మనరాకయొక ప్రహసనముగా మారినది. ఆ దృఢకేశిని జంపి ప్రజాహితము నొనర్చి కాని గురువుగారికి దక్షిణ సమర్పించనంటిరి. వాఁడీ వనములలో బహు దినములుండి వెదకినను గానబడఁడయ్యెను. మీ ప్రయత్నము లెప్పుడిట్లు విఫలముగాలేదు.

అవీ :- సఖా ! కొందరి వాని యంతరంగులైన రాక్షసులఁ జంపితిమి. మును ముందు వాఁడును మన బారినుండి తప్పుకొనలేఁడు. వైశాలినికై వాఁడీ పరిసరము లందే గూఢచారియైయున్నాఁడని పించును.

విదూ :- వాఁడు మీ వలన భయభీతుఁడై వాని యనుయాయులను మాత్రమే పంపుచున్నాఁడు. తానెచటనో వేరేప్రదేశముల దాఁగియున్నట్లు తోచును. కావున మన మీ ప్రదేశమును వీడి, దూరదేశముల వెదకిన బాగుండునని పించును.

అవీ :- వయస్యా ! నాకీ కన్నియ యందలి గాఢాను రాగ మీ ప్రదేశముల వీడివెడలకుండ బంధితుని జేసినది.

కన్నియ రూపయౌవన వికాసవిలాసమునే మనందు నే
మున్నిటువంటి స్వర్ణమయమోహనరూపము నెందుఁగాంచ
మేల్వన్నెల, రూపమార్దవసువాసనలన్ సురపారిజాతమై
కన్నులదోఁచి స్వాంతమును గట్టుచుఁ జేతము నాక్రమించెడిన్
నెఱియా ముద్దియ ముద్దుమోముగనఁగానే కోరు, నా పిమ్మటన్
దరియం, దర్కము సేయ, స్పర్శసుఖ సందర్భంబు గల్పింపఁగాఁ
ద్వరవెట్టున్, వెరవెద్దివానికని సంతాపమ్మునుం జెందు ని
త్తరి నాచిత్తముదారిఁ దప్పిచను పాంథప్రక్రియన్ వందురున్
మిత్రమా ! ఈ రాజకుమారి సౌందర్యమువర్ణనాతీతము.

విదూ ;- నీ దృష్టిదోషము తాకి యామె యెచ్చట కసుగందునోయని పించును. ఊరక బాగున్నదని మెచ్చుకొనకుము. మిత్రమా !

అవీ :- అటులైనచో నేమనవలె ?

విదూ :- తద్వ్యతిరేకముగాఁ బల్కుచుండవలెను నేను చిన్నగా బియ్యపు సంచిగానున్నాను చిన్ననాడు మాయమ్మ నన్నుఁగని మాపిల్లవాఁడు బక్కచిక్కి సగమైనాఁ డమ్మా ! ఎవరిదృష్టి సోకినదో అని పలుకు చుండెడిది. (అంత వైశాలిని పర్ణకుటి ద్వారపు మాటునఁ ప్రవేశించి) (స్వ) ఇచట రాకుమారుఁడు నతని స్నేహితుఁడు మాటాడుకొనుచున్నట్లు తోచును. (అని చెవినిడి యేర్పడనియట్లు వినును)

అటులనా ! వయస్యా ! ఐన నీ వైశాలిని నాకేమియు నచ్చుటలేదు. ఈమె రూపమును గాంచ నసహ్యత గల్గుచున్నది.

విదూ :- ఔను ! నాకు నట్లేయనిపించును. ఏ మాత్రము బాగులేదు. (అని నవ్వుచుండును) (వైశాలిని ప్రక్కయవనిక నుండి వినును)

వైశా :- నేనిపుడేమి వినుచున్నాను. ఇవి మాటలుగావు. నాగుండియలపైఁ బొడుచుపోటులు. ఈ యవమానము భరింపరానిది. నను మెచ్చని రాజ కుమారునిపై నా మనసు మరులు గొనుట దురదృష్టముగాదా !

(నేపథ్యములో)

దేవీ ! నినునవవధువునొనర్ప వలసియున్నది. రావలెను త్వరగా !

వైశా :-(వినుచు) అదో ! శ్యామల పిలుపు వినబడుచున్నది. ఇంకనే నీమాటలు వినుచునిట నుండజాలను. (అని దుఃఖ విచారములతో నేఁగును)

విదూ :- మిత్రమా ! నీవు నీప్రతిజ్ఞను మరచి యీ శృంగార గంగాతరంగాల డోలికల నీదాడుచున్న గురువర్యులేమను కొందురు ? కావున నీవీ విషయ ములో నిస్పృహఁ జెంది విరక్తి గొనుటే బుద్ధిమాట. దీనిని నీ విజయా నంతరము విచారించ వచ్చును.

అవీ :- సకల మహీమండలమును గెల్చుట సుకరమయ్యెను. కాని యీ చిత్తమును గెల్చుట దుస్తరముగా నున్నదిదేమి ?

కాంత పొందదు సులభతఁ గ్రాల మిఁకిని
మనసు విరిచివేసి కొనుచు మనిన గాని
మొండి జీవముల్ గలిగిన మ్రోడువోలె
నెప్పటికి నపుడేయిగురిడగఁ దొడఁగు

విదూ :- రాజకుమారా ! నీవీ యశాంతి నుండి విముక్తుఁడవగుటెట్లు ! ఓరీ! అదృశ్య కదనా ! మదనా ! యతనుఁడ వగుట బ్రతికి పోయితివి. లేకున్న మా మిత్రుని క్రోధాగ్ని జ్వాలలు మరొకమారు నిన్ను బూది చేయఁ గల్గెడివి.

అవి :- విదూషకా ! అతను నేల నిందించెదవు ! యతని వలన మేలే చేకూరినది.

ఈ మరుఁడు విరహాగ్ని నన్నింత గాను
కాకలిడుట రాగమ్ము విపాక మొదె
స్వర్ణకారుఁడుజ్వల శుచి జ్వాలలందు
పుటములిడఁ జొక్కమై పను పుత్తడివలె.

విదూ :- మిత్రమా ! నీవిటు కాము బారికి గురియై కర్తవ్యమును విస్మరించు చుంటివి. స్వయంవరము సమీపించుచున్నది. దృఢకేశి వధకు తీవ్రయత్న మొనర్పవలె. ఆ చార్యునకు దక్షిణ నిచ్చికొని ప్రజాతంతువు నుద్ధరించ రాదను వేదవాక్యముపేక్షణీయము కాదు. ఆర్యావర్త సార్వభౌములు వైదిక ధర్మ రక్షణకై వజ్రకవచమువంటివారు.

అవి :- ఇపుడేమి చేయుమనెదవు ?

విదూ :- నీవంటి ధీరుఁడు స్వార్థ సుఖములకై గుర్వాజ్ఞను దిరస్కరించఁ గోరఁడు స్వసుఖ లాలసత చరిత్రను నిర్మింపఁ జాలదు. త్యాగమే చరిత్ర మహాసౌధముపై ధ్వజము నెగురవేయఁ గలుగుట నీవెరుఁగ వనికాదు.

అవి :- వయస్యా ! నీ మాటలు పూర్ణ సత్యములు. నీవు నాకన్నులు తెరపించి గమ్యము చూపితివి.

పుట్టినప్పుడె నరుఁడు తాఁ బుట్టలేదు
కీర్తి పొడసూపునాడె యా మూర్తి పుట్టె
చచ్చినప్పుడు వ్యక్తి తాఁ జావలేదు
ఆత్మకవమానము ఘటించి నపుడె చచ్చెం.

విదూ :- మీకు తెలియనిదేది ? మీకు నేఁజెప్పు వాడనా ? కాని ప్రియమున కన్న హితమును గోరువాఁడే స్నేహితుఁడు. కావున నా ధర్మము నే నిర్వర్తించితిని.

అపీ :- వయస్యా ! కామినీ విరహాంధుడనై గన్తవ్య పథము మఱచిన నాకు దయతో దారిఁ జూపితివి. నిజమైన స్నేహితుఁడవు నీవేయనవలెను.

విదూ :- మిత్రమా ! ఇంకనైన మన గొప్పఁదనము తెలిసినదా ? నిజమునకు నేను మీ వద్దనే మహా మంత్రిగానో నుండవలసిన వాఁడను. అది మీ సార్వభౌమాధి కారమున రావలెను.

అపీ :- మహామంత్రి మాణిక్యా ! ఆలసింపక నేనీ కానలనెల్ల కడలు గాలించి దానవు హతమార్పఁ దరలు చుంటిని. నీవు నొకవై పునకేఁగి శత్రుస్థావర రహస్య సమాచారమును సేకరించి నా కార్యము సఫలముగాఁగ సహాయ మొనర్పుము.

విదూ :- (భుజములఱవొప్పింగఁ జేయుచు సంతోషముతో) సార్వభౌమా ! మీ మహామంత్రి మాణిక్యుఁడు మీ యాజ్ఞాను సారమటులే యొనర్చును.

అపీ :- నే నాశ్రమోద్యానమునకేఁగి యలరులఁ గొనివచ్చి యంబిక నర్చించి యరుగు వాడను.

విదూ :- ఇదివరలోనే నేను పూలుగోసి నీ పూజకై మనకుటీరమున భద్ర పరచి యుంచితిని, కొనివత్తు నుండుము. (అని చనును)

అపీ :- (స్వ) తనువు తన విధి నిర్వర్తింప దృఢ దీక్షఁ బూనినను మనము మాత్రము చివర కొొకసారి మానినిం గనుల చలువగా దర్శించఁ దలఁచి తహతహలాడు చున్నది, వైశాలినీ విగ్రహ దర్శన మగుటెట్లు ? హత విధీ ! ఏమిసేతు? వైశాలినీ ! నా బహిః ప్రాణమా! నేనినుఁ గాంచకుండ

నుండలేను. ఒకసారి నీదివ్య సుందర రూపముతో సాక్షాత్కరించి నేత్ర పర్వమొనర్పుము; అదో! నీచిరునవ్వుల మెఱపులు నను మోహాంధుని జేసినవి. నీయపురూపమగు రూపము నా హృదయ సింహాసనము నధివసించి దొరతనము నెరపుచున్నది. నిరంతర భవదీయ సౌందర్య దర్శనాభిలాషినగు నాకు దూరమున నుండకుము రమ్మా! రావా?

విదూ :- (ప్రవేశించి) వచ్చుచునే యున్నాను. చూచుచు లేవా?

అవీ :- నీవా!

విదూ :- రావా! యని, నీవాయనుచుంటివేమి? (అది సరేకాని నోటిమాటలేదు. కండ్ల చూపులు చిక్కుట కూడా చాల కష్టమేయని పించును. వృధావేదన పడనేల?

అవీ :- ఇదేమి మిత్రమా! ఎవరికి? సార్వభౌమ దంపతులకా? వైశాలినికా?

విదూ :- వైశాలినీ రాజకుమారిని గురించియే మాటాడు చుంటిని.

అవీ :- (ఆత్రముతో) ఏమైనది. ఆవిప త్తెట్టిదె నను వారింతు వివరింపుము.

విదూ :- అటులాందోళన జెందనేల? నేననునది నీవర్థము చేసికొనలేదు. నీముందు వైశాలిని వచ్చినపుడు నోరువిప్పి నీతో మాటాడదయ్యెను. మరియు లజ్జాభరమున సరిగా కండ్లెత్తి నిను ప్రేమతోఁ జూచుటయును గష్టమై పోయెనుగదా యని వాపోవుచుంటినంతే.

అవీ :- (నవ్వుచు) అటులనా! నీవు మాటలలోఁ జాల గడుసువాఁడవు. నీమాటలు నీవు విప్పి చెప్పిననే యర్థము కావలెను.

విదూ :- ఇదో! దేవీ పూజకై పూలఁగొని వచ్చితిని. కైకొమ్మా! శీఘ్రముగా నీకు నీశత్రువుపై విజయము ప్రాప్తించునట్లు వరమును వేడుకొనుము. నీవు వచ్చువఱకు నేను మన ప్రయాణ సన్నాహ మంతయుఁ జేసి యుంతును. మఱచితిని. ఇంకొక శుభవార్త. ఇప్పుడే వైశాలినీ దేవియు సఖులఁ గూడి వచ్చుచున్నట్లు వినఁబడినది. ఇప్పుడామెను లాంఛనముగాఁ బెండ్లి కూతురు నొనర్చి గౌరీ పూజార్థము గొనివత్తురఁట. ఆమెచే నాటి పెంచఁబడిన కోమల మల్లి కాలతను, క్రొంబోక బోదియతో సంధానింపఁ

జేయుదురఁట. ఇకనే బోయివత్తును. సెలవిఁడు. (విదూషకుఁడు చనుచుండును)

అవీ :- మంచిది. నేదేవినర్చించి వత్తును. (విదూషకుఁడు చనును)

(స్వ) దేవియను గ్రహము పూజకు పూర్వమే ఫలించినది. రాకుమారి వచ్చుచున్నదనెడి యానందకర వార్త వినవచ్చినది. నాపుణ్యమేమనవలె? ఆమెను సధూరూపమున దర్శించు భాగ్యము గల్గును గదా! (దేవియాలయమునకేఁగి పూలిడి నమస్కరించి) అంబా !

మారుఁడు బూదియైనను గుమారుని భావనఁ జేసి ప్రాణముం
గూరిచి యారతిం గలిపి కూరిమి మీరుగఁ బ్రోచినావు నా
తోంపు కాంక్ష దీరఁ జెలితోనను గూర్చవదేల ? యంబ ! యే
సారసనేత్ర పుత్రుని విచారముఁ దీర్చదు తల్లియై తమిన్.

(అనియేమో వినుట నభినయించి) ఎచటి దీనూపురధ్వానము ? ఇటు వైపు పూలు గోయుచు వచ్చు నామె యా దేవికి సఖిగా నోపును.

(సరళ ప్రక్క యవనికన్ జూచుచుండును)

ఈమె తాను పూలు గోయుటమాని యింకెవరి కొఱకో నిరీక్షించుచున్నట్లుగానఁ బడును. ముందు వైశాలిని యరుదెంచునేమో ? నేనిపుడీ దేవ్యాలయమునకుఁ బ్రక్కనేయున్న వాహనశాల బహిర్మండప ప్రాంతరాళములో నుండి నాప్రేయసిని గన్నుల కరవు దీరగాంచెదను. కలహంస కలహములఁ దలపించునామె లలిత భాషణముల నాకర్ణభూషణములఁ గావిఁతును. ఏతదాలయ ప్రాంగణో ద్యానపుష్ప పచయ మొనర్చు వీరికి నే మిక్కిలి దగ్గఱగా నుందును. వీరి భాషణములను స్పష్టగతి వినవచ్చుచుండును.

సర :- "దేవిని నవవధువు నొనర్చి యాలయమునకుఁ గొనివత్తును. నీవు పూజార్థము పూలు గోయు చుండు" మని ననుబంపెను. వారింకను రాలేదేలకో ?

(అంత శ్యామల వెనుక నుండి ప్రవేశించి సరళ కన్నులు మూయును)

సర :- దేవీ ! వైశాలినీ ! నీవేకాని; నాకుఁ దెలియదనుకొంటివా ? కనులకు బాధగల్గుచున్నదమ్మా ? దయచేసి విడువుము. (అని చేతులు విడిచి వెనుక నిశ్శబ్దముగా నవ్వుచున్న శ్యామలంగని)

అవీ :- వీరి పరిహాస మెంతయు రమణీయమేకాని వైశాలిని యేది ?

సర :- (ఆశ్చర్యముతో) నీవా ! సఖీ ! మరి వైశాలని యేది ?

శ్యామ :- ఆమె తన దేహ స్వాస్థ్యము గోలుపోయినదఁట, రాలేనన్నది.

సర :- నిజమా ! పరియాచకము విడువుము.

శ్యామ :- నిజమమ్మా ! నీతోడనబద్ధములాడునంతటి యాపద యేమి యొదవఁగినది ?

అవీ :- అయ్యో ! విపరీతముగా మారినదిదెట్లు ?

సర :- అటులైన నింటికిఁ బోదము పద ! దేవీపూజార్థమీ పూలఁ గోసితిని. (అని చనఁజూచును)

శ్యామ :- (నవ్వుచు) నీవు పిచ్చిదానవు. నేను దేవిరాదని నంతసేయల్లే యని పొరపడి నమ్మితివి సరళా ! నీకు సరళయని పేరిడిన నీ పితరుల చతురత నెంతయు స్తుతింపనలెను. (అని ముందు చూచి) అదో! ఆ బొండు మల్లె పొద మాటు నుండి పూ లే రు కొ ను చు వచ్చుచున్నది. చూచితివా ? ఆమెకు పీతాంబరము ధరింపఁ జేసి పదములకుఁ బారాణి దిద్ది, కస్తూరీ తిలకము బుగ్గలకునద్ది నవవధూ సమలంకృతి నొనర్చి తీసి కొని వచ్చితిని.

అవీ :- నా పోయిన ప్రాణములిప్పుడు మరల వచ్చినవి. ఈ శ్యామల యెంతయు జాణ గదా ! (అని వచ్చుచున్న దేవింగని) ధన్యోస్మి !

ఇంతపఁటకాశమ కుటీర మెడలి వచ్చు
నిందుముఖిఁ గాంచి నాకను లిప్పుడలరు
క్రమ్ముకొను సంజ మబ్బులఁ గడచి వచ్చు
పూర్ణ శశిఁ గాంచి కలువలు పూయునట్లు.

ఈ నవవధూరూపములోఁ బదునిడిన మదనుని కటారియై యీ మిటారి వచ్చుచున్నది.

సర :- శ్యామలా ! నేనా చంపక వృక్షశాఖల నెక్కి కొమ్మల నూపెదను. పూలు రాలిపడును. నీవు వానినేరుచుండుము. ఇవి మన రాజకుమారి

కెంతయుఁ బ్రియములు. (అని ప్రక్క యవనికం జూపుచు) ఈ దండతో నీపెండ్లి కుమార్తె నలంకరింతము.

వైశా - పొందు! ఆ సంపెఁగ శాఖాహస్తాగ్రముల మిమ్ముఁ బిల్చు చున్నట్లు గానవచ్చెడిని. (అని లజ్జనటించును)

సర :- సఖీ! వైశాలినీ! దేవికొఱకు నీవు నా బుట్టలోని పాటల ప్రసూనముల హారముగాఁ గూర్చు చుండుము. నీకునింపగు సంపెఁగలఁ గైకొని వైళమెవత్తుము. తదుపరి దేవి యాలయమునకేఁగదగును.

వైశా :- మంచిది పోయిరండు! మీరనినట్లు నేహారము గూర్చెదను. (శ్యామలయు, సరళయుఁ జనుదురు) (వైశాలిని బుట్టలోని పూలు పళ్ళెములోఁ గ్రుమ్మరించి హారముఁ గ్రుచ్చుచు నందుఁగనబడిన లేఖను గాంచి యాశ్చర్యముతోఁ దీసికొని)

వైశా :- (స్వ) ఇది రాజకుమారులు తమవేడుక చెలికానికి వ్రాసిన కమ్మ వలెనున్నది. (అని చదువు చుండును)

గాత్రము పుల్కలెత్తనిటుగాంచదురెప్పలనప్పళించియో
మిత్రమ! యీ విశాలసుత మిన్నక యుండునదెన్ని పల్కినన్
జిత్రముగాఁ గనంబడునుజేతమెయున్నటుదోచదీమెయే
మాత్రమునచ్చలేదచటి మానినియేకడు నచ్చెనాకికన్.

(సాశ్రు పక్ష్మములతో) నేనిపుడేమి చదువుచున్నాను? అంతనయోమయముగానున్నది. ఇది సరళయొద్దకెట్లు వచ్చినది. ఇంకనీ బ్రదుకుండి యేమిప్రయోజనము. ఇంతకుమున్నె రాకుమారుఁడు తనకూరిమి చెలికానితో వైశాలినిరూపమేమాత్రము బాగులేదని చెప్పుచుండ విని నేబడిన బాధచెప్ప రానిది. అతఁడు నన్నునిరసించుచున్నట్లే యుత్తరమిది రెండవ నిదర్శనము. నేనెంత దురదృష్టవంతురాలిని. (అని కన్నీరు గార్చుచు మూర్ఛిల్లును) (కొంతవడి మూర్ఛదెలిసి) నాసఖులముందిదినాకుఁ దెలియనట్లే నటించెదఁ గాక! కాని నావేదననదుమఁ జాలకున్నాను. అయినను నాకు నేనే ధైర్యము చెప్పుకొనక తప్పదు. ఆ రాకుమారునికి నేనేమాత్రమునచ్చలేదట. అతనికి

నచ్చని యీ రూపముండి యేమిమండియేమి? ఆమెయేనచ్చెనట. ఆయ దృష్టవతి యాపుణ్యాత్మురాలెవరై యుండును? ఎవరైన నేమి ప్రయోజనము?
(అని కొంగుతో కన్నీరు దుడుచుకొనుచుండును)

అవి :- ఈమె యీ కమ్మ చదివియేల దుఃఖించుచున్నది?

(శ్యామలయు సరళయుఁ బూలుగోసికొని ప్రవేశింతురు)

సర :- సఖీ! వైశాలినీ! నీవెన్నియుఁ బూఁగూర్చి దండనల్లలేదేమి? దుఃఖించుచుంటివి? వికాసము గోలుపోయినది నీముఖమేలకో?

శ్యా :- సరళా! నేడేవిదిశా నగరమునుండి కబురందినది. విశాల మహారాజుగారు కడుంగడు విచారముతోనున్నారని మన మహర్షులను గూడా నిన్ననే నగరమునకుఁ బిలిపించుకొనినారు. రేపటి స్వయంవర మహోత్సవ నిర్వహణము నిర్విఘ్నముగా నెట్లుజరుగునా యని దానికై మన చెలి విచార విషాదములఁ గలిగియున్నది.

వై శా :- (స్వ) నా వేదనకుఁ గారణముఁ నాయనగారి విచారభారమని వీరికిఁ దెలియుటయే మంచిదయ్యెను. (ప్రకాశముగ) సఖీ! నాయనగారి యీ విచారమునకుఁ గారణము నీకుఁదెలిసినదా?

శ్యామ :- దీనిఁగూర్చి నాకుఁ దెలిసిన ముఖ్య విషయమిది. మాయావిదృఢకేశి సపరివారముగా మెఱపు దాడులు సేయుచు మన రాష్ట్ర ప్రజల సంహరించుచు విశృంఖల విహార మొనర్చుచున్నాఁడఁట. దాని నివారణోపాయమాలోచించుటకై మఱియు నిర్విఘ్నముగా స్వయం వరము జరుపుటకై మన మహారాజులు సువ్రతా చార్యులఁ బిలువనంపిరఁట.

అవి :- మిత్రుఁడు చెప్పినట్లు ఈ దృఢకేశివధ, మొదటి నాకార్యమైయున్నది. వానిఁ జంపికాని నేనీమెను పరిణయింపనంటిని.

వై శా :- వాఁడేల యీ ప్రజాపీడ గావించు చున్నాఁడు సఖీ!

శ్యామ :- అది రాక్షసులకు సహజ స్వభావము. మాయోపాయములతో దుర్బలురఁ బీడించి కడుపు నింపుకొనుటలు వారి నిత్యకృత్యము. ఇదియే కాలమున దప్పదు. కలుపు మొక్కల పెరికిన గాని కడమపైరుకు

వృద్ధి గలుగదు. అందు వానికి మఱొక దుర్భావము కలదని తెలియు చున్నది

వై శా :- ఏమా దుర్భావము ?

శ్యా :- మన మహారాజులు వానితో సంధి గోరి సంభాషింపఁ బిలిపించిరఁట. అంత నీకూతురగు వై శాలిని నొసంగి పెండ్లియొనర్చిన గాని నీతోసంధి పొసఁగదనిచెప్పి కిన్క్రియవగు నిన్ను జేపట్టఁగా నువ్విళ్ళూరుచున్నాఁడఁట.

అవీ :- స్వయంవరమునకు ముందే వీనిని జంపి తీరవలెనని పట్టుదల గలిగియున్నాను, కాని, వాని జాడ దొరుకుట చాల కష్టముగా నున్న దేమిసేయవలెనో తెలియుటలేదు.

వై శా :- వసుంధరలో వాని గెల్చు మొనగాఁడే లేఁడా ?

సర :-వాఁడు మాయాయుద్ధములో బలపరాక్రమోద్ధతిలో నద్వితీయుఁడగుటచే రాజులెల్లరు వానికి విధేయులై వర్తించుచున్నారు. ప్రజ లేబాధలు పడినను తమ సుఖభోగములకు భంగము గలుగ కున్న జాలునని యీ రాజాధములు వానికే వంతు బాడు చున్నారు.

వై శా :- భోగలాలసుఁడు తానింద్రియముల నదుపులోఁ బెట్టలేనివట్టి య సమర్థుఁడు. ప్రజలఁ బీడించి సుఖించనెంచుట పొదుగును గోసిపాల్గొడుచు పోకడయగును.

అవీ :- రాజధర్మము ఏమెయెంతగా గుర్తించినదో యీ వాక్కు-చాలును. ఈమె వీరమాత యగునన నతిశయోక్తికాదు.

శ్యా :- ప్రజానుక్షేమము చింతించు మన మహారాజుల కిపుడొక చిక్కు సమస్య యేర్పడినది.

వై శా :- వయోవృద్ధులగు జనకు లిపుడేమి విచారించుచుండిరో ; నేను వారి కేమియు సాయమొనర్పలేని దానైతిని.

సర :- ఏమియు నొనర్పలేని దానినని చింతిలనేల ; ఒక వీరశిరోమణిని వలచి పెండ్లియాడి. తద్వారా యీ కార్యము నెరవేర్ప వచ్చును గదా !

వైశా :- అదినిజమే ! కాని యిపుడట్టి వీరుఁడెవ రున్నారు ?

శ్యా :- లేకేమి ? విశ్వ జిమ్నాస్టిక్ క్రీడలో విజయుండైన "విశ్వవీర" బిరుద విరాజితుండవీక్షత్కుమారుండున్నాడు.

వైశా :- సఖీ ! నామురందతని పేరెత్తకుండిన నీకెంతో పుణ్యముండును. మఱొక మాటా విషయము నుచ్చరింపకుము.

అపీ :- మందహాసామృతమ్ముల విందుగుడిచి
సుందరాపాంగ సుమపూజ లొందునెవండ
అతివసిగ్గు వాల్జూపుల కాగలేదు
కన విముఖయయ్యె సఖి నా మరణమెకాదె.

ఔరా ! పరిస్థితి తలక్రిందులైనదేమి ? ఈమె నా విషయములో నింత విముఖత గనంబరచుచున్నదేల ? వేరే రాజకుమారుని వరించినట్లు తోచుచున్నది. నేనీమె పట్లం జేసిన ద్రోహమేమి ? ఈ యమపైం గల చిత్తమునెట్లు మఱల్చుకొనంగలను. మొన్న నన్నెంతగానో ప్రేమించి నట్లగపడిన యీమె యిట్లెట్లు మారెను ? దీని వెనుక నేదో యొక ప్రబల కారణమున్నదని పించును. ఇప్పట్ల హారమును గ్రుచ్చు నీయమ తానా పూలను మిషతో నా హృదయాకాశమునే సూదులతోం గ్రుచ్చుచున్నట్లు బాధ గల్గించుచున్నది. అయిన నింకను సరిగా నీయమ హృదయాభి ప్రాయము తెలియుటకు కొంతవఱకు నిరీక్షించి చూచెదను.

శ్యా :- ఏల యిట్లు నీహృదయము కలతపడుచున్నది సఖీ ! నీలోనిట్లు చింతాజడమైన చైతన్యమును గాంచి సహింపలేను. అదో ! ఆలత నా వ్యక్తిమున గూర్చము నీకు నీ యిగవుల్ం దెలిపిన పుణ్యఫలముతోం జక్కని వరుండు లభించును ఇది యీ యుద్యానశ్రీమాచారము. మొదలీ తరు లతలకు వివాహము జరిపించుటకున్నై వాని రెంటిని గలిపి యక్షతల వేయుము. పసుపు కుంకుమల నుంచుము.

వైశా :- అట్లే యొనర్తును.

శ్యామ :- నిగనిగలాడుచునెటి పాంగ్రుక్కుచు
నిండు వయస్సున మెండు కొనుచు

కన నవీక్ష్యంబయి క్రాలు యీనును పోక
బోదియ నాసన్న పుష్పవతియు
నత్యంత కోమలి యామల్లికాలత
తనవగు మండపాంతర్బహిస్థ
లమ్ముల నాక్రమణమ్మొనర్చి విశాల
యై దర్శనీయములైన తనదు
సహజ మృదుల కరమ్ముల సాచిసాచి
కాంక్షనాలింగనము సేయఁ గష్టపడుటఁ
గాంచి సహియింపఁ జాలను గాన దీని
దీనితోఁ గల్పి పుణ్యా మార్గాన బోదము.

వైశా :- నీకనికరమెంతయు స్తోత్రపాత్రము. భవదాశయాను సారమొన రించుట నాకభీష్టమే. (అని లజ్జను ప్రకటించును)

సర :- పోదము పద ! (అని వైశాలిని కేలుగొని నడచుచు) సఖీ ! మనను గాంచి యాలతా కుమారి లజ్జాపరవశయై కరముల నిరోధము దెల్పు చున్నట్లూచు చున్నది తనకొనగొమ్మల.

వైశా :- (చప్పుననాగి క్రింద గాంచి) సఖులారా ! అటులాగుడు. నాకీ లతావలయము కాళులఁ జిక్కుకొనినది.

(సరళా శ్యామలలు వైశాలినిఁగని నవ్వుచుందురు)

సర :- క్రింద జూచుచు రావలదా ? ఐన నిన్ను ద్రోవనడిపించు చిత్త మన్యాయత్తముగాఁగ నిందు నిన్ననసేల ? శ్యామలా ! స్థిరత్వము గల యా లతాతన్వి తనవలెనేయున్న మనదేవిని నిజసఖియనుకొని భాషింపగాఁ బాదాక్రాంతయై నిల్పెనేమో ?

శ్యా :-సరళా! అటుఁగాదు. స్థిరత్వముగల యాలతాతన్వి సారూప్య సందర్శన మిచ్చు మనదేవికి చరత్వముండుటవలనఁ గన్నుగుట్టిసమానాధికారమొసంగ దరిసినంతనే చరణ శృంఖలల వైచినిలిపెను.

అపి (తనలో) మేలుమేలు ! సరళవచనము సామ్యము నిరూపించుటలో జక్కగాఁ బోసఁగినను శ్యామల వాక్కు సరసమై సంతసమునించుటకు దానికన్న మిన్నయని రూఢిపరచుటలో నా హృదయమే సాక్షి !

ఈమెతనులత నాయెద నెచటికేని
గదలనీక గుప్తమ్ముగాఁ గట్టివైచె
దానికై ప్రతిఫలముగఁ దనకునిపుడు
నీలతాంగ నాశృంఖలంగాలు నిలిచె.

వైశా :- సఖులారా ! నే నీలతాసుత నీతరువరునకు గూర్చుచున్నాను. ఇవి మూడు పూవులారుగాయలై వర్ధిలు గాక (దానికై సరళా శ్యామలలు సాయ పడుచుందురు) అని యక్షతలు చల్లును.

అపి :- (తీవనుసవరిచి కల్యాణమొనర్చు సఖీ త్రయమునుగాంచి) నిజముగా నీలతాంగులకును నాలతా వితానమునకును భేదమేయగుపడదు.

అదిని బల్లవాకరములై కనఁబాల్గురి పించునోలి నా
యాదలమేల్మి పుష్పవతులై కనఁదేనియ సోనజిమ్మనా
యాదట సత్ఫలాన్వితములై మధురార్ద్రరసమ్మొసంగుని
మ్మేదిని నీలతాంగనలమించునొకోదివిమించు దీవియల్.

శ్యా :- సరళా ! మనదేవి యీ లతాతన్వీ పాదప మిథునమునంటఁ గట్టి యెంతయుఁ బుణ్యముంగట్టుకొనెను.

సర :- మన మననేల ? అదో ! ఆ లతయేతాను తనసహజకోమల కరము లెత్తియూఁపుచు "నావలెనే యనతికాలమున జక్కని వరునిగూడుకొని దీర్ఘ సుమంగలివై యొప్పుదుగాక" యని మంగళాశాసనము లొసంగుచున్నది.

శ్యా :- నిజము సరళా ! నీవీలతా హృదయమును జక్కగా గ్రహించితివి. లేకున్న నెందులకాలతతనకరము లెత్తియూపును ?

వైశా :- (లజ్జాసూయలతో) మిక్కిలి పామరులై మీరటులనుకొనుచే కాని నిజమునకుగాలిచే యాలతాగ్రములు కదలి యాడుచున్నవి.

శ్యా :- అదిసరియేకాని, యొక విషయమడిగెదను తెల్పెదవా ? వాస్తవ మెఱింగింపకున్న నాపై యొట్టు.

వై శా :- ఏమా విషయము సఖీ ! తప్పక తెల్పెదను. ఒట్టేటికి ?

శ్యా :- నీ విట్లువిషణ్ణ వదనవై కానిపించ హేతు వెయ్యది ?

అపీ :- నా హృదయమే యిపుడు శ్యామలగా మూర్తీభవించి యడుగుచున్నట్లున్నది. నే నీమె కెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈమె నన్ను పరిగ్రహించుట కియ్యకొనని కారణము చెప్పకమానదు.

ఈ విషయమందు ముందుఁ దానీలతాంగి
చెప్పఁబోవుమాటలకయి చెవులు మిగుల
నాతురత నాసగొనియెడిస్వాతి వాన
చినుకులాసించు ముత్తెఁపుచిప్పలటులు.

వై శా :- (స్వ) నా సుఖదుఃఖములే తనవనియెంచు నీమెయొద్ద మరుఁగు పరచుటెట్లు ? ఈ లేఖావిషయము వీరికిఁ దెలియనట్లే తోచుచున్నది. ఈలేఖ వీరియొద్ద కెట్లువచ్చినది. నన్ను నా ప్రియుడు నిరాకరించెనను విషయము వీరితోఁ దెల్పుతలవోయినట్లని పించుచున్నది.

శ్యా :- సఖీమాటాడవేమి ?

వై శా :- సఖులారా ! ఏమని తెల్పుదాన ! ఎన్ని విధముల యోచించినను నా దుఃఖము దెల్పి మిమ్మును దుఃఖమున ముంపఁ జాలకున్నాను.

సర :- తెల్పి దుఃఖమున ముంపఁ జాలనను చుంటివే. అంతకెక్కుడు తెల్పకనే మమ్ము దుఃఖమున ముంచు చుంటివి. నీ కీరీతి సఖ్యాపచారము సంఘటిల్లుచున్నది.

వై శా :- అయిన నా యపచారము క్షమించుడు దయదలచి.

సర :- నీ హృదయావేదన దెల్పిననేకాక యది క్షమార్హముగాదు.

వై శా :- ఇంక మీ శాసనమునకుఁ గట్టువడితిని.

అపీ :- (తనలో) సరళా ! నా ఘనకార్యమును సరళమొనర్చిన నీ నామ రూపముల కనంతాభివాదములు.

వై శా :- ఇంతవరకు మీకు బహిర్గతము కాకుండ దానినంతయుఁ గప్పిపుచ్చితిని. మీరు దాని ద్రవ్వితేల్చుటవలన నది నా హృదయములోని

గాయమును నూత్నమొనర్చినట్లు బాధగల్గుచున్నది. సఖీ! (అని చెప్ప బోవ) (దుఃఖోద్వేగమున మాటపెకలక సబాష్పగద్గదస్వరయై) ఇంకనే నేమియుఁ బల్కలేను. నన్ను క్షమించుడు. నన్ను క్షమించుడు. నేను నిల్చుటకును జాలకున్నాను. (అని పైటలో మోముదాచుకొని ఏడ్చును) (మేనునేల వ్రాల్చబోవును)

శ్యా :- సఖీ! అట్లాగుము. వట్టిపసరి కన్బరుండవలదు. ఈ ఘాసాగ్రములు నీసుమ కోమల శరీరమున గ్రుచ్చుకొని బాధఁ గల్గించును. నేనిటపూలఁ బరచి శయ్యనొనర్తును. దానిపై విశ్రమింపుము.

(అని పూలను త్వరత్వరగాఁ బరచుచుండును)

వైశా :- నీకేటికిశ్రమ? నాకీ మనస్తాపముకన్న నీతృణబాధ యధికమా?

(అనిమేను వాల్చి కన్నీరు గార్చు చుండును)

శ్యా :- సఖీ! లాంఛనముగా వధువునొనర్చు నిన్నీ పూలహారముతో నలంకరించవలసియున్నది. ఈ సుమహారము తానిప్పట్లనగ్ని వలెఁగ్రాగు నీశరీర తాపమునుపశమింపఁ జేయునను కొందును. (అని సంపెఁగ పూల మాలమెడవేయును) (హారము వేయు సందర్భమున వక్షమునందలి పయ్యెద గాలివీచుటచే నెగిరిపోవును)

వైశా :- సఖీ! ఈ సమయమున మరుత్తుగూడ నాపయ్యెదతొలఁగఁ జేసి నన్ను శ్రమపెట్టుచున్నాఁడు. (అని పైటసద్దుకొనబోవును)

శ్యా :- సఖీ! నీకేటికీ పరిశ్రమనేబయఁట సవరింతు నుండుము. (అని పైట సవరించును)

అవీ :- ఔరా! ఈ మరుత్తు మితిమీరి చరించుచున్నట్లున్నాఁడే? కాదు ఈ పిల్ల మరుత్తు తల్లి స్తన్యము గ్రోలు స్తనంధయునివలె పయ్యెదఁ దొలఁగఁజేయు చున్నట్లున్నాఁడు.

ఔరా! ఇప్పటి యీామె మనోవేదనను జీదరపాటునేమని వర్ణింతును.

సడలుచు చోల బంధమును చాన కరాంగుళులంటి, యోపమిన్
దడవును వక్షమున్ మెఢవదాల్చి సుమస్రజమంటి స్కంధమున్

విడినును పైటజారిపడవేమరు దానిని గొంచు మూపునం
దిడఁజను బీనవక్షమొక యించుకఁ ద్రుళ్లిపడంగ వేసటన్.

ఇంతవరకు నాప్రేయసికేది ప్రియమయ్యెనో నాకది మరింత యానంద దాయకమై యొప్పినది. ప్రస్తుతము.

అతివగళమున నిడుసూన హారవితతి
అమె హృదయమ్మునకు నెంతహాయినిడెనో
కాని మన్మనంబున కవి కఠినపాశ
బంధ వితతియై నన్నట్టి బాధవెట్టె.

(నేపథ్యంలో విదూషకుని పిలుపు) (ఓ యవీక్షిద్రాజ కుమారా! నీ ప్రణయాలోచన చాలించి ప్రయాణా లోచనచేసి సిద్ధమైరమ్ము! సారథివేచి యున్నాఁడు. త్వరగా రావలెను.)

అవీ :-ఇవి విదూషకుని పిలుపులే. నేనవశ్యముగాఁ జనవలసియుండెను. నాకు ప్రజల యాపదబాపుట తద్వారా గుర్వాజ్ఞా పాలన మొదటి విధి.

(అని ప్రక్కయవనిక నుండి లోన ప్రవేశించును)

నాకనులనీమె యిటు విడనాడు చున్న
నామదిని పీడిచనగనీ లేమతరమె
కలువలకు శశిదవ్వుగాఁ గలుగనేమొ
కొలని యంతరంగము వీడఁగలదదెట్లు? (అనిచనును)

వై శా :- సఖులారా! ఈ పూల వీవనలు హారములును నాకేమియుఁ దృప్తిఁ గలిగించ వయ్యెను. ఇకశయనమే శరణ్యము.

(అని పూలసెజ్జపై మేను వ్రాల్చును)

సర :- (వైశాలినీ కపోల స్పర్శనొనర్చి) శ్యామలా! ఈమె శరీర మిపుడు తీక్ష్ణాగ్నివలె నెట్లు గ్రాగు చున్నదో చూచితివా? ఈ పద్మినీ హృదంబున తానమాడింపఁ జేయ నీ వేడికొంతయుపశమించునను కొందును

శ్యా :- సఖీ! వ్యాధినెఱుంగక యౌషధమును సేవింపఁ జేయు భిషగ్వరుని వలె మన యుపచారములు నిరర్థకములగు చున్నవి. నా సూనహారమెం

 వైశాలి:

ప్రయోజన కారియో నీతానమాడింపఁ జేయుటయు నంతటిదే. సఖీ! నీవీ పూలహారము మన పార్వతీదేవితో గౌరికి సమర్పింపఁ జేయ శమంతక ఋషి కుమారునకు నొసంగి పూజార్థము సకల సన్నాహముల నొనర్పు మని తెల్పుము. నేమెల్లగా రాకుమారిని గొనివత్తును.

సర :- సఖీ! తానీమె యేకారణమున నీయవస్థకు పాలయ్యెనో తెలిసికొన బాగుండెడిది. నాకిచటినుండి పోవుటకుఁ గాలాడుటలేదు.

శ్యా :- ఆమె తన వేదనాకారణము నిప్పట్ల నెరింగించునట్లగపడదు. నీవు త్వరగా నరుగవలె. నేనామె విషయము చూచుకొందును. అట్లే దేవ్యాలయమునకుఁ గొనివత్తును.

సర :- సరె నేనరుగు చున్నాను. (అని నిష్క్రమించును)

శ్యా :- సఖీ! నేనడుగు ప్రశ్నకు సమాధాన మిడనింతటి ప్రయాసమే యుండదు గదా?

వైశా :- అటులైన నన్నేమి చేయుమందువు చెలీ?

శ్యా :-నీ హృదయ వేదనకుఁగల కారణము నాకుఁదెల్పెదనని యభయమిమ్ము.

వైశా :- (శ్యామల చేతిలోఁ జేయివైచి) తప్పక తెల్పెదను.

శ్యా :- నీదేహస్థితి తానెప్పటి నుండి యీ పరితాప భాజక మయ్యెను?

వైశా :- చెలీ! నను జూచుచున్న నీకుఁ దెలియుటలేదా!

శ్యా :- నాకుఁ జూడ నిపుడిపుడే నీ పరిస్థితి యిట్లు మారినట్లుగు పించును. నీ మనోహర చంద్రుడ వీక్షితుఁడుగామి నీస్థితి యిట్లుమారినదని నాభావన.

వైశా :- ఆ విషయముతో నన్నేల యిట్లు బాధింతువు?

(అని కన్నీరుఁ గార్చుచు లేఖనచటఁ బడవైచును)

శ్యా :- ఇదినీకెవరిచ్చిరి? (అని జాబునంతయుఁ జదివి) నిన్నాతఁడిష్టపడుట లేదని మఱియొక కన్నియపైఁ గన్నుబడినట్లే జాబునుడువుచున్నది. నీవేమో యతనినే వరించితివి. ఇదియా యవీక్షిత్కుమారునే యడిగి తెలిసికొని నీకాతఁడను కూలుఁడగు నట్లొనర్చెదను నమ్మియుండుము.

వైశా :- సఖీ! శ్యామలా! నా భవిష్యత్తు ముందేమి కానున్నదో? యంతయు నయోమయముగా నుండి యపార విషాద మగ్న నొనర్చినది.

శ్యా :- మనమింక గౌరీ పూజార్థ మాలయమునకు వెడలి యామెను బూజింతము పద! నీవామె పూజనమొనర్చుటయు నా గౌరీకల్యాణము వినుటయు నీవిధి. ఆ దేవియే నీకిష్ట వరునితోఁ గల్యాణ మొనరింపఁ జేయును. (అని కొని చని పూజింపఁ జేయును) (వైశాలిని గౌరికి సుమములర్పించి మ్రొక్కును) సఖీ! ఇంక నీ గౌరీ కల్యాణము వినుము.

వైశా :- ఆ పవిత్రగాధను వినుపింపుము. ఆ లోకమాతయైన దయఁ జూడకుండునా?

శ్యా :-సఖీ! నీవలెనే మన పార్వతీదేవియు శంకరుని ప్రియునిగా వలచి సఖీజనము వెంటారానతని యాశ్రమమునకేఁగి యర్ఘ్యపాద్యాది సత్క్రియల నతని నర్చించుచు భక్తియు రక్తియుఁ గల్గి నివసించుచుండెను.

వైశా :- అపుడేమి జరిగినది?

శ్యా :- అంతనమరులకు శ్రమలిడు తారకాసుర వధార్థము సురేంద్రునకొక యతిలోక బలశాలియగు సేనాని కావలసివచ్చెను. యతఁడు విరించికడ కరుదెంచి, తారక వధార్థమతనితో సమాలోచన మొనర్చెను. అంతనా విధాత "యాకార్యమునకు శంకరునకు పార్వతియందుదయించిన కుమారుఁడే సమర్థుఁ"డని నిర్వచించెను.

వైశా:-శంకరుఁడు పార్వతిని పరిణయమొనర్చినగదా కుమార సంభవమగుట.

శ్యా :- అదినిజమే. శంకరుఁడు సతీవియోగముతో వీరవైరాగ్య రాశియైయతి కఠోరతపమాచరించుచుండెను. త్రిభువన సుందరియగు పార్వతి యతని సేవించుచుండెను. ఇదియదనుగాఁ గొని సురపతి మరుని హరునిపై విరిశరములేయఁ బుపురి కొల్పెను.

వైశా :- పార్వతి భాగ్యము ఫలించిన దనవలెను. మరుఁడు సురహితార్థము తానాకార్యమొనర్చెనను కొందును.

శ్యా :- సఖీ! అతిసాహసోపేత చిత్తుఁడైన చిత్తజుని పరార్థపరత నేమనవలెను?

విరిశరమ్ములఁ గురిపించి హరునెడంద
విషయవాసనల్ రగిలించి విడిచె మరుఁడు

పూలతీఁగెను వెదకెడి భోగివోలె
శివుఁడు పార్వతీపాణి నాసించిడాసె.

సై శా :- దరిసియేమనెను. వినఁగుతూహల ముదయించుచున్నది.

శ్యా :- అమిత కామాంధకారము లావరింప
హరుని ప్రణయావలోక తస్కరుఁడు పొంచి
అగజ రూప యౌవన ధనమపహరింప
మందహాసమ్ములను మచ్చుమందుచల్లె.

సై శా :- అగజతానపుడెంతటి పారవశ్యమును బొందెనో ?

శ్యా :- రాగకషాయిత రమ్యాక్షి మీనముల్
లజ్జార్ణవమ్మున లాస్యమాడ
అరవిచ్చుదరహాస వరపారిజాతాలఁ
బ్రణయ సౌరభములు పరిమళింప
కెంపుసొంపెక్కు నాణెంపు కపోలాల
స్నేహవసంతముల్ చివురులీన
హరప్రేమ పారవశ్యాలోకనావృష్టిఁ
బులకాంకు రమ్ములు మొలకలెత్త
ముట్టఁబోవు శంకరుఁ గాంచి ముగ్ధతాను
అత్తపత్తి కొమ్మ విధాన నంగమెల్ల
ముడుచుకొని సిగ్గుమొగ్గయై ముందువెనుక
లాడుమరునారియై ధృతి వీడఁజేసె.

అపుడు శూలివిరాళినోపలేక పార్వతినిగాంచి రాగవివశుఁడై.

శృంగారవార్ధి తరంగజాలాలకా
హాతినక్షి మీనాలయాటగట్టె
మదనకేతనమత్స్య సదృశాక్షియుగళినా
నిగమ విజ్ఞానమ్ము నీటఁగల్పె
దరహాసవిద్యుల్లతా వితానములు నా
తపములకృషినూడ్చి విఫలుఁ జేసె

శారదపూర్ణిమా శశికళాసఖమీ
ముఖమ్ము కామాంధ కారమ్ముగూర్చె
ఉగ్రబ్రహ్మాస్త్ర తాపమ్ము నోర్వవచ్చు
స్మరశరమ్ముల నోర్వగాఁ దరముగాదు
బ్రహ్మయే దర్పకాస్త్రాళి బారిఁజిక్కి-
కూతురనక భారతి రతిఁ గూడవలసె.

అని మహేశ్వరుఁడు నగ జాతసొగసులం బొగడియాడుచు నామెకేల్వట్టెను.

వై శా :- సఖీ! యాపురాణ దంపతుల సరాగవృత్తాంతము విననింపుగానున్నది. వివరింపుము.

శ్యా :- కాని యాపురహరుఁడు తానామరుని దురిత చర్యలఁ ద్వరలోఁ బసికట్టి వాని గాంచి.

అపుడు బొమముడియేధనువై తనర్ప
చటులనిటలాంబకాగ్నియశరముదొడిగి
చిత్తజునిపయిదూర్జటి చిచ్చుగురిసె
శలభమై తక్షణమె మాడిచచ్చె మరుఁడు.

వై శా :- అకటా! దేవతలకు సాయము సేయఁ బోయి మరుఁడు హార క్రోధాగ్ని కాహుతి యయ్యెను. స్మరవిరహిత ప్రపంచమన బ్రళయమున కంకురా రోపణమేకదా! అతఁడు లేమి లోకమే శుష్కమై తోచదా? అతని సతియగు రతి గతియేమి యయ్యెనో?

శ్యా :- సఖీ! మహాత్ముల కోపములర్థరహితములై యుండవు. అవియు లోక కల్యాణ కరములే. మహాదేవుఁడు యోగీశ్వ రేశ్వరుఁడు. అతనికిఁ గావలసినది యాతిలౌకికానందము. విషమాస్త్రుఁ డొసంగునది విషయానందము. దానికిని డీనికిని బర్వత పరమాణువున కున్న యంతర మున్నది. అంతటి మహా సౌఖ్యము భంగపరుప జ్ఞానానందరూపి పరమేశ్వరుఁడు తానెట్లు సహింపఁ గలఁడు. అపుడు కోప వివశుఁడై.

పాపములన్హరించి భవ పంకము శోళనమంద ముక్తికిన్
బ్రాపకమైన గంగహరి పాదజయైనను మౌళిఁ దాల్చితిన్

శ్రీపతి చిత్త జాతుఁడయి సిద్ధ తపమ్ముల వమ్మొనేయునీ
పాపిని బూదిసేతునిదె ఫాలతలానల కీలలన్వడిన్.

అని శపథమొనర్చి సఫలీకృత మనోరథుఁడయ్యెను. దీని కంతకుఁ గారణమైన పార్వతీదేవినిగాంచి వైరాగ్యముట్టిపడ నామె సఖీ జనము విననిట్లు శాసించెను. ఓ యువతీ!

యువతి జపతపోనియమాల సవతిగాన
తపము సేయు నాకడ నుండఁ దగవు నీవు
ఆత్మరూపమె పుత్రుఁడై యవతరించు
దాన నాత్మ శక్తి యదెంతొ తగ్గిపోవు.

అని యిట్లు శాసించుటచే నామెకుఁ దలవంపై కలఁతపడి యెదతపింప నేడ్చుచు వెడలి పోయెను.

వైశా :- వలచి వచ్చిన యువతిని వరుఁడు తిరస్కరించినప్పటి యవమానమాత్మ హత్యా సదృశము గదా!

శ్యా :- అపుడా యద్రిజాత పితరులు వలదని బతిమాలినను వినకపతిగా పశుపతినే పడయఁ గోరి మంచు కొండ యంచులపై ఘోర తపమొనర్ప సాగినది.

వైశా :- ఆ లోకమాత తపమునకు మెచ్చి మహాదేవుఁ డనుగ్రహించెనా? ఆమె తపమొనర్చిన విధానమెద్ది?

శ్యా :- విరహాగ్ని కన్నను వేడిగాదిదియని
పంచాగ్ని మధ్య తపమ్మొనర్చు
ప్రణయ దుఃఖార్ణవమ్మునకు లోతేయని
పెనుమనస్సు రసిలో మునిఁగివేడు
పర్ణమూ లౌషధుల్ పనిసేయవీ వ్యాధి
కనుచు నపర్ణయై వినతిసేయు
తన ప్రియుఁ డొల్లమిఁ దల క్రిందులైనంత
ఇందు గాదని తలక్రిఁదొనర్చి

నీల్చి మంచు కొండల గుండె నీరుగాఁగ
అమర వరుల మానసముల హర్షమొదవ
కాచివడెవోయి పసిఁడియై క్రాలఁ బ్రేమ
శివుని ధవునిగాఁ గోరి తపమ్మొనర్చె.

వై శా :- అంత నా తపః ఫలమెట్లాయెవినది ? శంకరుఁడంగీకరించెనా !

శ్యా :- ఒకనాడొక బ్రహ్మచారి తపము సేయు పార్వతికడ కరుదెంచి కుశల ప్రశ్నలొనర్చి తపో లక్ష్యము విపులముగా నెరింగింపఁ గోరెను అంత నామె పాప నా శంకరుఁడగు నా శంకరుని వశంకరు నొనర్ప నీతప మాచరింతునని నుడివెను. అపుడా బ్రహ్మచారి "ఓసీ! అమాయకురాలా! శంకరునేమని వలచితివి ? నిను జూడ జాలిగల్గు చున్నది. రూపున మన్మథుఁడా ? ఐశ్వర్యమున నాది విష్ణువా ? వైభవమున నింద్రుఁడా ? అమృత హృదయమున జంద్రుఁడా ? మీ మహోన్నత గోత్ర మెచట ? నతని వంశమెచట ? లక్షాధికారి పుత్రికా రత్నము బిచ్చగాని వరించుట కని వినని వింత" అని పరిహసించెను.

వై శా :-సఖీ! అతనిలోఁగల దోషము లేవియని యాబ్రహ్మచారి నిరూపించెను?

శ్యా :- పార్వతియు నతని నీవలెనే యడిగెను. అంత వారిరువురిలో నిట్లు సంభాషణ జరిగెను.

బ్రహ్మ :- అతనికిఁ గల్గిన యైశ్వర్యమది యెంత ?
పార్వ :- వరవిభూతి యన నైశ్వర్యమె కదె !
బ్రహ్మ :- అతనికిఁ దలిదండ్రులను వాఁరలున్నారె ?
పార్వ :- ఆది దేవునకేటి యమ్మ యయ్య ?
బ్రహ్మ :- తోల్తైన వస్త్రాలు దొడుగు వాఁడుండనె ?
పార్వ :- చర్మమ్మె దేహి వస్త్రమ్ము గాదె !
బ్రహ్మ :- క్షితి నెవ్వరేనియుఁ జితలో వసింతురె ?
పార్వ :- అంత్య వసతి ప్రాణి కదియె కాదె !
బ్రహ్మ :- పుర్రెలో బిచ్చ మెత్తెడి పురుషుఁడున్నె ?
పార్వ :- పుర్రె కెపుడును బిచ్చపు బుద్ధియె కదె !

బ్రహ్మ :- పాములను నగలిడుకొను సామి గలఁడే ?
పార్వ :- పసిఁడి నగలు మ త్తెక్కించు పాములెకదె !
బ్రహ్మ :- నిలువ నీడలేని కుడువ కూడునులేని
కట్ట బట్టలేని గరళ కంఠు
నాథుఁడనిన జగము నవ్వదే నిను గాంచి
సిగ్గుగాదె మగఁడు శివుఁడనంగ.
పార్వ :- అకట శివనింద సేయుట యద్ది వినుట
ప్రబల పాతక హేతువై పరఁగుఁగాదె
విషము పెట్టిన వారిని బెట్టఁ జూచి
వలదనని వారినింగూడఁ గలఁచు నఘము,

శివనిందసేయు నీముఖము చూడరాదని పార్వతి కోపించి వెడలిపో నుద్రిక్తయైనంత నాబ్రహ్మచారియే శివుఁడుగాఁ బ్రత్యక్షమైపరీక్ష సేయనట్లంటినే కాని పరిణయింతుననియె. అంత నొక సుముహూర్తమున సప్త ఋషులు వారిరువురికి హిమవంతు నింటిలో ముక్కోటి దేవతలు మురియఁ బరిణయ మొనర్చిరి. తుదకు మంగళాంతముగా నా యసురుఁడు మడియుటకుఁ గారణ మైన కుమార సంభవముతో నీకథ ముగియును.

వైశా :- సఖీ ! అది దంపతుల ప్రణయగాథ మంగళాంతముగా వినిపించి నా మదిని కుదుట బఱచినందులకు నీకెంతయు ఋణపడియున్నాను.
శ్యా :- నవవధువువై నీవు వినవలసి యుండుటచే నీకథ గానము చేసిన నేను తరించితిని. కావున దీనికి కారణమైన నీకే నే ఋణపడియున్నాను. పర్ణశాలకు రావా ?
వైశా :- నన్నీ శీతవృక్షచ్ఛాయలోఁ గొంచెము విశ్రాంతి గొననిమ్ము (అని యాలయమునుండి చని ఒక రసాలవృక్షచ్ఛాయలో శిలావేదికన్ బూసెజ్జపై శయనించి) నీకవసరమున్న నీవుపోయి గడియ యాగిరమ్ము! (అని సఖిని పంపించును)
శ్యా :- అట్లే నీవు విశ్రాంతి గొనుచుఁ జింత మానియుండుము. అంతయు మన మంచికే జరుగును. (అని పోవును)

తెర యెత్తఁబాతాళపురి

ప్రవేశము దృఢకేశి రాక్షసుఁడు

దృఢ:-(స్వ) ఇంతవరకు మిత్రుఁడు ద్విజిహ్వుఁడు రానికారణ మేమైయుండును? నేఁజెప్పంపగానే నాయాజ్ఞతలధరించి వచ్చి వ్రాలిపడువాఁడు. ఇంక నాజగదేకసుందరి నాచేఁజిక్కినదనుట కేమాత్రము సందేహములేదు. ఆ వైశాలినీ కరగ్రహణమునకు వేసిన యెత్తునూటికి తొంబది తొమ్మిది పాళ్లుఫలించినట్లేయనవలెను. అదో! పదముల చప్పుడు వినవచ్చు చున్నది. అతఁడే వచ్చుచున్నాఁడు కాఁబోలు.

(దృఢకేశి మిత్రుఁడు ద్విజిహ్వుఁడు ప్రవేశించును)

దృఢ :-(ఎదురు చనిమిత్రు నాలింగనమొనర్చుకొని) (వికటముగా నవ్వుచు) వయస్యా! నీవు వచ్చుటచే నాకార్యము సఫలమైనదనే చెప్పవలెను. నీ కొఱకే యెదిరి చూచుచున్నాను.

ద్విజ :- మన రాక్షసజాతికే యమూల్యమణిమకుటాయమానమైన నీవుపిలి పించుటయు నేరాకుండుటయు సంభవించునా ?

దృఢ :- నీవు మాత్రము సామాన్యుఁడవా ? నా కార్యకలాపములలోఁ గుడి భుజమువలె నుండి నీ యసాధారణ బాహుబల పరాక్రమములతో వానిని నిర్విఘ్న మొనర్చు చుంటివి.

ద్విజ :- అది నీకు నాపైఁ గలయమిత వాత్సల్యము. నీ స్నేహమునకునే నెంతయుగర్వించు చున్నాను. నన్ను బిలువనంపిన కారణమేమి ? నీ యాజ్ఞ సర్వధాతల ధరించువాఁడను.

దృఢ :- నీకు విదిశా పురాధీశుఁడగు విశాలుఁడు సుపరిచితుఁడే కదా ! అతని యేకైక పుత్రిక భువనైక మోహిని వైశాలిని. ఆమె స్వయంవర విషయము తెలిసియేయున్నదను కొందును.

ద్విజ :- అదియంతయు నాకుఁ దెలిసిన విషయమే. ఆమె స్వయంవరమునకు నీకాహ్వానము రాకుండుట మన జాతికే యొకతలవంపనినేను భావింతును. వాని యఖర్వ గర్వజలధివేలాతిక్రమణ మొనర్చు చున్నది.

దృఢ :— దానికి కారణము నీకుఁ దెలియును గదా?

ద్విజ :— తెలియును. వానికిప్పు డమానుషశక్తి సంపన్నుఁడగు, నవీక్షితుని యందమేఁదుగా నున్నది. అతఁడు విశ్వజి ద్రణక్రీడా విజయ విలాసాతి శయముచే విశ్వవీరుఁడనని విఱ్ఱవీఁగు చున్నాఁడు నీవే యాక్రీడలోఁ బాల్గొన వానిస్థితిగతులెట్లుండెడివో?

దృఢ :— మిత్రమా! నేను శక్తికన్నయుక్తికిఁ బ్రాధాన్య మొసఁగు మేధా వంతుడ. అందటి రాజుల నతఁడు గెల్చిబండశ్రమపడినాఁడు. వాని నొక్కనినినేఁ గెల్చిన జాలదా! ఎందరితో యుద్ధముచేయు శ్రమ తగ్గినదో చూడుము.

ద్విజ :— ఎంత చక్కని యుక్తి మిత్రమా! ఈ యాలోచనానుభవ మితరుల కుండుటకల్ల. వాని తండ్రి తపస్సొనర్చి కరాంగుళులనుండి కావలసినన్ని సైన్యముల సృష్టించి, సకల మహీమండలము నేకచ్ఛత్రముగఁ బాలించు చున్నాఁడు.

దృఢ :— అదొక యింద్రజాలము. తపస్సులేదు. ఏమీలేదు. నేదలంచికొనిన వానిగర్వము వాని సామ్రాజ్యము ఝఁఝూ మారుతహతి నశించుచిన్నా భ్రమువలె నశించునదే. కాని, (అర్థోక్తిలో)

ద్విజ :— నీవు దలంచుకొనుటలేదు. శత్రువు బలవంతుఁడని తెలిసియు నుపేక్షించుట యెంతటి ప్రమాదకరమో నీకుఁ దెల్యనిదికాదు. నీవి ట్లుపేక్షించుటచేతనే యతఁడాడిన దాటయుఁ బాడినది పాటయునగుచున్నది.

దృఢ :— ద్విజహ్వా! ఉత్సాహప్రభుమంత్రశక్తులఁ దనసాటి గననిమేటి వీరుఁడే ధరామండలింజిర కాలము పరిపాలింప సమర్థుఁడని నాకుఁ దెల్యక పోదు. సామదానభేద దండోపాయ చతుష్టయములో భేదోపాయమగు మాయను బ్రయోగించిన సులభముగా విజయము కరగతమగును. మన రాక్షసజాతికి మాయవెన్నతోఁ బెట్టిన విద్య. దానిఁ బ్రయోగింపఁ దలచి నిను బిలిచితిని.

సామదాన దండోపాయ సరణికన్న
మాయగలభేద నామకోపాయమెసరి

కార్యసాధన దానితోఁగడు సులభము
వేలువంకరనిడకున్న వెన్నసున్న.

ద్విజ :- మాయాయుద్ధము చాలా గొప్పదే. అందులో సందేహము లేదు. కానికరందముని తపశ్శక్తి ముందిదినిలువఁ జాలదని పించును. అతిలోక శక్తుల నార్జించుటకై నీవఖండతపస్సొనరింప నీముందీకరందమాదులెంత ?

దృఢ :- ద్విజిహ్వా ! జీవితము నిరర్థకములగు తపస్సులతోఁ గృశించుటకై రాలేదు. కష్టములనుభవించు మానవునకుఁ బ్రపంచమే యొక నరకము సుఖమే యనుభవించువారికీ లోకమే నాకము. కావున కష్టించి చేయుఁ గార్య ఫలముల యుక్తితో సాధించియు ననుభవించ వచ్చును. కష్టించి బ్రదుకుటయన పశువులకై మేధావులు గాని పశుతుల్యులకై విధించఁ బడినదని తెలిసికొనుము. అందులకే ఆమేధస్సుసర్వోన్నత స్థానములో నుండి సర్వేంద్రియములపై పెత్తనము నెఱపుచున్నది.

ద్విజ :- శరీర కష్టమును దప్పుకొనుటకే బుద్ధి యొసంగఁబడినదని కదా నీ యభిప్రాయము. అటులైన కష్టమూలములగు తపస్సులకు దేవుఁడు కరుణించి వరములిడుట కల్లలగు కలలేనా ?

దృఢ :- కాక మరేమి? విష్ణువునకువలె లక్ష్మిని (అనగా ధనమును) శివునకువలె మహోన్నతరజతాచలశిఖర పీఠమును (అనగా పదవిని) బ్రహ్మకువలె జగత్తంతయుఁ దలఁ దాల్చు వేదవాక్యమును ( అనగాఁ బలుకుబడిని ) గలిగియున్న మానవుఁడే దేవుఁడనఁబడును. నిరంతరమా భాగ్యమునకు బదవికిఁ బలుకుబడికి నై వేయునట్టి యెత్తులు చేయునట్టి యమోఘా లోచనలే తపస్సు. అది సిద్ధించుటే దుఃఖ విముక్తియగు ముక్తి.

ద్విజ :- భాగ్యము, పదవి, పలుకుబడి కలవాఁడే త్రిమూర్తి రూపుఁడైన భగవానుఁడని కదా నీ యాశయము.

దృఢ :- నిస్సంశయముగా నదియంతే. శ్రీదేవి భూదేవికలవానిదేకదా శ్రీమన్నారాయణత్వము. వాఁడే నిగ్రహానుగ్రహ సమర్థుఁడు. వానినే భగవానుఁడని లోక మంతయుఁ బూజించుటలేదా ? కావున నూరేండ్ల మానవ జీవితమును వేయేండ్ల జీవితమనుకొని సంపదల సంగ్రహించవలెను.

ద్విజ :- సంపదల సంగ్రహించిన నరుఁడే నారాయణుఁడగునని కదా ! అటు లైన ఈ విశ్వసృష్టి స్థితిలయము నొనర్చఁగల శక్తి యీనరునకు సంభవ నీయమగునా ?

దృఢ :- సృష్టిని చేయువాఁడు పరమాత్మయని యానీతలంపు ? నిరంతర సంచల నాత్మికమగు నీ పరమాణు కేంద్రీకరణమే పదార్థసృష్టి. మరియు వానివికేంద్రీకరణమే వానిదగునాశము. అట్టి పరమాణువులనాదిసిద్ధములు.

ద్విజ :- దృఢకేశీ ! నీవనిన యీ నారాయణత్వము దయా ధర్మములవలనను, బరోపకార పరాయణత్వము వలనను సంపాదించరాదా ? అది కీర్తి కరముగాదా ?

దృఢ :- న్యాయధర్మములతోఁ గష్టించువాఁడు లక్ష్మీపతియగుట కల్ల. అట్టి వాఁడు పరిమితావసరములఁ దీర్చుకొనుటకును గష్టపడుచుండగలఁడు. బలహీనులతలలను నిచ్చెనమెట్లుగా నొనర్చివానిపైఁ బదములుంచి, యధి రోహించిననే పదవిచేఁ జిక్కఁగలదు. బడితగలవానిదే లోకము. పైస గలవానిదే నాకమని తెలియుటే వివేకము. చిన్న చేఁపను పెద్దచేఁ పతినుట ప్రకృతి ధర్మము. అది తప్పనుకొనుట ఛాందసాచారము కీర్తి కై మోమోటమితో సుఖములనే జారవిడుచు కొనుటయునొక విధమగు పిరికితనమే కాదా !

ద్విజ :- ఇదియే సుఖానుభవ రహస్యమందువా ?

దృఢ :- ఇదే జీవిత లక్ష్యముగా నుంటవలననే, యీ సామ్రాజ్యాధిపతులు అశ్వమేధమో గోమేధమోయని పెట్టి దిగ్విజయ యాత్రయను నెపమున ననేక రాజ్యములఁ గొల్ల గొట్టిరి. పైనుండి యది రాజధర్మమనియుఁ బ్రాహ్మణులచేఁ బ్రచారము నేయించిరి.

ద్విజ :- అయినచో నీ జారచోరాది పాపములచే దానధర్మాది పుణ్యములచే వచ్చునరక స్వర్గములన్నియున బద్ధములేనా ?

దృఢ :- ద్విజిహ్వా నీవెంతటి యమాయకుఁడవు. దేవుఁడే కల్పితమైన యబద్ధ మనిన నీదేవలోకములగు స్వర్గనరకములు కల్లలుగావా ! ఈ నరకముల

బెదరింపులవియసమర్థులైన యాడువారలేడ్చి శపించు శాపములవంటివి. ఈ పుణ్యస్వర్గములను నవిబాలుర నోరూరించి పజ్జనున్న వస్తువులలాగు కొనుటకై పన్నినమచ్చువలలు. వీనినమ్మిన వాఁడెవఁడు సుఖించెను ? ఒకనిమృతి మరియొకని జీవనమనుటయు నొకని నష్టము మరియొకని లాభమ్మనుటయుఁ బ్రపంచమున గాన వచ్చునగ్న సత్యము.

ద్విజ :- చెలికాఁడా ! ఒక గోవునుచంపి దానిమృతాహారమును భక్షించుట కన్ననొక గోవును బెంచిదాని యమృతాహారమగుపాలఁ ద్రావుటలు భయ తారకము గాదా ?

దృఢ :- ఈ నీతులు నియమాలు పుణ్యపాపాలుసస్య రక్షణ కేర్పరచిన బెదురు బొమ్మలవంటివి. వానిగాంచి పశువులు బుద్ధిలేనివి కావున వెరచు కొనును. బుద్ధిగల మానవుఁడెవఁడును భయపడఁడు. మన యాయుః పరి మితియే స్వల్పమననందీ గ్రుడ్డి నియమాలతో సుఖదూరులమగుట లిచటనే నరకవాసమగును. ఇఁక గోవు విషయమందువా ? మనము దానికిపుడు శ్రమపడిమేఁత వేసిన రేపెన్నడోయది యొసంగనున్నపాలపై యాధార పడినేటి యాకటితో మలమలమాడి సమయవలసినదేనా ? దాని కంటె సిద్ధాన్నములగు రక్తమాంసాదులే శ్రమలేకుండ సమయమునకు లభించు నాహారములు.

ద్విజ :- అంతేనందువా ?

దృఢ :- బ్రదుకుట నిశ్చయముగాని భవిష్యత్తు కన్నను, వర్తమానము నుపయోగించుకొని వర్ధిల్లుటే బుద్ధి లక్షణము. ఒక జీవమునకు మరియొక జీవము ప్రకృతి సిద్ధమగు నాహారమై ప్రభవించినప్పుడే హింసతప్పుకాదని తేలిపోయినది. తరులతాదులలో ప్రాణములేదా ? వానిని మాత్రము హింసించ వచ్చునా ? అపుడు దేనిదిని బ్రదుకుటలు ?

ద్విజ :- స్వర్గనరకములబద్ధములైనను పూర్వజన్మకృత పుణ్యవిశేషము వలన, నదృష్టవంతుఁడై యీ జన్మలో సుఖించఁగలఁడనుట, ఆగర్భ శ్రీ మంతులైన వారెందరో నిదర్శనము గాదా !

దృఢ :- స్వర్గనరకములవలెనే పూర్వోత్తర జన్మములు గూడనసమర్థులు కడుపునింపుకొనుటకై వేసిన యెత్తులని తెలియవలెను. అదృష్ట మందువా ? దృష్టముకాని యుపాయమని యనవలెను. భాగ్యవంతుఁడగు వాఁడో వాని పితరులో యసమర్థులను దోచుకొనుటకై యసమర్థులకు దృష్టము కాకుండ అనగా తెలిసిరాకుండఁ జేయు సులభ కార్య సాధనో పాయమగు "మోసము" అని తెలియుము. ఎదుటి వానికిఁ దెలియునట్లు వాని సంపదలఁ దోచుకొని నది చౌర్యమో లేక దౌర్జన్య మోయనబడిన యపకీర్తి భాజకమగును అటులుగామినది యదృష్టమై మనపాలిటి భాగ్య దేవతయగును.

ద్విజ :- అయిన నీవనినటులీరీతి దోచుకొనలభ్యమగునర్థము తద్వారా నెర వేరు కామము అనునివిరెండే నిజమగు పురుషార్థములు గదా ?

దృఢ :- అంతే, అందునర్థ పురుషార్థము కామానుభూతికిఁ గారణము. ఎంత డబ్బు నార్జించినను సర్వేంద్రియ సుఖములలో నగ్రగణ్యమగు స్పర్శా సుఖకారిణియైన స్త్రీని బెండ్లాడి సుఖించుటకే కదా ! కావున కారణ పురు షార్థమగునర్థము కన్నను గార్య పురుషార్థమగు కామమే ప్రధానము. ఎట్లందువా ?

ఆరయ నాల్గునాళలనె యంతమునొందెడి యీ ప్రపంచపుఁ
సారము కాసు, కాంత, లయి స్వర్గసుఖమ్ములఁ జూపునెందుదీ
నారముకన్నమేల్సుఖము, "నారియెసు"మ్మని మూడు మూర్తులుఁ
దారవచింపరాకొ్కా కరణత్రయసాక్షిగ దైవరూపతఁ.

ద్విజ :- బాగు బాగు ! త్రిమూర్తులును త్రికరణ శుద్ధిగ దీనినే వచించినా రనుట లెంతయు సత్యము. విష్ణువు హృదయమున బ్రహ్మనాల్కపై శివుఁడర్థ శరీరముగా భార్యలనుంచి సుఖింతురు గదా ! వారికిని నారీ సుఖమే చరమ లక్ష్యమని తెలియనగును.

దృఢ :- అందులకే సుందరియగు వైశాలినిం బరిణయింపఁ గోరి యొక వ్యూహమునురచింపఁ దలచితిని. ప్రత్యర్థి విశ్వజిద్రణక్రీడలోఁ గెల్చిన

విశ్వవీరుఁడు. కరందముఁడన్నిట నతనియయ్యయనదగినవాఁడు. ఇచట మన యదృష్టదేవతవంచనో పాయమెట్లు ఫలించునో చూడవలెను. నీవేమో మంచి చెడ్డయని మహాపూర్వపక్షములు చేయుచుంటివి. ఇంకనైనను నీమనస్సు కుదుటఁబడినదా !

శక్తిచేత గెలువఁ జాలని శత్రువున్
యుక్తిగెల్చి మదమునుడుపవచ్చు
ప్రాణహానిఁ జేయుభయద శార్దూలమున్
పశువు నాసచూపి పట్టవచ్చు.

ద్విజ :- నీవేసినయుక్తిచూచాయఁగనైననాకుఁ దెలియఁ జేయుము.

దృఢ :- వృథా ధర్మాచరణ జపము నొనర్చుటకన్న మర్మ మెఱింగి మాయా ప్రయోగమొనర్చుటే మనకు శీఘ్ర విజయ ప్రదము. ఇంకనే జేయు నుపాయమును వినుము. మున్నొకమా రవీక్షితుఁడు కణ్వపుత్రునికి గురుపూజ నొనర్పఁబూలకై యొక వృక్షముపై దూరమునుండియే యొక బాణమును బ్రయోగించెను.

ద్వి :- అపుడేమి జరిగినది ?

దృఢ :- అది యతని బంధనమొనర్చుటకునై యుద్దేశించు రహస్యము నెరుక పరచినది.

ద్విజ :- ఆ రహస్యమేది ?

దృఢ :- ఆ వృత్తాంతముఁ జెప్పరాదు. చెప్పినవాఁడు ప్రమాదపతితుఁడగును.

ద్విజ :- అదినీకెట్లు తెలిసినది ?

దృఢ :- ఆసమయమున నేనొకకామరూపము ధరియించి యతని వెన్నాడు చుంటిని.

ద్విజ :- అటులైన నదిగోప్యముగానే యుండనిమ్ము.

దృఢ :- కానినేనొక ప్రయోజనము నీవలన గోరి పిలిపించితిని. దానికిని నీసాహాయ్య మవసరము. దానివలననీకును నాకునులాభకరము.

ద్విజ :- ఏమది ? నిశ్శంకగా వివరింపుము.

దృఢ :- మొన్న నే నొకసారి యరణ్యములోఁ దిరుగుచుండగా, నపూర్వ లావణ్యవతియగు నొక గంధర్వ స్త్రీ రాల్గరుగగాన మొనర్చుచుండెను. ఆమెను నీకు నుపాయనముగానర్పించి నాస్నేహ ప్రేమలఁ బ్రకటించి నీమెప్పుగాంచ నిచ్ఛగల్గెను. ఆమెయు వైశాలినికి దీటువచ్చు సౌందర్య వతి. ఆమె లభించిన నీభాగ్య మనవలెను.

ద్విజ :- నీకు నాపైఁ గల ప్రేమ వాత్సల్యములనిర్వాచ నీయములు. దానికినే నెంతయు సంతసించుటేకాక గర్వించు చున్నాను. ఆమె యిపుడెచట నున్నది. నీకు నాతోఁ గావలయు సహాయము నర్థింపుము.

దృఢ :-ఆమె ప్రతిదినము సాయంతనపువేళ మలయాచల సానుప్రదేశముల, సుందర చందన కానన సీమల విలాసముగాఁ బ్రియుని గూడి విహరించు చుండును. ఆ మంజుల కీరమును బంజరమున బంధించి తెచ్చుటకు నా మాయా మారుతాస్త్రము నొసంగెదను.

ద్విజ :- తప్పక తెచ్చెదను. నీవాయస్త్రమును వైశాలిని గొని తెచ్చుటకుఁ బ్రయోగించనుంటివని వింటినిగదా !

దృఢ :- (సాలోచనుఁడై స్వగతముగా) ఇప్పుడీ మాయా మారుతాస్త్రమునీ ద్విజిహ్వున కిచ్చెదను. దీనితో నితఁడా గంధర్వ కన్యను హరించు కొనుచుఁ బోవును. అపుడు నేను విప్రవేషధారినై, యాగంధర్వ కన్యను వలచిన వజ్రదంతునితో, నీ ప్రియురాలిని ద్విజిహ్వుఁడు మాయా మారు తాస్త్ర ప్రభావమున పాతాళపురికి హరించుకొని పోవుచున్నాఁడని తెల్పెదను. అపు డావజ్రదంతుఁడామె విముక్తికై వేదన జెందును. ఆ సమయమున నేనతనికి "వీర్వవీరుఁడగు నవీక్షితుని శరణము వేడుము. నీ ప్రియురాలి బంధ విముక్తియగు"ననియుపాయము నెరిగింతును. అంత నావజ్రదంతుఁ డవీక్షితుని శరణమువేడును. అపుడవీక్షితుఁడు మాయా మారుతాస్త్ర నిర్మూలనకై యేకైక సాధనమగు నారాయణాస్త్ర ప్రయోగ మొనర్చును. అది యదనుగాఁగొని స్వయంవరాగతుఁడగు నవీక్షితుని నేను సకల రాజన్య సమేతుఁడనై నాగపాశబద్ధుని జేసివధింతును. ఇట్లే మాయా మారుతాస్త్రము నొసఁగి యీ ద్విజిహ్వునకా గంధర్వకన్య నాశపెట్టి యవీక్షితునుండి

నారాయణాస్త్రము విడఁజేసినాకార్యము నెరవేర్చుకొనెదను. నారాయణాస్త్రమున్నంతవఱ కవీక్షితుఁడజేయుఁడు.

(చిన్నగానవ్వి) (ప్రకా) ఆప్త మిత్రమా! ఆలోచనము స్ఫురించినది. నేను వైశాలిని నపహరించి తెచ్చుటకు 'ఘన సమీరావర్తమను' నస్త్ర ప్రయోగము గనిపెట్టితిని. ఇదిమేఘముపై నధివసించి దిగ్బంధనము దప్పించుకొని వెడలి వచ్చును. మేఘమునకు దిగ్బంధనములేదు.

ద్విజ :- నిజమా ? నాకొఱకై నీవు నష్టపడరాదు.

దృఢ :- తప్పక. అదా శిరశ్శృంగునకిచ్చి పంపువాడను నీయాన. అదియాకాశమార్గగామియై వైశాలినిం గొనితెచ్చును. మన శిరశ్శృంగుడాయస్త్ర ప్రయోగము నభ్యసించి సిద్ధినొందినాఁడు. దీని నాదిగ్బంధనమడ్డు పెట్టఁజాలదు. ఇఁక దీనిపై నాయవీక్షితుఁడేమి యస్త్రము ప్రయోగించి విడిపించునో చూడవలెను.

ద్విజ:-గజకర్ణుఁడాదిమనయనుయాయులనెందరినో నాయవీక్షిత్తుబలిగొన్నాఁడు.

దృఢ :- ఆ యవీక్షితునింతటి శస్త్రాస్త్ర విద్యావిశారదు నొనరిఁచి మన రాక్షస జాతికి మహాపకార మొనరిఁచిన యా కణ్వపుత్రాశ్రమము ధ్వంస మొనర్పుము. అట్లే యా సువ్రతాది మునుల యాశ్రమములకు చిచ్చుపెట్టి యజ్ఞకుండముల సురాభాండములనెట్టి మునికన్యలఁ జెరఁ బెట్టి కసిదీర్చు కొనుడు. మీకునేనున్నాను. ప్రజానీకమును దోచుకొనితినుడు. క్రొన్నెల నేలు వారి వన్నెల కన్నెల మీకామాగ్నికి గురిసేయుడు. వెరువకుడు.

ద్విజ :- అది నీవు చెప్పుటకు ముందే మొదలైనది. దానికి నీయండయు లభించినది. ఇంకనే నాపని చూచుకొందును. నీవు నిశ్చింతగా నుండుము.

(అని వెడలును)

దృఢ :- నా యెత్తునేడు చక్కగా సాగినది.

(అని దృఢకేశియు నిష్క్రమించును)

తృతీయాంకము

# చతుర్థాంకము

## తెరయెత్త నరణ్య ప్రాంతము

(అవీక్షితుఁడు దృఢకేశిని తదను యాయుల వెదకుచుండును)

**అవీ :-** ఎంత వెదకినను ఈ మాయావి కాన గాన రాడయ్యె నేమిసేయుట ?

(నభోమార్గాన రాకుమారి నపహరించికొని పోవుచున్నాఁడు-కొనిపోవు చున్నాఁడు చిల్కపల్కు వినఁబడును)

**అవీ :-** (వినుచు) (స్వ) అష్టదిగ్బంధనముతో సువ్రత మహర్షి యీ యాశ్రమంబును సర్వథా రక్షించుచున్నారు. నిశాటులిందుఁ బ్రవేశింపనాస్కారమే లేదు. ఈ చిల్కతా నిటులు పల్కనేమి ? ఏ రాక్షసుఁడైన రాకుమారి నెత్తుకొని నభోమార్గమున బోవునేమో ! నేనును నభస్సం వర్తకాస్త్రమున నీయాశ్రమ దిగంత రాళము తారాపథముపరకు సంరక్షించఁ బ్రయోగించు చున్నాను. (అని అస్త్రమును బ్రయోగించును) ఇంక నెట్టియస్త్రశక్తియైనను వ్యక్తియైనను నిందుఁ జొరఁజాలరనుట నిస్సందేహము. (నభమ్మునకలకలము) (అవీక్షితుఁడు చెవినిడి వినుచు) ఏమి యీ కలకలము ? రాత్రించరునిదికాదు గదా ! (ప్రక్కతెరను వీక్షించుచు) అదో ! అరపు. ఒక రాక్షసుని శవమచట పడిపోయినది. ఇంకనీపైనుండి వచ్చున దెవరో ? వైశాలిని విస్మృత శరీరము మారుతాస్త్ర హతిఁ బడుటఁ గాంచి) ఎవరో కాదు. రాకుమారి వైశాలినియే. ఈ చనిపోయిన నిశాటుఁ డీమెను విస్మృతను జేసికొని పోవుచుండెను. నేనే యీ సంవర్త కాస్త్రమ ప్రయోగ మొనర్చకున్న వైశాలిని యీ రాక్షసుల చేతులలోఁ బడిపోవునదే కదా ! ఇది యంతయు నీ రాకుమారి పెంపుడు చిలకచేసిన యుపకృతి. భగవానుఁడు రక్షించినాఁడు. (అని వైశాలినీ శరీరమును సమీపించి) ఇంక నీయమ రక్షింపఁబడినటులే. ఈమె విస్మృతి వాయుటకై యిపుడీయమ మొగముపై నీ సరస్సులోనున్న కమలములఁ గొని వచ్చి తత్సుమ విలసితములైన హిమబిందు సందోహములఁ జిల్కియీమె తాపము పాపెదఁ

గాక ! (అని చిల్కుచు నామె కేలనున్న తనలేఖను గాంచి) నేననుకొని నంతపనియైనది. (అంత వైశాలిని కనులు నులుము కొనుచులేచి సఖియని కరమునతని భుజముపై నిడఁజని కాంచి సలజ్జయై తక్షణమే కొంత దూరము చని నిల్చును)

వైశా :- (స్వ) అయ్యో ! ఇదేమి ? ఎంతపనియైనది. నేనీయరణ్యమునకెట్లు వచ్చితిని. శ్యామల నను వీడి వెడలి రాలేదా? నాకీ విస్మృతియేల కలిగినది? ఈ స్థితిలో నేను శ్యామలయే నాప్రక్కనుండి జలమును జిల్కుచుండెనను భావమున లేచికేలు భుజముననుంచఁ బోయితిని. విలోకించుసరికి నీమనో హరమూర్తి తాసాక్షాత్కరించెను. అబ్బా ! ఎంతటి ప్రమాదము వాటిల్లు చుండెడిదో ! ఇంకముందెచటికిఁ బోవుదమన్నను గంపించుచుఁ గాలాడుట లేదు. ఇది యంతయునేమి జరిగినదో జరుగుచున్నదో నాకేమియు బోధ పడుటలేదు. ఇది స్వప్నమో జాగ్రదవస్థయో తెలియకున్నది.

అవీ :-రాకుమారీ! ఒక రాక్షసాధముఁడు తన మాయాప్రభావంబున నిన్నిందు నాకాశ మార్గంబున గొనితెచ్చుచుండ వాఁడిచట నాయస్త్ర ప్రభావంబున జచ్చెను. ఇంక నీవు సురక్షితవు. ఏమాత్రము వెరవకుము (అని స్వగత ముగా) ఔరా ! ఈమెనన్ను నిజసఖి యనుకొని కేలు భుజమునందిడ సిద్ధ పడి విలోకించునంత నవీక్షితా కారముననుండి యామె గుండెలనదలింపఁ జేసిననేను నన్నేమని నిందించుకొనవలెను ? ఇప్పుడు ననుజూచిలేచి సత్వరముగానచటికిఁ బోయినిల్చిన యీామె యాశయాభినయము లెంతయు వర్ణనీయములు గదా !

> వారిజ నేత్ర మోమురక వాలుచు, సిగ్గునఁగేలఁ గీల్చిమే
> ల్హారమణుల్ స్పృశించును, నఖాగ్రములన్మని పంటనొక్కుచున్
> భీరుతఁ గాంచి,. ఫాలమున వ్రాలునెఱుల్ వడిగోటఁ గొట్టుచో
> ధారుణిపైఁ బదాంగుళిసదా విలిఖించుచు లోభనీయయౌ.

వైశా :- (స్వ) నన్నింతటి మహా విపత్తునుండి మరొకమారు కాపాడిన యీ మహాభాగుని ఋణ మీఁగుటెట్లు ? ఇతని ముందు నిల్చుటకు

గుండె యదరు జనించు చున్నది. పదములు వడకి యాడుచున్నవి. ఒక వంకలజ్జా పిశాచము తలవంపులొన గూర్చుచున్నది. నేనేమియుఁ జేయఁ జాలకున్నాను. ఇంక నిలువలే నిచ్చట.

(అని కూర్చొని తృణతోటనమభినయించును)

అపీ - ఎంతయుఁ బరిశ్రాంతయగుట వలననోలేక భీతయగుటచేతనో నిలువ నోడి కూర్చొనినది. ఇపుడీయమనుగురించి యేమని భావింతును ?

లలి నేలంగనమోము వాల్చునెదొ యుల్లంబందు శంకించునా
కెలనంగాంచు తృణాదులేరు నురకన్ గిల్లున్ భువిన్గ్రీయునే
దెలియన్మంగలి మార్గమెవ్వగల వర్తింతు నృనో హారిణిన్
బలికింపంగలనెట్టు లే మిషఁగఁ దత్ప్రాంతఁబువోఁ జెల్లునో ?

ముందరుగఁ దానింతకు ముందటివలెనే యెచటలేచి పోవునోయను శంకగల్గెడిని. ఇక నిప్పుడేమి యొనర్పవలెనో యూహా బాహ్యమైయున్నది. (అని దగ్గర తీవపై ఝుంకరించు గండుతుమ్మెదం గని) ఏమి యీతుమ్మెద మైమరపు ! ఎంతహాయిగా నానందరాగములకు శ్రుతులల్లుచున్నది.

(అని తుమ్మెద కభి ముఖుఁడై) మధుపా !

ఉయ్యేల తీవమంచమున నొత్తని మెత్తని పూలపాన్పునం
దియ్యనితేనె సోన తమిఁ దీరగఁ బానముపేయుచున్నతం
బియ్యేల గొమ్మఁ గూడుకొని యిచ్చమెయి శ్రమియించు చుంటివే
యియ్యెడ యేమినేర్పుగలదించుక నాకెఱిగింతె భృంగమా !

ఎంత పిచ్చి ? యీ భృంగము నాకేమి హిత ముపదేశింపఁ గలదు? కాని దీని యొద్ద మాత్రమేదో యొక నేర్పులేకపోలేదు.

క్రొన్నన నాను భృంగకుల కోమలుఁడేమని బుజ్జగించె నా
తెన్నుతటి ల్లతంగరుగఁ దీయగ మేఘ గభీరవాక్కెదో
యెన్నగఁ బల్లవాళి గ్రసియింపగఁ గోకిలతీపి పల్కెదో
యన్నులమిన్నఁ జేరనొకరైన నుపాయము చెప్పలేరయో ?

(ఇంచుక విచారించి) ఓహో ! తెలిసినది. వీరేయిప్పట్ల తమసవర్ణమైన వేణివైపునుండి సమీపించనాయమకుఁ దెలియ కుండనుండు నను హితో

పదేశమొనర్చు నుపకారకులవలెఁ గనఁబడిరి. కాన నీమె కభేద్య మగునటులీ వృక్షముల మరుఁగు నుండి వెనుకటి పార్శ్వమును సమీపించెదఁ గాక! (అని యామె వెనుకఁ జనినిల్చి) ఓ దైవమా! ఇప్పటికెట్లో సమీపస్థుఁడనగు భాగ్యమునకు నోచుకుంటిని. ఆహా! యీ కృష్ణవేణి సౌందర్య మత్యంత దర్శనీయముగా నున్నది.

తమిముఖేందు బింబ దర్శనమ్మొలయమి
నస్మదీయ హృద్గుహాంతరమున
దాఁగియున్న విరహతమసంపు ప్రతిబింబ
మనగఁ గనులఁ దోఁచెనతివవేణి.
వనిత పాపట మేఘాన వరలు మెఱపొ?
నడిమికిం జీకటులఁ జీల్చునుడు పథమ్మొ
వేనలిన్ వెలుంగునవివి విరుల సరులొ
సఖి విరహ మంటి మురియు నాశాలతికలొ?

తలలోఁ గ్రొన్నెల వెన్నెల లీను నీమల్లియలు నాకునందుబాటులో లేని యీకొమ్మకై నట్లులు సాచునన్నుజూచి నవ్వియాడుచున్నట్లును గవ్వించుచున్నట్లు నీగాలికిఁ గదలియాడు చున్నవి.

వైశా :- (తలయెత్తి పురోభాగము వీక్షించి) (స్వ) ఔరా! ఇదియేమి చిత్రము? ఈ మూర్తి తానింతలో నెచట మాయమయ్యెను.

(నలువైపులఁ గాంచి లేవబోవును)

అవీ :-బేలా! ఏల యాలీలఁ బోఁ జూతువు? నీ సమీపస్థుఁడనగు భాగ్యమునకు నోచుకున్నందులకు నన్నునే నభినందించు కొనుచున్నాను. సాదరముగ నీతోవ్యవహరించు నన్నుజూచి భీతిగొననేల? నేనెందును నీకు హితుఁడనగు స్నేహితుఁడనని భావింపుము.

వైశా :- పూజ్య చరితా! సములతో స్నేహితము హితకరము గదా! మీతో నెందుఁ గూడఁదుల దూఁగలేనివారు మీ స్నేహమునకుఁ బాత్రుల మను కొనుట యధికారము మించిన యాశయగునేమో?

అవీ :- రాకుమారీ ! యీ చిత్రమెవరిది ?

(అని తనవద్దనున్న వైశాలినీ చిత్రముఁ జూపును)

వైశా :- (చిత్రము వైపుఁజూచి) ఆ చిత్రము మీ చేతిలోఁ నుండదగినదియు మీరు చూడఁ దగినదియుఁగాదు. (అని తలవంచుకొని లజ్జప్రకటించును)

అవీ :- రాకుమారీ ! ఈ నీచిత్రము విశాల నృపాలుఁడు పంపినారని నా మిత్రుఁడు మీస్వయంవరాహ్వానముతో నాకుఁ బంపించెను. అంతకు ముందే నేను నీ సౌందర్యమును బ్రత్యక్షముగాఁ జూచినవాఁడనగుటచే నినుగన్నులఁ జూచిన యానంద మీ చిత్రదర్శనమున నేమాత్రము లభించకుండుటచే నాచిత్రమును గురించి నాయనుభూతి మిత్రునికీ లేఖా రూపమున దెలియఁ బరచితిని.

వైశా :- ఏమని వ్రాసితిరి ? వివరింపఁ బ్రార్థన.

ఉ :- గాత్రము పుల్కలెత్త నిటుగాంచదు రెప్పల నప్పళించియో
మిత్రమ ! యీ విశాల సుత మిన్నక యుండునదెన్ని పల్కినన్
చిత్రముగాఁ గనంబడును చేతమెయున్నటుతోచ దీమెయే
మాత్రము నచ్చలేదచటి మానినియే కడు నచ్చెనాకికన్.

ఇది చిత్రముగా నున్నదనియు రెప్పలనప్పళించి యపాంగములఁ బరపఁ జాలదనియు మాటాడదనియు, మనసులేని యచేతనమనియు వ్రాసి యీ చిత్రములోనున్న వైశాలిని కంటె నిజమైన వైశాలిని వగునీవే నాకు చాలానచ్చితివని నీపైఁగల సద్భావము నీలేఖలో స్నేహితునకు వెల్లడించితిని. అంతేకాని మరేమియులేదు.

వైశా :- (మందహాసమొనర్చి తనలో) నేనీతనిలేఖ నపార్థమొనరించి కొని బాధపడితిని. హృదయమా ! ఇంక శాంతిని జెందుము.

అవీ :- రాజపుత్రీ ! నీకు బాధగల్గించిన నా యీలేఖను చించివైతును.

(అని నమీపించును)

వైశా :- వలదు. వలదు. మరి మీరు మీ చెలికానితో నమృత సరస్సువద్దఁ గూర్చొనియుండి యీకన్యక నా కేమాత్రము నచ్చలేదని నుడివిన పల్కుల కర్థమేమి ?

అపీ :-అదా ! మిత్రుఁడట్లనుట కునన్ను నిర్బంధించినాడు. ఊరక బాగున్న దని మెచ్చిన నీకనుల దృష్టిదోషము దాకి యామె బాధపడుననియు నందులకే యేమియు బాగులేదని యనుమనుచు బలిమిచేసెను.

వై శా :- (లజ్జాస్మిత చపలాక్షులతోఁ జూచుచుఁదల వాల్చుకొని చనఁజూచును)

అపీ :- (తొందరగా వైశాలిని గేలువట్టియాపి) రాకుమారీ ! నా యీసాహస మును మన్నింపవేడుదును. నన్నన్యథా భావింపవలదు.

వై శా - (స్వర్శా సుఖమునటించుచు క్షణమాగి లజ్జాపరవశయై యేమో వినుట నటించి) దయామయా ! అచట విడిచిన నాపెంపుడు చిలుక పక్షములేదో లతావలయమునఁ జిక్కుకొనినదై యుండును. వ్యాకులముతోఁ బదేపదిగఁ బిల్చుచుండెనేల ? నేజనవలయును.

అపీ :- (వైశాలిని కేలుంగొని యాపుచు)

లలన ! నీ రూపలావణ్యలతలఁజిక్కి
యాడుచును నెటుతోచక యరచునాదు
ఎడదచిల్క పల్కులు వినఁబడుటలేదె
చిక్కువడె నెచ్చటనొ నాదు చిల్కయందు.

వై శా :- (మరలనొక క్షణమాత్రము స్వర్శా సుఖమునటించుచు) ఆర్యా ! కాలి చప్పుడు వినఁబడు చున్నట్లగునేమి? నన్ను వెదకుచు శ్యామల తాను వచ్చుచున్నది కాఁబోలు. నేజనవలెను. (అని కేలిగ్గుకొనును)

అపీ :- సఖీ ! భీతిలకుము. ఆమెకు నీవిచట నున్నదెట్లు తెలియును ?

వై శా :- దేవీ ! పూజా సమయమతిక్రమించుచున్నది. సువ్రతులరుదెంచి నన్నడుగుదురేమో? నేబోవలసియున్నదానను. క్షమించుడు. నేనుగనబడక యున్నవారు చింతార్ణవమున మునిఁగి పోవుదురు.

అపీ :- పడతినిన్నును నన్నును నెడపరుచఁగఁ
జూచుచున్నది లజ్జాపిశాచమౌర !
అలముకొనఁ జూచు తరులతాభ్యంతరమున
వీచివిడఁ గొట్టువడిగాలి విధము దోచు.

ఈ వాయువును నే నసార్థమొనరించు కోనుచుంటిని. అదో! నాకీ ప్రకృతియంతయు నుపకరించుచున్నట్లున్నది చూడుము!

వాయువెదురయి కొంగునావంక కీడ్చు
నలదిశా ముఖములు మండు, నవనియంగ
ముడుకు, దినమణి సూర్యుండు నొకటనిన్ను
తీక్ష్ణముగఁ జూచు, వర్దంద్రుడు తీవయాంద్రుడు.

వైశా :- ఆర్యా! సఖీ జనముచే విడువబడిన నే నసహాయను. నాకేమియుఁ దోచుటలేదు. నన్ను విడిచిన బున్నెముండును.

అవీ :-రాకుమారీ! సకల మహీమండలమును గెల్చి యఖిల రాజన్య మండలి పై యద్భుత విజయమును సాధించిన యీ రాజకుమారుఁడు నీ కనుసన్నలలో నాడుచుండ నీవసహాయవెట్లగుదువు? అది యసంభవము.

మోమునువాడె ఫాలమున మూగెను జెమ్మట లీయరంటి యా
కోమలహస్త సంతతులఁ గ్రొంజిగురాకుల వీచువీవనల్
తేమయొకింత నార్పశ్రమదీర్ప నొకించుక నిల్వదోషమే
భామిని! తానవీక్షితుఁడె పాసిచనున్ నినుభీతిమానుమా

వైశా :- వలదు. వలదు రాకుమారులు నా యవినయమును మన్నింపఁ బ్రార్థితులు.

అవీ :- వైశాలినీ దేవీ! నిన్నిట్లని పించినది నానవపరిచయమే కాని నీ యవినయముకాదు. అదియుఁ గాక నీతో నొక యభ్యర్థన మొనరింపనెంచి యింత సేపిచట నుంటిని. అన్యధా భావించవలదు. రాజపుత్రీ! ముకుళిత కమల ప్రసూన మకరందమును మధుపమెపుడు నీచ రాక్షస ప్రవృత్తితోఁ గ్రోలఁజాలదు.

వైశా :- రాకుమారుల యాదేశము నెఱుంగఁ గోరుదును.

అవీ :- కోమలీ! ఇదో! నీ స్వయంవరమునకు రానున్న యీసకల రాజపుత్రుల చిత్రములొకే దానిలోఁ గల్గుపటమును నీముందుంచు చున్నాను. వీనిలో నీయమూల్య ప్రేమకుఁ బాత్రుఁడెవఁడేని గల్గినచోఁ దెల్పినన్ను

గృతార్థుని జేయఁగలవని విశ్వసించు చున్నాను. ఈ రాజులను గూర్చిన వివరములిది వరలో నీ చెలులు నీకుఁ దెల్పియే యుందురు. (అని చిత్ర పటమును ముందిడును) (వైశాలిని యా చిత్రపటమును గాంచుచు నిరుత్తరయై లజ్జనటించును) వీరిలో నీ ప్రేమపాత్రులేలేరా!

వైశా :- (తలపై కెత్తి లజ్జతో నవీక్షితుని గని) నాకెవ్వరును దెలియరు. నేనెవ్వరిని దెల్పలేను. క్షమించుడు.

అవీ :- నీవు వరించిన దన భాగ్యమని భావించు నవీక్షితుఁడే నందుల కర్హుఁడగునా? (వైశాలిని శృంగార లజ్జలతో మందహాస మొనర్చి తల నేల వాల్చుకొనును) (అనురాగముతోఁ జుబుకమును ముట్టి తల నల్లన లేవనెత్తి ప్రేమతో నామె మోమును గాంచుచు) రాకుమారీ! చెప్పవేలః ఈ యవీక్షితుఁడే నందుల కర్హుఁడగునా!

వైశా :- (చిరు నవ్వుతో) ఊఁ హూఁ (అని శిరము నడ్డముగానూపి తన యనంగీ కారమును దెల్పును)

అవీ :- నీయనంగీ కారమది నిజమా! లేక నన్ను జమత్కరింపనా? నేను నీవు నన్నంగీకరింతువనే యాసించి విశ్వాసము గల్గియున్నాను. చమత్కారమును మాని నిజముగా నీ ప్రేమకునే నర్హుఁడనా కానా తెల్పుము. తెల్పవేమి? నాతోఁ బరిణయమామోదమేనా? (అని యభ్యర్థించును) (వైశాలిని యనురాగపరవశయై యవీక్షితుని మోమును బ్రణయదృష్టులఁ జూచుచు శిరమునూపి యంగీకారమును సూచించి దరస్మితయై తలవంచు కొనును అది గాంచు నవీక్షితుఁడు తృప్తిగా మందహాస మొనర్చి) సఖీ! నాజన్మధన్యమైనది. గాంధర్వ విధినాశ్రయించియో కల్యాణ పద్ధతినను సరించియో? తెలియఁ జేయవేడు చున్నాను.

వైశా :- (లజ్జతో) పితరుల కనుల చల్వగాఁ గల్యాణ విధినేయని మనవి చేయుచున్నందులకు నార్యాపరాధ సాహసనగు నేనుక్షంతవ్యను.

అవీ :- సఖీ! యిందు క్షమించు నంతటి యపరాధమే మున్నది?

వైశా :- ఇంక నేజనవలసియున్నది. ఆజ్ఞనొసంగుడు.

అపీ :- (చిరునవ్వుతోఁ బ్రేమ వీక్షణలఁ బరపుచు)

ఉవిద ! నారాగరస పీడితోష్ట మిథున
మడరి నీమృదుగండ శయ్యల రమించ
నెంచునీ చిన్నిముద్దు చెల్లించకుండఁ
జనగలవె యప్పుడే ! నీదుసదనమునకు.

(అని చెక్కు గిల్లఁ బోవును) వైశాలిని కేలుమాటిడుకొని లజ్జాను రాగములతో మోముదాఁచు కొనును. (అపీక్షితుఁడు వైశాలిని మాటిడుకొను కరమును గ్రహించును)

వైశా :- ఆర్యా ! నన్ను విడువుడు. నేనాశ్రమమునకుఁ జనవలెను.

(అని లజ్జితయై కేలిగ్గుకొన బ్రయత్నించును)

అపీ :- కరము కరముల మాటగు కల్కి ముద్దు
మోముకై కడు నారాటమువడు మనము
తీవెలందాఁగి యాడెడి పూవునాన
దోపకభ్రమరించు మధుపము కరణి.

(వైశాలినికి నామె చిత్రపటముం జూపుచు) ఈ చిత్రపటమును దిలకింపుము ! నేనీ చిత్రమును జూచియే నా మిత్రునకు నాలేఖను వ్రాసితి. నిజముగా నత్యంత లోభనీయములగు నీప్రస్తుత లజ్జాభినయదృష్టులఁ జిత్రింప నీచిత్రకారిణి లేఖిని దీనిలో నేమూలకు సరిపడెను ? (ఆ చిత్రమును వైశాలిని చూచుచుండును అంత వైశాలిని రెండుచెక్కిళుల గ్రహించి సానురాగదృష్టితో) చెలీ !

సరసిజమంచుఁ బెభ్రమను సంఘములై పలు చాళ్లగాగఁ ద
త్పరతఁ బయింబయింబడుచు బంభరయూధము నీదుతేనియల్
గురిసెడిమోముదమ్మినిటు గ్రోలగ వ్రాలెడినో యనంగముం
గురులవిఫాల భాగమును గ్రూరతగప్పెడిఁ గోటగొట్టెదన్.

(అనిముంగురులను బైకి దువ్వుచుఁ బరవశుఁడై ముద్దిడు కొనఁబోవును)

వై శా :- (లజ్జతోఁ జేయినడ్డు గానిడుకొని) అదో ! శ్యామల వచ్చు చున్నది చూడుడు ! (అపీక్షితుఁడు బెదరుచూపులతోఁ దొందరగాఁ జప్పున దూరము తొలఁగి పథము వంకగాంచును)

అపీ :- ఎవరును వచ్చుటలేదే ! నన్నెంతలోఁ జంటి పిల్లనటులు భయపెట్టి యుపాయముగా దూరము దోలితివి. నీవిటనున్న దామెకెట్లు తెలియును.

వై శా :- (చిరునవ్వుతో) నాకొఱకై శ్యామల వచ్చినన్నచ్చట గాంచకున్న నాందోళన చెందును. కావున నన్నచటఁ బ్రవేశపెట్టిన మీకు నింకను బుణ్య ముండును. నన్ని మహావిపత్తునుండి కాపాడిన మీకునేఋణపడియున్నాను.

అపీ :- సఖీ ! అటులైన నీవు నావెంటరమ్మ ! కొంచెము దూరములోనే సువ్రతాశ్రమోద్యానముగలదు. (అని తీసికొని చని ఆశ్రమమున ఎప్పటి చోటఁ బ్రవేశపెట్టును.

తెరయెత్త సువ్రతాశ్రమము

అపీ :-రాకుమారీ! నీ యీ విపత్తు గూర్చి వారికిఁ దెల్పకుము. భీతావహలై ఖేదింతురు.

(నేపథ్యమున) "వైశాలినీదేవీ ! ఎచ్చటనున్నావు" (అని ధ్వనివిన బడును) (వైశాలిని యపీక్షితునుండి మిక్కిలి దూరముగాఁ జనినిల్చును) అపీక్షితుఁడొక పొదమాటునకుఁ జనినిల్చి చూచును)

అపీ :- ఇప్పట్లు నీయమసఖియగు శ్యామలగాఁబోలు ! పిల్చుచునిటకేవచ్చు చున్నది. చేతికందిన ఫలము స్వీకరింపకముందే చేనున్నకొమ్మచివాలున దప్పించు కొని పై కెగసినది.

ఎంతయుఁ బ్రేమ మీరమొగమెత్తి రవుల్లి మకమ్ముతోడవా
పొంతకుఁ జేర్చిరాగరస పూర్ణలసన్మధు రాధరమ్మునే
వింతునటంచు షట్పదము వీఁకన బ్రొమ్మొగ్గితి నాముఖాబ్జమా
యింతటిలోఁ బ్రదపాలహరి నింతగమున్గుట లేమెఱుంగుదుఽ.

శ్యా :-(ప్రవేశించి) సఖీ! ఇచ్చట నిల్చితివేమి? ఇపుడు నీశరీరమెటులున్నది?

వై శా :- అట్లే యున్నది.

శ్యా :- ఇంతకు ముందు మాటాడుటకునైన స్పృహలేని నీవిపు డొకింత లేచినిలుచుటఁ జూడనయముగాదా ! ఎంతటి విపత్కర సమయములో నైనను హృదయము నొకింత సమాధాన పరచలేకున్నఁ బ్రమాదముకాదా! పూజ్యగురువులు శ్రీసువ్రతులు విదిశాపురమునుండి గురుకులమునకు తామిపుఁడే యరుదెంచి మిమ్ము జ్ఞాపకమొనర్చిరి. ఇంకొక సంతోషవార్త. నీ స్వయంవరసన్నాహములు చురుకుగాసాగుచున్నవఁట. ముహూర్తముగూడ నత్యంత సమీప కాలముననే నిర్ణయమొనర్చిరఁట (వైశాలిని నిరుత్తరయై నిల్చును) ఆఁ! మరచితిని. గురువుగారు మిమ్ము వైశమె కొని రమ్మని యాదేశించినారు త్వరగాఁ బర్ణశాల కరుగవలెను. నేను నీవపుడచటఁ బడుకొనుటకై పూసెజ్జపైఁ బరచిన పట్టుశాలువను గొని నీకటు లందవత్తును. నీవునెమ్మదిగా రమ్ము! (అని చనుచుండును)

(అవీక్షితుఁడు పొదమాటు నుండి మోమును జూపి వైశాలినిం దమక మునగాంచును.

వైశా :- (తీవనుండిరాలిన పూపును మిషనిడి కాంచుచు)

ఓ యవీక్షితానిలమ ! నీ వీలతాంగి
యంతరంగ ప్రసూనమ్ము నపహరించి
యాక్రమించితి దీని సర్వస్వ విభవ
మూరడిల్లు మింకేటి కీయురుకులాట.

అవీ :- ధన్యోస్మి ! యీమె భావగర్భితములగు ప్రేమాలాపములతో నిపుడు కృతకృత్యుఁడనైతిని గదా ! (అని వైశాలినిన్సమీపింపఁ బోవును) (నేపథ్యమున) "దేవీ యాలసింపక త్వరగారమ్ము"

వైశా :- (ప్రవేశించెడి యవీక్షితుని గని) అబ్బ! ఎంతటి సందిగ్ధ సమయ మరుదెంచినది. అదో ఒక వంక శ్యామల తాఁబదేపదిగఁ బిల్చుచునే యున్నది. ఇంకనే జనమి విధిలేదు.

(అని అవీక్షితునపాంగావలోకనమున గాంచుచుఁ జనును)

అపి :- చూపులనియెడి మారుని తూపులేసి
ఎదనువేఁటాడి కైకొనియేఁగు నీమె
ఎడదతోఁ గూడి నాయాత్మయేఁగు చుండెఁ
బూవుతోఁ బాటుచనియెడి తావివోలె.

ఆ మరుఁడీమెముఖశశిని దాచి నన్ను విరహాంధకారమునకు గురి చేసె. ముందు మార్గమెయ్యది ?

పూలబాణాలతోడనె శూలిగుండె
లదరఁగొట్టి రెండొకటిగా నతుకువెట్టి
గంగనౌదలఁ దాల్పగా లొంగదీసె
చచ్చిపుట్టిన మరునకసాధ్యమేది ?

అకటా ప్రస్తుతమామె లజ్జాభినయము లెంతయుఁ దలపునకు వచ్చుచు నన్నానందావేదనలకు గురిసేయుచున్నవి.

అడరెడి ప్రేమఁ దర్జని నఖాగ్రముతో ననచెక్కు గిల్లగా
దొడరిన ముద్దరాలపుడు తోరపులజ్జ నిషేధ భాషన
ద్దిడుకొనికేలుఁ దమ్మిమొగ మెంతయు వాల్చి శిఖాలివంచి త
త్ఫలమును నందబో వశము దప్పిపయింబయికేఁగు కొమ్మయై

ఈ యవీక్షితుఁడును నీయమూల్య ప్రేమ కర్హుఁడగునా యనినంత నాయింతితాను,

నుడువలేక నుడువలేక కడకొకింత
శిరము నూపియంగీకార సరణిఁ దెల్పి
విరియు మందారకుసుమాన మెరయుచున్న
మంచుముత్యాల సరులన మగువనగియె.

(అంత విదూషకుఁడు ప్రవేశించును)

విదూ :- సఖా ! నీకొక సంతోషవార్త దెల్పెదను. రేపే వైశాలినీదేవిగారి స్వయంవరము జరుగనున్నది. మనమిపుడే యచటి కరుగవలసియున్నది. ఇచటికి మిక్కిలి సమీపముననే విశాలనగరము గలదఁట.

అవీ :- ఆమె నన్నువరించునను విశ్వాసమేమున్నది. విశ్వసించినను విధి యనుకూలపడవలదా!

విదూ :- నిన్ను దప్పనింకెవరి నామెవరించును? ఇదివరకేని న్నామెవరించినట్లు నీ మోముకళయు నానాటి యామె యపాంగములును జెప్పక చెప్పుచున్నవి. మనమింక శ్రీ సువ్రతులవారినిదర్శించుకొని స్వయంవరమునకై నేడే పోదము.

అవీ :- ఆ రాక్షసుని వధించి ప్రజా సంక్షేమ మొదవఁ జేసి కాని గురు దక్షిణ సమర్పించ నంటిని. వైశాలినియు దృఢకేశిని వధించి తమరాష్ట్రి ప్రజాహిత మొనర్చిన వీర వర్యునే పెండ్లియాడు సంకల్పము గలిగియున్నట్లు తోఁచుచున్నదని పూజ్యులు, సువ్రతులు పచించిరి. దృఢకేశిని వధించికాని నేనాయమను బెండ్లియాడనని వారి మును ప్రతిన గొంటిని. ఎన్నిరీతుల విచారించి చూచినను నేను దృఢకేశి వధమొనర్పక విదిశాపురికి, వైశాలినీ స్వయంవరమునకు వచ్చుట హాస్యాస్పదముగాఁ దోచును మిత్రమా!

విదూ :-వయస్యా! నీవు విదిశాపురమునకు రాకున్న విషయమెరింగి యా రాక్షసాధముఁ డచటికి వచ్చి వైశాలినిం బలిమింగొని పోవుట తథ్యము. స్వయంవర ముహూర్తమా రేపు మాపుల నున్నది.

అవీ :- మరి నన్నిపుడేమి చేయమనుచున్నావు?

విదూ :- నీవచటికేతెంచిన గనీసమా యసురుఁ డామెను బలిమిని గొని పోవుటయైననునిల్చి పోఁగలదు. ఒకవేళ వాఁడు స్వయంవర సమయమున నీమె యవీక్షితు నెచ్చట వరించి పోవునో యను సందేహముతో నామె యందలి వ్యామోహమున విదిశాపురి కరుదెంచిన నచటనే నీ వతనితోఁ దలపడి పోరి వధించి విజయివైన సకల కార్యములను దామీ యొకే యొక సమస్యతోఁ దీరి పోఁగలవు గదా! యెన్ని విధముల విచారించినను నీవచటికి వచ్చుటే సమీచీనముగాఁ దోఁచుచున్నది. ఏమందువు?

అవీ :- మిత్రమా! నీ విచారముగూడ దూరదృష్టి సంగతమైయున్నదే యని తోఁచుచున్నది. ఏది యెట్లైనను వైశాలినీ స్వయంవరమునకేఁగుటే

సముచిత మనిపించును. అచటికి దృఢకేశి వచ్చి నాతోఁ బోరు నొనర్ప నెటులైన నాకవిజయం బొనఁ గూడక తప్పదు. నీ యభీష్టానుసారము విదిశాపురికేఁగుచేసరి. ప్రయాణము సిద్ధపఱచుము.

(అని నిష్క్రమింతురు)

[తెరయెత్తగా విశాలుని దర్బారు. ప్రవేశము విశాలుఁడు]

(సఖులఁ గూడి వైశాలిని విశాలునకు నమస్కరించును)

విశా :- శీఘ్రకాలమున కల్యాణ ప్రాప్తిని గాంతువుగాక ! (అని ఆశీర్వదించును) (స్వ) ఈ స్వయంవరము తలపెట్టిన దాదిచిత్తమణు మాత్రము గూడ స్వాధీనములోలేదు. రాకుమారు లెల్లరీ సాయం కాలమువరకువచ్చి తీరవలెను. వారి స్థితిగతుల రాకుమారికిఁ దెలియఁ జేయుటకై చెలికత్తెల విధించితిని. వారన్నియుఁ దెల్పియుండ వచ్చును. (వైశాలిని దిక్కై (ప్ర)) బిడ్డా ! నేటికిమము వీడి యత్తింటి కాపురముసేయు వేళయాసన్నమైనది. (అని విచారమును సూచించును వైశాలిని విషణ్ణ వదనమున నిరుత్తరయై నిల్చును)

విశా :- (సబాష్పుఁడై గద్గద స్వనముతో)

బిడ్డ! యెన్నాళ్ల నిన్ను నేఁ బెంచియేని
ప్రీతినొక యయ్య చేతులఁ బెట్టగానె
వలయు, మణికారుఁ డెంతయుఁ దొలిచి మణిని
కోరి యొక స్వర్ణభూషతోఁ గూర్చునటులు

(వైశాలిని సాశ్రుపక్ష్మములఁ బయ్యెద కొనలతో నద్దుకొనుచుండును)

విశా :- (నిట్టూర్పువిడిచివిచారముతో) (స్వ) ఎంతకష్ట మెంత కష్టము.

పుట్టిన నాటినుండి యొక పూటయు మమ్ముల వీడియుంటనా
నెట్టిదెరుంగనట్టిదిపుడెట్టులొరుందరిఁ జేరుముందుమే
మెట్టులు వీడియుండఁ గలమియ్యది మాకును మాతనూజకున్
బెట్టెను కష్టమో సుఖమొ ప్రేమము నేమని నిర్ణయించుటల్.

నేనిట్లు కుందుచు నాచిట్టి తల్లిని గూడ బెంగ గొనఁ జేయుట భావ్యము గాదు. గుణ విద్యారూప శోభితయగు కన్య నుచితవరునకు ధారవోయునంతటి పుణ్యమబ్బెనని సంతసింపక యిట్లువంతనొందనేల? (కంచుకి ప్రవేశించును)

కం :- దేవా! కూరిమి సఖుని గూడికొని యవీక్షిత్కుమారులిందు విజయము చేయనున్నారు. ప్రవేశపెట్టుటకాజ్ఞ యొసంగిన (అని చూచును)

విశా :- శీఘ్రముగా వారినిందుఁ బ్రవేశపెట్టుము.

కం :- చిత్తము. (అని తలవంచి నమస్కరించి పోవును) (వైశాలిని చెలులతో లోనికిఁ బోవును అంత విదూషకునిగూడి యవీక్షిత్కుమారుఁడు ప్రవేశించును విశాలుఁడు లేచివారి నుచితాసనముల నుంచును)

విశా :- (విదూషకుని గని) భూసురోత్తమా! గౌరవనీయులగు కరంధమ సార్వభౌములకుశలము వారి రాష్ట్ర రాజకీయ విశేషము నెరుంగఁ గోరెదను.

విదూ :- విశాల మహారాజా!

రూపులన్ని తానయి కనుపాప యటులు
నిజసితాక్ష్యంతరస్థ కనీనికముగ
నలమహోదధి వలయితాజాండమెల్లఁ
బాలన మొనర్చు మా సార్వభౌముఁ డెపుడు.

కందెరలయట్టు లచటి దుర్గములు గాఁగ
పక్ష్మముల యట్లు సేనలు బలిసి కొలిచి
యచటి రాజును రాష్ట్రము ననవరతము
గాఁపు సేయుఁ గన్గ్రుడ్డుతోఁ బాపను వలె.

విశా :- అందులకే యవీక్షితుని పరాక్రమ మింత వెల్లి విరియుచున్నది.

వరగుణమ్మేల నెల్లర మురియఁ జేయు
తనయుఁ డగునాడె జనకుని ఘనత విరియుఁ
దగిన సూక్తుల రసికులం దనుపు కావ్య
మగు నెడనె కవివరు మూల్య మగణిత మగు.

లేకున్న విశ్వజిద్రణక్రీడా మహోత్సవములో నేకైకవీరులను ప్రత్యేక సమర్థులన నొప్పు నీసకల నృపానీకమును గెల్చుట లేకరణి నొరులకు సాధ్యపడఁ గలదు ? (కంచుకి యాత్రముతోఁ బ్రవేశించును)

కం :- మహారాజా ! మీకు సంతోష సమయములో నొక కష్టవార్తఁ దెల్ప సాహసింతును. క్షమింతురుగాక !

విశా :- ఏమా కష్టవార్త ?

కం :- ఒక వార్తాహరుఁడు మన సర్వసైన్యాధ్యక్షుని కడనుండి వచ్చి మహారాజుగారిని రహస్య వార్తా గృహమున కవశ్యముగా రమ్మని కబురు నెరింగించి త్వరఁగాఁ జనియెను.

విశా :- అటులైన సత్వరమే వచ్చుచున్నానని పోయితెలుపుము. (అవీక్షితుని దిక్కై) నే నిపుడే పోయెదను. వైశమె వచ్చి తమను దర్శించెదను. క్షమించ వలయును.

అవీ :- మంచిది. పోయి రాఁగలరు, మేము నీ యుపవనిలోనే వేచి యుందుము. (అని యందరును నిష్క్రమింతురు)

(తెర యెత్తిన నుపవనము అవీక్షితుఁడు ఉద్యాన భవనోపరి బ్రవేశించును

(వైశాలినీ శ్యామల లందు భీతలై ప్రవేశింతురు) అవీక్షితుఁడు భవనము పైనుండి గవాక్ష ద్వారమున వారినిఁ జూచుచుండును)

వైశా :- ఏమి యీ భయంకర ధ్వనులు ? శ్యామలా ! నా హృదయము తానపాయ శంకతోఁ గంపించుచున్నది. ఇంకెట్లు మన మంతఃపురమున కరుగఁ గలము ? ఈ చమూ సమూహము లెవరివి ? ఈ నగరమును జుట్టుముట్టిన వేల ?

శ్యా :- దేవీ ! భయ మందకుము. సుఖదుఃఖములు జీవితములోఁ జీకటి వెలుఁగుల వంటివి. చీకటి నెదిరింప శీతాంశువు వలె పరమేశ్వరుని కరుణా కటాక్ష ముదయింపక పోదు. అంతేకాక చిరు దీపమును వెల్గించు కొనుట వలె ధైర్యమును గల్గియుంటయే కర్తవ్యము.

వైశా :- ఇది యేమై యుండునో తోచుట లేదు సఖీ !

సర :- (పరువెత్తుకొని వచ్చి) వైశాలినీ దేవిని భూగర్భ మార్గము నుండి యంతిపురముఁ జేర్చవలసినదిగా మహాదేవిగారి యాజ్ఞ. ఇదో! అరహస్య మార్గపు తాళపుఁ జెవిఁ గొని వచ్చితిని.

శ్యా :- ఈ సైన్యము లెచ్చటివి? ఎందు కిట్లు మన నగరము నాక్రమించు చున్నవో నీ కేమైన తెలిసినదా సరళా?

సర :- ఏ మనవలె సఖీ! మన యవీక్షిద్రాజ కుమారులు విశ్వజిద్రణక్రీడా మహోత్సవములో సకల విధ విజయములు సాధించుకొనుటచేఁ గనలి దృఢకేశి నిఖిల రాజన్య సమూహమును గూడగట్టుకొని యతని బంధింప నిటు దండెత్తి వచ్చెనట వైశాలినీదేవి యతని వరించ నున్నదని తెలిసి యాస్వయంవరమునకు విఘ్న మొనరింప నిట్లు వచ్చెనఁట.

అవీ :- అక్కటా! ఈమె వచ్చి యొక పిడుగు వంటి వార్త నాకు వినిపించి నది. మునుముం దీపరిస్థితి యెటు మారునో? ఊహింపఁజాలకున్నాను.

శ్యా :- సఖీ! ఈ యందరి రాజుల నెదుర్కొని యా రాకుమారుఁడు జితుఁడై పునర్జీవితుఁడై వచ్చెనా నీ యదృష్టమే యనవలెను. నీ వేమి చేయఁ గలవు?

వైశా :- ఈ శత్రు రాజు లందరి నతఁడు తప్పక నిర్జించ గలఁడు. అటు విజయుఁడు గాకున్న సతుల కట్టి కాలమున సహగమనమునకన్న నుత్తమ గతి యేముండును?

అవీ :-(స్వ) ఔరా! ఈమెకు నాయెడ గల యవ్యాజాను రాగమునకీ యమూల్య వాక్యొకటియే చాలును. ఇపుడీయమపల్కు లెంతటి యానంద దాయక ములో యంతటి దుఃఖ దాయకములై బాధించు చున్నవి.

శ్యా :- సఖీ! నీ మహితాశయమెంతయుఁ బ్రశంస నీయము. ధన్యచరితవు.

వైశా :- సఖీ! నావలననేకదా! ఆ మహితాత్మునకిట్టి యాపదలు. ఇట్టి నేనుండి యేమి ప్రయోజనము? (అని యశ్రువులు విడుచును)

అవీ :- (స్వ) ఇప్పుడు నేనొక శిలనైతిని. నాకేమియుఁ దోచకున్నది.

శ్యా :- మనము దుఃఖించుట కన్న నామహా రాజకుమారునకు జయము గల్గుటకై భగవానుని బ్రార్థింతము. మహాదేవిగారు మన రాకకై

బెగడొందు చున్నది కాఁబోలు. ఈ భూగర్భ మార్గమునుండి మన మంత్రి పురి కరుగఁదగు. (అని యందరు నిష్క్రమింతురు)

అవీ :-(స్వ) ఈ రణవాద్య కోలాహలము లచటివేయై యుండ నోపును. ఈ శత్రురాజులందరు కదన రంగమునకుఁ గదలుచున్నారు కాఁబోలు! ఇప్పటి నాకర్తవ్యమేమి ? (విదూషకుఁడు ప్రవేశించును)

విదూ :- మహారాజా ! శత్రు రాజు లందరేకమై మనపై కత్తి గట్టి వచ్చు చున్నారు. వారందరునధర్మయుద్ధ మొనర్ప నున్నట్లున్నది.

అవీ :- సమయమున కరుదెంచితివి. సంగర రంగమునకు రథమాయత్త పరచుటకై సారథిని వినియోగింపుము. త్వరగా నరుగవలెను.

విదూ :- మిత్రమా ! నీ సాహసమున కొక నమస్కారము. వారి నందర నధర్మయుద్ధమున నొంటిగా నెదుర్కొన నేమి భావించియరుగు చుంటివి ?

అవీ :- నేనెట్టియుద్ధమునైన నెదుర్కొనఁ గల్గిన ధైర్యముతో నున్నాను. ఇది యుత్తమక్షత్రియ ధర్మము.

విదూ :- అదేమో ? మన మిల్లు వెడలినదాది యన్నియు నిక్కట్లే దాపురించుచున్నవి.

అవీ :-సఖా ! ఉత్తమ క్షాత్ర సంపన్నుఁడనగు నేను ముక్కున నూపిరి యుండు నంతవరకు నెన్ని కష్టములనైన గాలదన్ని సఫలీకృత మనోరథుఁడను గాఁగలను.

విదూ :- కీడెంచి మేలెంచవలె నందురు. ఒకవేళ నీ వాయధర్మ మాయా యుద్ధమున నోటమిఁ జెందవాఁడు వైశాలిని నపహరించి కొనిపోవునో ?

అవీ :-(క్రోధముతో) విశ్వజిద్రణక్రీడా మహా విజయినగు నాకప జయమా! అమంగళము శాంతించు గాక! అటులగు వరకుఁ జూచుచుఁ గూర్చొందునా! స్వవాంఛిత వస్తువన్యుల పాలగు చుండ చేతులు ముడుచుకొని పౌరుష హీనుఁడై పడియుండు నెవ్వఁడు? ఈ లోపలనే విజయమో వీర స్వర్గమో తేల్చుకొనవలెను.

విదూ :- ఇందరి రాజుల చతురంగ బలములు చతుస్స ముద్రములవలె పొంగి పొరలిపైఁబడిన ప్రళయమే కదా ! వారి ముందు మనము బలములు లేని వారమేకదా ! ఇంకనీ సాహసమున కాధారమేమి ?

అవీ :- (నాల్కకఱచుకొని బొమ ముడి పాటుతో క్రోధఘూర్ణితనేత్రుఁడై) తెలియక యటులు పల్కు చుంటివి. నిన్నే మన వలెను ?

పాఱుబోతుతా నేవేళ బ్రదికి చచ్చు
వీర వరుఁడెందు ప్రాణమ్ము వీడి బ్రదుకు
సస్యసంగత మయ్యును జచ్చుఁ దాలు
గట్టిగింజ రాలియు మొలకయయి నిలుచు.

వారి ముందు నాపరాక్రమము తక్కువను చుంటివా ! నేను వీరకాంతా పుత్రుఁడ నేనా ? నాతండ్రి సకల రాజన్య సైన్యంబుల నొక్కకేల నుక్కడంచి యఖిల మహీమండలమునేకచ్ఛత్రముగఁ బరిపాలించిన సార్థక నామధేయుఁ డగు కరంధమ సార్వభౌముఁడేనా ? అట్టివారి పొట్టన బుట్టిన నాకిట్టి పిరికి మందులు నూరి పోయుట నిరర్థకము. విజయలక్ష్మినివరించి వైశాలినిఁ జేపట్టని యీతను వేల ?

మసురు కొను నిశినిదునుమగ
శశి సరణి న్వెనుక ముందు సలుపక నలుకన్
నిశిత కరశరములెక్కిడి పస
చెడనదుమఁడొకొ నుదయ భానుఁడు తానై.

విదూ :- ఏమి పొందఁ గలవో నా కయోమయముగా నున్నది.

అవీ :- పొందలేనా ? నాకెవరడ్డు ?

విదూ :- ఒక వేళ యేదేని బలవంతమైన యడ్డే సంప్రాప్తించిన......

అవీ :- అడ్డు వచ్చిన వారి నందరినసిధారం గసిదీరం గూరకోఁత లొనర్చి సంగరస్థలి విగత శిరస్కులై విశాద్యమానకరాంఘ్రులై విలుఠీ తాంగులై నికృత్త గళంబుల కర్తంబులు ధారాపాతములుగాఁ జిమ్మ పడ నింగినిం గనుంగొనంగ నోళ్లు దెరచి కాళ్లుసాచి వేళ్లుదెగిన పాదపం

బలంబోలెన్నేలం గూలందోలి యస్మదీయ బాహూ ద్వయకండూ హరణం
బొనరించు కొనుశక్తి నాకు లేదా ? ఏలయిట్లు సందేహింతువు ?

విదూ :- చచ్చిన పాములోనైనను వెచ్చని రక్తము పరువు లెత్తఁ జేయునీ వీరా లాపములు వినిచితివి. మనికి గలుగ వైశాలిని నీ సొమ్మే లెమ్ము ! నడుము బిగింపుము ! నిరాఘాటముగ విజయము నొందెదవు.

అవీ :- (వినుట నభినయించి) అదో ! ఆ రణవాద్య కోలాహలములు.

నదమొనరించు వైరినృపనందన బృందము నామరుద్ధతిన్
జెదరిన మేఘ పంక్తివలెఁ జేసి వినాశముగాఁగ మద్భుజా
స్పదమున కుంకు వౌనటులు వారిజనేత్రను నా విశాలనే
నిదెకొని బోవువాఁడను నవీక్షిత వాయువు తావినింబలెన్.

ఎదురెవరో చూచెదఁగాక !

విదూ :-(ప్రక్క తెరగాంచి) మహారాజా! అల్లదో! యెవ్వఁడో మన వైపునకే వచ్చుచున్నాఁడు. దివ్య పురుష లక్షణములచే నొప్పారి యున్నాఁడు.

అవీ :- మిత్రమా ! ఇతఁడెవరో యార్తునివలెఁ గనఁబడు చున్నాఁడు.

విదూ :-ఇతఁడార్తుఁడని నమ్మియుండరాదు. రాక్షసులు కామ రూపులు గదా ! ఇతఁడు తాను శత్రు పక్షము వాఁడేయని పించుచున్నది. ధనువు నెక్కిడి సిద్ధముగా నుండుడు.

అవీ :- ఏది యెట్లైనను శరసంధాన మొనర్చి కొని యుండుటే మంచిది. కీడెంచి మేలెంచ వలెనందురు. (అని నారాయణాస్త్రము నెక్కిడియుండును.)

విదూ :- రాకుమారా! వీఁడేలకోత్వర త్వరగా వచ్చుచున్నాఁడు అడుగులు తడబడు చున్నవి. కనుల బాష్పములు గ్రమ్మి యున్నట్లు తోచును.

అవీ :- తొందర పడనేల ? క్షణములో నీతని యథార్థము బయటఁబడ గలదు విల్లునమ్ములు నెక్కిడి యున్నాను. శత్రువైనచో నితనిపైనే ప్రయోగింప వచ్చును. లేకున్న నార్తుఁడే యైనచో నతని శత్రువుపైఁ బ్రయోగింతును.

విదూ :- నిజమే ! నమ్మదగిన వారినే నమ్మ వలదనిన గ్రొత్తవారి నమ్ము టెట్లు ? (వజ్రదంతుఁడు ప్రవేశించును)

వజ్ర :- రాకుమారా! విశ్వవీరా! ఆర్తుఁడగు నీవజ్ర దంతుఁడు మిమ్ము శరణు వేడు చున్నాఁడు. రక్షింపుడు (అని పాదములఁ బడును)

అపీ :- ఓయీ! నీ కభయ మొసంగితిని. ఇంక నిన్ను త్రిలోకములలో నెవ్వరును బాధించలేరు. దుఃఖించఁ బనిలేదు. లెమ్ము! (అని లేపును)

వజ్ర :-వీర శిరోమణీ! మీకు నేనెప్పుడు కృతజ్ఞుఁడనై యుందునని మనవి చేయుచున్నాను. నన్ను విపజ్జలధి నుండి దరిఁనిజేర్పుడు.

అపీ :- దుఃఖా కృతిగొనిన నీ వెవరు? నీకు వచ్చిన యాపదయేమి? భయ ముడిగి వివరింపుము.

వజ్ర :-ఆర్యా! నేను గంధర్వ రాజగు సునయుని తనయుఁడను. వజ్రదంతుఁ డనువాడను. నా కూరిమి ప్రియురాలు సుమాలిని యను వనిత మలయగిరి సానుప్రదేశంబుల విహరించు చుండ నామెను దృఢకేశి ప్రాణ మిత్రుఁడు ద్విజిహ్వుఁడను వాఁడు దృఢకేశిచేఁ బ్రేరేపింపఁ బడినవాఁడై మాయతో నపహరించి నాఁడు. మహా వీరమార్తాండుఁడవగు నీవీ యాపధ్వాంతము బాపఁగలవని యాసించి యరుదెంచి నాడను.

అపీ :- (స్వ) నే నిపుడేమి సేయవలెనో తోచ కున్నది. యాపదలన్నియు నాకేసారి వచ్చి పడినవి.ఐనను ధైర్యముతో వీని నెదుర్కొనుటలే కర్తవ్యము. (ప్రకా) గంధర్వకుమారా! ఆ వనిత యిపుడెచట నున్నదో నీకేమైన తెలియునా?

వజ్ర :- ఆమె నిపుడు దృఢకేశి రాజధానియగు పాతాళపురిఁ జేర్చి నున్నారని మాత్రము తెలిసినది. నా ప్రియురాలి నెట్టియిడుమల పాల్జేయుదురో! నామనసు మనసునలేదు.

అపీ :- భయముడుగుము. ఆ పొలతికెట్టి యిక్కట్టులును గలుగ కుండ నారాయణాస్త్రమును బ్రయోగించి పంపుచున్నాను. అది యామెకుఁ దగిన రక్షణ మొసంగఁ గలదు. చింతిలకుము పొమ్ము! (అని నారాయణాస్త్ర మును స్మరించుచుఁ బ్రయోగించును) వజ్రదంతుఁడు సంతోషస్వాంతుఁడై వెడలును.

విదూ :- ప్రభూ ! ఎంతమాట యిచ్చితిరి. మీకుముందు దృఢకేశితో యుద్ధము గలదు. అక్రమ పద్ధతిలో నడువనున్న యా యుద్ధమునకు నారాయణాస్త్ర మొకటే రక్షణమని నమ్మియుంటిమి. ఆ దృఢకేశి మాయావి. అనేక దివ్యాస్త్రముల నెరింగిన వాఁడు. ఎట్టి యస్త్రములనేని మట్టు బెట్టిమిమ్ము పరిరక్షించగల నారాయణాస్త్రమునే ప్రయోగించి యామెను రక్షింపఁ బంచితిరి. ఏమనవలెను ? (అని విచారము వెలిబుచ్చును)

అవీ :- వయస్యా ! అబలయగు నామె రక్షణము ప్రథమ కర్తవ్యము. ఏది యెట్లైనను శరణాగతుల రక్షించుట వీరులవిధి.

స్వీయ దేహము నర్పించిక్షితిని విబుధ
ప్రజల రక్షించుటకె రాజు ప్రభవమందె
స్నేహగతి నాత్మ నాహుతిఁ జేసి జనుల
క్షోభపెట్టు తమమ్మార్చు జ్యోతిభాతి.

అవీ :- (సంధ్యా సమయమును గని) అదో !

క్షితినినెల్ల వారికి నవీక్షితుఁడగు రవి
సార్వభౌముని నానిశాచరులు తార
లౌర ! గ్రహపతి యనకయు నందరొకట
నణచ నున్నారు గద విశాలావని గొన

పదనగు చంద్రహాస కరవాల ఫణాగ్ర మునన్నిశల్ప్రతీ
చిఁదనరు నర్కు గాయపరచెన్ వడిమూర్ఛమునుంగ రక్తముల్
మడుపులు గట్టిపారగఁ దమస్థితులంధులు తెల్యజాలరా
పదనమృతంబు శత్రునకె ప్రాణమిడున్ దముఁ జంపునంచొగిన్.

చ తు ర్థాం క ము

[ప్రవేశిక] (ప్రవేశము ముదుసలి సోమదత్తుఁడు)

(ప్రదేశము విదిశాపురాంతర్గత రాజవీధి.)

సోమ :- (స్వ) నేటికి రెండు రాత్రులు గడచెను. పురవీధుల నరక్షణమేని విధి విరుగడలేకుండ రథనేమీ రవార్భటులు నాబోటి ముదుసలి పంగువునకును, జెవుల త్రుప్పెగిరి పోవుచేకాక కర్ణకుండలముల స్వర్ణపుఁబొరుసులు గూడ నూడునట్లున్నవి. ఈ తురగఖుర ప్రహారణముల యొరపిడిచేఁ బురపుర పొక్కి రేఁగు ధూళిచూచాయగఁ బాదచ్ఛాయలిడు నాకైతే చిమ్మచీకటులఁ గ్రమ్మఁ జేసి యూపిరియే యాడనీయకున్నది. పథంబుల నెచటఁ జూచిన రథంబుల రాపిడియే. ఔరా ! ఆవర్షర్తునందలి పర్జన్యుని గర్జనంబులవలె నెడతెగకుండ నుఱుము నీగీరయంచుల గడగడలును, మరియు నొత్తుగరాలు జల్లుచినుకులవలె నెత్తుకొని వచ్చు నాఖురపుట పటలమ్ముల పడపడలును, నట్లులే జలధరోపరి భాగమ్ములఁ దళుక్కుమని మిలమిలలాడి చలింపఁ జేయు విద్యుద్వల్లీ నివహంబులవోలె వాయుహతుల రెపరెపలాడుచు బంగారు రంగు లీను నాధ్వజమ్ముల తళతళలును, నింకను దృష్టియడ్డుపడ భూనభోంతరాళమ్ములు నిండి యనుక్షణంబు తుపతుపరాలు తుషారంబుల పోలికన్విసారించియాడు నాధూళి యొక్క దుమదుమలును గాంచ దివిచరాధిపులు నీరదంబుల ద్వారా నీటిఁ గురిపించ భువిచరాధిపులు నరదంబుల ద్వారా ధూళిని బరపించుచు నితరేతరానుమతితో స్వవస్తుతతి నెగుమతి దిగుమతి యొనరించుకొను చుండిరేమో యనునట్లు దోచును. సరేకాని దిక్కు మాలిన పీడ వీధులనే చిక్కి బోయినను "బ్రక్కజరుగుము! జరుగుము" అనిన ధ్వనియేకాని "చక్కనరుగుము! అరుగుము!" అని యొక్కఁడును వక్కాణింప డయ్యెను. కావున గుక్కిన పేఁనువలెఁ బడియుండక యొక్క యడుగు ముందిడితినా! కుళ్లిన గుమ్మడి పండువలెనున్న నేను సళ్లిన కీళ్లతో సాగిన కాళ్లతో ఫెళ్లన గూలి మహాసంరంభముగా నిహతయుద్ధ భటులతోఁబాటు రంభాసంభోగ సంచారార్హుఁడనగుదు నమటలో లోపమేమియుఁ దోచదు. అబ్బ! ఎంత

సంకుల సమరమై యీరూపమున నొప్పియున్నదో చెప్పలేము. ఒక్కఁడు పెక్కు వీరులతోఁ బోరిముక్కునకు దమ్ము తెప్పించి నాఁడనిన నా యవీక్షిద్రాజ కుమారుని సాహసమునకును బాహు బలమునకును సాటియే లేదన బోటి యెచ్చటిది? కాని కాలవశమున గట్టువడవలసి వచ్చినదతనికి. ఎచ్చటఁ జూచినను హాహాకారములే యెచ్చటఁ గాంచినను బీనుగుల పెంటలే. నగరమంతయుఁ గుల్లకంపువేయు చున్నది. ఈ గడబిడలో నీప్రక్క నిల్చియుండు టేమేలు. (అని కడదొలఁగి నిల్చి కేలు మాటిడుకొని యటిటు వీథులఁ గాంచి) (అంత రవివర్మ వచ్చు చుండును)

(స్వ) అదుగో ఆ వచ్చు నతఁడు మా రవివర్మ గావచ్చును. (ప్రకా) రవివర్మా! రవివర్మా! (పిల్చుచు దగ్గరించుచు రవివర్మను గాంచి) ఎవరదీ వచ్చువారు? ఎవరు నాయనా? (రవివర్మ ప్రవేశించును)

రవి :- వచ్చు చున్న నన్నుజూచి రవివర్మాయని పిలుచుచుఁ గూడ దగ్గరించు నంత యెవరు నాయనా! యని యడుగుదు వేమయ్యా?

సోమ :- ఏమి జేయవలెను? నాదృష్టి బొత్తుగా సన్నగిల్లినది. వార్ధకము వచ్చినది. అందునీ ధూళి యంధునిగాఁ జేయుచు నేదియుఁ గాన బడనీకున్నది. నీ ప్రయాణ మెచటికి?

రవి :- వైశాలినీదేవి వివాహమది యవీక్షిద్రాజ కుమారునితో నిశ్చయమైన దని తెలిసి యాయుత్సవముల దర్శించుటకై పల్లియ నుండి పనిగట్టుకొని పయనమై వచ్చితిని.

సోమ :- అయ్యో! నీకుఁ దెలియదేమి? ఆ నిశ్చయ మంతయుఁ దలక్రిందు లైనది. గడియలో వచ్చునది తెలియ కుండును. దైవ విధి.

రవి :- ఏదో యుద్ధము జరుగు చున్నట్లు తెలిసినది. దాని వివరము లేవో యెఱింగింపుము.

సోమ :- వినుము! అవీక్షితుఁడు విశ్వజిద్రణక్రీడలో విజయ మంది విశ్వవీర బిరుదము బొందిన నాటనుండి శ్రీ వైశాలినీ రాజకుమారి తానా రాకొమరునే వివాహమాడ ముచ్చట పడుచుండెను.

రవి :- మరి తద్వ్యతిరేకముగా మారుటకుఁ గారణము ?

సోమ :- అదే చెప్పు చున్నాను. వైశాలినీ స్వయంవరార్థము తా నవీక్షితుఁడు విదిశా నగరమునకుఁ జేరుకొన్నంతనే యతని ప్రత్యర్థియైన దృఢకేశి యను దైత్యుఁడు తనతోఁ దక్కిన రాజమండలిని గూడగట్టుకొని మత్సర మూనివచ్చి యక్రమ సంగరంగమున నతని నాగపాశ బంధితుని జేసి మన రాజుగారి కారాగారమున నుంచెను.

రవి :- అయయో ! విపరీతముగా మారినదేమి ? ఎచటి యవీక్షితుని బలపరాక్రమము. ఎచ్చటి దృఢకేశి ?

సోమ :- దైవవిధి ముందు తక్కిన బలముల లెక్కయేమి ?

రవి :- అతని స్థితిగతులిపు డెట్లున్నవి ?

సోమ :- అది గాంచి వజ్రదంతుఁడను గంధర్వుఁడా యవీక్షిద్రాజ కుమారుని చెలికాఁడు కరంధమ సార్వభౌముని యొద్దకేఁగి యిదియంతయు సవిస్తరముగా వివరించెనట.

రవి :- కరంధమ సార్వభౌములు రానున్నారా ?

సోమ :- కరంధముఁ డింతలోనే రానున్నారనియుఁ గుమారుని విడిపించి కొని పోవుననియుఁ దెలియ వచ్చినది.

రవి :-మరి యాదృఢకేశి యతని యను యాయులగు రాజు లతని విడుతురా?

సోమ :- వజ్రదంతుఁ డరిగి కరంధముని గొని రానుండుట దెలిసి యాదృఢకేశి పలాయన మంత్రము పఠించినాఁడు. సకల రాజమండలి సమైక్యత యంతయు గాజు బుడ్డివలెఁ గకావికలై చిట్లి పోయినది.

రవి :- అవీక్షితుఁడు మాత్రము కట్టుబడు వాఁడేనా ? మరి వైశాలిని నపహరించిరా ?

సోమ :- ఏజన్మ పాపమో, యెవ్వరి శాపమో ; కాని యతఁడేడు గడియల దానిచేఁ గట్టుఁబడినాఁడు వైశాలినీదేవి రాజభవనమున నెంత వెదకినను గనఁ బడుటలేదు.

రవి :- ఆ రాక్షఁడ పహరించుకొని పోయెనేమో ? ముందు దీని పరిణామమేమగునో చూడ వలసి యున్నది. ( వినుట నభినయించి ) అదో ! వీర

పురుషుని సింహనాదమేదో వినఁబడు చున్నట్లున్నది. కరందముఁడు వచ్చు చున్నాఁడు కాఁబోలు.

సోమ :- పోదము పద! యేమి జరుగునో, విలోకింతము గాక ఈ కోలాహల మంతయుఁ జతురంగ బలముతోఁ బరువెత్తుకొని పరువెత్తుకొని వచ్చు చుండెను. ఆ సార్వభౌముల దేనో ?

రవి :- అదేనేమో ? పద చూచి వత్తము. రాజ దర్బారునకేఁగ వలెను.

(నేపథ్యములో)

పౌరులారా ! నగర శాంతి భద్రతల సంరక్షించుటకు సర్వ విధ ప్రయత్నములు జరుగఁ గలవు. భయ విహ్వల చిత్తులు కావలదు. కరందమ సార్వభౌములు సకల సైన్య సమేతులై వచ్చు చున్నారని గంధర్వ కుమారుఁడగు వజ్రదంతుఁడు వార్త గొని వచ్చు చున్నాఁడు. తొలగుడు.

సోమ :- ఇక మనకు భయము లేదు. నేఁజెప్పినంతయు యదార్థమైనది. గంధర్వ కుమారుఁడు తానేమి వార్త దెచ్చెనో ? వివరముగాఁ దెలిసి కొనుటకై రాజనగరు కరుగుట మంచిది. పద పద ! అదో ! ఆ వచ్చు వాఁడు వజ్రదంతుఁడే నేమో ? (ఇరువురు నిష్క్రమింతురు)

(ఇ ది ప్ర వే శ క)



# పంచమాంకము

[ప్రదేశము—అవీక్షితుని నిర్బంధించిన కారాగారము]

(ప్రవేశము-వజ్రదంతుఁడు సానుభూతి పూరితుఁడై)

వజ్ర :- నాప్రేయసీ రక్షణమునకై నారాయణాస్త్రము నొసంగి నాగపాశ బద్ధుఁడవగుట లిపుడీ దుస్సంఘటన గల్గినది. ఇది నావలననే కదా !

అవీ :-ఆశ్రిత రక్షణము వీరుని విధి. ఇందునే నొర్చిన త్యాగమే మున్నది ?

వజ్ర :-నేనీ దుస్థితి సంఘటితమైన తక్షణమే విమానోపరి మీ పితృపాదులగు కరంధమ సార్వభౌములదరికిఁ జని వృత్తాంతమెల్ల వివరించి తక్షణ సహాయా వసరమును దెల్పి యిందు రమ్మని మనవి యొనర్చితిని.

అవీ :- వజ్రదంతా ! నేనిట్లు శత్రువుచే నోడింపఁబడి నిరుపమాన వీర శిరో మణియైన నాజనకునకు వీరమాతయగు నాతల్లికిని దలవంపులఁ గలిగించి తిని. నేనును దీరని యవమతికి గురియైతిని. నాపితరులేమని దుఃఖించిరో దాని నొకింత నెరింగింపుము.

వజ్ర :- అవీక్షిత్కుమారా ! నీ విశ్వజిద్రణక్రీడా విజయమును వినినవారై వా రొందిన యానందమునకు మేరలేదు. అది విని సార్వభౌములుప్పొంగి యిట్లనిరి.

> "పరిమళ మీను చారు ప్రసవమ్ము వనమ్ముల గోరకింప నే
> ఖరకరుఁ డుద్భవింపగనె కాంతిలు నెండ పొడల్గాన నా
> చిరుతఁడు నై జశూరత నశేష నృపావళిఁ గెల్చెనల్లె యా
> సిరిగలమోము చందమది చిన్నతనాననె యేర్పడుంగదే"

అవీ :- నాయీ ప్రస్తుత పరిస్థితిని గూడ నెఱింగించితివేమి ?

వజ్ర :- తెలుపలేక తెలుపలేక నీ విషయ మంతయు మెల్లగాఁ దెలిపితిని. అంతనే యాపురుష సింహము మండిపడి యిట్లనెను.

> "ఏమేమీ ! విదిశాధి పాదినృపులిల్లేకీ కృతాంతర్యులై
> భీమా కారతనంద రొక్కమొగినే భీష్మించి వెన్నాకి స్వ

స్థేమాద్యస్థిర సంపదన్విత మదాంధీ భూతచేతస్కులై
జీమూతా క్రమితార్య ముంబలె నవీక్షిత్పుత్రు బంధించిరే".

అవీ :- సుమ కోమలమగు మజ్జనకుని హృదయ మెంత పరితపించినదో? ఇంకేమనెను ?

వజ్ర :- సుమకోమలమైన యా హృదయమే వజ్ర కాఠిన్యతను వహించి యిట్లని గర్జించెను. "ఈ విశాలుఁడు స్వయంవర మని యాహ్వానించి తుదకింత మోసగించునని కలనైనఁ దలంపనైతిని. ఔరా!

"అను కరణమ్మొనర్చెడి విహంగపు కూతలతో విహంగమున్
దనవలఁ జిక్కునట్టులు నొనర్చెడి వ్యాధుని పోల్కి వీఁడు నా
మనమున కెక్కునట్టులు సమాహిత వాక్కులనమ్మఁ బల్కిన
తనయుని బంది చేయుటలెదం దలపోయఁగ నైతి బేలనై".

(అని విచారము వెలిఁబుచ్చిరి)

అవీ :- హా! నా పితరుల కెంతటి దుఃఖమును దెచ్చి పెట్టితిని. అత్యంత సుకుమారహృదయ, నాజనని వీరమాత యేమయ్యెనో యేమని దుఃఖించెనో? తెలియఁ బరచెదవా ? వజ్రదంతా ?

వజ్ర :- ఆమె దుఃఖమును నేనేమని విన్నవింతును. నీబంధన వృత్తాంతము వినినంత మూర్ఛపడి పోయెను.

అవీ :- హా! జననీ! వీరా! ఈ నిర్వీర్యుఁడు నీ పొట్టనబుట్టి నీకెంతటి వంత దెచ్చి పెట్టినాఁడు. వజ్రదంతా మూర్ఛదెలిసి యేమని దుఃఖించెను ?

వజ్ర :- ఆమె తాను వర్షకాలమేఘమువలె బాష్పవృష్టి గురియుచు "నాచిన్ని కుమారునా కిరాతు లెన్ని యిడుమల పాల్జేసిరో? మరల వానిఁ జూచు భాగ్యము నాకుఁ గల్గునో? వాని వినా నాకీ ప్రపంచమేల? దేవదేవా? నాకీ వార్త వినరాక ముందే మరణమునేల బెట్టవైతివి ?

దంపతుల ప్రేమ ద్వైత విధానముడిగి
నిర్మలా ద్వైత సౌఖ్య సద్ధర్మమొందు
సుందరానంద రూపమె నందనుండు
తనయ దుఃఖమ్ము హృదయ విదారకమ్ము.

"పతికి సతివియోగమ్మొక పాయనివెత
సతికి పతి దుఃఖమెద వీడిచనని కోఁత
ఇరువురును ప్రాణములనుండి మరణబాధ
ననుభవించుచె పుత్ర దుఃఖాప్తిగాధ". యని విలపించెను.

**అవీ :–** అయ్యో! నాతల్లి దుఃఖమును నివారింపఁ జేయువారెవరు?

**వజ్ర :–** కరందమ సార్వభౌము లాయమ దుఃఖమును వీక్షించి "తన తన యుని కష్టావమానముల కోర్చి యుండగా నీ కరందముఁడు జీవచ్ఛవము గాదు. దండతాడిత కాలభుజంగంబు భంగి శత్రు భక్షణ మొనర్చి కాని తన యాకలి పాపుకొనఁడు. సకల శత్రునరపాలుర, ససైన్యంబుగా సర్వ నాశమొనర్చి తన యఖండ దోర్దండ కండూ హరణం బొనర్చి కాని మరి నిదురింపడు" అని ప్రతిజ్ఞ నొనర్చినాఁడు.

**అవీ :–** వజ్రదంతా! నీవరిగి పైశాలిని సురక్షితముగా నున్నదా లేక దృఢ కేశ్యాదులచే నపహరింపఁ బడినదా? ఆమె గతియేమైనదియుఁ దెలిసికొని శీఘ్రముగా వచ్చి నాకెరింగింపుము.

**వజ్ర :–**ఆమెకు నేనదృశ్య కరణి నొసంగి యా యుద్ధ సమయమున నేరక్షించితిని. నీవా విషయమునఁ జింత దక్కి యుండుము. నాశక్తి మేరకామె కాలికి ముల్లు నాటకుండునట్లు కాపాడుదును. నాకు నా సోదరియు నామెయు వేరుకాదు.

**అవీ :–**ఇక నీవు పోవలయును. నీకు నపాయము తెచ్చిన వాడనుగా గూడదు.

**వజ్ర :–** మంచిదట్లే పోయివత్తును. మిత్రమా! నీ వెప్పుడీ బందె నుండి విడివడుట. (అని విషాదముతోఁ బోవును)

**అవీ :–** స్త్రీకి శీలభంగమువలెనే క్షత్రియునకు యుద్ధాపజయము తీరని యవ మానమై తలెత్త నీయదు.

కననవమానముం బొరయగాఁ దలవంపుల కన్నకత్తి వ్రే
టున దలపైకిఁ దానెగసిడుల్లుట లెంతొ సుఖావహమ్ము జీ
వననిధనమ్ములో మరణ బాధక్షణమ్మె స్పృశించుఁ గాని యీ
మనికి గలుంగునంత కవమాన హతిన్దలనేల వ్రాల్వేతల్.

అసిగాయము మానునేమో కాని యవమానపు గాయము మానునది కాదు. ఈ యవమానపు గాయము నాకే కాక నాతలిదండ్రులకును నావంశమునకును తీరని వేదనము తెచ్చిపెట్టినది. అఖిల శత్రు విదారణ దక్షుండును నఖండ భుజబల మండితుఁడునగు నాతండ్రియిట కరుదెంచి ననుగాంచి యెంత బాధపడునో?

భూమిరుహాంపు గర్భమున బుట్టువు నొందిన కీటకమ్ము తా
భూమిరుహాంత రస్థలిని బూనిక దొల్చెడినట్లు నేనునుఁ
శ్రీ మహితుండు మజ్జనక సింహునకు న్జనియించి యింతకా
భూమి ధవాంత రంగమునె వుండొనరించుచు బాధఁ గూర్చితిఁ.

అను కొనిన దొకటి. ఐనదొకటి. మానవుఁడు ప్రయత్న మొనర్చియుఁ బరాధీనుఁడై యుండును గదా! ఇది గ్రహించిన నహంకార పడుటకాధారమే లేదు. ఆహార నిద్రలఁ బరిత్యజించి నేటికి మూడవ దినము. అందులకే యీ ప్రపంచమంతయు నేకచక్రముగ గిఱ్ఱునదిరుగు చున్నట్లున్నది. ప్రాణములెచటి కోపయనించు చున్నట్లున్నవి. నాలో నేను లేనట్లున్నాను. కనులు తెరచిచూడఁ జాలకున్నాను. (అని మూర్ఛిల్లును) (అంత వైశాలినీ శ్యామలలు ప్రవేశింతురు)

వైశా :- శ్యామలా! ఆ ముందున్నదే చెరసాలయను కొందును. అటఁ జని మన మా రాజకుమారుని చెరవిడి పించుటకు నాయన గారాదేశించినారు.

శ్యా :- ఔను! ఈ దుస్సంఘటనకునై యీ రాజకుమారునకు మన మహా రాజుగారి పై దురభిప్రాయము గలుగకపోదు. దాని నివర్తింపఁ జేయనీ స్వరూప సౌజన్యములే శక్తిమంతములను విషయము ప్రభువులు చక్కఁగా గుర్తించిరి. ఇది వారి రాజనీతిజ్ఞతకుఁ దార్కాణము.

వైశా :- కరందమ సార్వభౌములు రానున్నారను వార్త దెలిసి యీ రాజు లందరు పారిపోయిరి. రాజకీయ నిర్బంధ పరిస్థితి వలన విధిలేక యీ రాజకుమారుని బంధించ వలసి వచ్చినందుకు నాయనగారు హృదయమున నెంతయు నొచ్చుకొని విచారపడు చున్నారు. మరియు రాకుమారునికిఁ దమ యెడగల ద్వేషాభిప్రాయమును దొలగించి వాస్తవ పరిస్థితుల

నెరింగించుటకు నన్ను నియమించినారు. నేనీ మహత్తర కార్య భారము నెట్లు నిర్వహింపఁ గలనో తెలియఁజాలకున్నాను. నేను నాయథాశక్తికృషి చేయఁగలను.

శ్యా :- ఆ రాకుమారుని యన్యథా భావము తొలగించుటకు నతని సుముఖుని జేయుటకు నీకుఁ దక్క మరెవ్వరికిని శక్యముగాదు. నీకు నారాకుమారుని పట్లగల యవ్యాజాను రాగము మరియు నా యవీక్షితునకు నీపైఁగల ప్రగాఢ ప్రణయము, పరస్పరావగాహనకుఁ దోడ్పడి కార్యసాధనను సులభ మొనర్చఁ గలవు. ఈ యర్థరాత్రి నిన్నెట్లో యిందుకొని వచ్చితిని. ఇఁక నీకర్తవ్యము మిగిలినది.

వైశా :- నిజము సఖీ! ఇంతటి నీ సహాయ సంపత్తికి నేనే మీయఁగలను?

శ్యా :- నీవట్లను కొనరాదు. ఇది నావిధి. నేను నిర్వర్తించితిని. కారాగార రక్షకులకీ రాజ శాసనము చూపి వారిని దొలఁగించెదను. లోన ప్రవేశించి భయపడక లక్ష్యకార్యమునకుఁ బ్రయత్నింపుము. ఈ కార్యసాధన ఫలితముపైన నీకల్యాణ మాధారపడి యున్నది. (శ్యామల రక్షక భటులకు రాజాజ్ఞ వినిపించి వారినట నుండి తొలఁగించును)

వైశా :-ఇట్టి పరిస్థితిలో నతని సమీపించఁ గాలాడుటలేదు. అయిననేఁగ కుండ నుండరాదు. నీయొద్దగల వజ్రదంత ప్రదత్తమగు నదృశ్య కరణి నిటు లిమ్మా! (అని శ్యామల యొద్దనున్న అదృశ్య కరణి గైకొనును)

శ్యా :- (ప్రక్కఁగల రక్షకభట శిబిరమునకు జనియట దాఁగి యుండును) (వైశాలిని కారాగారమున బ్రవేశించును)

వైశా :- (స్వ) ఔరా! యెంతటి వారలనైన బలవత్తరమగు విధితాను వంతలఁ బెట్టకమానదు. ఇంతటి మహావీరుని నిట్టి సధర్ముని గూడ దుర్లంఘ్యమగు విపదబ్ధిఁ ద్రోయుటఁగన దైవ భావమే మైయుండును? అకటా! దైవముననసేల! దీనికంతకుఁగారకురాలిని నేనేకదా! (నిట్టూర్పుతో) ఓపయోముఖ విషకుంభమా! వైశాలినీ! నీరూపరేఖా విలాసములే యా దృఢకేశ్యాదుల నధర్మ యుద్ధమునకుఁ బురికొల్పి యీపురుష సింహుని

మానుషమును మంటఁ గల్పినవి. (సబాష్పయై రాజ పుత్రుంగని) ఈ నిర్భాగ్యురాలి ప్రాపువడయఁ గోరికదా! సాధ్యా సాధ్యముల గుర్తెరుంగ కనాల మొనర్చితివి. ఇట్టి నీయవ్యాజానురాగమునకుఁ బ్రతియేమి గలదు?

బాణాస్యాయుధముష్టి ఘాత బలవద్బంధాదుల న్నైన్చియున్
మానప్రాణ శరీర సంపదల నిమ్మాడ్కిన్ మదీయా ప్తికై
దానంబిచ్చిన నీదుత్యాగ మెచటన్ దౌర్భాగ్య లజ్జాప్తినో
ప్రాణేశా! తమినామనమ్మిడనిలోభమ్మేడ? నీసన్నిధిన్.

స్త్రీల సౌందర్య మెంతటి యానంద దాయకమో యంకటి భయానకమై యుండును గదా?

చంద్రముఁడై కండ్లచలువ యొావదనమ్ముఁ
గనసుధాముఖవిష ఘటముగాదె
కమ్మసంపెఁగ మేల్మికాంతు లీనెడి చారు
తనుకాంతి వ్యాఘ్ర సుందరత గాదె
తములంపుఁ దీవె యౌతను కోమలాకృతి
విద్యుదాఘాతమై వెలయుఁ గాదె
పట్టు కుచ్చుల నీలిపరువంపుటలి వేణి
గరళ సంగత భుజంగమ్మ గాదె
ప్రేమపాశములను బెనవేయు చూపులు
కాలపాశమగుచుఁ గ్రాలుగాదె
వేయిమాటలేల? విపరీత వేళల
నారి మృత్యుముఖపుదారి గాదె.

అకటా! నాకీ కారాగృహముఖద్వారమును సమీపించుటకే గుండియ లేకున్నది. సమీపించిన నన్గాంచి యాపురుష సింహమెట్టి భావమున జూచునో యను శంకవొడమును. అయినను నామనస్సాగ నిచ్చుటలేదు. (విచారించి) జంకనేల? ఈ యదృశ్యకరణి ప్రభావంబున గనఁ బడకుందు గదా! (అని కారా గృహములోఁ బ్రవేశించి బంధింతుఁడగు నవీక్షితుని గని) అయ్యో!

ఈతఁడిపుడత్యంత మనోవ్యథా పీడితుఁడై సర్వంబును మరచి పడియున్న వాఁడువలె నగపడు చున్నాఁడు. ఇదియ మంచి తరుణము. నితని వెనుకఁ జనినిల్చి వీక్షింతుఁ గాక (చని నిల్చి) బందెకే యందమిడు నీ సౌందర్య మాశ్చర్య జనకము.

ఱోనులోఁ బడియున్న పోతు సింగమ్మన
రాహుముఖము చొరిన రవి యనంగ
గారడీని పెట్టె దూరిన నాగేంద్ర
మనగబందె నీతఁడలరునిపుడు.

అవీ :- (స్మృతి నభినయించి)

ఏమిమొగంబు వెట్టుకొనియేఁగనువాడను తండ్రిమోమునే
నీమిడిమేల మాలము జయించితి మించితిఁ గీర్తివచ్చె నీ
కీమహినంచుఁ జెప్పుదునె యీయెద సిగ్గెటుగాదు నాకుఁ దా
మీమెయి వీడి ప్రాణములె యేఁగిన చిక్కులు చింత లుండునే?

ఛీ! ఇంకనీ చంద్రహాసమును గొనియేని ప్రాణత్యాగ మొనరించు కొనెదఁ గాక! (అనిమొల నున్న యొరనుండి కత్తిదూసి) ఓ ఖడ్గ రాజమా! చంపను రక్షింపను గలమా, కులదైవతము వీవే; ఇంత వరకు నన్ను శత్రువులనుండి కాపాడి, నాక్షాత్రమున కుంకువయైన నీకివే కడపటి నమస్కారములు. క్షాత్ర చిహ్నమైన నీవీ పిరికి నందయగు వీక్షితుని నవీక్షితు నొనర్పుము.

వైరిమస్తక మేఘవర్తి విద్యుద్గతిఁ
బొరిరక్త వర్షాలఁ గురియఁ జేతు
కోశవల్మీక నిర్వాసితవ్యాళమై
యరి ప్రాణ వాయువులారగింతు
వీరశైలాగ్ర విహార వాహిని వయి
ప్రతిపక్ష తరు మూల హతినొనర్తు
రణభువి పరిపంథి జనపాళి దివికేఁగ
ధూమ కేతువువయి త్రోవవైతు

ధీరయోధులకై సుధా ధార వీవు
తలఁకు పిరికి బంట్లకు విషధార వీవు
ధర్మరత వసుంధరకు నాధార వీవు
కంఠముక్త రక్త విహార ఖడ్గధార!

నన్నుగని యెన్నియో కష్టములకోర్చి కాపాడిన యోతలి దండ్రులారా! మీ కివే నాచివరినమో వాకము లర్పింతును. ఏకైక పుత్రుఁడనై యెంతో యాప్యాయముగాఁ బెంచఁబడిన నేను మీనుండి శాశ్వతము సెలవు గొను చున్నాను. కడకొకసారి కనుల చల్వఁ గామిమ్ముఁ జూచికొని చచ్చు చావునకు నోచనైతిని. నా మరణానంతరము మీదుఃఖ జలధికినంత ముండునా! నాకై మీ హృదయాబ్జము లెంత కుమిలియేడ్చునో? మీకీ దుఃఖ మిడునాయ పరాధము సహింపుడు! వైశాలినీ! నాకనుల దోచుకొను నంతటి సుందరివై నీవేల పుట్టితివి? ఇందునీ నిష్కల్మష వదనాబ్జము దేమి దోషము? నాప్రాణ కాంతా! నాప్రణయ సామ్రాజ్యపట్టమహిషీ! నాజీవితసర్వస్వమా! వైశాలినీ! (అని విలపించును బాష్పబిందువుల రాల్చును)

వైశా :- (స్వ) ఔరా! ఇవి యితనికి నాపైఁగల యపార ప్రేమసాగర సంగత ముక్తావళులు గాని యశ్రువులు గావు. ఈ యనురాగ వాక్యము లితని దరిఁజేరనన్ను ద్వరపెట్టుచున్నను, నావల్లనే యీగతి ననుభవించు నన్నితఁడే మనునో యనుభీతి కాలును కదలనీ కున్నది.

అరుగుటకు కాలుమును దూకునంతలోనె
భీరులజ్జా పిశాచము వెనుక కిగ్గు
ఉరికివచ్చు తరంగాలనొగి వెనుకకు
నెట్టి వేసెడిచెలియలికట్ట వోలె.

అవీ :- ప్రేయసీ! వైశాలినీ! మరణాంధకార మావరించు ఈ యంతిమ దశలోనైన నీ సర్వాంగ సుందర రూపమున వెల్గునీ ప్రణయ దరహాస దీపము నొక్కసారి సాక్షాత్కరింపఁ జేయువేల? ఎంత చూచినను దనివి తీరని నీమనోహర రూపము నెంతని భావింతును. నా భావాంబర వీధుల

విహరించు నీముఖ చంద్ర మండల మనోజ్ఞత నేమని వినుతింతును. అదో! ఆ బాలశశాంకునేలు ఫాలతలముపై నీలాలక జాలములు కాదంబి నీఖండములై నాట్యమాడు చున్నవి. వాని మాటున నేత్రతారకలు చెలువగు నెన్నుదురు నెలవంకతోఁ గూడి చిలిపిగాడాఁ గురింత లాడు చున్నవి. వానితో నేనును గూడి యాడి యలసి సొలసిదప్పి గొంటిని. ఇదో ఇంకనీ కనీనికా నీలనీరదములు వర్షించుచనురాగమధువాని తనివి గొంటిని. (కొంతాగి) త్రాగి త్రాగి తన్మయత్వమును జెంది మత్తుఁడనై మార్గము దెలియని మోహాంధ కారమునమునిగి పోయితిని. నీరూపమున నిజమైన జీవనజ్యోతి వెలిగినది. ఇంక నెమ్మది గల్గినది. నీమిసమిసలాడు మేలిమిమై దీవియతో మలయ మారుతములు గుసగుసలాడు చున్నవి. వాని మనోజ్ఞ స్పర్శలకు స్పందించి యానందించి నీపొంగారు క్రొవ్వయసు పైఁదల నానితనుచేష్టలుమాని తన్మయతలో శయనింతును. (అని కనులు మూసి వెనువ్రాలి క్షణమాగిలేచి) అకటా! ఇట్టి దురదృష్ట వంతునకా యీసుఖవాంఛలు. అవీక్షితా ఇక నీకు మరణమే శరణము. ప్రేయసీ వైశాలినీ! నీతో పాటీసకల ప్రపంచమును వీడనున్నాను. (అని బాష్ప నేత్రుఁడై గద్గదికతో ఖడ్గమును గాంచి) ఓ ఖడ్గదేవతా! నీవింకనా బాష్ప వారి యను వేడి నీటల స్నానమొనరింపుము. ఈ క్షణమ్మే నీకు నాస్వాదురక్త పానీయముల విందొసఁగు చున్నాను. రమ్ము! ఇంక వీఁడు బ్రదుకరాదు. దృఢకేశి వధ మొనర్చి ప్రజాక్షేమమొన గూర్తునన్న శపథము వృధా యయ్యెగదా (అని కత్తినెత్తి పొడుచు కొన బోవు నవీక్షితుంగని వైశాలిని దుఃఖ విభ్రమయై సమీపించును.)

వైశా :- (స్వ) ఇంకెట్లు? ఏమి సేయుదాన? ఇట్టి విపత్కర సమయమున గనులొప్పగించి కాంచుచు నూరకుండుటెట్లు? ఓ లజ్జా భయములారా! ఇది భయానక పరిస్థితి. ఇందు మీకణు మాత్రము తావులేదు. శీఘ్రముగానను విడిచి పొండు. ( విచారముతో ) ముందేమి సేయుట? ( ఆలోచన మొనర్చి ) తెలిసినది. ఈ శూరునకుఁ దెలియకుండఁ పైకత్తిపైన

నేలాగు కొనియెదగాక ! (అని కరము నుస్పృశించి పట్టి కత్తిని చప్పున లాగుకొనును)

అవీ :- (ఆశ్చర్యముతో) (స్వ) ఔరా ! ఇదియేమి ? ఎవరీ దీనిని లాగుకొనినది ? ఎవరిదీ పరిచిత పాణి స్పర్శము ?

నాడులకు నవజీవమ్ము మోడూలైన
ప్రాణ తరులకు పల్లవ ప్రదవసంత
మంతరంగపు కోఁతకు నతిప్రశాంత
మైన యమృతంపు బూఁత ప్రియం పుస్పర్శ.

ఆ స్పర్శా సుఖ పరవశుఁడనై ఆత్మశక్తిని గోలుపోతినా ! ఖడ్గము నెంత సులభముగా లాగికొనినది ? (ప్రకా) ఎవరీ కత్తిని లాగుకొనినది ?

వైశా :- (వడకుచున్న మేనితో దుఃఖ రుద్ధస్వరముతో) మీ ప్రాణమే తన ప్రాణమని యెంచు వైశాలినికి దక్క యీపరితాప మెవరికిఁ గలదు?

అవీ :- హా ! వైశాలినీ ! కనఁ బడకుండ నుందువదేల ? ఈ పాపాత్మునికి గనబడ రాదను కొనితివా ?

వైశా :- వజ్రదంతుఁడిడిన యదృశ్య కరణి ప్రభావమున నిట్లుంటిని.

(అని యదిదూరముంచి కనబడును)

అవీ :- (కోపాను రాగములతో వైశాలినిం గని) హా ! ప్రాణ సఖీ ! (అని కన్నీరు గార్చుచు) ఈ యవమాన హతుఁడగు నవీక్షితుని పజ్జకేల వచ్చితివి ?

ఎక్కడి ప్రాణకాంత విక నెక్కడి ప్రాణ సఖుండ నేను నా
కక్కట ! ప్రాణ మన్ననె భరాధికమై సహియింప కుండెనన్
దుక్కగ గుండియన్దరుగు దుర్యశపుం బవికోఁత మాన్పదే
ఇక్కడికేఁగు దెంచియసినిగ్గు కొనన్పలమేమి ? మానినీ ?

నీవలచిన రాజకుమారుఁ డెన్నడో చచ్చినాఁడు.

ప్రాణమేఁగుట మృత్యువు కానె కాదు
నరుఁడు యభిమాన హతియైన నాడె చచ్చు

మేనుపుట్టుట జన్మమ్మ కానె కాదు
కీ_ర్తియుదయించు నాడె యామూ_ర్తి పుట్టు.

రాజకుమారీ! నాపై యాస విడువుము! ఏ రాజకుమారు నైనవరించి సుఖించుము.

వై శా :- మిము మెచ్చి మీకిచ్చిన యీ మనస్సును దత్తాపహార మొనర్చి యితరుల కిచ్చుట నావలనగాని పని. వీరాగ్రణీ! నేను మీపద దాసిని. నాకొసంగిన మీమనసుపై మీకెట్టి యధికారముండ గూడదు. అదినా సొమ్మగుట మీకుఁ దెలియనిది కాదు.

అవీ :-బేలా! అటులాడు చుంటివేల? మన కిరువురకును శాస్త్ర సమ్మతమగు వివాహమైన గదా! ఇట్లాడ భావ్యమగునా?

వై శా :- శూర శిరోమణీ! మనోలగ్నమే నిజమైన లగ్నము. శాస్త్రసమ్మత కల్యాణాచరణము పెద్దల యామోదాశీస్సులఁ బడయుటకును వారికి విందొనర్చుటకును మాత్రమే నియమింపఁ బడినది.

అవీ :-రాజపుత్రీ! శత్రువులచే నోడింపఁబడిన నన్ను "శూరశిఖామణీ" యని పిలిచి మరింత యవమాన పరుచనేల?

వై శా :- ధర్మయుద్ధ విజయమే జయమగుగాని పలువురుపైఁబడి యక్రమ పద్ధతుల పట్టి నాగపాశ బద్ధుని జేసి చెఱఁ బెట్టు బంది పోటు తనమును విజయమనుట హాస్యాస్పదము.

అవీ :- భామినీ! బలిమినైన ప్రాణము లాగిన నది చావే యనఁబడు నట్లు ధర్మమున గాని యధర్మమున గాని మనను లొంగఁ దీసినచో నదివారికి విజయమును మనకునప జయమగునని తెలియవలెను.

వై శా :- మాయఁ బన్నియేమరు పాటున బెక్కు రొక్కరితోఁ గెల్చిననా పశుబల విజయము విజయమగునా? దాని విజయార్జన మనుట కన్న పాపార్జన మనుట సమంజసము. మా నాయనగారు విధిలేక నిర్బంధముతో దీనిలోఁ బాల్గొన వలసివచ్చి నందులకుఁ దమతాము లోలోన నెంతగాఁ గ్రుంగి పోవుచున్నారో వచింపఁ జాలను. దానికై మీతో క్షమాపణ వేడు కొనగానను బంపిరి.

అపీ :- అది నాకును దెలియును. వారిపై నాకే కోశమున నన్యథా భావము లేదని విశ్వసింపుము. పరిస్థితుల నిర్బంధమువారి నాచర్య లొనర్పఁజేసినది.

వైశా :- ఇందు నాయనగారి పక్షమునుండి క్షమాపణ వేడుకొను చున్నాను.

(నేపథ్యమునుండి వచ్చు ధ్వని నిరువురు వినుట నభినయింతురు)

అపీ :-(తనలో) ఇంకేమి ? ఆయుఋము నాతండ్రియగు కరంధమ జీమూత ముదే ! ఇంకెట్లు ? ఈ మొండి జీవమునకు రాళ్లఁగొట్టిన జావులేకున్నదే.

(తెరవ్రాలును తెరలో)

అరెరే నీవాకమేక వన్నెపులి వంచాలోచన న్బూకయే
మరిమత్పుత్త్రి నవక్ర విక్రమ కళామాన్యు న్వరాఢ్యు న్స్వయం
వరఘోషన్బ చరింప నౌనని మదిన్భావించి పుత్తెంచగా
స్థిరమౌ శాస్త్రినొనర్చి నాకుఁదగు బుద్ధిజెప్పినా వేమనన్.

(పై పద్యముఁ జదువుచు కరంధముఁడు ప్రవేశించును)

ఇంకనీ చెరఁగునంటి వచ్చు నీకరంధమాగ్ని నీవిదిశ విశాల వంశకాననము వ్రేల్మిడి భస్మముగా దహించి కాని మరి విడువదను కొనుము. ఎచట నా ప్రియనందనుఁడు ? వేగఁ జూపించుము ! (విశాలుఁడు ప్రవేశించును)

విశా :-కరంధమ సార్వభౌములకు జోహారులర్పించి ఈ విశాలుఁడు వినమ్రుఁడై మనవిఁ జేసికొను చున్నాఁడు. ఇంగితజ్ఞులగు దేవరవారు తొందర పడియే కార్యమును జేయ నొల్లరనియే నావిశ్వాసము.

కర :- నీకపట వినయ భాషణలు నేను వినదలచు కొనలేదు. ముందు నా ప్రియనందను జూపించి మరిమాటాడుము !

విశా :- మీనందనుఁ డింతకు ముందే బందెనుండి విడిపించబడి ఈ రాజాతిథి భవనములో నున్నాఁడు. (అంత తెరయెత్త నవీక్షితుఁడు తలవంచుకొని నిలబడి యుండును కరంధముఁ డవీక్షితుని గాంచి బాష్పాస్యుఁడగును. అవీక్షితుఁడును కన్నీరు విడుచుచు మౌనముగా నిల్చును)

కర :- కుమారా ! రాహుగ్రస్త చంద్రునివలె చిన్నవోయి వన్నె తరిగిన నీమోమునిట్లు మున్నెన్నడును నేజూచి యెరుగను. నీయపజయ వృత్తాంతమునంతయుఁ జెప్పికొని నాహృదయమును భారరహితముఁ జేయుము.

అభి :- ( బాష్పరుద్ధ కంఠస్వరముతో ) తండ్రీ! అపజయావమానము లొందిన యీ మోము మీకుఁ జూపుటకై నేదుఃఖపడు చున్నాను కాని వేరుకాదు. మీకరమ్మున మెరయుఁ గరవాలమున నీ యసమర్థుఁడగు పుత్రుని శిరమ్ము తరిగి తద్రక్తమున వంశకలంకము కడిగివేయుడు.

కర :- కుమారా! యుక్తాయుక్తముల నెరిగి నిన్ను నీవేలనిందించుకొను చున్నావు. నీవంతగా గ్రుంగి పోవలసిన యవసరములేదు. మరల నీవు వారందరి నిజయించినీ విశ్వవీర బిరుదమును నిల్పుకొను సమర్థుఁడవని నావిశ్వాసము. గతమును గూర్చి చింతింపఁబనిలేదు.

ఓ కొమరుండ! ప్రాణముల నుంచిరి యింతకు నింతెచాలునా
సోకులు, నోడితీవనుచు శోకము నొందను ధర్మమార్గతన్
డీకొనినారె "దొంగిలి గడించున దొక్క ధనమ్మొ" యవ్విధిన్
వీఁకనధర్మపద్ధతి లభించున దొక్క జయమ్మొ యిమ్మహిన్.

నిన్నిట్టి యధర్మ యుద్ధమున వంతలిడిన యీరాక్షసాధములు చావవలసి నదేకాని, నీవేలచచ్చుట? నీవు బ్రదికి యుండి తిరిగి వారినందరనశింపఁజేసి కసిదీర్చుకొన కృత నిశ్చయుఁడవు గమ్ము. ఎట్టి యాపదలలోనైనను ధైర్యముడుగుట వీరునకుచితముగాదను విషయమునే నీకుఁ జెప్పవలసిన పనిలేదు. ఔరా! దురాత్ములారా! నేరానుంటఁ దెలిసి పారి పోయితిరి. (విశాలుని దిక్కై) ఓయీ? నీవు నన్నెరింగియు వారికి వంతబాడితివా! నీకును వారి గాలి సోకెనా? స్వామి ద్రోహులారా! తగలు బలిసి కొండను డీకొనిన దిగాదా! నాతో వైరమునకు మీకెన్ని గుండియలు కావలయునో తెలియునా?

విశా :- మీకెన్నడు నేనిట్టి ద్రోహము తలపెట్టు వాడనుగానని పదేపదిగ మనవి నొనర్చు చున్నాడ. మీరాక వినియారాజు లింతకుముందే పలా యన మంత్రము పఠించినారు. తక్షణమే నే నీరాకుమారుని బంధ విముక్తు నొనర్చితిని. మీపట్లనపచారపడు నంతటి మూఢుడనుగాను.

కర :- మరిదీని నేమందురు?

విశా :-- అనేకములగునమూల్యప్రాణముల రక్షించుటకునై నాయనిష్టము నణచికొని వారికిలొంగి యీ యసత్కార్యముననుమతించవలసి వచ్చినది. మీపై ద్వేషము నాకే కోశమునలేదు. వారందురు నీకుమారుని వధో పాయము నాలోచించు చుండ వారికడ్డు జనిపలు తెఱఁగుల బోధించి రక్షించుకొనిన నాప్రేమమది నీతనయునకు సువిదితమే.

ఘనప్రతీపశక్తులకు లొంగినటులుండి
స్వీయకార్యము సాధించు ధీయుతుండు
ఒక మహానదిన్ దాటగనోడ తాను
ధారకెందు, లోఁబడుచునె తీరమేఁగు.

కర :- ఔరా ! నీప్రేమ మెంత వెల్లి విరియు చున్నది. ఇది మామొగముఁ జూచి మాటాడెడి యవకాశ వాదము. (సుతునిగని) రాకుమారా ! ఈ రాజన్యుని పలుకులన్ని నిక్కవ మనుకొన దగునా ?

అవీ :- అందేమాత్రము సంశయము వలదు.

కర:-అయినచో నారాజులతోఁగూడి యాదృఢకేశి యీదురంతచర్య నొనర్చెనా?

అవీ :- ఔను ! అట్లయ్యునునే నెవ్వరికిని నోడిచను వాడను గాను. కాని నన్నా దృఢకేశి నాగపాశ బంధితుని జేసెను. దాని ప్రతిక్రియయగు నారాయణాస్త్రము వజ్రదంతుని కూరిమి ప్రియురాలిని రక్షించుటకై ప్రయోగించితిని. ఆమెసురక్షితయై గంధర్వలోకమును జేరుకొనుచుండెను. ఆ యదనుగని వారలు బంధితుఁడనగు నన్ననేక దుండగములకు గురి నొనర్చిరి.

కర :-(రోషముతో నొడుగఱచి కాలనేలఁ దన్ని) ఊఁ ! ఆ కిరాతులు నిన్ను బలుహింసలఁ బెట్టిరి కదా ! ఈ యధర్మయుద్ధము వారి జీవితములో నొక మాయని మచ్చగా భావించక విజయుల మైతిమని విఱ్ఱవీఁగు చుండిరా ?

అవీ :- తండ్రీ !

అక్కట యస్త్రమాయదను కందెడి పట్లవిరోధి వర్గమున్
డొక్కలు చించిరాల్జరచి దుష్ట శిరమ్ముల నొక్కటొక్కటిన్

ఫక్కమనంగఁ దన్ని బలవత్తర ఖడ్గకఠోర ఘాతలన్
జక్కగఁ గాయముల్దరిగి శాంత మనస్కుఁడఁ గాక యుండునే.

(విచారముతో) ఇపుడే మనినవేమి ప్రయోజనము? బీరములు పల్కుటలగును.

దక్కరి పోసతీ మణుల తాళిబలమ్మనగ త్తిలేమిచే
నిక్కడికేని బోవిడువ నెట్టని చీమల బారులట్లుకా
ల్ద్రొక్కుల నుగ్గునూచలయి త్రుంగగ రాచినదజ్జయధ్వనుల్
దిక్కుల మారు మ్రోగఁబగ దీర్పమినిద్దుర వోవుపెట్లికన్.

విశా :- కరందమ సార్వభౌమా! మీకై నను మీకుమార సింహమునకై నను నీశత్రు విదారణ మొక ఘన కార్యము కానేకాదు. ఈతవచ్చిన వాఁడు లోతింతయని భయపడునా! మీముందు వారందరి పరాక్రమ మెంత? (ప్రతీహారి ప్రవేశించి యొక పత్రమును విశాలున కొసంగి నమస్కరించి చనును) (విశాలుఁడది చదివినవ్వుకొనుచు) ప్రభూ! మీరు వచ్చెరింగి పారిపోవుటే కాక వినతి పత్రిక నంపి తద్వారా శరణాగతిని యాచించిరి. చేతులు కాలిన పిదప నాకులపట్టుకొన యత్నించు మూర్ఖులు వారు. ఒక్క దృఢకేశి మాత్ర మెచ్చట దాఁగి యున్నాఁడో కాని వాని పేరిందులేదు. (అని యాపత్రిక కరందమున కొసంగును) (కరందముఁడది చదువును)

కర :- (పరిహాసముగ నవ్వుచు) ఆయతిరథ మహారథులకును మమ్ము క్షమా భిక్ష వేడవలసి వచ్చెనా? దీనింజూడ వీరి పరాక్రమ మెంత వెల్లివిరియు చున్నదో తెలిసికొనవచ్చును.

విశా :- నేను ముందే మనవి నొనర్చితిని. పరాక్రమించి పైకిలంఘింప వచ్చు పంచాస్యము ముందు మదగజ సముదాయము బెదరి చెదరి పోక నెదిరింప సమర్థ వంతమగునా? రాహుగ్రస్త సూర్యబింబమువలె మాయా వివశుఁడై యపీక్షిత్కు మారుఁడు పట్టువడెనే కాని ఈ ముల్లోక ములలో నతని మించిన వీరుఁడు లేఁడనుట నిర్వివాదాంశము. ఏమరు పాటున నతని నిట్లొనర్చిరే కాని యిపుడతని మునునిల్ప సహస్ర దృఢ కేశులైన చాలుదురా?

కర :- అది నిజమే ! ఇపుడు నాకర్తవ్యమేమి ?

విశా :- మీరిరువురు తండ్రికొడుకు లిపుడాత్మపతుల క్షమింపకున్న నెన్నియో రాజ వంశము లంతరించిపృథివి నిక్షత్రియము కాగలదు. లోకకల్యాణము కాంక్షించి వారిని క్షమించుటలే సమంజసము

నిలవు గభీరహృదయునకుఁ
దులువలు తన యెడ నొనర్చు దొసఁగులు తిరమై
జలము లఖిలకల్మష భృత
ములగుచునడుగొత్తి స్వచ్ఛములె యగు మాడ్కిన్.

ఒక్క దృఢకేశిని మాత్ర మంత మొందించవలసినదే.

కర :- (అవీక్షితుని గని) కుమారా ! ఈ రాజులెల్లరుతా మొనర్చినయవివేక కార్యమునకు నాకు మోము చూపుటకు సిగ్గుపడి పశ్చాత్తప్త హృదయులై ప్రతికా ముఖమున నిట్లుక్షమాభిక్షనర్థించిరి. ఇపుడు మన కర్తవ్యమేమి ?

అవీ :-నేనొందిన యవమానము మరియుకష్ట నష్టములు వారి నాశమొనర్చిన నివారింపఁ బడుననుట మాత్సర్యమే కాని మంచి చర్యకాదు. పాపము పశ్చాత్తాపమున కడిగివేయఁ బడుననుట లోక ప్రసిద్ధము. శరణన్న వారిని క్షమించుటలే క్షత్రధర్మమని నామనవి.

కర :- నాకును వారిని క్షమించుటే సముచిత కార్యమని పించుచున్నది.

విశా :- (స్వ) ఏమి ! యవీక్షితుని సహనపరాకాష్ఠ ? ఎంతటి చిత్తసంయమనము ? ఈ కల్యాణమణిభూషణు నీకూరశిరోవతంసు నీశ్వరుఁ డాయురారోగ్య భాగ్యములఁ బ్రసాదించి రక్షించుఁగాక ! (ప్ర) కరందమ సార్వభౌమా ! అనుభవజ్ఞులు దండోపాయమునే సర్వత్ర సాధనముగాఁ గొనరనుట తమ రెరుంగనిది కాదు. పగతో బగచల్లారునా !

ముల్లుగొని ముల్లు పెరుకం
జెల్లునసుచు నిర్ణయమ్ముఁ జేసియటులె యే
యిల్లైనగాలు వేళన్
జల్లార్పఁ గవశమె దాని జ్వాలనునితోడన్.

కావున కయ్యమును మాని నెయ్యమును బాదుకొల్పి వారిక్షమించు మీ దూరదృష్టికి ననంతాభి వాదములు. మహానది తనుజూచి తలవంచు ప్రబ్బలను బొట్టనిడి పోషించుట తమకు తెలియనిదా ?

కర :- మీయందరి యాశయాను సారమా శరణాగతుల రక్షింతునని వాగ్దాన మొనర్చు చుంటిని.

విశా :- ఇంకొక మనవి వినమ్రముడనై తమ మ్రోలవిన్నవించు కొనుచుంటిని. దాని చిత్తగించవలెను.

కర :- ఏమది ?

విశా :- కరంధమ సార్వభౌమా ! నాకూతురు వైశాలిని తానీ యవీక్షిత్కుమారుని మనసార వరించినది. దీనికి సమ్మతింపరేని నితని దక్కనన్యులవరింపనని పట్టువట్టిన నాతనయ జీవితము వ్యర్థపరచుటలగును.

కర :- ఇందు నాదేమి కలదు. ఇది యంతయు నాచిరుతనిపై నాధారపడి యున్నది.

విశా :- వారిని గూడ మెప్పించి యొప్పించఁగల సమర్థులు మీరే కదా ! సానుభూతితో దీని విచారించ గలరని ప్రార్థన.

కర :- (ఆలోచించి సుతుని గాంచి) కుమారా : ఆ కన్నియ నిన్నుదప్ప నన్యునివరించియిప నొల్లనని ప్రతిన దాల్చి యున్నదట. ఆ సుందరిని బాణిగ్రహించి మన వంశము నుద్ధరింపఁ గలవని తలంతును. నీయభిప్రాయమేమి ?

అవీ :- (విచారముతో) "తనలో" ఇపుడీ విషయములోఁ బరమ పూజ్యులగు జనకులకేమని ప్రత్యుత్తరం బిడవలెనో తెలియ రాకున్నది. ఏయింతికై యింతటి వంతల నొందితినో ఘోర పరాజయము గాంచితినో ? ఆమెను నేనేమని చెట్టఁ బట్టవలెను ? అన్ని తెలిసియు నా జనకులు దీనికై పురి కొల్పుచుండిరేల ! ఐన నీప్రకారముగా నొక మనవి యొనర్చి చూచెదను. (ప్రకా) ఆర్యా! నేను మీమాట నెప్పుడును దలదాల్చు వాడను. కాని యీ సందర్భములో శత్రురాజులచేఁ బరాజయము పొందిననేనామెను బాణి

గ్రహించ నిచ్చగించుటయు నామెనన్ను వరింపనెంచుటయుఁ బ్రపంచమున బరిహాసభాజకములగును.

విశా :- రాకుమారా ! మీరు విశ్వవిజయులు. మీరు పరిహాసమునకు గురియగుటలుకల్ల.

అవీ :- అంతకు మున్ను విశ్వవిజయినైననేమి ? నేనిపుడు శత్రురాజులచే నోడింపఁబడి పరాభవము నందలేదా ?

విశా :- అధర్మయుద్ధ మందక్రమపద్ధతినోడితిరి. లేకున్న నీ ముల్లోకముల మిమ్ము గెల్చు మొనగాఁడే లేఁడనుట లతిశయోక్తులుగావు. ముఖప్రీతి వాక్యములంతకును గావు. ఆ రాజులందరును మీకు శరణాగతులగుట యేమీవిజయమునకుఁ బ్రబలతార్కాణము. కావున మీరది యొక యవమానముగా భావించక జనకుని యాదేశమును మన్నించి నాతనయనను గ్రహించ వలెనని మనవి సేయుచున్నాను.

కర :- వత్సా ! విశాలుని వాక్యము లియ్యెడ నాదరణీయములే కాక యాచరణీయములు గూడనైయున్నవి. విశాలుఁ డనినట్లు శరణాగతులైన యా రాజుల పరాజితులు కాని నీవుకావు.

అవీ :- తండ్రీ ! ఈ రాజుల దొక లెక్కగాదు. నాకువైరి యాదృఢకేశివాఁడు తాను లొంగి వచ్చుట యసంభవము. వాఁడేనా పరాజయమునకుఁ బ్రబల కారకుఁడు. వానిగెల్చి లోకకల్యాణ మొనర్చిన గాని నేను రాజ్యభారము వహించననియు, కల్యాణ మొనర్చుకొన ననియు గురువులగు కణ్వ పుత్రులతో మరియు సువ్రతులతో నంతకు ముందే ప్రతిజ్ఞ నొనర్చితిని. ఆ రాక్షసునిచేఁ బ్రజలు చెప్పరాని కష్టములఁబడుచున్నారు. రాజున కెందును బ్రజాకల్యాణమే తన కల్యాణమని తమ రెఱుఁగకపోరు. కావున వాని నిర్జించునంత వరకు నితరములాలోచింపలేను. ప్రజాకల్యాణము మొదలు నాసుఖ భోగములు తదుపరి.

కర :- నిన్నువాఁడు ధర్మయుద్ధమున నోడింప కుండుట నాలోచింపఁజాలకున్నావు. నీకడ నారాయణాస్త్రమే యున్న నీనాగబంధము నిన్ను బంధించ

గల్గెడిదా ? దానిఁ బరోపకారమున వినియోగించిన నీవు ధన్యజీవివి. ఆ నాగ పాశమే నిన్ను బంధించుటకేదో శాపము కారణము కావచ్చును. శాపము తలక్రిందులు తప మొనర్చి పాశమై వేధించి యుండ నోపును. చాపశక్తి కన్న శాపశక్తి ఘనమైనది గదా ! నీకెవరేని శాపమిడిరేమో? నీకు శాపముతో విపత్తు గలదని నీచిన్ననాడు జ్యోతిష్కులు చెప్పిరి.

అవీ :- జనకా ! నాకే శాపము తెలియదు. తమతో స్వతంత్రించి మాటాడు వీనిని క్షమింతుననిన నొక చిన్న మనవి నొనర్ప సాహసింతును.

కర :- నీ యభిప్రాయము నిరభ్యంతరముగా నివేదింపుము.

అవీ :- పూర్వ మొకసారి యీసామంత రాజులందరును దమతో నిర్లేకమై యధర్మయుద్ధ మొనరించియు నోడింపఁ బడలేదా ?

కర :- అది నిజమే. నాకాయమానుషశక్తి తపమువలన లభించినదే కాని సహజముగా సంక్రమించినది కాదు.

అవీ :-ఈ చిరంజీవుఁడు నన్నిట మీకు కుమారుఁడే యనఁబడుటకు శ్రమించ వలదా ?

కర :- కుమారా ! నీవు పరమనైష్ఠికుడవై యరణ్యములఁ దపమాచరించు చుండిన రాజ్య భారము నెవరు వహించు వారు ? ఈ వాన ప్రస్థము వార్ధకమున నీకు రాజ్య భారమప్పగించి నేను సల్పవలసిన చర్య.

అవీ :- ఈ యసమర్థుఁడు గృహలక్ష్మిని వరించి గృహాధికారి యగుటకే యనర్హుఁడన రాజ్యలక్ష్మిని వరించి రాజ్యమున కధికారి యగుటెట్లోతోచదు.

కర :- ఇంక రాజ్యమరాజకమై యుండవలసినదేనా ?

అవీ :- అటులననేల ? "వీరభోజ్యా వసుంధరా" అను నార్యోక్తి నను సరింపఁదగు.

కర :- ఈ వాక్యములలోని నీయాశయమేమి ?

అవీ :- ఇప్పటికిని శత్రు మదగజంబుల కెవ్వనిపేరు సింహస్వప్నమో మరియు నే మహా సత్వుఁ డొక్కకేల లెక్కలేని శత్రురాజ సమూహంబుల ససైన్యముగ నుక్కడంచి కరంధమ బిరుదము నొందెనో ఆ వీరశిరో మణిగల్గ రాజ్యరమకేటి లోటు ? ఎక్కడి భయము ?

కర :- వత్సా ! ఏలయిట్లు వనప్రయాణ గర్భితమ్ములును, దపశ్చర్యా సూచకంబులగు వాక్కులఁ బల్కుచుంటివి? నీ తలిదండ్రులమగు మేమునిన్ను గని వార్ధకమున మాకక్కరవత్తువని గంపెడాసలు నీపై నిల్పుకొని యున్నాము. అట్టి మా యాశాంకురముల గోసి వేయనేల? ఈ వార్త వినిన నీ తల్లి నిలువున గ్రుంగి పోదా ?

అవీ :- పితృదేవా ! ఇంతకు ముందే శత్రురాజులచేఁ బరాజయమునంది మీ మనంబుల ఘనంబుగ నొప్పించితిని. మరల మీకిపుడనిష్టమగు వన ప్రయాణములతో మిమ్ము ఖేదపెట్టఁ జనదు. కావున నికముందు దీనుడనై పరాధీనుఁడనై మీముందే పడియుందును.

కర :- కుమారా ! ఇట్టి యలౌకిక భాషణములు భాషింపనేల ? ఈ వృద్ధ జనకుని మాట లొక్కింత చెవినిడి నీపై ననే తను మనః ప్రాణములు నిల్పి యున్న యిన్నెలఁతను వరింపుము. మమ్మానంద సాగరమున ముంపుము.

అవీ :- తండ్రీ ! పరిభవాంధుఁడనగు నాకు మీరు చూపు మార్గమే మాత్రము గాన రాకున్నది. నన్ను క్షమింపుడు.

విశా :-(స్వ) ఇంక నీ విరక్తున కెవరి హితోపదేశములను జెవి నాటుకొనవు. ఏమి యొనర్పవలెనో యూహా బాహ్యమై యున్నది.

కర :-(స్వ) జ్వరితున కన్న పానంబులు రుచించనట్లే యీ యవమాన పీడితున కెవరి హితోపదేశంబులును రుచింపకున్నవి. ఇంక నీ విషయ మింతటితో విరమించుటయే మంచిది. (ప్రకా) ఇంటి కైనను వచ్చెదవా ? కుమారా !

అవీ :- ఆర్యా ! మీయాజ్ఞాను సారము వచ్చెదను. కాని మీరు నాకు తపశ్చర్యకై యవకాశ మొసంగి యా యతిమానుషశక్తి పడయునట్లొనర్పవలెనని మనవి. అప్పుడు గాని

వైరివితతిచే నీ యోటువడిన కరము
కాష్ఠతాడిత భుజగంబు కరణి వారి
కాయముల నసిదంష్ట్రిల గాయపరచి
ప్రాణవాయువు భుజియించి పగనడంచు.

విశా :- (స్వ) ఔరా ! ఇంక నితఁడు తన పట్టువిడుచునట్లు లేదు, ముందు నాతనయ గతియేమి కావలెను ?

కర :-(స్వ) తానొకటిఁ దలంప దైవకృత మింకొకటియైనది. ఇంక నిచట నుండుట సముచితముగాదు. (ప్రకా) కుమారా! సదనమున కరిగిన పిదప మీజనని యాజ్ఞగైకొని నీయిచ్ఛ వచ్చినట్లు మెలంగుము. ( విశాలుని దిక్కై) విశాల నృపాలా ! చింతలనేల ? దైవవిధి దాట నెవరితరము. మానవుఁడు తానెంత బలవంతుఁడైనను బరాధీనుఁడే యనుమాట నీకుఁ దెల్యనిది కాదు. నేనేమియు నీకు సాయము సేయలేకున్నాను. పోయి వత్తును. దయనుంపుము.

విశా :-కరంధమ సార్వభౌమా ! దయఁ దలంప మీ ముందునే నెంతవాఁడను. పెద్దలు మీరే యీ దీనుని దయఁ గనవలెను. నావిధికృతమునకు మీరెట్లు బాధ్యులు. (విచారించి) పోయిరండు.

(కరంధమావీక్షితులు నిష్క్రమింతురు) (వైశాలిని ప్రవేశించును)

విశా :- (స్వ) హా ! హతవిధీ ! ఎన్నిరీతులఁ బ్రయత్నించినను రాకుమారుని మనసు మారదయ్యెను. అతనిని దప్ప నితరుల వరించనని దృఢ నిర్ణయము గల్గి యుపవరయైయున్న నాతనయ గతియేమి కావలెను ? మరొక భూపాలుని దగినవ్వాని వరించుటకై యథాశక్తి కృషినొనర్తును. (వచ్చుచున్న తనయంగని) బిడ్డా ! విషణ్ణ వదనవై కనిపింతువు. ఇంత వరకా రాకుమారుఁడాడిన పలుకులు లోనుండి వింటివి కదా ! పరిపంథి నృపులచే పరాభూతుఁడైన తాను పరిణయ మాడుట పొసఁగదని యెంత వేడినను నిను బరిగ్రహింప నొల్లఁడయ్యెను. నాకుఁ జూడ నీ వొక యోగ్యుఁడగు క్షితిపతిని వరించి జీవితము సఫల మొనర్చికొనిన బాగుండునని పించును. అందని పండ్లకై యఱ్ఱులు సాచనేల ? ఏమందువు ?

వైశా :- నాదురదృష్టమునకు మీరేమి యొనర్తురు ? అర్థించు ఫలములు హస్తంగతమగుటకు పూర్వ పుణ్యముకావలెను.

విశా :- మరొక నృపాలు వరించుటకు నిష్ఠేల వెనుదీయు చుంటివి ? బ్రహ్మ లిఖితము నెదిరింప నెవరి తరము ?

వైశా :- (బాష్పరుద్ధ కంఠధ్వనితో) సర్వజ్ఞులగు మీ ముందొక చిన్నమనవి. సహృదయులగు తమరు చిత్తగించవలెను.

విశా :- బిడ్డా! తప్పక తెలుపవచ్చును, నేను నీకు పరవాడనా?

తలపడిగున్న మావిని లతాసతిమల్లిక యల్లిబిల్లిగా
నలము కొనంగ దానిఁ గని యన్యతరు స్థలినంటు వెట్టనై
తొలఁగఁగఁ దీయుపట్లనది త్రుంపులు త్రుంపులుగా దెయట్టులే
తలపఁగరాదె నాయెదను దండ్రి! యికేమని విన్నవించెదన్.

విశా :- నీచక్కని వాక్కుల కెంతయు సంతసించితిని. కాని యా రాకుమారుఁడు నిన్నొల్లక స్వపురి కరిగెను. అదియును గాక యతఁడరణ్యములఁ దపమాచరించుచుఁదానాదృఢకేశిని శత్రురాజులతోఁ గూడ నిర్జించు శక్తిసంపాదింతు ననుచున్నాఁడు. అంతవరకు నినుపెండ్లి యాడఁడట. కాని, తలిదండ్రులది సాగనీయరనియే నానిశ్చయము.

వైశా :- నాకతని వీడిన పట్టణమైనను వనమే. అతనిఁ గూడిన వనమైన బట్టణమే. మనశ్శాంతి లేని సుఖమేనియు దుఃఖ సదృశమైనదిగాఁ గన్పట్టును. అతఁడడవులఁజని తప మొనర్ప వీలులేదంటిరి. నేనతనికి మారుగా వనులఁ జని యా వీరశిరోమణి విజయ ప్రాప్తికై తపమాచరింపఁ దలఁచితిని. వజ్రదంతుఁ డొసంగిన యదృశ్య కరణి ప్రభావంబున నేనొరులకుఁ గాన రాక సురక్షితముగా నుందును.

విశా :- నీవనుభవములేని వాక్కులఁ బల్కుచుంటివి. ఏమను చుంటివో నీమాటలు నీకే తెలియుటలేదు. నీవేడ ? యా ఘోరాటవులలో తపం బొనర్చుట లెక్కడ ?

వైశా :- మీరు నామనస్సును బరీక్షించుటకో లేక వాస్తవముగా నిటులు పల్కు చుంటిరో తెలియుటలేదు.

విశా :- బిడ్డా! యేలయిట్లు పల్కుచుంటివి ? ఏకైక పుత్రికవగు నీవు వన ప్రయాణ ప్రయాసము లనుభవించుచుండగా నీజన్మలోఁ జూడలేము.

అతని విస్మరించి మరొక రాజకుమారుని వరించి మమ్మానందింపఁ జేయుము.

వైశా :- బిడ్డల యానందమే తమ యానందమని తలఁచు పితృదేవుఁడే యిటులానతీయ నింక నా ముచ్చటలు దీర్చువారెవరు గలరు ?

విశా :- బిడ్డా ! నీ శరీర మావనము లందలి శీతాతప బాధలకును గందమూలాదుల భుజించుటకును నొంటరి నివాసమునకు నోర్చుకొనఁ జాలదు. నీపట్టుదలమాని నామాటవిని మరొక మహాత్మ విచారము జేసికొనుము.

వైశా :- సత్యవాక్పరి పాలకుఁడగునేలిక స్వయంవరమని చాటి యన్యథా యిటులాజ్ఞాపించుట లెట్లో తోచకున్నది.

విశా :-కుమారీ ! నీవీ వాక్కుతో నానోరుగట్టితివి. నేనింక నేమియు వచింపఁ జాలను. నీయిచ్చవచ్చిన వరునే వివాహమాడఁ బ్రయత్నింపుము. ఆ పరాత్పరుఁడెల్లెడల నీకుఁ దోడు నీడయై రక్షించుఁ గాక ! (కంచుకి ప్రవేశించును) (తలవంచి నమస్కరించును)

కం :- మహారాజా ! పూజ్యులు సువ్రతులు ప్రవేశింప ననుమతిగోరి వేచి యున్నారు.

విశా :- అవశ్యముగా నిందుఁ బ్రవేశపెట్టుము.

కం :- చిత్తము (అని నిష్క్రమించును)

(సువ్రతులు ప్రవేశింతురు) (రాజులేచి యుచితాసనమిడి నమస్కరించును)

సువ్ర :- మహారాజా ! ఆయుష్మాన్ భవ !

విశా :- త్రికాలవేదులగు తమకుఁ దెలియని విషయమే ముండదు. మహాత్మా అయినను నాపుత్రికా విషయ మొక్కింత విన్నవింతు. చిత్తగింపఁ బ్రార్థన.

సువ్ర :-నరపాలా ! నీవు చెప్పవలసిన యవసరములేదు. నాకంతయు నింతకు ముందే తెలిసినది. అవీక్షిత్కుమారుఁడు శత్రురాజులచే నోటమిగాంచి వలచిన వైశాలినీ దేవిని పాణిగ్రహింప నొల్లక వనుల కరుగఁ దలచెను. నీపుత్రికయు నతని దక్క నింకొక్కరిని వరింపనొల్లక తపమ్మొనర్ప నరణ్యముల కరిగెదనని పట్టుబట్టి యున్నది.

విశా :-తమకుఁ దెలియ రానిదేది ? మునీంద్రా ! భయ దాఁటవులలో నీబాలిక తపమాచరింపఁ దరలుదు ననుట సాధ్యపడునెటులు ? గురువులగు మీరైన వారింపఁ జేయుడు.

సుద్రవ :- విశాల నృపాల ! నీవు భయమొంద వలసిన పనిలేదు. ఈ మగువ నరణ్యములకేఁగ నిమ్ము ! అంతయు శుభమే కల్గును చింతిలవలదు.

విశా :- ఒంటరి బాలిక తానా యరణ్యంబులఁ గ్రూరమృగంబులఁ గాంచి భయమొందక నిలువఁ గలుగునా ? మునీంద్రా ! వజ్రదంతుఁ డొసంగిన యదృశ్యకరణిని నమ్మి యింత సాహసించుటలుచితమా ?

సుద్రవ :- మహారాజా ! నీకాచింతవలదు. ఈమె యరణ్యములో నుండఁ గ్రూర సత్వములవలన బాధ నొంద కుండ నేను నొక రక్ష నొసంగెదను. దీనివలన వనదేవత ప్రసన్నయై సర్వవిధముల నీమెను రక్షించును. వైశాలినీ దేవీ ఈ రక్షను ధరించుము ! (అని యిచ్చును)

వైశా :- మహాభాగ్యము. గురుదేవులు సమయమున కరుదెంచుట నాయదృష్టము.

విశా :- మీరు సమయమునకు దేవునివలెఁ బ్రత్యక్షమైతిరి. మీకు నెంతయుఁ గృతజ్ఞుడను. మీరు మహారాణి చిత్తమునోదార్చి యీ యమ నడవులఁ గొని చనుడు రండు. (అని అందరు చనెదరు)

పంచమాంకము



# షష్ఠాంకము

[ప్రదేశము—వనసీమ ప్రవేశము వైశాలిని]

వై :-(స్వ) రహిమేఘముల తోడి రాయబారమ్ముల
నొనరించునటు దోచు వనతరువులు
అదె యసూర్యంపశ్యయగు నిశాకాంతకుఁ
గట్టని గృహములై క్రాలు పొదలు
వనసత్వములకు జీవన దాన మొనరింపఁ
బరువెత్తి వచ్చునా బరఁగు ఝరులు
కాననలక్ష్మి శీర్షానఁ గుసుమవృష్టి
గావించునన వ్రాలు ఖగ వితతులు
విపిన సుందరి యందాల బిడ్డలగుచు
సంచరించెడి వనమృగ సముదయములు
జంతు సంతతికిడిన యాస్తరణములన
చారుసైకత శాద్వలస్థలులు దనరు.

ఈ వనమెంత సుందరమో యంత భయానకమై యొప్పు చున్నది. శ్రవణ మాత్ర భయంకరంబులును జైతన్య ప్రభేదకంబులునగు సింహ శార్దూల ఘోరగర్జాట్టహాసములే వినఁబడు చున్నవి.

క్రింది మీదులు మరియును ముందు వెనుక
లగుపడ దయోమయంబయి యవలదూర
శాఖలను బాయఁ దీయనె సందొసంగు
భయద సాంద్రాటవిది యెట్లు బయలుగాంతు.

ఇంతకు ముందు నేనున్న తపః ప్రదేశముకన్న నిది వివిక్త ప్రదేశమై యెవరికిని దెలియరానిదిగా నున్నది. కాని యిచ్చటఁ గ్రూరమృగ బాధ యధికము. (నేపథ్యమున ధ్వనియగును) వైశాలినీ! నీకు సువ్రతుఁ డొసంగు రక్షాధారణము వలన నేను గడు బ్రసన్ననైతిని. నీ కిచ్చట నెట్టి ఘాతుక

జంతువులను నపాయము గల్గింపఁజాలవు. నీవు నిర్భయముగా నిచ్చట నీతపో వృత్తి నిర్వహింపుము. ఇచ్చట భిల్లపురంధ్రి నీకు నాపత్కాలమునదా నవ సరపడఁగలదు. సకల పరిచర్య లొనర్చఁగలదు. నేను వనదేవతను.

వై శా :- వనదేవతకు నాకృతజ్ఞతాంజలులు సమర్పించుకొను చున్నాను. నీ యభయ ప్రదానమువలన నామనస్సు కుదుటబడినది. నేను ధన్యనైతిని. నాకు నీవును నీవన్య సత్వమ్ములు నాప్తులని భావించు చున్నాను. (స్వ) నాకు నెవ్వరునుగతి లేరను కొంటిని. ఈ వనదేవతా ప్రసాదమున నీ తరుల తాగుల్మములే బంధు మండలి యైనవి. ఈ పశుపక్ష్యాదులే నాసజాతీయ మిత్రులు. (కొంతాగి) వాని స్వేచ్ఛానందములో నాకు సహస్రాంశ మైన గలదా ! ఏ ప్రక్కఁ జూచినను దమ ప్రియులతోఁ గూడి ప్రేమామృతము వెలిఁ జిమ్ము చున్నవి.

విన్ను గ్రుమ్మెడి చారువృక్షాగ్ర శాఖలఁ
గూయుచుఁ దమినాడు గువ్వజంట
కనుమోడ్చి పెంటి గ్రీవను గ్రీవ నొరయును
విచలితోచ్చైచ్ఛ్రవ వికృతి నిల్చి
త్రాడు పేనినయట్లు తనువులు పెనవేసి
కొనుచు మత్తిలిసోలు ఫణిమిథునము
కొలని నీరముఁ జిమ్ముకొనుచు నొండొరులపైఁ
దమిఁ గ్రీడసల్పు వేదండయుగళి
అరయనెందుఁ జూచినను స్నేహాను రాగ
జలధిఁ దేలాడు సకల ప్రాణులును నౌర !
భగ్న ప్రణయనైచను నీయభాగ్య కన్న
ధన్యతమములన్ని విధాలఁ దలఁచిచూడ.

(అంత భిల్లిని ప్రవేశించి వైశాలినికి నమస్కరించును)

భిల్లి :-నీవెవరు ? తల్లీ! రాచకూతురువలె నుంది నిర్మానుష్యమైన యీయడవి నొంటిఁ జరించు చుంటివి.

వై శా :-విదిశా పురాధీశుఁడగు విశాల నృపాలు కన్న బిడ్డ నేను. ఈ కొండ కోనల నీ కారడవుల నీశ్వరుని గూర్చి తప మొనర్చుటకునై వచ్చితిని. నా శరీర మలసి పోయినది.

భిల్లి :-తల్లీ! నీకష్టాను భవముఁ జూడ జాలి గొల్పు చున్నది. నవయువతి వగు నీవీ నిర్జనారణ్యములో నెవ్వరిని నమ్ముకొని యిట్లు బయలుదేరితివి? తమల పాకు తీవవలె సోలిపోవు చున్నావు. తన్మయావస్థతో నొక్కొక యడుగిడు చున్నావు.

వై శా :- మీవంటి దయార్ద్ర హృదయు లెవరైన లేకుందురా? ఈశ్వరుఁడు తన భక్తులఁ గాపాడ కుండునా?

భిల్లి :- అమ్మా! ఈ కానన మే మాకు కన్నతల్లి. కల్పవల్లి. చింతిలవలదు. ఈవనుల యందు నే నుండ మీకెట్టి కొఱఁతయుఁ గలుగదు.

వై శా :-నిజము. అల్లదో! ప్రాణుల దాహతాపములకుఁ గరగిపోవు మంచు గుండియలతోఁ బరువిడి యరుదెంచుచుఁ బలు తరంగహస్తముల జీవన దాన మొనర్చు సెలయేరులు. ఇదో! ఆకలి గొన్న బిడ్డల కాహారమిడ నారాటపడు తల్లివోలె నాత్మీయ శాఖా కరాల నన్నకబళములట్టులతి రుచ్య ఫల సంతతుల నవనిపై రాల్చు తరువరములు. ఇటు గాంచుము! ఆ పన్నుల యార్తి నపనయింప మందహాసముల మధుర భాషణములఁ బలు కరించు మానినులట్లు విచ్చు విరులతోముచ్చటాడు పులుఁగు కలస్వనమ్ము లతో నలరించు పూఁదీవియలు.

భిల్లి :-ఇవి మీ తపోనిష్ఠకై యర్హములగు నాహార విహారముల కనుకూలించు చున్నవి. ఇంక మీరిట యథేచ్ఛగాఁ దపమొనరించుకొనవచ్చును. నేనుకుమీ వలయు సామగ్రి సమకూర్చెదను. మీరు మా వనదేవతకు గౌరవాతిథులు.

వై శా :- నిజము.

అతిథులనేటి నీరముల నర్చనసేయుచు సూనవాసనా
ప్రతతి సుగంధ వాతములఁ బల్మరు వీచుచుఁ దన్ని స్వాదుసం
గతఫలరాజి విందులిడి కమ్మని పక్షికలస్వ నోర్మిసం
గతివరరాగతానమృదు గానములన్వినుచున్ వనోర్వితాన్.

| పేజీ | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 4. | ఒన_ర్తృ | ఒన_ర్తృ |
| 5. | ఆది | అవి |
| 6. | ర్వ్యదే | ర్వ్యఁదే |
| 9. | నిథులు | నిధులు |
| 11. | మణి కుండల | మణి కంధర |
| 12. | క్షిఁచ | క్షించ |
| 20. | బయళుల | బయళుల |
| ,, | వతా | వత్నా |
| 21. | సమర్దింప | సమర్థింప |
| 26. | చుట్టు | చుట్టు |
| ,, | నిండి నుండి | నింటి నుండి |
| 29. | వచ్చి | వచ్చి |
| ,, | నుంచుఁడు | నుంచుడు |
| 31. | గల్లు | గల్గు |
| 34. | ముఁగదా | ముకదా ! |
| ,, | వెంతఁ జూచినన్ | వెంత చూచినన్ |
| 35. | నీవుఁ దక్క | నీవు దక్క |
| ,, | యామెను చేపట్టను | యామెను జేపట్టను. |
| 37. | వై శాలినీ కురుల | వై శాలిని కురుల |
| 37. | ప్రీతిమై యతిథి | ప్రీతిమై నతిథి |
| 43. | మాకు ఇంత | మాకు నింత |
| 44. | చిత్రమును కాబోలు | చిత్రమును గాఁబోలు |
| 45. | నవ్వెలది | నవ్వెలఁది |
| 47. | మల్లిఁ పూచు | వల్లిఁ బూచు |
| 48. | నొక్కై | నొకే |
| 61. | ముద్దుల | ముద్దులు |
| 65. | నలె | వలె |
| ,, | సూర్యల | సూర్యుల |
| 65. | మును తాము | మును దాము |

మొనర్చితిరి. దాని బాటింపరైతిరి. మీరునన్ను మరచినను మీ దివ్య సుందరమూర్తినినే మరువఁజాలను. నేనపుడే మీ సొమ్మునైతిని. ఎపుడు మీరు నాకరమును గ్రహించి తిరో? మీకీ నిరాకణ భావము గల్గుట నా దురదృష్టము గాదా!

నీయనంగాకృతినింగాంచమిని గనుల్
వలవల కన్నీరు వడుపు చుండె
నీసుధాధరమాననేరకహా! యని
యోష్ఠమ్ము లూర్పుల నడుకు చుండె
నీమృదు పదసేవనేని నోచక కేలు
గవ జీవితాశను గడిగివైచె
తావకాశ్లేష బంధములేమి మేన్నీడి
ఖగములై ప్రాణమ్ము లెగయనుండె
(కనులు మూసికొని నిట్టూర్చుచు సబాష్పయై)
కనులు మూసియె నీరూపుగాంచు చుంటి
ధ్వనియె లేకుండ నీనుడుల్ వినుచునుంటి
దరినిలేని నిన్గొగిటఁ దార్చు చుంటి
పనికిరాని యీ తనువునె పాయనుంటి.

అబ్బా! యిప్పటి యీ హృదయావస్థ నేమనవలెనో తోచకున్నది. ఏమి యీ యున్మత్తత?

తద్వి నాన్యసువస్తుతతినొల్ల దెప్పుడు
నతని సేవయె భాగ్యమని తలంచు
అంతట నామూర్తినంటి యుండుటె కాక
దర్శించునన్నిటి దాని గానె
తనముందు మను జగమ్మును దెల్యగాలేదు
తనుకృత నిజచేష్టితములె మరచు
అంత నామూలాగ్ర మతని రూపమ్మైయై
తను దాను మరచి లేనను నటుండు

పరమవైరాగ్యమేని సద్భక్తియేని
విమల పరిపూర్ణ ప్రేమ మేన్వేక్షియేని
సొరిదినేకత్వమేనియు శూన్యమేని
విరహకామినీరూపాలె వేయునేల ?

ఓ విరహమా ! చిత్తజత్వమును గలిగి మమతా గుణాధారముగ నా పంచ ప్రాణములనే బాణములుగా గురిచేసికొని గుండె గూటిలో నున్న నా యాత్మ విహంగముపై గుప్పుచున్నావేమి? అది యెగసిపోలేకయు నాగూటి లోనుండ లేకయు విలవిల గొట్టుకొని విలపించు చున్నది. నీవిట్లు కటిక వానికంటె కఠినత్వమును బూనుటలేల? ఔరా! తెలిసినది. నారెండు కనులతో నీవెచట భస్మమగుదువు ? నాయర్ధాంగుని కృపా కటాక్షమను మూడవ చూపు పడిన గాని నీయంతముగాదు. విపత్సమయమున నన్నియును వికటించును గదా !

అంగ విరహితుఁడై మరుఁ డాక్రంమించె
నతికృశించియు దుర్భర మయ్యెఁదనువు
ప్రాణముల యంటునున్యమపాశమయ్యె
వికటకృతులేమొ ప్రేమంపు విరహగతులు.

నాథుఁడధర్మయుద్ధమున బంధింపఁబడిన దాది యమృత ప్రాయము లగు నాహార పానములును విషతుల్యములై విసర్జింపఁబడియెను. ఈ వనిలోఁ దపోనిష్ఠనున్న నాకు వాయు భక్షణమే వల్లని భోజన మయ్యెను. అకటా ! నాయొడలేక చక్రముగ గిఱ్ఱుమని తిరుగుచున్నది. ఇంక నిలుచుట దుర్భరము గానున్నది. ఇన్నాళ్ల తపశ్చర్యవ్యర్థ ప్రయాసమేనా ? ఇంతకు ముఖ్యమా యీశ్వరుఁడను వాఁడొకఁడుండి భక్తులమొరవిని పరిరక్షించుననుట లబద్ధము లేనా ? (అని మూర్ఛిల్లును) (అంతదేవ దూతయై వాయువు ప్రవేశించును).

దేవ :- (స్వ) ఉత్తమ సాధ్వుల శక్తి యుత్తమ పురుషుఁడగు నీశ్వరుని శక్తివలెనే యనంతమైనదై కనిపించును. ఏమి యీ శాంతమూర్తి ? ఎంతయు దర్శనీయయై ప్రకాశించు చున్నది.

నిదుర వుచ్చెడిని యీ బెదురు మృగావళి
నా ప్రశాంత నిమీలితాక్షి యుగళి
తేనెలూరించు నీసూనాల నాహారి
స్తవకళగీతి నోష్ఠ ద్వయమ్ము
జీవముల్నింపు నీ తీవయల్లికల నా
బద్ధాం జలిన్యస్త పాణియుగము
నెఱుసులేరును లేతగఱిక పూసెజ్జల
నా సుఖాసన ఖాస్వదంఘ్రి మిథున
మా ప్రశాంత మహామధురామృతాతి
కోమల ప్రేమవర్ణాల నీమెలోని
ప్రత్యణువు నీ విశాలమౌ ప్రకృతి నంత
నెన్నిగతులనో చిత్రించి యేపుమీరు.

వైశా :- (స్వగతముగ) అయ్యో! ధ్యాన మొనర్త మనిన గన్నులు మూఁత
వడవేల? ఇంక నామేను నాయధీనము దప్పినది.

కన్నులు నిల్చిపోయెఁ బెనుగండముగా నడయాడు నూపిరుల్
సన్నము లయ్యె మైమునుఁగఁ జల్లని చెమ్మట వోయుచుండెలోఁ
బన్నిన జీవనాళములు పాయక తీపులు వెట్టుచుండె ని
ట్లన్నిట హింసనొంది మెయి నాగవటేఁగవు మొండి జీవముల్.

హా! హతవిధీ! యీ ప్రాణము లేఁగిననైన నాయాత్మకు శాంతిగల్గెడి
దేమో? బలిమినైన దొలగింతును గాక! ఇంక బ్రదికిన దానిలో లాభము
లేదు. (అని కేశపాశముల గళమున నురివేయును.

దేవ :- (చప్పునమును జని) అమ్మా వైశాలినీ! ఆగుమాగుము! దైవాను
గ్రహము వలన నీపతి నిన్ననుగ్రహించఁ గలఁడు. నీకొక చక్కని
సుతుఁడుదయించ నున్నాఁడు.

కూడవు కూడ వీపనులు ఘోరతరాఘము లాత్మహత్య లి
ప్పోడిమిఁదా నిరాశనెదఁ బొందఁడు సాధకుఁ డిష్టసిద్ధినిం

గూడమి యత్నముల్విడఁడు, కూలిపడం బలుమార్లు పిచ్చుకల్
గూడు నొనర్చు నిల్చువరకుం దృణ కాష్ఠములేరి చూరులన్.

వైశా :- (కొంచెము స్మృతిఁ గొని హీనస్వరముతో) మహాత్మా ! మీరెవరో నాకు సరిగాఁ గనఁబడుట లేదు. నాప్రాణ ప్రయాణ సమయ మరుదెంచినది. పతియొల్లని నాకు నింకను సుతుఁడా ! హా ! అవీక్షితా నాథా ! (అని మూర్ఛిల్లును)

దేవ :- (స్వ) ఇంక నీయమ బ్రదుకు సంశయాస్పద మయ్యెను. ఔరా ! ఇన్ని కష్టపరంపరల మ్రగ్గుచున్నను నిర్వాణ కాలమున నాథుని స్మరణమే. (మొగముపై జలము ప్రోక్షించినస్మృతి వడినంత) (ప్ర) తల్లీ ! యీ నీయ పాయస్థితిని దొలఁగింప నశ్వినీ దేవత లౌషధమంపినారు. దీనిని భుజించిన నీకు తక్షణమే బలము చేకూరును. (అని నోట నౌషధమును బోయును)

వైశా :- (కొంచెము స్మృతి చేకూరు నంత) అవీక్షితా ! మన్నాథా ! నిను గూర్చు నౌషధ మేమియు లేదా !

దేవ :- (స్వ) ఔరా ! ఈమె కార్యసాధనలోని పట్టుదల ప్రశంస నీయము.

సాధకుల సుఖము దుఃఖము
బాధల నిడలేవు రోగబాధలనెల్లన్
బోఁదోలు నౌషధార్థికిఁ
జేదేమి మరందమేమి జీవనమునకై.

అతివా ! కష్టకాలముల ధైర్యముతో నెదుర్కొన వలెను. నీతపమ్మె కార్యసిద్ధి ఘటింపఁ జేయును. చింతిల వలదు.

కాల సర్పంబు విషరత్న కలితమగుట
నెప్పుడే వేళఁ గాటిడు నెఱుఁగఁ దరమె ?
కాటు నిడు చోట మణి మోపి గరళ మడచు
మనదు ప్రారబ్ధ కర్మము మంచిదైన.

మానవులఁ బీడించు రాక్షస జాతిని శిక్షించి ప్రజా కల్యాణ మొనర్తునని ప్రతిజ్ఞను బూనిన దేవతా గుణములు గల వీరపురుషునే వరింతునని తపమ్మొ

నర్చు నీవు మా యమరజాతికే యాదరణీయవగుట దేవతలు నీప్రాణరక్షణకై నన్ను దూతగా నంపిరి. నీపతి నిన్ను జేపట్టును. అదియుఁ గాక నీగర్భ ఖనిలో నత్యుజ్వల రత్నమై ప్రకాశించ నున్న పుత్రుఁడు సామాన్యుఁడు కాఁడు అతఁడును ప్రజాహితమునకై తన యావజ్జీవితమును ధారవోయును. నాపలు కులపై విశ్వాసముంచి లోకకల్యాణ కారకమైన నీజీవితమును వ్యర్థ మొనర్చుట భావ్యము కాదు. అందు నాత్మహింస పాపమనుట నీకుఁ దెలియ నిదా ?

వై శా :- పరుల హింసించి వేధించుట కన్న నాత్మ హత్య మంచి దేమో యని పించును స్వామీ !

దేవ :- ఏ హింసలైనను పాపహేతువులే యగును.

వై శా :- పరుల హింసించుచు బ్రదుకుట యొక పాపము కాదా ? ఈ శాక, ఫల, పుష్పముల నీకంద మూలములఁ గొని బ్రదుకుట వానిని హింసించుట కాదా !

దేవ :- బిడ్డా ! వైశాలినీ ! ఒక వృక్షశాఖను నఱికివేసిన ఆ నఱికిన కొమ్మకు నటనుండి పది కొమ్మలుద్భవించి యా వెలితిని పూడ్చుచున్నవి. కాని ఒక పశువు కాలు నరికినచోఁ బదికాళ్ళ ఉత్పత్తి యెందవు గదా! కావున మాంసా శనము మాత్రమే హింసయగును. నీవీ కంద మూల, ఫల, పత్రములు స్వీకరించుచు దేహపుష్టి నార్జించు కొనబోలును.

వై శా :- నాయీ దేహము పుష్టివంతమైన బ్రయోజనమేమి ?

దేవ :- నీ గర్భఖని నుండి యొక పుత్రరత్న మఖిల ప్రపంచమునకు గాఢ జ్యోతియై యుదయించు నన్న నావాక్యముల ప్రతిహతములు. (సత్యము, సత్యము అని గగనవాణి వినవించును) వింటివా ! ఇంక నాపలుకు లసత్యములేనా ?

వై శా :- ఏలయగును ? (ఆనందముతో) మునుముందు నాకు శుభము ఫలించు నేమో ? నాయాశాజ్యోతి చివురించు చున్నది.

దేవ :- తల్లీ ! భవిష్యత్కాల మాశా జనకమని నమ్మి కష్టములు సహించుట లుత్తముల లక్షణములు. అధైర్య పడరాదు.

ఎండ నీడలట్టులే వేళఁ గాంచిన
కష్టసుఖము లెపుడు కలిసియుండు
ముండ్ల నుండి నవ్వుముద్దు పూలంగాంచఁ
గష్టములకు బెగడి కలఁత పడునె ?

దేవ - ఇకముందు నీవీ సమీపముననే యున్న గంగానదిని స్నానమాడి గౌరి నర్చించుచు లోకకల్యాణమునకై దేహధారణ మొనర్పుము. కందమూల ఫలాదుల స్వీకరించి కండపుష్టి నార్జించు కొనుము.

వైశా :- లోకకల్యాణ గర్భితములగు విబుధోపదేశము లవశ్యాచరణీయములు.

దేవ :- ఇపుడు నిన్నా గంగాతటమునకుఁ దోడ్కొని చని యచటి నుండి వీడ్కోలు వడయఁ గోరుచుంటిని. నీకు సమ్మతమగుచో బయలుదేరుము!

వైశా :- దివ్యపురుషుల శాసనమును దలధరించుచున్నాను. కాని ఒకయడుగు నిడలేని నేనెట్టులా దూరము నధిగమింతునో తోచకున్నది.

దేవ :- అటులైన నామహిమచే నిన్నొక క్షణములో గంగాతటమ్మున జేర్పఁ గలను. ఒకింతసేపు కనులను మూసి గంగను ధ్యానింపుము.

వైశా :- చిత్తమటులే యొనర్తును. ( అని కనులు మూసికొని గంగను ధ్యానించును ) (తెరయెత్తిన గంగా తటము ప్రత్యక్షమగును)

దేవ :- ఇదో ! ఈ గంగానదిని దర్శింపుము. దీని నీరు సకల దుష్టప్రారబ్ధ కర్మలఁ దుడిచివేయు శక్తిగలది.

వైశా :- భగవానుని పాదోదకమున కసాధ్యమేది ? ( అని మ్రొక్కును ) అమరపుంగవా ! ఈ నదీ మతల్లి తన సహజ సౌందర్యముతో నన్నా కర్షించుచున్నది. నామనోవేదనా మాలిన్యమును గడిగి వేయు చున్నది. నేనెంతయు ధన్యను. ఈ విశాల త్రిపథగా సౌందర్యమును దిలకింప నాలఘు దృష్టితానేమూలకు సరిపోవును ?

దేవ :- నిజము తల్లీ ! ఇది మా యమరలోకమున బ్రవహించి మమ్మే భ్రమింపఁజేయునన మానవుల లెక్కయెంత ? దీని పవిత్రత నేమని వర్ణింతును ? హరి పాదోదకమని హరుఁడే యౌదలఁ దాల్చెను.

హరి పదాంబుజ మకరంద మగునొలేక
శర్వశీర్షోదిత జ్ఞానసారమగునొ
వరభగీరథ నృప తపః ఫలరసంబొ
ఔర ! యీవారి పాప తాపాపహారి.

చూడ శృంగారవతియే కాక యుర్వికిని నుపకార కారిణియై యఖిల భూత జాలమున కాధారమగు జీవనధారయై ప్రవహించు చున్నది.

వెడలుపు సన్నముల్ మరియు వేగము మాంద్యము మిట్టపల్లముల్
సుడులు తరంగ సంతతులు సుందర ఫేనము బుద్బుదమ్ములన్
మడుగులు నాదిగా జలసమంచిత భేదములన్ని గంగనాఁ
బడినటులెల్ల ప్రాణులును బాయకవిష్ణుని విశ్వరూపమే.

అని యీజలములారస స్వరూపుని విరాడ్రూపమును దెల్పుచున్నవి. ఇచటనే తపశ్చర్య గావింపుము. నీ మనోరథ మీడేరును. నేబోయి వత్తును.

వై శా :-మహాత్మా ! నన్ను తిరిగి తపమొనర్ప నాదేశించు చున్నారు. నేవింత వరకొనర్చిన తపమ్మరణ్యరోదనమై యంతరించినది. నాయనుభవమును బట్టిచూడ నీశ్వరుఁడున్నాఁడా? నామొర విన్నాఁడా? అనిపించినది. అయ్యా! మీరు పోవుటకు ముందు నే మీతో కొన్ని ధర్మ సూక్ష్మముల తత్త్వరహస్యములను నాతపో నిర్వహణార్థము తెలిసికొన వలయునని యాచింతును. దయచేసి మీ నిజమగు పరిచయ మొనర్ప వేడుకొను చున్నాను.

దేవ :- బిడ్డా ! నేను వాయుదేవతను. పంచమహా భూతములలో నేనొకడను. నేను సర్వకాలములు సర్వత్రసంచరింతును. ఈశ్వరాస్తిక్యమునుమానింప వలదు. అతఁడు సర్వభూతముల యందు సమదృష్టి గలవాఁడు.

వై శా :- మీరు వాయుదేవతలా ! మీ దర్శనమున నాజన్మ పవిత్రమైనది. సర్వభూత కోటికిని ప్రాణ స్వరూపులైన మీకన్న నీశ్వరు లెవరు గలరు? విశ్వసృష్టి స్థితి లయములు మీవలననే జరుగుచున్నవి. మీరే నాపాలిటి యీశ్వర స్వరూపులు.

దేవ :-జగత్తులకు సృష్టి స్థితి లయకారకుఁడు వేరొకఁ డున్నాఁడు. వాని వినా గడ్డిపరకయుఁ గదల దనుట యథార్థము. వాని సేవించిన నీతపము శీఘ్రముగా ఫలింపఁ గలదు.

వై శా :- కనరాని, కర్తృత్వములేని యతఁడెట్లు జగత్పరిణామ కారకుఁడో ? తెలియుట లేదు. పరతత్వము గూర్చి నాకేమియుఁ దెలియ రాకున్నది. ఇన్నాళ్లు తపమొనర్చిన కానరాఁడేల ? ఈ యాత్మ యననేమో, ఈ పరమాత్మయననేమో ? అయోమయముగా నున్నది.

దేవ :- అది నాకును సమగ్రముగాఁ దెలియదు. తెలిసినంతలో వివరింపఁ బ్రయత్నింతును. ఒకఁ డెవఁడో తెలియనివాఁడు లేదని నంత మాత్రాన వాని మాట నమ్మి తెలిసిన వారి నందఱిని వంచకులను కొనుట మంచిది కాదు. తెలియని బాలునికి లోకమే అసత్యము. తెలిసిన పిదపనది సత్యము గాక పోదు. కాన దెలిసికొన యత్నింపవలెను. అడవిలో నుండి రాగా నొకనికిఁ బులి కనఁబడెను. మఱొకనికిఁ గనరాలేదు. కాంచినవాఁడు పులి కలదనెను. కననివాఁడు పులిలేనే లేదనెను. ఆ దారిజను మనకు ఆత్మ రక్షణకునై పులికల దనుమాట నమ్ముటే శ్రేయస్కరము కదా !

వై శా :- ఈ యుపమానములు వాదము నొనర్చి గెలుచుటకే, కాని నిజమైన విషయము దెలుపఁ జాలవేమో ?

దేవ :- ముఖమును చంద్ర బింబముతో నుపమింప ముఖమే లేదనుటలెట్లు పొసఁగును? ఉపమానము యథార్థమును సుగమముగా తెలియఁ జేయుటకు సహాయకారి యని తెలియవలెను.

వై శా :- యథార్థమగు నాత్మరూపము దయచేసి వివరింపుడు.

దేవ :- జ్ఞానానంద రూపుఁడాత్మ, రాజకుమారీ ! ఇది ఘటము, ఇది పటమని తెలియు జ్ఞానరూపియే యాత్మ, యా ఘటపటముల వలన గలుగు సుఖ దుఃఖానుభూతి నెఱింగి దుఃఖమును విడిచి సుఖానుభూతికై యత్నించు నానందస్వరూపియు నాత్మయే. అది యీదేహమున ననుక్షణము "నేను, నేన'ని వ్యక్తమగు చుండును. ఏయాత్మ సాపేక్షతోఁ బుట్టుట, పెరుగుట, నశించుట అను దేహ వ్యాపారములు జరుగు చున్నవో తానా యాత్మయే దేహేంద్రియములకు గోచరముగాకున్నది. అటులే ఈ విశ్వసృష్టి, స్థితి, లయముల నొనర్చు పరమ పురుషుఁడు విశ్వమున కంగ రూపులమైన



వై శా లి ని

మాకును దెలియదు. అతఁడు దేహేంద్రియ మనో బుద్ధులకుఁ దెలియఁ
డను చే నిజమైన తెలివి. ఆత్మలేనిది కర్తలేక కార్యము సేయలేని పని
ముట్టువలె నీ దేహము మృతమై జడమువలె పడియుండును గదా!

వైశా :- అది సరెకాని యప్రత్యక్షములగు నీపరమాత్మ మరియుఁ బర లోక
ములు విశ్వాస పాత్రములెట్లు కాఁగలవు?

దేవ :- ఒక కర్తలేని కార్యము జరుగుటయసంభవము. ఇంతటి విశ్వసృష్టి
స్థితి లయ కార్యములా విశ్వకర్తలేని దెట్లు జరుగును?

పాల్గుడుచు పాపనికిఁ దలి దండ్రులు తెలియనంత మాత్రమున వారు
లేకుందురా! నిద్రితునకుఁ బ్రపంచము లేనంత నది లేని దగునా? తనకుఁ
దెలిసికొన శక్యముగాని దంతయు లేదనుట విపరీత జ్ఞానరూపమనునన్న
యజ్ఞానము. ఆ పరాత్పరుని దెలియుట కధికారము వలయును. ఆ పరలోక
ప్రాప్తికి త్యాగ మూల్యమును జెల్లింప వలసి యుండును. పరమాత్మయే
లేకున్న స్వర్గనరకాదులే లేకున్న వృథాగా నీ ధర్మాఖ్యతో నియమాచరణ
సేయుచు నాత్మనేల కష్టపెట్టవలెను. పశువువలె స్వేచ్ఛగావిహరించరాదా!

వైశా :- నిజముగా బ్రహ్మానంద సుఖాను భూతియనున దొకటి కలదా?
కల్గినచో దాని సేవించు మార్గమెద్ది? ఆనతీవలెను.

దేవ :- కలదు. దానిఁ దెలియుటకు సద్గురు సమాశ్రయణము వలయును.
ఒక పిల్లవాఁగు మహానదిని జేరి మహా సముద్రమున లీనము కాఁగలిగి
నటులాచార్య సన్నిధి సర్వేశ్వరుని జేకూర్పఁ గలదు.

తత్వ దర్శకజ్ఞాన నేత్రమ్మొసంగి
కర్మబంధ విముక్తి మార్గమ్ము చూపు
సద్గురుండు లభించఁడీ జగతి నెందు
జన్మ జన్మల పుణ్యసంచయములేక.

ఆ పరమ పురుషునిలో లీనమగుటయే బ్రహ్మానంద సుఖానుభూతి. చంటి
పిల్లకు సంసార సుఖానందము తెలియనంతమాత్రమున నదియ బద్ధమగునా?

అన్ని యాత్మలలో పరమాత్మ గలఁడని, యే యాత్మనొచ్చినను నతనికే
నొప్పియని తెలిసి నానాత్వములో నేకత్వము దర్శించి అన్ని యాత్మలఁ
బ్రేమించుటలే నిజమగు నతని సేవారూపమగు భక్తి. అదియే ముక్తిమార్గము.

వై శా :- త్యాగము యొక్క యథార్థ స్వరూపమును వివరింప వేడెదను.

దేవ :- స్వార్థములగు కర్మల ఫలితమును బరార్థమునకై వదలి వేయుటలే త్యాగ మనఁబడును. కర్మత్యాగము నిజమగు త్యాగము కాదు.

వై శా :- కర్మ ధర్మ బద్ధమైయుండ వలయు నందురు. ధర్మము యొక్క నిజ స్వరూపమును క్లుప్తముగా వివరింపఁ గోరెదను.

దేవ :-ఇతరులు తన పట్ల నేకర్మ లొనర్చిన దన కనిష్టములై బాధగూర్చునో తానట్టి బాధాకరములగు కర్మల నితరుల పట్లఁ జేయకుండుటయే సకల ధర్మములకు మూల సూత్రమని పెద్దలు నిర్వచించిరి. ఆ ధర్మరూప భగ వానుని తిరస్కరించిన దున్నలు నరక గాము లగుదురు.

వై శా :- ధర్మ మెపుడు దేనిని బోధించును ?

దేవ :- ధర్మ లక్ష్య మెప్పుడును బంధవిముక్తినిడు త్యాగా చరణమే.

వై శా :- స్వార్థరూపమగు సంసారమున బరార్థ పరతగల త్యాగా చరణమెట్లు పొసఁగును ?

దేవ :- స్వార్థరూపమగు సంసారమున గల యీ యైశ్వర్యము లన్నియును నీశ్వరునివే యనుకొని యీ వస్తు సంయోగ వియోగములలో ఖేదమోద ముల నొందక తటస్థముగా నుండవలెను. అటులే మనమొనర్చు కర్మ లన్నియు స్వామి కార్యములనుకొని స్వామిచే నియోగింపఁబడు సేవకుని వలె నేనీ కర్మ లొనర్చు చున్నాడననియు నా కర్మ ఫలితములు దొరయగు నా పరాత్పరునకే చెందినవని యీ లాభ నష్టములలోఁ దటస్థ భావముతో నున్న స్వార్థరూపమగు సంసారమున పరార్థ పరతగల త్యాగాచరణ సంభవ నీయమగును.

వై శా :-అపుడు కర్తృత్వమునందుఁ గల యహంకారము ఫలాపేక్షలోఁ గల మమకారము నష్టమొంది సుఖ దుఃఖ విముక్తియై శాంతి చేకూర గల దని భావింప వచ్చునా ?

దేవ :-ఔను! నీయీభావనమే నిజమైన విజ్ఞానము. ఇట్టిభావనతో మానవుఁడు సంసార పంకమున, నంటియంటక యుండు కుమ్మరి పురుగువలె నుండి

శాశ్వత దుఃఖ విముక్తి నొందఁ గలఁడనుట నిశ్చయము కావుననే తన కర్మల నీశ్వర పరాయత్త మొనర్చి తరింపవలెను.

వైశా :- పతిపరాధీనయై యస్వతంత్రయగు స్త్రీ తన కర్మల నీశ్వరార్పిత మెట్లొనర్చఁ గలదు ? ఆమెకు తనకర్మపై నధికారమేది ?

దేవ :- స్త్రీ పత్యాధీన యగుచునే పతిని దన యధీనమున నుంచు కొనగల సర్వ స్వతంత్రురాలు. ఒక ప్రబ్బు నాధారముగాఁ జేకొననిచో లతనిలువఁ జాలక పతితయగు ననుట వాస్తవమే. లత యాప్రబ్బును దన కౌగిలితోఁ గట్టివేసినట్లు ప్రేమ సూత్రాలతోఁ బురుషునిఁ గట్టివైచి పూర్ణముగా వశ పరచుకొనిన స్త్రీకి స్వాతంత్ర్యమునకేమి కొదువ ?

వైశా :-స్వామీ! పడతులకు పాతివ్రత్యమునకన్న గొప్ప తపస్సు లేదందురు. పతి సేవయే పరమపద సోపాన మనియందురు. సత్యమా ?

దేవ :- అది సంపూర్ణ సత్యము. పురుషులు పరాత్పరునిలోఁ బతిత్వము దర్శించ స్త్రీలు పతిలోనే పరాత్పరత దర్శించి కృతార్థులగుదురు. నీపతి దేవుని గూర్చి తపమాచరించు నీవు ధన్యవు. పతియందనన్య భక్తిగల స్త్రీ శ్రియఃపతి యందనన్య భక్తిగల భక్తునికన్న మిన్న. ఆత్మానువర్తియగు మేనువలె, భావాను సారిణియగు భాషవలె భార్య భర్తకనుకూలయైననే దాంపత్యకథ సుఖాంతముగా సాగిపోవును. అటులే పతియు నేకపత్నీవ్రతుఁ డగుట లవసరము.

వైశా :- స్త్రీ కింతటి విజ్ఞాన మవసర మందురా !

దేవ :- విద్యా విజ్ఞాన రూపిణియగు వాణియే స్త్రీయైనపుడు స్త్రీకి విజ్ఞాన మవసరము లేకుండుటెట్లు ?

వైశా :- మహాత్మా ! మీ యుపదేశామృతము నా సందేహ కళంకములఁ గడిగి వైచినది. ఇట్టి మీ యుపకృతికి నాకృతజ్ఞతాంజలిని మాత్రమే బదులిడఁ గలను.

దేవ :- అంతియె చాలును. ఫలపుష్పంబుల నొసంగు తరురాజి జలంబులనిడు నదీనదములేమి ప్రతిఫలము కాంక్షించుచున్నవి? పోయివత్తును. నీతపమ్ము ఫలించు గాక ! (అని నిష్క్రమించును)

వైశా :- ఇచట నున్న చరాచరంబు లీ నదీమతల్లి స్వేచ్ఛానంద గాననృత్య విహారములకు శ్రుతిలయ లొసగూర్చు చున్నవి. ఔరా! ఈ నదీకాంత ప్రణయ విలాస మత్యంత స్పృహణీయము.

శశిప్రతిబింబ మాస్యమ్మయి జతఁగూడ
శైవాలకృత శిరోజమ్ము లాడ
కైరవ సుందర స్మేరముల్ విరజిమ్మ
చంచల మీన వీక్షలను గ్రుమ్మ
పారు నీర్వోలి పట్టుపయ్యెద జారిచి
ముకుళ పద్మ స్తనమ్ముల వెలార్చి
అలల నొయ్యారంపు వళుల కాంతి విదిల్చి
నొప్పారు సుడినాభి సొగసుఁ దేల్చి
మదను దెగటార్చు శివునట్టి యెదను దోఁచి
అతని తలకెక్కిపడి నిక్కియాడు చుంటి
కడిగివేయుదె మారాగ గతుల నిటులు
కనికరపు పాలవెల్లి గంగమ్మ తల్లి.

ఆహా! నావలెనే యీనదీ పరిసర సుందర దృశ్యములును ప్రణయ నదీతరంగ డోలల దేలియాడు చున్నట్లున్నవి. అల్లదో!

సీలాభ్ర వనితా విలోలార్ధ మీలితా
పాంగమ్ము లనబారు పక్షిపంక్తి
దిక్సతీ కబరికా ప్రసక్తమంచిత శోభ
దనరెడిగిరి శీర్షతరు లతాళి
సురనదీ భామినీ వరహంస తూలికా
శయ్యాకృతుల నొప్పు సైకతములు
వసుధాంగనా ధృతవసనాంచలమ్ములై
చెలువారు లేతపచ్చిక బయళ్లు
కననలంకార మొనరించికొని విలాస
శయ్యలమరించికొని యాత్మ సఖులఁ జేరి

సుఖమలందేలఁ దెన్నులు చూతురేమొ
ప్రకృతి సుందరు లీలీల ప్రణయగతుల.

ఇచటి ప్రకృతి సౌందర్యమునెంతని వర్ణింతును. రాజ భవనాలనున్నపుడు నేనిట్టి మనోహర దృశ్యములను జూచియెరుగను. ఇంక నీ గంగా తరంగిణీ జలములం దోఁగి నలినాక్షి నర్చింతును. (అని నీటకాలిడి) హా! చచ్చితిని. చచ్చితిని. నన్నేదో జలచరములోని కీడ్చుకొని పోవుచున్నది. రక్షింపుడు! రక్షింపుడు. ఓ పంచభూతములారా! ఓ దేవతలారా! నేను ముందేదో సౌఖ్యామృతము జుర్రుకొనెదనని నా ప్రాణము నిల్పితిరేల? గజేంద్ర రక్షణకై ద్విజేంద్రు నెక్కకయే వచ్చిన యా శ్రీమన్నారాయణుని శరణు వేడుచున్నాను. అనాథవత్సలా! ఆపత్కాల బాంధవా! దయా సింధూ! శ్రియఃపతీ! శ్రీనివాసా! శ్రీమన్నారాయణా! నీవినావేర దిక్కులేదు. రావేల? అంత కంతకిది నన్ను గళదఘ్న జలంబుల కీడ్చుకొని వచ్చినది. దీని బారినుండి తప్పించు వారులేరా? శ్రీహరీ! కడసారి కన్నీటి పన్నీట నీపదములు గడుగుచుంటిని.

చిక్కితి నాపన్నదిలో
దిక్కెవ్వరు లేరటంచు దీనత వేడన్
వక్కాణింప వదేటికి
మ్రొక్కగఁ దలఁ గొట్టు దైవముంగలడె హరీ!

నదీ మతల్లీ! గంగా భవానీ! నన్ను నీ పొట్టనిడుకొని శ్రమలుడుపుము. (అని నదిలో మునిగి పోవును) (తెరపడును)

(తెరయెత్త కరంధమాంతః పురోద్యానవనము) (ప్రవేశము కరంధముడు)

కర :- (స్వ) హా! కష్టము. అన్నిటిని భరింప వచ్చును గాని యవమానమును భరింప నఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకునకును దరముకాదు.

ప్రాణములతోడ నుంచియె ప్రతిమనుజుని
జంపునవమాన మన సుదుస్సహ కరమయి
కన్నులందృష్టి నుంచియె కాంచగ్రుడ్డి
వాని జేయు నమావాస్యదౌ నిశవలె.

ఏనాడు శత్రువులవలన నపజయము నొందెనో నాటినుండియు నల్గురిలో మోమెత్తికొని తిరుగలేకున్నాఁడు. పరాజితుడనగు నాకుఁ బరిణయమేల యని పట్టుపట్టి కూర్చొని యున్నాఁడు. సామ్రాజ్య పట్టాభిషిక్తుడనగు టకును సమర్థుఁడగానను చున్నాఁడు. సామ్రాజ్య మరాజకమై చనవలసిన దేనా ! ఇంతటితో నావంశ మంతరించి పోవలసినదేనా ? హా ! హతవిధీ ! ఈ యనర్థములఁ గాంచుచున్న బ్రదుకు దుర్భరమై పోవుచున్నది. హా !
(అని కన్నీ రద్దుకొను చుండును) (వీరమాత ప్రవేశించును)

వీర :- ఇష్టవ్యతిరేకములగు సంఘటనలు విషతుల్యములై కనఁబడినను నను భవించకతీరదు. తనయుని సకలసుఖవిరాగము జనకుని దుఃఖకారణమైనది. ఆహారనిద్రలు రుచిహీనము లయ్యెను. నేనును దుఃఖించి మహారాజును మరింత దుఃఖమునకు లోనుగాఁ జేయుట యెంత మాత్రము తగదు. ఎట్లో నాదుఃఖమును దిగమ్రింగి సాంత్వనయ వచనములతో స్వామిని శాంత చిత్తు నొనర్చుట నావిధియైనది. (కన్నీరు నద్దికొనుచు) (దగ్గరించి) ఆర్య పుత్రా ! (అని పిలుచును)

కర :- (దుఃఖమును గప్పి పుచ్చుచు) (సంభ్రమముతో) ప్రేయసీ ! నీవెపుడ రుదెంచితివి ?

వీర :- నేనింతకు ముందే యరుదెంచి చూచునంత నార్య పుత్రులు చేరు మాలుతోఁ గన్నీ రద్దుకొనుచుఁ దలవంచి దుఃఖించుచుంటిరి. ధీరోదారులగు దేవరకు దుఃఖోపశమన మొనర్ప మేమెవరము ?

కర :- కాకులు రెట్టరాల్చి చనగా వటబీజము రాతి సందులన్
వీఁక నొకండు వృక్షమయి వేరులఁ దన్ని గడింబెకల్చున
ట్లాకుల పాటు ధీరవసుధాధిపు నైనను గుండెవ్రయ్యగాఁ
జేకురఁ జేసి దుఃఖితుని జేయుట సంభవ నీయమే కదా !

ఎంత వారించినను సుతుని గూర్చిన చింతయలవలె వచ్చి నాహృదయమును దుఃఖ సాగరమున ముంచు చున్నది. దుఃఖ జీవిత మీడ్చుట కష్టము.

వీర :- సార్వభౌములీ కష్టపరంపరల గాంచి చలించరనియే నావిశ్వాసము.

పదిగ హృదయ వాసన లీను పాటల సుమ
ములకునై జీవనము ధారవోయు నరుఁడు
కానితోడ్తోడనే కంటకములఁ గూడ
పెంచు చున్నాఁడ ననుచు భావించఁ డెపుడు.

పూలు నాలుగు నాళ్లుండినేల రాలు
కాని విడిపోక మిగిలు నీ కంటకములె
ఐన జీవన దానము నాపలేఁడు
ఎపుడొ మరల నాలుగు పూల నిచ్చుననుచు.

కర :- దేవీ ! నీవనినట్లు కష్టసుఖ మిశ్రిత జీవిత భవిష్యత్తుతా నెప్పడాశా జనకమైయుండుట సహజమే. చుట్టములకువలె సుఖములకు సన్నిహితులమై దుఃఖములకు మాత్రము దూరముండి పోగలమా ? నాకు నీమాటలోకింత ధైర్య ప్రదములే కాని ముందీ రాజ్యాభిషేక మెవరి కొనర్పవలెను ?

వీర :- ఎన్నటి కైనను హృదయమును మార్చు కొనకుండునా ?

కర :- వివాహ విషయ మెత్తినంతనే విముఖుఁడగుట చూచుచుంటివి కదా !

వీర :- అది నిజమే. ( అని విచారించి యానందముతో ) మహారాజా ! నా మనంబున నిపుడొక చక్కని యుపాయము పొడ సూపినది. నాయాత్మ శాంతికై నేను కిమిచ్ఛక వ్రతము నొక దాని బూనితి ననియు నా వ్రతా చరణ మందు ద్విజోత్తములేది యాచించిన దాని నొసంగు నొక నియ మముగలదనియుఁ దెల్పెదను.

కర :- అదిసరె. ఇఁక తదుపరి విషయము నెఱింగిపుము !

వీర :- ఈ దాన కార్యమునకు నీవు యాజమాన్యము వహించి సహాయపడి యాచక మనోభీష్టము లొసఁగి నా మనోరథము పూర్తిచేసి మాతృఋణము దీర్చుకొనుము అని యడిగెదను.

కర :- ఇది యతఁడు తప్పక సమ్మతించును నీ మనోభీష్టము నెరవేర్చును. దీనివలన మనకుఁ జేకూరు మహత్తర లాభమే ముండును ?

వీర :- ఆ సమయమున ద్విజత్వము గల్గిన మీరును నొక పౌత్రుని యాచించిన నొప్పుకొనక తప్పించు కొను వీలుండదు. ఈ యుపాయము సరియైనది కాదా!

కర :- మహారాణీ! ఇది యత్యంత ఫలకారిణి యనందగునూహ యని నా హృదయమున గూడ విశ్వాసము గలుగు చున్నది. అటులైన కుమారుని వైశమె పిలువం బంచి నీ యభీష్టము నెరింగించుము. తదుపరి యేమగునో చూతము గాక!

వీర :- ఇంతకు ముందే యవీక్షితుని బిలుచుకొని రమ్మని వేత్రవతి నంపి యుంటిని. వచ్చు చున్నాడు కాంబోలు.

కర :- దేవీ! అతడు వచ్చు వరకు నేనిచట నున్నచో నే విషయమునడుగం దలంచినను వివాహ విషయమే యని యనుమానపడుట సహజము. ఆత్మజుండీ ద్దీని నంగీకరించిన పిదప, నేవచ్చి నీవనిన ట్లొనర్తును, అంత వరికీ ప్రక్క గదిలో నుండ గలను. ( అని కరంధముండు నిష్క్రమించును ) (వీరకాంత నిరీక్షించు చుండగా నవీక్షితుండు ప్రవేశించును)

అవీ :- జననీ! అభివాదము లొనర్చు చున్నాండీ యవీక్షిత్కుమారుండు. (అని నమస్కరించి) నన్ను రమ్మని యాజ్ఞాపించితిరని వేత్రవతి తెల్పినది. ఏ సేవలో నియోగింపం దలచితిరో తెల్పగలరని మనవి సేయుచుంటిని.

వీర :- కుమారా! విజయీ భవ! శ్రీరస్తు! నేనొక కార్యావసరమున నినుబిలిచితిని. దాని శ్రద్ధతో వినగోరెద. నా హృదయ శాంతి నిమిత్తము "కిమిచ్ఛకము" అను వ్రతాచరణ మొనర్పం దగునని భూసురులానతిచ్చిరి. ఆ వ్రతా చరణ మందు ద్విజవర్యులడిగిన కామితార్థముల లేదనకయొసంగవలసి యుండును. ఈ ఘనకార్య నిర్వహణమునకు దీక్షా ధారణ మొనర్చి నీవు తల్లి ఋణమును దీర్చుకొనంగల వనినమ్మికొని యున్నాను.

అవీ :- తప్పక నీ యానతి శిరసా వహింతును. కాని నేనిది యాచరించిన మాత్రమున నీఋణ విముక్తుండనగుదు ననుట కల్ల.

కనరానినను నీవు గర్భమ్ము నందాచి
నవమాసములు పెంచు నాటి ఋణము
దుస్సహ ప్రసవ వార్తితోఁగని యొడిఁ గట్టి
కంటఁ గన్నిడి సాకు తొంటి ఋణము
రుధిరమ్మె స్తన్యమ్ము రూపుగఁ జేపురా
నర్లొంది చన్నిచ్చు నట్టి ఋణము
సవ్యాపసవ్య హస్తములంటి యెత్తుచు
మూత్ర పురీషాల ముస్గు ఋణము
రోమ రోమాన విరబారి రుధిరనాళ
సంతతులఁ బ్రవహించున ఉయ ఋణమ్ము
జన్మమున్నంత వరకును జర్మమొలిచి
పాదరక్ష లొనర్చినం బోదు జనని.

వీర :- కుమారా ! నీ మాతృభక్తి ప్రశంస నీయము. ధన్యోస్మి !

అవీ :-తల్లీ ! నీయాజ్ఞ నిర్వర్తింప నీకింకరుఁడు సర్వదా సిద్ధముగా నున్నాఁడు.

వీర :-నీకాపరాత్పరుఁడాయు రారోగ్య భాగ్యములిచ్చి కలకాలము రక్షించుగాక
(కరంధముఁడు చప్పునఁ బ్రవేశించును. అవీక్షిత్తు నమస్కరించును.)

కర :- కుమారా ! చిరజీవివై వర్ధిల్లుము. నీ తల్లితోఁ గూడ నేవో యా శీస్సుల నందుకొను చుంటివి. విశేషమేమి ?

అవీ :- నా ప్రియజనని తన హృదయ శాంతికై కిమిచ్ఛక వ్రతము నొక దానిని దలపెట్టినది. ద్విజోత్తముల నిచ్ఛల నిర్వర్తించు దానాదిక కార్యకలాపములకీ చిరంజీవుని బాధ్యునిగా నొనర్చినది. ఆ యాజ్ఞతలఁ దాల్చ నానందాతిరేకమున నాశీస్సులొ సంగుచున్నది.

కర :- (సంతోషముతో) కిమిచ్ఛక వ్రతమున ద్విజుల కోరికలీ డేర్ప నిన్ను నియమించినదేమి ? నీవందు కనుమతించితివా ? బాగు బాగు ; నీమాతృ భక్తి యద్వితీయము. నీ ధైర్య మప్రతిమానము.

అవీ :-నేనెంతవాఁడను. మీ యాశీర్వాద బలమున్నచో నసాధ్యమేముండును?

కర :-ప్రియనందనా ! క్షత్రియులకును ద్విజ శబ్దము చెల్లుబడియై దాన ప్రతి గ్రహణముల కధికారముండునా ?

అవీ :-(నాల్క గఱచికొని) (స్వ) ప్రమాదపడితిని. నా జనకుఁ డిపుడు నా వివాహమును గూర్చి యాచించునేమో ? కర్తవ్యమేమి ? (అని మౌనము వహించును)

కర :- లేకున్న లేదనుము. దీని కింత సందేహపడనేల ?

అవీ :- క్షత్రియులకును ద్విజ శబ్దము చెల్లుననుట లార్య సమ్మత మని తెలియుదును.

కర :-అయినచో నేనొక ద్విజుఁడనని నేఁగోరిన కోరిక నొసంగుదువని విశ్వ సించి నీవలన నొక పౌత్ర దానమును యాచించు చున్నాను. స్థిరవచస్కుఁ డవగు నీవు దీని కామోదింతువని యాసించు చున్నాను.

అవీ :- (స్వ) ఇంక నేనను కొనినంతయైనది. ఇపుడు దీని నామోదించుట లెట్లో తెలియ రాకున్నది. నేనా కన్యను వరింప నర్హత సంపాదించ నైతిని. దృఢకేశిని వధించి ప్రజాకల్యాణ మొనర్పక స్వార్థ పరుఁడనై నాకల్యాణమున కెట్లామోదింతును ? ఇపుడు జనకునకేమి యుత్తరమిడ వలెను ?

కర :-కుమారా ! నీవిట్లను మానింపనేల ? నేనట్టిదానమునకపాత్రుఁడననియే నా నీయను మానము.

అవీ :- తండ్రీ ! నేనావనితను బెండ్లియాడి కదా ! మీ కోరిక నెరవేర్చుటలు. నాయపజయ కారణముగ నే నామెను వరింపఁదగనైతిని. ఇంక మీ యభీష్టముఁ దీర్చు మార్గమేది యని చింతించుచుంటినే కాని మీ యాజ్ఞను మీరుదునను కొనవలదు.

కర :-నీజనని యాజ్ఞ మన్నింప నిచ్చగలదేని నాయభిమతముఁ దీర్చుటనీవిధి.

అవీ :-(సవినయముగ) అటులననేల ? మీయాజ్ఞ మాత్రముల్లంఘింపగలనా ?

దైవసముఁడగు జనకుని సేవలోన
తలను గోసి పీఠము నిడవలెను గాదె

తండ్రి యాజ్ఞ మించెడి దుష్టతనయుఁ డెందు
పాత్రఁ దౌనఁకు జీవనగతి పతన మొందు

(కంచుకి ప్రవేశించి మహారాజునకు జోహర్లొనర్చును)

ం :- మహారాజా ! పూజ్యులగు కణ్వ పుత్రులు ద్వారము కడవేచియున్నారు. ఆజ్ఞయైన వారినిపుడ ప్రవేశపెట్టెదను.

ర :- నిరభ్యంతరముగ వారి నిందుఁ బ్రవేశపెట్టుము. మహాత్ము లవసర సమయములఁ బ్రత్యక్షమై యనుమానములఁ దీర్చి మార్గదర్శకులగుదురు. (కణ్వ పుత్రుఁడు ప్రవేశించును రాజులేచి నమస్కరించును పీఠమున నాసీనుం జేయును.

ణ్వ :- (కూర్చొని) సార్వభౌమా ! ఆయుష్మాన్ భవ ! (అవీక్షితుఁడు నమస్కరించును) రాకుమారా ! విజయీభవ !

ర :-మహర్షీ ! ఈ సమయమున మీరాక మాకు రాకా శరచ్చంద్ర దర్శనమై మార్గదర్శక మయ్యెను.

ణ్వ :-రాజరాజా ! ఇప్పటి మీ విషయము మరియు నా వైశాలినీ వృత్తాంతమునంతయుఁ దెలిసికొని యిచ్చటికి వచ్చుటయైనది. దాని జెవి యొగ్గి వినుడు.

ర :- అవశ్యము విందుము. మీ వాక్కుల విననుత్కంఠతో నున్నాము.

ణ్వ :- వైశాలిని తా నవీక్షితుని యందలి యనురాగాతిశయముతో గృహమును వీడి అఖిల శత్రు మండలిపై తన వరున కమోఘ విజయము ప్రాప్తించుటకు నరణ్యముల ఘోర తపమాచరించి గంగా స్నానమున కరిగెను.

కర :- తదుపరి జరిగిన వృత్తాంతమేమి ? మహర్షీ !

అవీ :-(స్వ) అబ్బా! నాకొఱకై యా సాధ్వి తప మొనర్చుట లామె ప్రేమావధికి నిదర్శనము.

కణ్వ :-ఇటులా కన్య తానా సురనదిని గాలిడునంత నొక సర్ప రాజము నాగలోకాధిపతి ప్రేరణచే నామెను పాతాళమునకుఁ గొని చని నాగేంద్రుని

ముందు నిల్చెను. అతఁడామె నాదరించి "సతీమణీ! ముందు జనింప నున్న నీ కుమారునితో మా జాతి నశించు ప్రమాదము కలదు. అట్టివిపత్స మయమున నీకుమారుని వినిపించి, మా జాతి నుద్ధరింతునని యభయ ప్రదానము నొసంగుము" అని ప్రార్థించెను.

కర :- అపుడేమి జరిగినది ? విననుత్సుకత పెరుగు చున్నది.

కణ్వ :- ఆ సాధ్వి తన నాథుని వృత్తాంత మంతయు వినిచి, "నాకు వివాహమే జరుగదు మీరు నిశ్చింతతో నుండుడు" అనెను.

కర :- అంత నాగేంద్రుఁడేమనెను ?

కణ్వ :- "రాజకుమారీ! నీ పతి కీజన్మలోనే వచ్చిన శాపము. నీకు పూర్వ జన్మలో వచ్చిన శాపము నీవు మాపాతాళ దర్శన మొనర్చి యిపుడు మా కభయ మిడుటతో విముక్తినందినవి. ఇంక నీతపః ఫలము శీఘ్రము సిద్ధించి నీ వరుఁడగు నవీక్షితుఁడు నిన్ను జేపట్టఁ గలఁడు. నీ విది విశ్వ సింపుము. దీని వివరములు ముందు నీకే తెలియఁ గలవు" అని యామెను సన్మానించెను. ఆమె తపస్సిద్ధిపడయ నున్నది. ( అవీక్షితునిఁ గాంచి ) రాకుమారా ! ఆ సాధ్విని పెండ్లి యాడి నీజననీజనకుల యాజ్ఞపాలించుటలే కాక దృఢకేశిని జంపి ప్రజాకల్యాణ మొనర్చి నాగురు దక్షిణ నొసంగుము ! మా యాశ్రమమున కరుదెమ్ము !

కర :- గురువర్యా ! సమయమున కరుదెంచి మాకు కర్తవ్యము నుపదేశించిన మీ కెంతయుఁ గృతజ్ఞులము.

అవీ :- ఆచార్యా! మీ యాజ్ఞ సర్వథా శిరోధార్యమని మనవి చేయుచున్నాను. దైవము నాకనుకూలించునటు లాశీర్వదింపుడు. నాకా దృఢకేశి గల జాడ నెరిగింపుడు.

కణ్వ :- ఆ దృఢకేశియు వాని యను యాయులును మా యాశ్రమ పరిసర ముల విశృంఖలముగా విహరించుచు నుడువ దానికడ గండ్ల పాలుగావించు చున్నారు. వానినేమని తెల్పుదును ?

ఆశ్రమ మృగముల యాయములాహ్కారి జాల్
దితిజ ఫలాహార దీక్ష లయ్యె

నెటిదైత్య నిందాఢ్య నిష్ఠీవనమ్ములె
మంత్రోక్త తీర్థసమ్మార్జనములు
దనుజ ప్రహార పాదరజంబె ముని జన
మ్ముల దేహముల బూది పూఁతలయ్యె
ముని కన్యకా జనముగ్ధ రూపమ్ములె
దైత్య కామాగ్ని కింధనములయ్యె
శాంతమా, మీరె దిక్కు నన్నంపకున్న
తలకి ఋషి సంతతుల పొట్ట దాఁగి కొనియె
క్రౌర్యమా, మునిగణముపై కాలుద్రవ్వి
రాక్షసముఖాల స్వారియై రాఁదొడంగె.

ఇట్టి పరిస్థితులలో నవీక్షితుఁడు వారిఁ బరిమార్ప సర్వథా యోగ్యుఁడు.

కర :- మునివర్యా ! వారి దుండగముల నింకవినలేము. తక్షణమే దౌర్జన్యము నా మూలాగ్రము నాశమొనర్చి ధర్మ శాంతుల నెలకొల్పుట మా ప్రధాన కర్తవ్యము. అవీక్షితుఁ డచటి కేతెంచి యన్ని విధము వారి పనిచూచు కొనఁగలఁడు. మీ రేమాత్రము చింతిలఁ బనిలేదు. కుమారా ! వైళమె చని యారక్కసి మూకల నుక్కడంచి రమ్ము.

అవీ :- చిత్తము. సత్వరమే బయలుదేరు చున్నాను.

కణ్వ :- ఇంకనే సెలవు గొనుచున్నాను.

కర :- చిత్తము. కుమారా ! ఇఁక ప్రయాణ సన్నాహములఁ గావించి సర్వ సైన్యముల యుద్ధ సన్నద్ధుల గావించి వేకువలేచి వెడలవలెను. పోదము పద ? (అని పిరాకంధములు అవీక్షితుఁడు నిష్క్రమింతురు)

షష్ఠాంకము

# సప్తమాంకము

[ప్రదేశము అరణ్యము-ప్రవేశము వైశాలిని మరియు ఖిల్లిని]

వైశా :- ఖిల్లినీ ! నేను గంగమునుంగుతఱి నాయదృశ్య కరణి మూలిక పోయినది. ఇంకెట్లు నేనీ యరణ్యములో రాక్షసుల బారినుండి తప్పు కొందును ?

ఖిల్లి :- నేనుండ నీవు చింతిలఁ బనిలేదు రాకుమారీ !

వైశా :- నీవు నాప్రాణమునకుఁ బ్రాణమిడుటకు సిద్ధముగా నున్నావు. ఇది మన కెన్ని జన్మముల స్నేహమో తెలియ రాకున్నది. ఆ విషయములో నాకుచింతలేదు. నన్ను నీవు కంటికి రెప్పవోలెఁగాపాడుచుందువు. కాని,

ఖిల్లి :- ఇంకే విషయములో నీవిట్లు చింతింప వలసి వచ్చినది ?

వైశా :-ఖిల్లినీ ! నేనిల్లెంత కాలమీ ప్రియుని విరహాగ్ని జ్వాలలలో వేగు చుండుటలు ? దుస్సహము. దుర్భరము.

ప్రణయ సంగత విరహంపు బాధలోర్వ
తరముగా దలకందర్ప హరునకైన
విరహపుం బ్రేమవధ కష్టతరము దీన
బ్రాణములు తెగవసి కోఁత పాసి చనదు.

ఖిల్లి :-శిశిరము వసంతమునకు మార్గదర్శియైనటులు కష్టములు సుఖములకు దారి తీయకపోవు.

వైశా :-ఖిల్లినీ ! నమ్మిన ప్రభువు నట్టడవిలో విడిచి చనెను. కమ్మని కలలు గంగపాలై పోయెను.

హృదయ సదనమ్ము ప్రియునకు నిచ్చివేయ
విభుఁడు దానికి విరహాగ్నిఁ బెట్టిపోయె
వేరెదిక్కు గానక యేడ్చు విరహతాప
ప్రణయమది కోరికొని తెచ్చికొనిన చావు.

స్వామికి నామొరఁ జెప్పు వారెవరున్నారు? ఈ తరులతా గణము లచరములు. ఈ జంతు సంతానము నోరులేనిది. పనిగట్టుకొని యచటికిఁ బోయి చెప్పు వారెవరున్నారు? నా ప్రియుఁ డెచట నున్నాఁడు?

ఖిల్లి :- నిరంతరము నిఖిల దిశలఁ జరించు వాఁడొక వాయుదేవుఁడే. నీలో నాలో నీనాథునిలోఁ బ్రాణరూపియై పరిభ్రమించు వాఁడీ వాయువే.

వైశా :- నిజము సఖీ! న న్నాపత్కాలమున నాదరించిన వాఁడు నీవాయువే. యా జగద్రక్షకునే వేడుకొనెదఁ గాక! (అని కనులు మూసి ప్రార్థించును)

నీవు సర్వవ్యాప్తి నెగడి విష్ణువోలె
సకల భూతమ్ముల సంచరింతు
నీవె యూపిరివయి నిల్చి ప్రాణులకెల్ల
జీవముల్పోసి రక్షించు చుందు
నీవె మేఘమ్ముల నియతిమైఁ గొని వచ్చి
యొగివ సుంధర తాపముడుగఁ జేతు
నీవె వస్తువులలో నెసఁగు సువాసనా
దానాల నాత్మలఁ దనుపు చుందు
నీవు శీతోష్ణ సంస్పర్శ నిగుడఁ జేసి
భూత కోటికి సుఖ దుఃఖ భోగమిడెదు
చల్లగా మెల్లగా నేఁగి స్వామిదరికి
మనసు కెక్క నామొరఁ జెప్పుమా మరుత్త!

ప్రసరించి యంత మట్టుకు
వెసనను జేపట్టు మనుచు విభు కర్ణమునన్
గుసగుసలఁ బొసఁగఁ జెపుమా!
యుసురా! వంశమ్ము నిల్పుమొగి పేరుండున్.

(అంతనేమో భయంకర ధ్వని వినుట నటించి ప్రకంపితాంగియై)

వైశా :- ఖిల్లినీ! మరల నీ ప్రళయ సూచనమేమి? ఎచటిదీ వికటాట్టహాసము? ఎంతో భయానకమై శ్రుతి పుటముల భేదించు చున్నది. ఇంకెట్లు?

ఈ నిర్జనారణ్యమున నాకు రక్షకు లెవ్వరు ? ప్రభూ ! దేవదేవా ! నిన్నే నమ్మి యుంటిని. (ప్రక్క యవనిక నాంచి) అదో ! భయంకర పర్వత శిఖరమునకుఁ బ్రాణము వచ్చి నడయాడునట్లుండి యెవఁడో యీవంక కేవచ్చు చున్నాఁడు. నిశీధమందు వెల్గిపడు నిప్పు కొఅవుల వలెన్నున్న యాకనుగ్రుడ్లు చూచుచున్నవా ? లేక కాల్చు చున్నవా ? తెలియుటలేదు. అమ్మో ! అది హాసమా ? లేక ప్రళయ కాలమేఘ గర్జాట్టహాసమా ? ఆ వెకిలి నవ్వులతో నీవైపునకే వచ్చుచున్నాఁడు. భిల్లినీ ! యిపుడు గతియేది ?

భిల్లి :- రాకుమారీ ! నీకే మాత్రము భయములేదు. నీ ప్రాణమునకు ప్రాణము బలిగానిచ్చెదను. వగవనేల ? తెగువ యొనర్చి నీ వీగుహాలో దాఁగు కొనుము.

వైశా :- అట్లే చేయుదును సఖీ ! (అని త్వరగా చనుచుండును) (గుహాలో దాఁగుకొనును) (దృఢకేశి ప్రవేశించి యరణ్యములోని దశదిశల నన్వేషించుచు)

దృఢ :- (స్వ) ద్విజిహ్వుఁడు తాను వైశాలిని భిల్లినీ రక్షణలో గంగా తీర భూములలోఁ దప మొనర్చు చున్నదని చెప్పెను. అవీక్షితుని నాగపాశ బంధితుని జేసి యంతః పురమును గాలించినను నాడామె కనబడలేదు. (అని కనుల మాటుగఁ జేయి నుంచికొని దూరము గనుచు) అదో ! ఆ ముందున్నది యెవతెయో భిల్లజాతి స్త్రీవలెనే యగపడు చున్నది. (సమీ పించి) ఆ వైశాలినియు నీ పరిసరములలో నెందో దాఁగి యున్నదను కొందును. ఈ భిల్లినినే మంచి మాటతో నడిగి చూతుఁగాక !

దృఢ :- (భిల్లినిం గాంచి సమీపించి) నీ వెవరు ?

భిల్లి :- నేను భిల్లజాతి స్త్రీని. నీవెవరు ? ఏలయిందు వచ్చుటయైనది ?

దృఢ :- నేను జగదేక వీరుఁడనగు దృఢకేశిని. వైశాలిని యిచట తపమొ నర్చు చున్నదని వింటిని. నీవామె రక్షకురాలివై యున్నావనియుఁ దెలిసినది. నీవడిగిన దెల్ల నిచ్చెదను. వైశాలినిం జూపుము.

భిల్లి :- నేనేమియు నెరుఁగను. వైశాలిని యెవరో నీవెవరో ?

దృఢ :-ఆమెను రక్షింతునను పిచ్చి పట్టుదలతో నీ మృత్యువును నీవే యాహ్వానించు చున్నావు. ఈ దృఢకేశితో వైరమొనర్చి బ్రదుకలేవు.

(అని కత్తిదూయును)

ఖిల్లి :-మృత్యువు పిరికి పందలను మాత్రమే భయపెట్టఁగలదు. దీపమార్పఁజను శలభము తానును రెక్కలు గాలి చావక తప్పదు. నీజగదేక వీరత స్త్రీల బెదరించునంత వరకేనా ?

దృఢ :- హుఁ ! మంచి మాటలతో నీవేల విందువు ? ఈ కత్తి నీ పాలిటి మిత్తియై వచ్చినదని తెలిసికొని సిద్ధపడుము. మూర్ఖురాలా !

(కత్తిదూయును)

ఖిల్లి :-యుక్తాయుక్త వివేకములేని కామాంధులు మూర్ఖులగుటచేఁ బ్రపంచమంతయు వారికి మూర్ఖ రూపముతోనే కనబడును.

దృఢ :- ఖిల్లినీ ! నీభాషణ మంత కంతకు శ్రుతి మీరిన రాగమువలె మితిమీరు చున్నది.

ఖిల్లి :- పరస్త్రీల నంటరాదను శ్రుతిని మీరినది నీభాషణము మరియు నీరాగవర్తనమే.

దృఢ :- నీచురాలా ! నీవు నాకు ధర్మోపదేశము చేయవలసిన పనిలేదు.

ఖిల్లి :- అంతరింపఁ జేయు నసాధ్య రోగమున కౌషధమక్కరలేదని నాకును దెలియును.

దృఢ :- అంతరించునది నీవో నేనో యిపుడే చూపింతును. (అని ఖిల్లిని తల ప్రక్క తెర మఱుఁగు నరికివైచును ఖిల్లిని, నేపథ్యమున హా! యనినేలఁ గూలును. గంధర్వజాతి స్త్రీయై పైకెగసి చనును)

(అంత వైశాలిని దుఃఖితయై వెలికి వచ్చి రాక్షసుని గాంచి)

వైశా :- ఓరీ దుర్మార్గ వర్తనా ! నిరపరాధయగు నీఖిల్లిని నంత మొందించితివి. స్త్రీవధ పాతక మని నీకుఁ దెలియదా ! నారినిజంపిన నీవొక వీరుఁడవా? నీ కీనాడేకాలము మూడిన దని తెలిసి కొనుము. నీవును నేడే యాఖిల్లినితో దివికేఁగుట నిశ్చయము. హా! ఖిల్లినీ! నాకై ప్రాణములర్పించిన నీఋణము దీర్తునెట్లు? నీ, నాసఖ్యమెన్ని జన్మములదో? (అని దుఃఖించును)

దృఢ :- (ముందున్న వైశాలిని గాంచి) (స్వ) ఈ జవ్వని తానెవ్వతెయో ? అంతిపురికే వింత శోభఁగూర్చు నీయందాల రూపమడవిఁ గాచిన వెన్నెలగాఁ జేయుచున్నదీ క్రొన్నెల. ముని కన్నెగాదు గదా ! లేక వైశాలినియే యైయుండునేమో పురుషులకేని భయావహమగు నీయరణ్యమున రాఁగత మేమి? నాయదృష్టఫలమే నాయొద్దకిట్లునడచి వచ్చెనాయేమి? (అని) (ప్ర)

అతివా ! యెవ్వతె వీవు ? కారడవి పాలై యిట్లురానేల ? యా
రతివో ! భారతివో ? రమాయువతివో ? రంభోర్వశీ మేనకా
కృతులందెన్నడు నిన్నువంటి చపలాక్షిం గాంచనేలేదు నీ
వెతనాతో నఱపీడి తెల్పఁగదవే భీతిల్ల నీకేటికే ?

వైశా :- (స్వ)కన్నులప్పగించి నన్నేచూచుచున్న యీ కాముకునకు నేశపించు నది కూడ వినబడలేదు. నాకేటికో గుండె యదరు చున్నది. ఈ దురాత్మ ర్గునితో నీప్రకృతి వక్రునితో నిపుదేమని సంభాషించుట ?

(అని మౌనము సూచించును)

దృఢ :- (తనలో) ఇదియేమి ? నేనడుగు ప్రశ్నలకుఁ దలనేలవైచి మిన్న కున్నదేల ? ఇదే ప్రథమ పరిచయముగాన లజ్జాభినయములను సూచించు చున్నది కాఁబోలు ? తరులతలకు దోహద క్రియ నొనర్పమి గుసుమించ కుండు నటులే తరుణులకు లాలించనిదే యనురాగము నసలెత్తకుండును. ఒకసారి సానునయవాక్యములఁ బ్రణయ సుధలొల్కఁ బల్కరించి చూచెదఁ గాక! (ప్రకాశముగా) భామినీ! ఒక యువకుఁ డొక నచ్చిన యువతినిఁ బ్రేమించుటలు నేరముకాదు గదా ! కాళ్ల ప్రేళ్లకు మట్టియలు గళమున మంగళ సూత్రము లేకుండుటయే నీ వవివాహితవని చెప్పక చెప్పుచున్నది. ముద్దరాలా! నీతోనే నాపెండ్లి జరుగుట విధిలిఖితమై యున్నదేమో? తప్పింప నెవరి తరము ! అందుకే యీ ప్రపంచ జేతకు నీపై ప్రణయము ఘనీ భవించి యున్నది. చక్కని చుక్కవు చేఁజిక్కితివి. ఏమందువు ?

వైశా :- (చెవులు మూసికొని) హరి హరీ ! పాపము శాంతించుఁ గాక !

దృఢ :- ఇదియేమి ? ఈమె చెవుల ప్రేళలిడి పాపశాంతిని వేఁడుచున్నదేల ?

దృఢ :- బేలా! ఏలయిట్లు పాపశాంతి వేడుట? నేను నీపట్ల నొనర్చిన పాప మేమి? నీవు కన్యవు గాన నిన్ను వరించుటకు వాంఛించుటకు నాకధి కారము గలదు.

వైశా :- ఒక నచ్చిన యువకునితో నాకిదివరకే మనోలగ్నమైనది. ఇష్టము కాని మంగళ సూత్రము గళసూత్రమగు ఉరియగునే కాని వేరుకాదు. పోసికొనినవి తలఁ బ్రాలు గాదు. నుదుటంగల చెడువ్రాలు నందలి యక్ష రాలు. అచేతన పదార్థముల నెన్నిటినేని కోరి కొన వచ్చును. కాని స్త్రీ చేతన పదార్థ మగుట వలన నామెకును నొక యిష్టముండును. అది తెలిసి కొనలేనిది పశువు కాని మానవుఁడు కాఁడు.

దృఢ :-(స్వ) ఈ ధిక్కారము నెక్కరణి సహింపఁ గలను. (ప్రకా) బేలా! ఈ దృఢకేశి ప్రతాపమునకు వలచి సకల మహీమండల సామ్రాజ్య లక్ష్మియే తా నీపదములఁ బడి రాగ నొక సామాన్య లావణ్యవతివి నీవు దేనిలో లెక్క? అజ్ఞుఁడనర్ఘ జాతి మణిని గాజుగా భావించి పరిత్యజించి నట్లు నీవును నన్నెరుఁగక తిరస్కరించుచున్నావు. నావంటి ప్రతాపవంతుఁడు నీ కీభువి గల యువకులలో దొరుకుట కలలోని వార్త.

వైశా :- (ఒక తృణమును ద్రెంచి పారవైచి మౌనముగా నుండును)

దృఢ - నన్ను దృణ తుచ్ఛముగాఁ జూచు చుంటివా? లేక యేమియుఁ దోచక తృణ త్రోటన మథినయించు చుంటివా? అమర లోకము నా మూలాగ్రము హతి నొనర్చి బలారాతిని బంధించి యా విశాల స్వర్గ సామ్రాజ్యమునకును నధునాతనేంద్రుఁడనై అఖండదోర్దండ బలప్రతాపాతి శయమున బ్రతిభటానీక దుర్నిరీక్ష్యుఁడనై యల్ప బలశాలుర నీభూపాలుర నందర సుడిగాలి శుష్కతృణములనువలె కొని తెచ్చి చెరఁ బెట్టి ముల్లోక ముల విశృంఖలముగా విహరించు చుంటిని. ఆత్మస్తుతి నావంటి వీర పురుషుల కుచితము గాదు. కాని నీకుఁ దెలియఁ జేయ నెంచి చెప్పక తప్పినది కాదు. లోకమున నన్ను మించు బలశాలియే లేఁడు తెలియునా? ఇంకనైన నీ యభీష్టము నెఱింగింపుము.

వై శా :- (స్వ) విన విన వీని వాక్కులు కర్ణశూలములై గుండెను రెండుగాఁ జీల్చు చున్నవి. అనౌచిత్య సంభాషణకు మౌనమే మండలింపు. (అని మౌనము వహించును)

దృఢ :- మానినీ ! నీమౌన మింత సుదీర్ఘమై సహింప రాకున్నది.

పిలిచిన బదులిడ వేమని
తలఁ చెద విది యొక్క పెద్ద తనమటె యొకటం
దలయెత్తి చూచి పల్కిన
పొలతిరొ నీనోటి ముత్యములు రాలునొకో ?

వై శా :-(స్వ) వీడింకను విడుచునట్లులేదు. నాయాత్మ కథ నాల్గు మాటలలో నాటఁ జెప్పెదను. (ప్రకా) నేను విదిశా పురాధీశ్వరుఁడగు విశాల నృపాలునికూరిమికూతురను. నేవలచిన రాజపుత్రుఁడవీక్షితుఁడు. కొండొక కారణాన నన్ను ప్రేమించియుఁ బరిణయింప నొల్లఁడాయెను. అతని యనుగ్రహ పాత్రనగుటకై యరణ్యములఁ దప మొనర్చు చుంటిని.

దృఢ :- అహో ! సుందరీ ? వెదకఁ బోయిన తీవ పదములలోఁ దగుల్కొని నటులు నీవే దర్శన మిచ్చితివి. నేటికి నా ప్రయత్నము ఫలించినది. ఎన్నాళ్లనుండియో నిన్ను గాంచఁ దెన్నులరయు నీకన్ను దోయికి మది మత్తిలఁజేయు నందాల విందిడు చుంటివి. ఇఁక నీవీ దృఢకేశి బారినుండి తప్పుకొనఁ జాలవు. నాబాహు పాశగ్రంధిని విప్పుకొనఁ జాలవు.

వై శా :- దుర్మతీ ! పరవనితలఁ బెదరించుట వారితో ననుచితప్రలాపములు పల్కుట భీరువుల పనికాని శూరుల పనికాదు. మారుని గెలువఁ జాలని నీవొక శూరుఁడ వెట్లు ? మూఢ హృదయమును వశపరచు కొనలేని నీవు ముల్లోకముల స్వాధీన పరచు కొంటినన సిగ్గుగాదే.

దృఢ :- జవ్వనీ ! నా వీరత శూరత నీముందు పనికి వచ్చునది కాదు.

వీరవర్యుఁ డెదుటి వీరుల గెల్వఁగా
చావునకుఁ దెగించి సల్పుపోరు

సుందరాంగి నవ్వి చూచిన చాలుఁదా
నెట్టి వీరుఁడేని పట్టు వడును.

అవివాహితవు. నీవు పరవనిత వెట్లు? నిన్ను బరిగ్రహింప నొల్లని యా రాజకుమారునిపై ఫలింపని యాసలిడు కొని వంచితవగు నీ గతియేమి?

వైశా :- ఇష్టుఁడగు వరుఁడు లభించు వరకు నిట్లరణ్యములఁ దప మాచరించుటయే యుత్తమగతి. నాకు లేని విచారము నీకేల? సీదారిన నీవు పొమ్మ!

దృఢ :-(సతిరస్కారముగ నవ్వి) బాగు బాగు! ఈ చదువెచ్చట నేర్చితివి?

క్రొవ్విరు లీనుమేను సరిక్రొత్త రుచుల్గిల కొట్టఁ జూపులున్
నవ్వులు కమ్మవాసనలనారతముఁబుకిలించ, మవ్వపుం
బువ్వులరువ్వు జవ్వనము పోయిన వచ్చునె వేయిచేయ, నీ
యౌవన జీవితాల్పము ననల్ప తపమ్ముల వమ్ము చేసెదే.

కావున ననుగూడి కామ సామ్రాజ్య పట్టమహిషివై కలకాలము సుఖింపుము.

వైశా :- హతాస్మి! దుర్మతీ! నీకిట్లాడనోరెట్లువచ్చినది? మనసు నొకరికిచ్చినదీమగువయని తెలిసియు నాసతిని వాంఛించు వాఁడు కామ సామ్రాజ్యమే కాని ప్రేమతత్వమెరుఁగని పశుసమానుఁడు. ధర్మ బద్ధమగునపుడే స్వచ్ఛత నొంది కామము ప్రేమమై కష్ట సుఖముల గణించక యిష్ట కామ్యములఁ బొందును. అప్పుడే యది పురుషార్థ రూపమై గురు గౌరవ పాత్రమగును.

దృఢ :-ప్రేమమైనను కామమైన నొకే రూపము. అర్థరూపిణి లక్ష్మి కామునకు కన్నతల్లి. ధర్మరూపి నారాయణుఁడు కన్నతండ్రి. వారిరువురి ప్రేమమే కామరూపమైనది. అది యపవిత్ర మెట్లగును?

వైశా :- తల్లి ప్రియకారిణి. తండ్రి హితకారి. కాముఁడు తండ్రిహితోపదేశము వినని కుమారుఁడు కావుననే శివుని కంటి మంట లంగాలిపోయెను. తండ్రి యాదేశముల ననుసరించు బిడ్డ కావుననే గంగను శివుఁడు తలఁ

దాల్చెను. ఇంతయేల ? ఒక లతాసతి యొక తరువరాశ్లేష మొనర్చి యన్య తరువు నంటఁ బోదు. కాని పతితులకు వానికున్న ధర్మ దృష్టి లేకున్నది.

దృఢ :- బేలా ! యాలతాంగన యచర మగుట వలన దానికది సహజము. అది ధర్మమనుట కన్న, దాని ప్రారబ్ధ కర్మమని జాలి గాంచ వలెను. అదియుఁ గాక స్త్రీయు నొక లతయే.

హాస సుమము లవిద యధరపల్లవమును
స్వర్ణ కుచ యుగమ్ము సరసతయును
కామునింబ్రసన్ను గావించు పూజకై
పత్రపుష్ప మధుర ఫల జలాలు.

వైశా :- ఉన్మాదీ ! ప్రేమమునకుఁ గన్నులుండి సరిమార్గములో సంచరించి యుత్తమ గమ్యమును జేరుకొనును. కామము గ్రుడ్డిదై పాపకూపమున గూలిపడి నశించును. ప్రేమము స్త్రీ పురుషుల పరస్పరా మోదమును బొంది కష్ట సుఖముల వెంట నుండును. కామ మటులు గాక తన సుఖమునే భావించి యెదుటి వ్యక్తి యామోదము నొందఁజాలదు. ఇంక నీపశు చర్యలు మానుము.

దృఢ :- ( రోష కషాయిత నేత్రుఁడై ) (స్వ) ఔరా ! ఈ వనిత సామ వచనముల దారికి వచ్చునట్లగపడదు. బలిమితో నసాధ్యములు సాధ్యము లగును. జగదేక వీరుఁడనగు నేను నీయబలతో నిందా లాపములకు గురి యగుటలా ? (ప్ర) మూఢురాలా ! నీ సౌందర్యము నీదుర్భాషల నన్నిటి క్షమింప నిర్బంధ పఱచు చున్నది. నాకేలఁ జిక్కిన నిన్నా త్రిమూర్తు లేకమై వచ్చినను విడిపింపలేరు.

ఫలములనిత్తు నీకు నీను ప్రాణమొకెత్తుగఁ జూతునంచునన్
బిలిచిన ప్రేమ చూపినను బేర్మి శుకంబది వచ్చి ప్రాలునే
బలిమిని బట్టి పంజరపు బంధము నందిడఁ జెప్పినట్లుగాఁ
బలుకుచు ముద్దులొల్క కను పండు వొనర్చును గాదె కోమలీ.

(కత్తి దూసి) కదలితివా ? కంఠమునుండి తల వేరగును.

వై శా :- ఓరీ కామాంధా ! నీకరవాలము నా ప్రాణములఁ బాపినను జీక్కు లేదు. నాకన్ని కష్టములఁ బాపి యుపకరించిన వాఁడ వగుదువు. స్వచ్ఛ ప్రేమము బలియగుటకు భయపడదు. దానికి నేను సిద్ధముగా నున్నాను. కాని దుర్భావముతో నను సమీపింతువా ? దుష్పరిణామమునకు గురి యగుదువు.

దృఢ :- ఆ దుష్పరిణామ మేదో నేనును జూడఁ దలఁచు కొన్నాను. నీవద్ద నున్న యస్త్ర బలమేదో ? చూపింపుము.

వై శా :- నీచ ! నావేడి కన్నీటి బొట్టే చాలు
మొదలార నీసంతు ముంచి వేయ
అధమ ! నాయెదనుండి నట్టి యగ్నియె చాలు
నీ దీర్ఘ సంపదల్ బూదిసేయ
హేయ ! నాయూర్పె చాల్వేయేల నీవంశ
భూజమ్మును సమూల ముంబెకల్ప నీ
క్రూర ! హాహాకార హీరమ్మె చాలు నీ
తొలి పుణ్య నగముల ధూళిఁ గల్ప
పతిత ! యిల నపేక్షిత ధర్మపత్నినైన
నన్నుముట్టిన నీచేయి సున్న మగును
ఫలమనెడి భ్రాంతి నీ పతివ్రతల చిచ్చు
నంటరాకు పతంగమవై నశింప.

దృఢ :- ఆడుదాని శాపములకే యదరి పోవునంత పిరికి పందకాఁడీ దృఢకేశి. నేను నీ పాతివ్రత్య శక్తినే పరీక్షింపఁ దలఁచి నిలిచితిని. పతియే లేని పాతివ్రత్య మెచ్చటను గని వినని వింత. పురమే లేదనిన నంతఃపుర మొకటుండునా !

వై శా :- హా ! హతాస్మి ! ఈ పాపాత్ముఁడు నావెంట నంటి వచ్చుచునే యున్నాఁడు. ఇంక గతియేది ? (అని పరువిడును)

(ఇరువురును నిష్క్రమింతురు)

(అపీక్షితుఁడు ప్రవేశించి కన్నులపైఁ జేయి మాటిడుకొని యన్ని దిసలం గాంచును)

**అపీ :-** (స్వ) అబ్బా! ఇప్పటి యీ నిండు వేసఁగి మండుటెండ నేమన వలె ? ఇపుడీ వనసీమ నిప్పులఁ జేటలతోఁ జెరిగి పోయు చున్నట్లున్నది. ఐన నీవేడి విరహాగ్నిని మించునది కాదు. (వైశాలినిం దలఁచి)

హృదిని విడని ప్రేయసికినై యేల యిట్లు
విరహ వేదనం గుందుట ? మఱపురాని
భావనామయ ప్రణయ ప్రపంచ మందుఁ
గాంక్ష చల్లారదు విరక్తి గల్గఁ బోదు.
విరహాన కాంక్షలు పరిపూర్తి గనకున్న
భావనా మధురిమ జీవనదము
విరహంపు ప్రణయమ్ము విగత ఫలంబయ్యు
కమ్మ వాసన దన్పు గంధ ఫలియె
విరహాబ్ధి దాహమున్ బొరి నార్ప కున్న న
క్షీణ మత్తత నిచ్చు పాన మధువు
ఇష్ట సిద్ధి లభించ నీకున్న విరహమ్ము
పార వశ్యా నంద ప్రద సమాధి
వేదనల మహానందము, రోదనముల
గాన మాధురి, యద్వైత ఘన సుఖాప్తి,
ప్రేమ తరు దోహద క్రియ, ప్రేయసి కయి
విలువ నిడరాని కానుక విరహ మనిన.

ఈ వనము గూడ విరహాగ్నిఁ గుందునట్లు తోఁచుచున్నది.

గిరిరాజు విరహాగ్ని కీలలై దావాగ్ని
మంటలు భగ భగ మండి వెలుఁగు
ఉద్రిక్త దిశల నిట్టూరుపో యన నెండ
వడ గాడ్పు తుక తుక నుడుకఁ జేయు

నీళలను దూరము కసరి కొట్టు దివంపు
మది మంటయై రవి మసలు చుండు
అన్యుఁడు స్పృశియింప నగ్నియై కాల్చెడి
సతి యన నుర్వి ప్రజ్వలిత యగును
గ్రీష్మ రూపమ్మదెంతయు భీష్మమగుట
జీవరాశికి నతఁడనఁ జెమట వోయు
పగళులనఁ బ్రాణులకు నెల్లఁ బగలొనర్చు
నీడలనఁ దోడు నీడలై నెమ్మి గూర్చు.

ఔరా ! ఆశ్రమమునుండి బయలుదేరినదాది వేఁట తమకంబున ధనుష్పాణినై ప్రముక్కడి మృగముల లెక్కకు మిగులఁ జక్కాడితిని. ఇంతకు ముందే చంపఁబడిన వ్యాఘ్రము నన్ను దనవెంటఁ గొని వచ్చి నా పరిజనమ్ముల కెడఁబఱచెను. అలసి పోయిన నేనిపుడీ వృక్షచ్ఛాయలఁ బచ్చిక బయళులఁ గొంత వడి విశ్రమింతుఁ గాక !

(అని పచ్చి గడ్డిపై మేను నరవాల్చును)

చెమటారఁ జలువగాడ్పుల విసరుచు శాఖాకరాల, నాశ్రమలు మరపించు నీ పావన తరు సేవాభావము ప్రశంసనీయము.

రవికర తీక్ష్ణఘాతలఁ గరంబు నిరోధ మొనర్ప భూమి తా
నవిరళ వృక్షశాఖల దయామతి నడ్డుచు ఘాత సంతతిన్
సువిదిత భాతి నీడనిడుచున్ దరి దీసెడిఁ దండ్రి గొట్టుచోఁ
దవిలి స్వమాత యడ్డుచని తాల్మి నివారణ సేయు కైవడిన్.

కఠిన కష్టంబు లెఱుఁగు సౌఖ్యం బటన్న
నకట ! క్షుద్బాధయే రుచి యనఁ దెలియును
విరహ దశయే యెఱుంగును ప్రేమయనిన
నార్తియే తెల్యు నుపకృతి యనిన నెందు.

(నేపథ్యమున)

నాథా ! యవీక్షితా ! చచ్చితిని. నన్నీ దురాత్ముఁడు తరుముకొని వచ్చుచున్నాఁడు. రక్షింపుము ! రక్షింపుము !

అవీ :- (ససంభ్రమము) ఔరా! ఇదియేమి? ఈ యార్తధ్వని యెచటిదీ? స్త్రీ స్వరము వలె వినబడు చున్నది. నాథా! యవీక్షితా! రక్షింపు మను చుండెను. (స్మృతి నభినయించి) అయ్యో! వైశాలిని కాదు గదా? ఆమె నాగలోకమున నున్నదని గురుదేవులు వచించిరి. మరి యీ కాన నార్త ధ్వని యెవరిది? (నేపథ్యమున మరల ధ్వని వినవచ్చును) ఈ దురాత్ముఁడు నిర్జనారణ్యములో నాపైఁ బడ వచ్చుచున్నాఁడు. నాకు దిక్కెవరు? హా నాథా!

అవీ :- (విభ్రాంతితో) (స్వ) ఆఁ! మరల నీ యార్త ధ్వని యిదియేమి! ఎవరిది? (అని ప్రక్క తెరను గాంచి) ఈ వైపే వినవచ్చుచున్నది. ఇటు జనుదుఁ గాక! (మరియొక వైపు ఖడ్గపాణియై వైశాలినిం దరుముచు దృఢకేశి ప్రవేశించును)

దృఢ :- జవ్వనీ! ఏటికీ రీతి నిన్నాల్లని పూరుషునిపై నిట్టి భ్రాంతి నిడుకొను చున్నావు (స్మృతి నభినయించి) వైశాలినీ! నీపతి కణ్వపుత్రుని శిష్యుఁడగు నవీక్షితుఁడు కాడు గదా?

వైశా :- ఔను. ఆ మహా భాగుఁడే. అతని పరాక్రమము నీకు తెలిసియే యుండును.

దృఢ :- అయ్యో పాపము! నీ కింతవరకు నతని మరణ వార్త తెలియదా యేమి? ఏలయీ మృతునిపై రిత్త భ్రాంతినిడి కొంటివి?

వైశా :- ఏమేమీ! అతని మరణ వార్త నుచ్చరించు నీ నోరు పడిపోదేల? (అని చెవుల ప్రేళ్ళిడుకొని) పీడ శమించు గాక! మాయావీ! అతఁడు బ్రదికియే యున్నాఁడు. నీవాక్కులు శుద్ధాబద్ధములు.

దృఢ :- కణ్వ పుత్రయజ్ఞ రక్షణ మొనర్ప వచ్చి యతఁడీ మధ్యనే మాద్వి జిహ్వునిచే హతుఁడైనాఁడు. ఇదియ సత్యము.

వైశా :-ఇదియే సత్యమా! హానాథా! హతాస్మి! (అని తల మోదుకొనుచు నురము బాదుకొనుచు నేఁ రాలును) దీన జనావనా! శ్రీమన్నారాయణా! ఇన్నాళ్లొనర్చిన తపమునకిదియేనా నీ విచ్చిన ఫలము. నీవు వరదుఁడ

వనుట భక్తకల్పద్రుమము వనుటలు సత్యమేనా ? నీవింత కఠిన హృదయుఁడవనుట నాకు తెలియదు.

త్వరపడనేల నేడిటులు తక్కిన రేపటికేని నాథ సుం
దర చరణాబ్జ సేవన ధనమ్మది చిక్కదె యంచు నమ్మి నా
కరముల యాసనాలవము గంగను గల్పెను నేడువిన్న నీ
మరణ నదీ తరంగముల మందత నేత్రతటాల నశ్రులై.

దృఢ :- బేలా ! ఏల యీలీల కురరిపలె మొరలిడి విలపింతువు ? ఇకనైనను నను నీవు వరింపుము. కాదేని నిను బట్టికట్టి శిరమ్ము నందిడి కొని పోవుదును. ఇంక నిన్నా దేవుఁడును రక్షింపఁ జాలఁడు.

(అంత తెర ప్రక్కనుండి పద్యము జదువుచు నవీక్షితుఁడు ప్రవేశించును)

అవీ :- ఎవ్వడ వోరి క్రూర ! ఏదురెవ్వరు నాకని యెంచి యింతగాఁ
గ్రొవ్వుచుఁ గామ మోహ మద కుత్సిత చిత్తుఁడవై యరణ్యమం
దివ్విధి నివ్విభీత హరిణేక్షణ నిట్లు ప్రకంపితాంగియై
కెవ్వన నార్వ బల్మి గొనఁ గేరుదు క్షత్రికడనే ప్రతాపముల్.

దృఢ :- ఓహో ! నీవీ కన్నియను విడిపించ వచ్చిన మొనగాఁడ వేమి ?

అవీ :- విడిపించుటే కాదు. (అని వైశాలినిం జూపుచు)

ఏపాపంబు నెఱుంగ కుండ వనిలో నేకాంగియై సన్మని
వ్యాపారంబులఁ బ్రొద్దుఁ బుచ్చు నబలన్వంచింపగా నెంచు నీ
కా పోఁ గాలము దాపురించుటిది నిక్కంబేది యెత్తైననో
పాపాత్మా ! నిను ద్రుంప మిన్విడువ నా బ్రహ్మాదులే నడ్డురాన్.

వైశా :- (స్వ) అమ్మయ్య ! కొంతంత ధైర్యము వచ్చినది. ఆ పరమేశ్వరుఁడు నను గటాక్షించినాఁడన వలెను. (అని కొంత దూరము చని యందు నిల్చును.

దృఢ :- ఔరా ! యీ తన్విని విడువనిది నన్నును జీవంబులతో విడువవేమి ? ఏమి నీ యార్తత్రాణ పరాయణత్వము. ఏమి నీ ప్రతాపము ! (అని తిరస్కారముగా నవ్వుచు) మదీయాఖండ దోర్దండ ప్రతాపాగ్ని నెరుఁగక

కారులు ప్రేలు నీవెవ్వండవు ? ( అని మీసమును దువ్వుచు ) ఓరీ ! యధమా! వృషభ మెంత బలిసినన్ సింహముతోఁ బోరఁదగునా. నన్నెవరను కొంటివిరా ! నాతో పోరుటకై నీకెన్ని గుండె లున్నవిరా ?

పులినోటి కండ రాపులఁ గిగ్గనుంకించు
కైవడి నీవు నన్గదియ నిచట
గరుడి ముక్కాఁరయు సుందర మత్స్య మహి
మ్రింగఁ దలచుట నీవు నన్దలపడ నిట
ఫణిశిరస్థలలసన్మణి శాణకుఁడు గొన
నెంచుట నీవు నన్నెదుర నిచట
వ్యాధునగ్ని జ్వాల వలచి శశమ్మాడఁ
బోవుట నాతోడఁ బోరుటిచట
అమర వరుల గుండియ లిట నాగలేవు
మర్త్యుఁడవు నీవెచట నీదు మర్మ మెంత
కులిశహతి మేరు శిఖరమ్మె కూలిపడిన
గులకరాయి లెక్క యదేమొ పలుక వలెనె ?

అపి :- ఇట్లు బీరములఁ జెప్పు కొనుట నీవంటి దాంభిక శిరోమణికే చెల్లును. శూర శిరోవతంసుల బలపరాక్రమములు కదన రంగముననే కనఁబడును. నీకుఁ బ్రత్యుత్తర మీ శరశరాసనములు మాత్రమే చెప్పఁ గలవు.

(అని శరాసన మెక్కిడును)

దృఢ :- ఓరీ ! అవివేకీ ! నీ సాహసము గాంచ నవ్వు వచ్చుచున్నది. కోప ముహెచ్చు చున్నది.

నీదు బాణాగ్నిచే నే నీఱగుదు నంచుఁ
బారిపో నొక చిన్న పక్షి నొక్కొ
నీతర్జనమ్ములఁ నీదు గర్జనముల
వెరువ స్తన్యమ్మాను చిరుత నొక్కొ

నీ చిఱ్ఱు బుస్సుల నీ కోప తాపాల
వడకఁ గాఱులఁ దాల్చు పడఁతి నొక్క
నీ యాజ్ఞ ప్రాజ్ఞల నీ శాసనమ్ములఁ
బాలింప నీ బంటు బానిస నొకొ
సౌధముల లోన నీ యాట సాగుగాని
వనుల నా ముందె మనుజండికక ! యివన్ని
ప్రాణములు పట్టియున్నచో వచ్చు దారి
నేఁగు మికఁ దుది యవకాశ మిచ్చుచుంటి.

ఇప్పటికిని కరుణించు చుంటిని. నీ పుణ్యమేమో తెలి యుటలేదు. తారతమ్యమెరుఁ గక నేనుఁగులతో నేటులాడ వచ్చు చుంటివి నీవారిలోఁ గలియ నెంచితివేని పారిపొమ్ము ! (కొఁతాగి) పోవా ? సరి ! ఈ క త్తి నిను మి త్తి నోటికి నందించు నమోఘ సాధనము. చూడుము !

(అని క త్తిదూయును)

క్రొ త్తగఁ గూసమున్విడుచు క్రూర భుజంగము ఱంగి మింటిలో
నృ త్త మొనర్చుచు న్పయద నీల దవానల కీలఁ బోలు వి
ద్యు త్తన మృత్యు తామస మహోగ్ర ముఖమ్మున వేలునాల్కయై
యి త్తరి మత్తరాసి వధియించి భుజించగ నెంచు విన్నవిన్.

ఇది కడసారి చెప్పుట నాకడ్డు రాకుము పొమ్ము !

అపి :—పీపుచూపుటలా? రాజపుత్రుఁడన నెట్టివాఁడో తెలియక పలుకు చుంటివి.

దాన ధారలుగ నా ర్త జనమ్ములకు గుండె
చింపి నెత్తురులు చిమ్మింపఁ గలఁడు
ఫలదాన మట్టులభయ మన్న వారికిఁ
దలనట్టె త్రెంపి హస్తాల విడును
"పాహిమామ్మ"ను వారి పాదానముల్
నాటకుండ మైతోలాన గూర్చు రక్ష
శరణార్థి దృష్టి దోషము నేని గననట్లు
ప్రాణాలు మీదు ద్రిప్పఁ గలవాఁడు.

దృఢ :- (తిరస్కార హాసముతో) ఎవరిని ? తనను తానిటులిచ్చు కొనునా ?

అవీ - గెలిచి యరినన్ని రీతుల బలినొసంగు
లేనిచోఁ దున్నదానె యీలీల నిచ్చు
కొనెడి నార్తుల కొఱకు రాకొమరుఁడాజి
వీపు చూపునె జీవచ్ఛవో పమముగ.

దృఢ :-నేటితో నీకు నిండ నూరేండ్లాయువు మూడినది. ఐన నా విశాలమగు మైదానమునకుఁ బోదము పద ! నీ క్షాత్ర మెట్టిదో చూతును.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

వై శా :- (సంతోషముతో నిట్టూర్చి) అమ్మయ్య ! ఇప్పటి కీపీడ కొంత విరుగడయైనది. ఆపద్బాంధవా ! ఆర్త త్రాణ పరాయణా ! ఇంత కీదీను రాలి మొర తలకెక్కెనా ? ఏమి నీవాత్సల్యజలధి ? ఈ నిర్జనారణ్యములో నా మానప్రాణములు రక్షింపఁబడునని యేకోశమున భావించనైతిని. మనమా ! ఇంక శాంతిని జెందుము, ఆ వీరపురుషుని విజయమునకై పరమేశ్వరుఁ బ్రార్థింపుము. దుఃఖ వార్ధి తరింపుము.

(అని కరములు మోడ్చి భక్తితో)

నిండు మనంబు తోడ నతి నిశ్చలుఁడై కడు నిర్భరాత్ముఁడై
యుండి నతిఁ హరీ ! వరద ! యో పరమేశ్వర ! నీవె దిక్కు వే
రొండొక లేను లేదు శరణొందితి దీనుఁడ నన్ను నాపదల్
కొండలవోలె వచ్చియును గొంచెపు మంచుగఁ దేలిపోవాకో !

(అని ప్రక్క యవనికం గాంచుచు) అల్లదో ! ఆ ఘోర నిశాచరునితోఁ బోరుటకు సిద్ధపడిన యా వీరుని మనోహరాకారమునేమని వర్ణింతును.

తూణము నందుఁ గేలునిచి తోరపు వీరము రూపు గొన్నటుల్
బాణము తీయుచేయు టొక పాటున నేర్పడ నీక జ్యాలతన్
బాణిని లాగి తీవ్రశర వర్షము గుప్పట దైత్య దుర్వపు
శ్శోణిత ధారలద్ద్యుపరిశోభిత నిర్ఝరులై స్రవించెడిన్.

ఔరా ! ఏమి యాదైత్యుని యార్భాటము ?

శర ఘాతమ్ముల నుండి తప్పుకొనగాఁ జండో(గ్ర నిస్త్రింశ సం
గరకేళిం బొనరించుచు న్దొడరి వ్యాఘ్రమ్మట్లు గర్జించుచున్
బరిమార్చున్నిను నీ కృపాణ మనుచుం బై పైకి లంఘించుచో
మెరపుల్ గ్రక్కెడి మేఘమై యసురపేర్మిన్దాండవంబాడెడిన్.

(భయముతో) అయ్యో! ఇఁకెట్లు? సురారి యా వీరుని శరాసనమ్మును ఖరాసితో నిరు ఖండమ్ములు గావించెను పరాత్పరా! నీవెట్లు కాపాడెదవో? అదో! ఆ వీరశిరోమణి కటిగ్రవేలాడు ఖడ్గముంగొని యెదిరించు చున్నాఁడు.

అసినాగంబులు రెండున్ గసిబిసిఁ
బెనఁగాడుకొనుచుఁ గాటిడు తఱికై
బుస గొట్టి వొంచు నిట్టులు హసియించెడి
మృత్యు దంష్ట్రిలసి రూపములై .

పారెడి వేడి నెత్తురులు పాయలు వారుచుఁ గాల్వలై చనన్
బోరఁగఁ బొంగుచున్ గరుడు వొల్చెడి కండల నూర్మి సంతతుల్
గూరఁగఁ గోర చూపు లలుఁగుల్వడి మీలయి తేలియాడగా
వీర రస(ప్రవాహములె వీరల యాకృతి నాడుఁ జూడగన్.

ఓ దేవదేవా! నామాననేతను నా(ప్రాణదాతను నీ వేరీతి విజయునిగాఁ జేసెదవో నిన్నే నమ్ముకొని యుంటిని. అదో! ఆ వీర శిరోవతంసుఁడా దితిజుని కరవాలము నిరు ఖండములుగా నరికి వైచినాఁడు. అమ్మో! చూచుచుండగనే యా మాయావి చేతిలో మహాభయంకరమగు గద యొకటి (ప్రత్యక్షమైనది. దానిఁ గొని యా వీరుని పైకేఁగు చున్నాఁడు.

గురు ఫణిరూప హస్తములు గోత్రనిభాంగము వ్యాళ వక్త్రి గ
హ్వార సదృశో(గ్ర కోప వివృతాస్యము నిష్ఠురముష్టి యొప్పఁగన్
బొరి వికటాట్టహాసములు భోరుకొనన్ వడివచ్చు దైత్యుఁడున్
గరిపయి దూకు సింహమనగా నెదురేఁగుచుఁ బోరు నీతఁడున్.

ఔరా! చూచుచుండగా నానిశాచరుని గదాదండమును రెండు ఖండములుగా జెండివైచినాఁడు. ఏమి యీ వీరుని (ప్రతాపము! అమ్మో! దైత్యుఁడు

తాను కోపముతో "నిదియే నీపైఁ బ్రయోగించు తుదియస్త్ర" మని, ఘోర భయానకమగు తన మంత్ర శక్తినిఁ బంపుచున్నాఁడు. అది యగ్ని జ్వాలలఁ గ్రక్కుచు రివ్వున బరతెంచు చున్నది. ఇంకెట్లు? అల్లదో! ఆ వీరుఁడు "కాచుకొమ్మిది బ్రహ్మాస్త్రమ"ని మంత్రించి విడుచు చున్నాఁడు. ఆహో! అది యా శక్తిని ముక్కలొనర్చి యసురునిపైఁ బడినది. ఘోరముగా నార్భాట మొనర్చు చున్నాఁడా దైత్యుఁడు. (గుట్ట వలె దైత్యుఁడు గూలిన చప్పుడు విని) ఇంక నాదుష్ట రాక్షసుఁడు క్రిందఁ బడి కాలు నేతులు తన్ను కొనుచు విలవిలలాడి పోవుచున్నాఁడు. మృత్యు ముఖములో నున్నాఁడనిపించును. కాయము తాళ వృక్షమువలె కూలి పడి కదలుటలేదు. చచ్చినటులున్నాఁడు సకల జగమ్మునకు సుఖమొన గూడినది. (అవీక్షితుఁడు ప్రవేశించును)

అవీ :- (వైశాలినిం గాంచి) మానినీ! ఇంక నా రాక్షసుఁడు చచ్చెననుటలో సందేహములేదు. వెఱపు మానుము. పర ధన రక్తులకును బర వనితాసక్తు లకును బట్టునట్టి దుర్గతి యిదియే. వీఁడిట్టి సాధ్వుల నెందర హరించి పచ్చని కాపురములకుఁ జిచ్చు పెట్టినాఁడో? దానికిఁ దగిన ఫలమనుభవించి నాఁడు. వలదన్న నిట్టి పాపాత్ములు చిరకాలము బ్రదికి బాధించు చుందురు. వీరిఁ గాంచి యా మృత్యువు గూడ సమీపించగా వెరచునేమొ! "పాపీ చిరాయువ"ందురు.

ఉండవలె నన్న సుకృతియె యుర్వి వీడు
వలద టన్నను బాపి యివ్వసుధఁ బ్రదుకు
తావినిడు పూవుక్షణ ముండి ధరణిరాలు
బాధనిడుముల్లు స్థిరగతిఁ బ్రబలి యుండు.

(వైశాలిని దిక్కైకో మలీ!)

ఖగతాడనములకుఁ గస్సని ఫణమెత్తి
కాలపాశములయి కదలు ఫణులు

పానీయ మానుచుఁ బ్రతిబింబముల నీటఁ
గాంచి మారిడుచు గాండ్రించుఁ బులులు
కరిసంఘములు పర్వఁ గానలు మార్మ్రోగ
నుపొంగి గర్జించుచున్న హరులు
తెట్టె కొల్లంగొట్టఁ దేంట్లు నోటిం గుట్ట
నిలిచి బొబ్బలు పెట్టు నెలుఁగు బంట్లు
కారు చీకటి నిలయమై గ్రాలు పొదలు
ప్రాణమున్న ముండ్లనఁ దేళ్ల పాములాడు
దిగులుఁ బుట్టించు కానలఁ దెగువ మెయిని
నేల తరుముచు వచ్చె నిన్నీతఁడబలా !

వై శా :- (దుఃఖ పరవశతఁ గన్నీరు దుడుచు కొనుచుఁ దనలో)
అశ్రులొల్కి తేర్చు నాత్మీయులం గాంచ
నెదఁ జెలంగు దుఃఖ మెక్కి వచ్చు
మంచు గురియు శశిని గాంచిన సాగర
క్షోభ మెంతొ పొంగు నూపు నటులు.

?వీ :- అబ్బా ! యిప్పటి యీమె దురవస్థ నేమనుట ?
చెక్కిళులంటి జారఁ జిరు చెమ్మట లొదల నుండి యెంతొ వె
క్కెక్కి యడంప లేని వెత నేడువఁ గన్గొనఁ గ్రమ్మునశ్రువుల్
గ్రుక్కఁగ వల్కలాంచలపు కోనలు పాణుల నూనియద్దగా
నక్కట వాచి యెఱ్ఱవడె నా మృదువౌ కను పొట్టలింతగన్.

ఈమె మేరలేని దుఃఖముతో నామనసు నీరౌనర్చు చున్నది. ఆ దురాత్ముఁ డెంతగా బాధించెనో యీమెను.

? శా :-(తనలో) (దుఃఖముతో) ఈ పురుషుఁడు చిరపరిచితుఁడగు నవీక్షితుని దలపించు చున్నాఁడేమి ? అతఁడే కాఁడు గదా ? పెరిగియున్న ముఖవ్యం జనములతో నీతఁడు సరిగా గుర్తింప రాకున్నాఁడు. అతఁడేయను నను మాన మధిక మగుచున్నది. ఈ యసామాన్య బలపరాక్రమము లన్యత్ర సుదుర్లభములు. (అని యతని బదే పదిగఁ జూచును)

అవీ :- ఔరా! ఈ తన్వి మాటి మాటికిని మిక్కిలి తమకమున జూచుచున్న దేల? వైశాలిని కాదు గదా! అవీక్షితా! నాథా! యని మొరనిడెను. అత్యంత కృశీభూత గాత్రయగుట వలననో పరిచయము సరిగా నొనర్ప లేక పోవుచున్నాను. ఆహా? ఏమి యీ గాత్ర సౌందర్యము.

చిక్కిన గాత్రవల్లి వగచే వసి వాడిన యా ముఖాబ్జ మా
యొక్కటియైన వేణి, కన నోడుచు వ్రాలెడి కన్ను దోయి లేఁ
జెక్కిలినాను చేయి చిరు చెమ్మట గ్రమ్మ లలాట రేఖతో
చొక్కెడిఁ బ్రబ్బు గాంచమికి సోలు లతంబలె నిర్భరాంగియై.
చొక్కపు మేని పాండుర రుచుల్ వ్యనివారిత దీప్తినింతగాఁ
జిక్కియు జీర్ణ వల్కలపు చెంగు మరుంగున దక్కు లీను నీ
చక్కదనాల కుప్పమెయి సర్వము చేయని సొమ్మె యయ్యె నిం
కెక్కడి భూషణాంబరము లెక్కడి వర్ణన లేటి సామ్యముల్.

నా హృద్వేగము నాపఁ జాలకున్నాను. ఈమె స్థితిగతుల నరసెదఁ గాక! (వైశాలినిం గని) (ప్రకా) వనితా శిరోమణీ! నిను గూతురుగాఁ బడసిన భాగ్యశాలి యెవరు? ఆ రాజశేఖరుని యేలుబడిని ముదమొందు రాజ్య రమ యెట్టిది?

వైశా :- (దుఃఖరుద్ధ స్వరముతో) వీరాగ్రణీ! నేను విదిశా పురాధీశుఁడగు విశాల నృపాలుని యాత్మజాతను. నన్ను వైశాలిని యందురు.

అవీ :- (ఆశ్చర్య దుఃఖ ప్రేమల నణచివేయుచు) సాధ్వీ రత్నమా? నీవేల యీ దుస్సహ తపమ్ముల నాచరించు చుంటివి?

వైశా :- అవీక్షిత్కుమారు నాత్మేశ్వరు నొనర్చుటకునై.

అవీ :- (విభ్రాంతుఁడై) (తనలో) హా వైశాలినీ! అవీక్షితు నాత్మ నాథు నొనర్పగా నింకను దపమాచరించు చుంటివా? హృదయమా! నీ వేదియో తలంచు చుంటివి? శరీరమా! నీవేలకో త్వరపడు చుంటివి? ప్రపంచమా! నీవు నా పాలిటి కెట్లో మారుచున్న దానివలె నగుపడు చుంటివి. వైశాలినీ! ప్రాణ ప్రియా! నీ వింకను నాకొఱకై ప్రాణములతో నుండి

యిన్ని కష్టములనోర్చు చుంటివా? నీ సాహసమును నీ పట్టుదల నేమని కొని యాడుదును. దురదృష్ట వంతుఁడగు నీ యవీక్షితు నాత్మ నాథునిగాఁ జేయఁ దలంతువా ?

మిట్ట న్మాసెడి తన్వి మేనిటులు వెన్నోకుండ నెన్నో విప
ద్ఘటమ్ముల్ వడిదాటఁ గల్గెననఁ జిత్రంబై కనం జెల్లు వేఁ
టట్టన్నల్గు కపోత పోత మజె క్షుద్బాధార్తి నా చిల్లరాల్
పొట్టన్నింపి హరింపదే కన వలెన్నో దైవ చిత్రమ్ములన్.

ఇంక మహానదివలెఁ బరువిడి వచ్చు నీ ప్రణయ వేగము నాపఁ గలుగు నెద్ది ? నా ప్రియురాలి వక్షమానకట్టయైన గాని నిల్వదు.

మెఱపు తీవ కౌగిటఁ బడి మేఘ మపుడె
కరఁగక యొకింత సేపు నాగఁ గలదేమొ ?
కాని ప్రియ కాంత కౌగిలి ననుకొన గనె
కరఁగి లేనిది యగు నేమి విరహి మనము.

వైశా :- ఈ మహా వీరుఁడు ననుగురించి యేమో యాలోచించునటులు దోచును. ఈ మహా భాగుఁ డెవరో ?

అవీ :- ఒక వంక దృఢకేశి మరణము విజయానందము నుప్పొంగఁ జేయు చున్నను దక్కిన రాజుల గెల్వక పోయితినే యను విచార మింకను మనసును బీడించుచు వెనుక కిగ్గుచున్నది. మఱియొక ప్రక్క నా యవ్యాజానురాగము నదీ ప్రవాహమువలె ముందున కీడ్చుకొని పోవుచున్నది. ఈ సందిగ్ధావస్థ నతిక్రమించు టెట్లు ?

(స్వ) ఐన నీమె నించుక పరీక్షించి నా నిజస్థితి దెల్పెదఁ గాక ! ఒక వస్తువును పరిగ్రహించుటకు ముందు పరీక్ష యవసరము గదా ! అగ్ని తప్తమగు బంగారమైనను నికషోపలముపై ననుమానముతో నరుగఁ దీసి చూచుట లోకరూఢి. (ప్రకాశముగా) మానినీ రత్నమా ! నీకా పిరికి పందయగు నవీక్షితునిపై బుద్ధి వాడమెనా ? యీ తపమ్మంతయు నతని కొఱకేనా ? 'కొండను ద్రవ్వి, ఎలుకను బట్టుట' లెచ్చటను జూడము.

వై శా :- అతఁడు విశ్వ వీరుఁడు గాని పిరికి పంద కాఁడు. మోసమైనర్వ బోనులోఁ బడిన మృగేంద్రము మేఁక యగునా? అతనినే గోరుటలు. 'కొండనుద్రవ్వి యెలుకనుబట్టుటలు' గాదు. శిరోజమును గట్టి, గిరిని లాగఁ జూచుటలగును. మోసముతో శత్రురాజు లొందిన విజయము విజయమా? మోసము తానెన్నటికిని వీరత్వ మని పించు కొనదు.

అవీ :- సకల రాజన్య మండలిచే స్వల్ప కీటకముగా గుర్తింపఁబడిన దీను నిట్లు పొగడనేల?

వై శా :- కట్టుబడిన నాగేంద్రము చుట్టును మూషక సమూహములు గంతులు వేయుట గణన లోని దగునా?

అవీ :-అతడు తానా దృఢకేశిని వధించనిది పెండ్లియాడ ననియును సింహాస నము స్వీకరింపఁ జాలననియుఁ బ్రతిన పూనెను గదా! అట్టి యనర్హుని పైన మన సెట్టులు పడినది?

వై శా :- నీవెట్టి వీరుఁడవైనను, యెంతటి యుపకారి వైనను నాపతి నింద సహింపఁ జాలను. ఈ దృఢకేశి నతఁడు వధించి, నన్ను బెండ్లియాడుటకే నేనింతటి ఘోర తపమ్మాచరించితినే. నేను నిక్కమైన పతివ్రతను గానన్న వీ రక్కసి నుక్కడించిన వాఁడతఁడు, గాకున్న నా తపమ్ము వమ్మైయైన ద్రికరణ శుద్ధిగా నేడు నా శాపమున నీ బ్రహ్మాండము బ్రద్దలై ప్రళయము సంభవించును గాక! ( అంత నశరీరవాణి పల్కెను ) పతి వ్రతా శిరోమణీ! ఓ వై శాలినీ? ఈ దృఢకేశిని జంపిన వాడే యవీక్షితుఁడు. వేరెవ్వరు గారు. ఓ యవీక్షిన్మహా రాజా! నీవు విశ్వ వీరుఁడవు.

నేను సర్వత్ర సంచరించు మరుత్తును. నా వాక్కుల విశ్వసింపుము. నీచే చంపఁబడిన ఈ దృఢకేశి నాడు నీ బంధనా నంతరము నీ తండ్రికి భయపడి తక్కిన రాజులందఱును శరణు వేడుట వలన వారందఱి నిర్జించి చెఱ పెట్టెను. వారందఱి విముక్తి యిపుడు నీ దయా ధర్మములపై నాధార పడియున్నది. ఇది కారణముగా నీవు వారందఱిని గెలిచితి వనుట రాజ ధర్మ సమ్మతము. నీవు నాగుల శాపవశమున దృఢకేశితో బంధింపఁ



వై శా లి ని

బడితివి. అటుగా కున్న నిన్ను త్రిభువనముల నెవ్వరును గెలువ లేరనుట సత్యము. నేడు నీవు "జగదేక వీరుఁడవు విశ్వ విజయివి" నీకు నాప్రసాదము వలన కీర్తిశాలియగు కొమరుఁడుదయించును. ప్రజా శ్రేయమొన గూర్చును.

వైశా :-(దుఃఖ రుద్ధ స్వరముతో విభ్రాంత యగుచు) (స్వ) ఆఁ! నేనిపుడేమి వినుచుంటిని? ఏమి నాభాగ్య పరిపాకము! ఈ మహా భాగుఁడే యవీక్షితుఁడను నాయనుమానము వృథ కాలేదు. (ప్రకా) నాథా! యని పాదములఁ బడును.

అవీ :- వైశాలినీ! వీఁడు వంచకుఁడైన యవీక్షితుఁడు క్షమించుము. (అని పదములఁ బడియున్న వైశాలినిని లేపి కౌగిటఁ జేర్చును)

వైశా :- (అవీక్షితుని మూపున శిరమిడి బాష్పముల విడుచుచు) ఆర్యా! ఇన్నాళ్ళకీ దైవోపహత యగు వైశాలినిపైఁ గరుణ గల్గెనా? నేను ధన్యురాల నైతిని.

అవీ :- (వైశాలిని కన్నీరు దుడుచుచు) ప్రియా! ఈ యశ్రువు లేమి! దుఃఖించు చుంటివా?

వైశా :-లేదు. ఇంకను దుఃఖ మెచ్చట? (అని కన్నీరు గార్చుచునే దరస్మిత మొనర్చును)

అవీ :- లేకున్న నీ వేడి కన్నీరేల విడుచు చుంటివి?

వైశా :-శివంకరులగు మిమ్ముఁ గాంచిన నాప్రేమ కన్నీరై గంగవలె పొంగి పొరలుచు మిమ్మభిషేకించు చున్నది.

అవీ :- నీ, వనినట్లు ఇది కన్నీరు కాదు. గంగయుఁ గాదు.

ఎనయఁగ నశ్రువారికెటు లింతటి యుష్ణతలబ్బుఁ గాదు కా
దనయము శ్వాస కోశములె యాతత వీజన పంక్తులై ప్రదీ
పనమొనరింప నీ విరహ వహ్నిని నీ హృదయంపు పాత్ర నా
ప్రణయ సుధారసమ్మదికి పైపయి పొంగి యిటొల్కెఁ బ్రేయసీ!

నీ ప్రణయ సుధారసధార నేడొకింత
నా పిపాసఁ దీర్చుట మేన నాటి నుండి
సమసి పడిన యానందాంకురము లిగిర్చి
మరల మొలచె నాఁ బులకలు వొరయు ముదిత.

ప్రేయసీ! నా ప్రేమ దేవత నీ రూపమున సాక్షాత్కరించినదా? నీవా నాగలోకమున నుంటివని పూజ్యపాదులు కణ్వ పుత్రులు నుడువ వింటిని. నీ విచటి కెట్లు రాఁగల్గితివి?

వై శా :- ఆర్య పుత్రా! మీరనినది సత్యమే. ఆ నాగ కన్యలు నే నరిగినంతనే యఖండ తపస్సుచేఁ గృశించిన నా మేను గాంచి దేవర సేవకిది చాలదని నా యథా పూర్వ శరీర దార్ఢ్యము నొకింతఁ బ్రసాదించి నేడే యిచటికి బంపించిరి. ఇపుడీ యశరీర వాణినుడివిన విధముగా మీకు నాగుల శాపము సంఘటించెను. మీరొకనాడు గురు పూజార్థము పూలఁ గోరి యొక వన తరు శాఖపై లతలవలె నలమికొని యున్న ఫణిద్వయ శీర్షములందలరు మణులఁ బూవులనుకొని భ్రమించి బాణ ప్రయోగ మొనర్చితిరఁట. ఆ ఫణులు తమ సంగమునకు భంగమగుటచే నాగ పాశబద్ధుఁడవు గమ్మని మీ వంశముపై పగబూని ధ్వంసము చేతుమని శాపమును మీకొసంగిరి. సారథి వలన మీ చర్య యజ్ఞాతమని తెలిసికొనిరేమో? యా నాగులు మన కానున్న పుత్రునితో తమజాతి ప్రళయము సంభవించు టెరింగి తన్నివారణో పాయమునకు నావలన నభయము గొని, మీశాప విమోచన మయ్యెనని తెలిపి నన్నంపిరి.

అవీ :-(ఆశ్చర్యముతో) మరి సారథి నాకా శాప విషయమేల దెలుపఁడయ్యె?

వై శా :-'మా శాప విషయము దెలిపినవాఁడు శిరస్సు పగిలి మృత్యు ముఖమున బడు'నని యా నాగులు వచించుటచే నతఁడు తెల్పఁ జాలఁ డయ్యెను.

అవీ :- దేవీ! నాకా శాప విషయ మింత వరకును దెలియదు. ఇంతటి శాపమునైనను నీవు ఘోర తపమ్మొనర్చి నాగుల కభయమిడి విముక్త మొనర్చి యీ విజయమునకు కారణమైతివి. నాకై యింతగాఁ బరితపించి కృశించి తపస్సిద్ధి వడసిన సహజ సుందర కోమల గాత్రమిది.

పొలతిరా! నీవు నా కోంఅకపూర్వ తపమ్ములచేc గృశించి నీ
వలచిన కార్యమిట్లు ఫలవంత మొనర్చి సుఖించెదే సుఖ
మ్ములకిరవౌను కష్టచయమున్మను రూపుగc గొంచు నేదియున్
దలcప సుమమ్ము లెండc గృశతం గొననే ఫలరూప మౌనటుల్.

నీ కార్య సాధనలోని పట్టుదల యత్యంతము ప్రశంసనీయము. నీ జన్మ ధన్యము.

వైశా :-ఆర్య పుత్రా! మీరును నాకై యిపుడెంత శ్రమపడితిరో వచించుటకు వాక్కులు చాలవు. త్రిలోక కంటకుcడగు నీ ఘోర రాక్షసుని వధించిన మీరు త్రిలోక వంద్యులు. దీనికై సకల ప్రజానీకముతోc బాటు నేనును మీకు సర్వదా ఋణ పడియుందును. మీ బలపరాక్రమాతిశయము మీ వచస్సరణి గాంచ నాకును మీరే యను ననుమానమొదవినది. కాని మీ ముఖముపై పెరిగి యున్న వ్యంజనాదికములు మిమ్ము గుర్తించుట కవరోధ జనకము లయ్యెను.

అపీ :-ఔను! సఖీ! నేను కిమిచ్ఛక వ్రత దాన దీక్షా పాణినై కొన్ని నియమములc బాలించ వలసి యిట్లుంటిని.

వైశా :- ఏమా వ్రతము? దానినేల యాచరింప వలసి వచ్చెను?

అపీ :-ప్రియురాలా! నా మాతృ దేవత దానిc దలపెట్టినది. అందు ద్విజుల వాంఛితార్థములc దీర్ప నన్ను నియమించెను. నేనది శిరసా వహించితిని. దానికై నేనీ వ్యంజనాదికము దీక్షగాc బెంచ వలసి వచ్చినది.

వైశా :-వీర శిరోమణీ! మీ దాన శీలమును వీనుల విందుగా వినcగోరెదను.

అపీ :- ప్రియా! ఏమని తెల్పుదును? ఈ దీక్షగొని నంతనే యస్మజ్జనకు లరుదెంచి నేను నొక ద్విజుcడనే నాకొక పౌత్ర దాన మొసంగు మనిరి.

వైశా :- అపుడేమొనర్చితిరి? వినc గుతూహల మొదవు చున్నది.

అపీ :- అంత నదే సమయమునకు గురు దేవులగు కణ్వపుత్రు లరుదెంచి మీ జనకుని వాంఛితము పూర్తియగుటకు నీవు నా యాశ్రమ పరిసరారణ్యములc దిరుగాడుచున్న దృఢకేశిని వధించుటకు రావలసినదని యాదేశించిరి.

వై శా :- శ్రీ గురువుల యాజ్ఞా ఫలితమే యీ శుభాగమన మను కొందును.

అవీ :- సఖీ ! నేనును బ్రజలీ రాక్షసునిచే వాని యను యాయులచేఁ బడు హృదయ విదారకములగు కష్ట పరంపరలఁ గాంచి నా గురువులతో నీ రాక్షసుని చంపి ప్రజాకల్యాణముఁ జేకూర్చి కాని కల్యాణ మొనర్చి కొనననని ప్రతిజ్ఞ యొనర్చితిని. అదియే నా గురు దక్షిణ యని గురువులను సెలవిచ్చిరి.

వై శా :- అది యట్లే జరిగినది. ఒక వంక ప్రజా సంక్షేమము, మరియొక వంక గురు దక్షిణా సమర్పణము. ఇంకొక వైపు మన యుభయుల కల్యాణ కారక మైనదీ దృఢకేశి వధము.

అవీ :- ఇంకొకటి మిగిలి యున్నది.

వై శా :- అదేది ?

అవీ :- పూజ్య పాదులగు జనకులకు పౌత్ర దానము. అది (అర్ధోక్తి)

వై శా :- (లజ్జచే దరస్మితయై చంచలాపాంగములఁ దల వ్రాల్చును.)

అవీ :- ప్రియా ! ఆ కోలాహలములు నా సైన్యములవి. ముందు మన మచటి కరిగి రేపు కర్మ సాక్షి సాక్షిగ వివాహ మొనర్చి కొందము.

(ఇరువురును నిష్క్రమింతురు)

స ప్త మాం క ము



# అష్టమాంకము

(సమయము ఉదయము)

[ప్రదేశము–గంగాతటము-ప్రవేశము. వైశాలిని]

వైశా :- (స్వ) గాంధర్వ విధితో నాప్రియుని గళ సీమ సుమహార మలంక రించి యుద్వాహ మొనర్చు కొననున్న సుసమయమిది. దీనికై తప మొనర్చితిని. ఆ పరమేశ్వరుని యపార కృపా మహిమ చేనది సిద్ధించినది. నా పితరులిది దర్శించి యానంద పారవశ్యము నొందగా నిది జరుగవలెనని యాత్మ భావించెను. కాని యది యసంభవమైనది. ఏది యెట్లున్న నింక "శుభస్య శీఘ్ర" మని యిది జరిగి తీరవలయును.

(అంత నవీక్షితుఁడు ప్రవేశించును)

అవీ :- ( సానురాగము ) సఖీ ! నీ యభిప్రాయమేమి ? మన వివాహము గాంధర్వ విధి నిర్వహింపఁ బడుటుచితమని భావింతువా ?

వైశా :- ధన్యాస్మి ! మీయాజ్ఞ శిరోధార్యమని సంతసించు చున్నాను. నా కోర్కి నొకటి మన్నింపవలెనని యభ్యర్థించు చున్నాను.

అవీ :- నీయభీష్ట మేదో నిరభ్యంతరముగ నెరింగింపుము.

వైశా :- (లజ్జానురాగ చలదపాంగ వీక్షణములతో సుస్మితయై యటనున్న పూలమాల గొని)

వికసిత మనోజ్ఞ వాసనా విలసితమ్ము
అమల మధు మత్త సుమనస్సమంచి తమ్ము
రాగసూత్ర సంబంధ విరాజితమ్ము
దండయిది నీ గళమ్మున దార్తు సఖుఁడ !

అవీ :- ఈ దండ గొని యీామె లతవలెనే ప్రకాశించు చున్నది.

మరుని భాగ్యలతయె మానిని మై దీవ
యగుచు రాగ దృష్టులై చిగిర్చి

నగవు లగుచుఁ బూచి నవ వాసనలఁ జిమ్మి
కనక కుచ యుగమ్ముగా ఫలించు.

వై శా :- ఈ పూలమాలను గాంచ మీరు నాపై వ్రాసిన పద్యమాలను స్మృతికిఁ దార్చు చున్నది.

సుకవి ప్రతిభలఁ బ్రకటించి సుకృతి తాను
నతని విబుధులు కీర్తించు నటు లొనర్చు

అవీ :- ఔను సఖీ !

పూల తావుల విర జిమ్మి గాలి తాను
వాని సరసులు తలఁ దాల్చగా నొనర్చు.

వై శా :- బాగు బాగు ! నాదండ మీకు నచ్చుట నాపుణ్య పుంజములేకీభవించి ఫలించిన వని భావింతును. (ధ్వని వినుట నభినయించి) ఆర్య పుత్రా ! ఇదియేమి? మిన్నులు విరిగి మీదఁ బడినటు లేదో యొక భయంకర ధ్వని వినవచ్చుచున్నది. అదియు నా రాక్షసాధముని కపట కృత్యము కాదుగదా?

అవీ :- బేలా ! ఇంకెక్కడి రాక్షసుని కపట కృత్యములు ? ఇప్పటికిని నీకా భీతి వదలనట్లున్నది. వాఁడు సంపూర్ణముగా మృతిఁ జెందెను.

వై శా :- వాఁడు గాకున్నను వాని వారెవరైనను వంచనా కృత్యములకుఁ దల పడి వచ్చు చుండిరో ? రక్కసుల విశ్వ సింపరాదందురు ? మరి గగన తలము నుండి బరతెంచు నీ భయంకర ధ్వని యది యేమై యుండును ?

అవీ :- అటులైన నేను సరిగాఁ జూచి వచ్చెద నుండుము (కొంతముందరిగి) (కాంచి తిరిగి వైశాలిని సమీపించి) సఖీ! ఏ రక్కసియులేఁడు. అదో! ఆ విమాన రాజముదే యా ధ్వని.

గగన మొక మహా జలధియై కాన బడఁ గ
నలల భాతి నిట్టటులాడు జలద పంక్తి
తెల్ల మబ్బులు నురువులై తేలియాడ
మీన మన జను నందు విమాన మతివ.

వై శా :- (కాంచి) ఆహా ! ఎంత తీవ్రగతి నరుదెంచు చున్నది. అది యీ భామ బింబము వైపు పయనించు చుండె నేటికి ?

అవీ :- ఇరుల తీవల రిక్కల విరుల మరఁగి
దినమునన్ వాని గానక తిరుగు మధుప
మర్కు నరుణో దయ నదీగతాబ్జ మనుచు
బరచునన విమానమ్మిటు లరుగు దెంచు.

వైశా :- (ప్రక్క తెరఁ గాంచి) ఇది మనవైపే వచ్చు చున్నది. దానిలో నున్న వారెవరై యుందురు ?

అవీ :- ఎవరైన నేమి ? నీ వేమాత్రము భయమొంద వలసిన పనిలేదు. అదో! ఆ విమాన రాజ మీ సమీపముననే నేలపై దిగుచున్నది. అందున్న వారెవరో క్షణములోఁ దెలియఁ గలదు. (అంత విమాన రాజము భూమి పై దిగి సునయ తుంబురులు నంశుమతీ, విశాలుర ప్రవేశింతురు)

వైశా :- (ఆనందాతి శయముతో) అదో ! ఆ వెనుక వచ్చు వారు నా జననీ జనకులవలె గాన వచ్చు చున్నారు. (కొంత సేపాగి) వారే మమ్మాటికి వారే. ప్రభూ నీ కారుణ్య మతి వేలము. ఆశ్చర్య జనకము. (వైశాలిని వారి కెదురేఁగును) (తల్లి దండ్రులకు నమస్కరించును. తల్లి బిడ్ద నాశ్లేషించును ఇరువురు దుఃఖింతురు)

అంశు :-బిడ్డా! (అవి గద్గద స్వరముతో) నీవు నాకనుల కగపడెదవని కలనైన భావించలేదు.

విశా :- (కూతురును దరికిఁ దీసి) (అశ్రు నేత్రుఁడై) తల్లీ ! కుశలముగా నుంటివా ? మా పూర్వ పుణ్యము వలన నిను గాంచఁ గల్గితిమి. మమ్ము మరచియే పోయితివా ?

అంశు :-ప్రాణముతోడ నుంటివను వార్త చెవింబడ నేడ నా బహిః
ప్రాణ మటంచు నిన్గనమిఁ బ్రాణము లెచ్చట నిల్వ వయ్యెని
న్గానగ నప్రయత్నముగఁ గౌగిలి సాచెడిఁ గేలు దోయి నా
కూనరొ నిన్ను గంటినను కొందును రెండవ గర్భమందిటన్.

విశా :- (బిడ్డను దరిదీసి) చిట్టి తల్లీ ! బ్రహ్మతో బ్రహ్మండ మని నటులు నిన్ను బూపెట్టుకొని ప్రాణముల నిల్పుకొను మేమేమి కావలెనని మము వీడి యీ యడవులకు వెడలి రాగలిగితివి ?

అంశు :- ఈ వనినిల్లు చేసికొన నిష్టము గల్గెనె యిన్ని నాళు లీ
తావుల మమ్ము మించు తలిదండ్రులు నీకు లభించిరే మొ ని
న్నావులఁ బెట్టి సాదుకొనఁ బుత్తడి బొమ్మరో! యెంత చేసినన్
నీవలెఁ గన్న బిడ్డ యెటనేని లభించునె మాకు నిమ్మహిన్?
ఆడపిల్లలకు అత్తింటిపై మమతయే కాని తల్లింటి మమత తక్కువే నమ్మా!

(అని కన్నీరు నద్దుకొనును వైశాలినియు నేడ్చును)

తుం :-(స్వ) ఔరా! వీరి మమతా పూర్ణ హృదయములనేమనవలెను. కరఁగి కన్నీరై ప్రవహించు చున్నవి. ఇన్నాళ్లీ వైశాలిని తలిదండ్రుల విడిచి యెట్లుండఁ గల్గెను? అందులకే "రాయివంటి బిడ్డ" లక్కవంటి తల్లి యని రేమో?

సున :- విశాల నృపాలా! జరిగిన దానికిఁ జింతింప వలసిన పనిలేదు. ఇది యంతయు మన మంచికే జరిగినది. ఇచటి నుండి శుభ దినములు మొదలయ్యె ననుకొన వలయును.

వసుధ సుఖదుఃఖములు నహర్నిశల వోలె
వరుస నొకటి వెన్క నొకండు వచ్చు చుండు
శిశిరమందు నాకుల పాటు చెందు వనులు
మధుర హాసాలఁ బ్రసవించు మాధవుఁ గని.

ముందటి కర్తవ్యము నాలోచింపఁ దగియుండును.

అంశు :- ( బిడ్డ చెక్కిలి నిమురుచు ) ఇవి యన్నియు మేము నీ వియోగా వేళమున ననుచుంటిమే కాని నిజమారయ నీ కార్యసాధనలోని సాహసము పట్టుదలయు మిక్కిలి ప్రశంస నీయములు. నీ ప్రియుఁడు నిన్నంగీ కరించు దృశ్యము విమానముపై నుండి కాంచియే సంతృప్తి నొందితిమి. ప్రజా కల్యాణ మొనర్చిన నీ కల్యాణము, నీ పవిత్ర చరిత్ర మెల్ల సాధ్వుల కాదర్శ ప్రాయము. అది యాబాల గోపాలము కీర్తింపఁ జిరకాల మలరారును.



అ

విశా :-నిను గాంచిన దాది యానంద సాగరమున మునింగిన మాకీ ప్రపంచమే కాన రాకున్నది. నీకష్ట పరిస్థితులన్నియు నిదివరకే నీ గంధర్వ రాజగు సునయునితో విని యున్నాము. ఇతఁడు తానత్యంత దుఃఖితులమగు మాయొద్ద కరుదెంచి మీకు మీ కూతును జూపింతునని యభయమొసంగి యీ విమాన రాజముపైఁ గొని తెచ్చినాఁడు. మరుత్తు చెప్పఁగా విని యీ తుంబురుఁడు సునయునకీ వార్త నెరింగించి నిను గూర్పఁ దోడ్పడినాఁడు. ఈ సునయ తుంబురులకు నట్లే మరుత్తునకును మేమెంతయు ఋణ పడి యున్నాము. వారికివే మా కృతజ్ఞతా పూర్వక ప్రణామాంజలులు.

సున :- విశాల నృపాలా! ఈమె నీ కూతురే యను కొనకుము. వెనుక జన్మలో నాకును కూతురై యుండెను. ఆ సమయమున నొక నా దగస్త్య ముని యరుదెంచెను. అతని గని ఈమె సఖి మోహిని సముద్ర జల ములతో జల చరముల నన్నిటి నారగించితిరే యని పరిహసించి నవ్వెను. ఆమెతో పాటు నీమెయు నవ్వెను. అపుడు తా నగస్త్యుఁడలిగి యీమె సఖిని గని "నీవు నీచయోని యందుద్భవించి నిశాచరునితో నశింతువు" అని శపించెను. అట్లే యీమెను గనియు "నీవును మానవ జన్మమెత్తి వివాహమే కాక నీ వలచిన పతి విరహముతో బాధ ననుభవించెదవు" అని శపించెను. అపుడు మేమా ముని ననేక విధములఁ బ్రార్థించి యప రాధము క్షమించి యీమెను కరుణించ వలెనని మనవి యొనర్చితిమి. అతఁడు ప్రసన్నుఁడై "తిరిగి యీమె యా సముద్ర గర్భమగు పాతాళ మును దర్శించిననే శాప విముక్తి నంది పతి ప్రేమకు పాత్రయై సుఖించు" నని చెప్పి వెడలి పోయెను. ఈమెకును నీమె సఖి యగు మోహినికిని ముని సూక్తి ప్రకారమే శాప విముక్తత ఘటించి కృత కృత్యత లభించెను. నేను నెంతో కాలము నుండి బాధించు పుత్రికా మమత నాపుకొన జాలక మరుత్ప్రేరితుఁడగు నీ తుంబురునిచే సకల మెరిఁగి యిందు వచ్చితిని. ఇపుడీ మెను దర్శించి మీతో పాటు సంతోష సముద్రమున దేలియాడు చుంటిని.

విశా :-గంధర్వ రాజా! అట్టి మీ బిడ్డ మాకును బిడ్డ యగుటచే మా వంశమే పవిత్ర మయ్యెనని భావించి గర్వించు చున్నాము.

సున :-విశాల నృపాలా! నీ సౌహృదమునకును నీ యాదరాభి మానములకును నే నెంతయు సంతసించు చున్నాను. ముందీ బిడ్డ తన నాథుని గళ సీమ నా పూల హారము నలంకరించి పాణి గ్రహణ మొనర్చును. అది గాంచి మన మందరము సంత సించు తరుణ మాసన్న మైనది. (అని పూల దండ నొసంగును) బిడ్డా! యిది దేవ లోకపు పారిజాత ప్రసూన హారము. నీ హారముతో పాటు దీని జతపరచి నీ పతి కంఠ సీమ నలంకరించుము. (అంత వైశాలిని అవీక్షితుని గళ సీమఁ బూల మాల లిడును)

సున :- అవీక్షిత్కుమారా! ఇది మా దేవ లోకము నందలి మందార మాల దీని నీ యింతి కంఠ సీమ నలంకరింప జేయుము. ఇదియు వాడ కుండ చిరకాల ముండును. (అని యిచ్చును. అవీక్షితుఁడట్లే యొనర్చును) (నవ దంపతులిరువురు నచ్చటిపెద్దలకు నమస్కరించి యాశీస్సుల గొందురు) (అందరును సంత సింతురు. తుంబురుఁడును వారి పాణియుగ్మమును గలిపి వేదోక్త మంత్ర పూర్వకముగా వివాహ విధి నెరపుదు నను)

తుం :- (నమస్కరించు వైశాలినిం గని) బిడ్డా! ఆ మరుత్తు వరదానమున మహా ప్రతాప శాలిని, దాన శీలిని, నంశు మాలిని వంటి కుమారుని గాంచి యుభయ కులముల నుద్ధరింపుము. (అని దీవించును)

సున :- విశాల నరపాలా! నాకింతటితో నింకను సంతృప్తి కాలేదు. ఈ బిడ్డను మా గంధర్వ లోకమున మీతోఁ బాటు కొన్ని నాళ్లుంచుకొని పుత్రవతియైన పిదప నత్తగారింటికిఁ బంప నెంచితిని. దీనికి మీరామోదించ వలెనని ప్రార్థించు చున్నాను.

విశా :-నాహృదయము సమ్మతించినది. అట్లే యవీక్షిత్కుమారుఁడును నిందుల కామోదించునని విశ్వసించు చున్నాను.

అవీ :-పితృ సమానులగు మీరిడు నీ యాదేశమును దల ధరింతును. గంధర్వ రాజా! మన మందర మిపుడు మా రాజధానికి జని యీ శుభ విషయ

మంతయు నాజననీ జనకుల కెఱింగించి వారి యనుమతి గొని గంధర్వ లోక మరుగవలెనని మనవి.

సున :-అటులే యొనర్తము. అది మరింత యానంద కరమగు చర్య. మన మందరము నతితర్వగా విమానరాజ మధిరోహించుటకై యరుగ వలెను. నడువుడు. (అని యందరు నిష్క్రమింతురు. తెర వ్రాలును)

[తెర యెత్తిన విమాన మాకాశమున జను చుండును)

(అందు సునయాదులు)

సున :-అపీక్షిత్కుమారా! విమానము పై నుండి గాంచిన మీ భు లోని వస్తువు లెట్లు కనఁబడు చున్నవి ?

అపీ :- పై కెగసి చూడ భూమిపైఁ బట్టణములు
బొమ్మ రిండ్లుగా నగములిభమ్ము లటులు
ఆరవేయు చీరల వోలె నా పగలును
నంబుధులు సరోవరములై యగపడియెను.

అంతియె కాక యీ విమాన మాకసమున నాడు నొక సుందర విహంగమై యగపడు చున్నది.

సున :- దేదీప్యమానమౌ త్రిదివమ్ము శిరముగా
శశిసూర్యు లిరువురు చక్షువులుగ
మేరు శృంగాగ్రమ్ము చారు చంచువు గాఁగ
జలధులు కదలు పుచ్ఛములు గాఁగ
నీల నీరద పాళి ఁదేలు పక్షములుగాఁ
బర్వతాగ్రమ్ములు పాదములుగ
అమలాంతరిక్షమ్ము నాత్మోదరమ్ముగా
నక్షత్ర కోటి యండములు గాఁగ
విశ్వమే యొక విహగమై విమల రీతి
గానిపించును మా వ్యోమ యానగతుల

రెక్కలం దాఁగు నొక పిల్ల పక్కి వోలె
మబ్బులందాడుచున్ మా విమాన మొప్పు.

విశాల మహారాజా! మా విమాన ప్రయాణమున మీకేమైన నలసట గల్గు చుండెనా?

విశా :- లేదు. పైనుండి ప్రయాణ మొక వినూత్నానందదాయకమై యొప్పు చున్నది. మబ్బులను దూసుకొని చను చున్నపుడీ శీతల వాతావరణ మపూర్వమగు హాయిని గొల్పు చున్నది.

ఒత్తనల్లు రథాన నుపధానములు పూన
నెత్తువంపు పథమ్ము లేడి పించు
ఆందోళికా యాన మది వాహక భుజాన
నటిటు నూగి కుదింపు లందఁ జేయు
అశ్వ మత్తేభ వాహన యానములును మై
నదలించి యలసటం గదురఁ జేయు
అబ్ధి నేఁగెడి యోడ నలలపైఁ దూగాడ
నుంతైన బడలిక నూపునేమొ
అన్ని వాహనమ్ముల కన్న నధిక వేగ
గతులఁ జను నీ విమానమ్ము కదల కుండ
నింట నున్నట్టు లుంచియు మింటఁ గొంచుఁ
బోవు వాడనిపూవుల వోలె మనను.

తుం :- మీ పుణ్యము లగణ్యములు. మీరు సశరీరులై స్వర్గ సందర్శన మొనర్చు చున్నారు.

అవీ :- ఇది మీ యవ్యాజ కరుణా పరిణామము దక్క యన్యము గాదు.

సున :- రాకుమారా! అల్లదో! ఆ సువర్ణ గోపుర ప్రాకారములఁ బ్రవాళ కృత ద్వారముల, నిరుపమస్ఫటిక వినిర్మిత భవనముల, నా సుందర నందన ప్రమదా వనముల నింద్ర నీల మణి తోరణముల నైరావతాది మత్త వారణముల, నదో! ఆ చుక్కల నెక్క సక్కెము లాడు పట్టు

పెక్కుముల శోభాయమానమై యొప్పారు వైకుంఠప్రతి యీ యమరావతి. ఈ దేవ పురిని గన్నుల కరవార దర్శించి హర్షింపుము.

అవీ :- ఔరా ! ఏమి యీ పట్టణ సోయగము. గంధర్వ రాజా ! ఈ రాజ్యమున బరిశీలింప నొక బిచ్చగాఁడైనను మచ్చునకుఁ గానరాఁడు. పేరునకైన బూరి గుడిసె లేదు.

సున :- అవీక్షిత్కుమారా ! ఇచట ధనిక దరిద్ర భేదములు లేవు. ప్రతి పౌరుఁడు విద్యావంతుఁడే; ధన వంతుఁడే, శక్తివంతుఁడే; స్వతంత్రుఁడే! ఎవరికిని నన్న వస్త్రముల కొదువ లేనే లేదు.

అవీ :-ప్రజలందరును స్వతంత్రులై సమాన సంపదలఁ దులదూఁగుచు శాంతి సౌఖ్యములఁ దేలుచున్న ప్రతి దేశము స్వర్గమే కదా ! స్వర్గ సౌఖ్య మన నిదియే నేమో ?

సున :- నీ వాక్యములు యథార్థములు. సంక్షేమ రాజ్యమేదియైనను స్వర్గమే !

అవీ :-ఇంక నిచటి విశేషముల వినవలతును. దయతో నెరింగింప వేడుదును.

సున :-ఇచట సకల ప్రజలకు సాంఘిక మర్యాదలు సమానముగా లభించును. ప్రజలెల్లరును దేవ జాతి వారే. జాతి భేదములు మచ్చునకైన గానరావు. అటులే యిచట సకల విధ దైవోపాసనల నొకే మర్యాదతోఁ జూతురు. వీరందరిది యొకే దేవ భాష. వీరిలో వీరికే విషయముల యందును పరస్పర వైషమ్యులు లేవు. అందరు నందరి మేలుకై కలిసి కట్టుగాఁ బాటు పడెదరు. ఒకే తల్లి బిడ్డలవలె సకల ప్రజలును ప్రేమ గలిగి మెలఁగెదరు.

అవీ :- ఇది యంతయుఁ గాంచిన నీ యేలిక ప్రజా సంక్షేమమును రేయిం బవలు వేయి కన్నులు వెట్టుకొని కాపాడు చున్నాఁడనిపించు చున్నది. ఇతని మంత్రాంగము మిక్కిలి సమర్థ వంతమైనదిగాఁ గని పించును.

సున :- రాకుమారా ! నిజముగా నితఁడు సహస్రాక్షుఁడే. ఇతఁడు సకల లోకములకు ప్రాణ ప్రదులైన వాయ్వగ్ని వరుణాదులఁ దన మంత్రాంగమున నియమించినాఁడు. అతనికి రేలు నిదురయే యుండదు.

అవీ :- గంధర్వ రాజా ! ఈ భూములు సస్య శ్యామలములై కను విందొనర్చుచున్నవి.

సున :- ఇచట మేఘములు ప్రభుత్వా ధీనములై యవసర వేళల వృష్టి గురియును. ప్రతి సస్యమొక కల్పవృక్షము. ప్రతి గోవొక కామధేనువు. ఇంక పాడి పంటల కొదువ యేముండును. ఈ భువనమే యొక నందన వనము. ఇచట దొరుకు నమృతాన్న పానములచే నిచటి వారికి ముదిమి త్వరగా నావరింప కుండుటయు మృత్యువు దూరముగాఁ బారి పోవుటయుఁ గలిగి వీ రజరామరులైనారు.

అవీ :-ఆయురారోగ్య భాగ్యమ్ము లగ్గువైన యీ ప్రదేశ మఖిల భువనముల కాదర్శవంతము. ఎచటఁ జూచిన నానంద తాండవములే. యెచటఁ జూచిన నాటలు పాటలే. అందరును విబుధులే. అందరును గళానిధులే, అందరును కవులే యందరును గురువులే. ఇచట దౌర్జన్య పరులును వంచకులును మాయావులును లేకుండు టెట్లు సంభవించెను ?

సున :-ఇచటఁ గూడ ధర్మాత్ముల కన్న దౌర్జన్య పరులే యిమ్మడిగా నుండిరి. ఆంత రంగిక విప్లవము చెలరేగినది. ప్రజాశక్తి సముద్రమును మథన మొనర్చుటలో ధర్మరూపిణి విజయ మోహిని ప్రత్యక్షమై దేవ గుణుల కమృతము పోసినది. అసురగుణుల నణచి వేసినది.

అవీ :- నాక లోక దర్శనము చేయించి నా కన్నులఁ దెరపించితిరి. నేను మీకుఁ గృతజ్ఞుఁడను. నా భూలోకమును నాక లోక మెట్లు చేయవలెనో నా ప్రజానీకమునజరా మరుల నెట్లొనర్పవలెనో నాకుఁ దెలిసి వచ్చినది.

సున :- అవీక్షిత్కుమారా ! నీ వొక సంవత్సర మిచటనే యుండి అన్ని విధానముల నవగత మొనర్చి కొని భూలోకమును స్వర్గ తుల్య మొనర్చుటకై నిన్నిందుఁ గొని తెచ్చితిని. అదో! అపుడే మన పట్టణము చేరితిమి. అదే మన భవనము. (అని యందురును దిగిపోవుదురు)

## అ ష్ట మాం క ము

# నవమాంకము

[ప్రదేశము కరంధముని యంతిపురము-ప్రవేశము వీరా కరంధములు]

వీర :- మన యవీక్షిత్తు గుర్వాజ్ఞతో నరణ్యములకేఁగి యా రాక్షసుని వధించి వైశాలినిం బాణి గ్రహణ మొనర్చి కొని సునయ ప్రేరణతో గంధర్వ లోకమునకుంజని చాఁ కాలము కావచ్చినది.

కర :-గంధర్వ రాజు తా నొక వత్సర మచట వైశాలినితోఁ బాటు నవీక్షితుని గూడ నుండుటకు నిర్బంధ పరచినాఁడు. ఈ నూత్న దంపతు లచటి వినోద ప్రదేశముల దర్శించుచు సంతోషముతోఁ గాల యాపన మొనర్చు చున్నారు.

వీర :- ఆర్య పుత్రా! పుత్ర దర్శన కుతూహలము నాపఁ జాలకున్నాను. అచటికిఁ జను మార్గమే దైన నున్నచో నాలోచింపఁ గలరని వేడు కొను చున్నాను.

కర :- దేవీ! నీవలెనే నేనును పుత్ర దర్శనోత్కంఠ నాపఁ జాలకున్నాను. ఆ విలోకన భాగ్యము నేడో రేపో సంభవింపఁ గలదని యాసింపవచ్చును. దైవకృప యెటులున్నదో చూడ వలెను.

(అంత రాజ భటుఁడు వచ్చి రాజునకు మ్రొక్కి నిల్చును)

భటు :-దేవా! గంధర్వ లోకము నుండి దేవ ముని తుంబురులరు దెంచినారు.

కర :- వారిని ద్వరగా లోనికిఁ బ్రవేశ పెట్టుము.

భటు :- చిత్తము ( అని తలవంచి వెనుకకు నడచుచు నిష్క్రమించును. తుంబురుఁడు ప్రవేశించును. రాజు లేచి నమస్కరించి యుచితాసనము నొసంగి గౌరవించును )

తుం :- కరంధమ సార్వభౌమా! ఆ యుష్మంతుఁడవు గమ్ము.

కర :-దేవమునీ! గంధర్వ లోక విశేషంబు లెరుఁగ మనము కుతూహలపడు చున్నది. సునయాదులు కుశలముగా నున్నారని భావింతును.

తుం :- రాజరాజా ! అందరును మీ దయవలన కుశలముగా నున్నారు. కానీ మా గంధర్వ లోకమును మీ మానవుఁ డొకఁ డాక్రమించు కొనినాఁడు. వాని నచటి నుండి తొలగించుటకు మా గంధర్వ రాజు మీ సహాయము నర్థించినాఁడు.

కర :-గంధర్వ లోకము నేమి! ఒక మానవుఁ డాక్రమించుట లేమి! అదెట్లు పొసఁగును?

తుం :-ఎక్లేమి ? గంధర్వ రాజ దంపతులఁ గట్టి వైచినాఁడు. వారిల్లు విడిచి యడుగు మాత్రము గదలలేరు. నిరంతరము వారి కదే చింత.

కర :- ఐన నేను తక్షణమే బయలుదేరు చున్నాను. వారి కట్లతోఁ బాటు నిక్కట్లన్నిటిని ద్రెంచి వేయఁగలనను ధైర్యమును గలిగి యున్నాను.

తుం :- మీరిటు లనుచుంటిరి, కాని మీరు వచ్చినను మిమ్ముఁ గూడఁ గట్టి వేయు నేమో యని పించును. మీరు వాని గెల్తురను విశ్వాసము నాకుఁ గల్గుటలేదు.

కర :-అది యసంభవము. నాతనయుఁడగు నవీక్షితుఁడేచాలు వాని నడంచుటకు నా కుమారుఁ డచటనే యుండ నన్ను బిలువ వలసినంత యవసరము రాదే,

తుం :- అయ్యో పాపము ! ధర్మ పత్నితోఁ బాటు నీ కుమార సింహము గూడఁ గట్టుఁ బడెనని తెల్ప మరచితిని.

కర :- ఔరా ! అంతటి బలశాలి మా మానవ లోకమున నెవ్వఁడును లేఁడే ,

తుం :- మీకుఁ దెలియ కుండ నతఁడీ మధ్యనే పుట్టి వచ్చెనేమో ? ముందు ముందతఁడు మీ సామ్రాజ్యమును గూడ నాక్రమించఁ గల సమర్థుఁడే యని యనిపించు చున్నది.

కర :- మమ్ముఁ గట్టి వేయు వాఁడు మా సామ్రాజ్యము నాక్రమించు వాఁడీ మధ్యనే పుట్టి వచ్చెనేమి? అటులైన నతఁ డన్నిట నేనే యన "నాయయ్య" యన వలసినదే ?

తుం :- మీరతని జూడ కున్నను మీ కపుడే యతఁడు తెలిసి నట్లున్నాఁడే ?

కర :- నన్ను గట్టి వేయు వాఁడు నా సామ్రాజ్యము నాక్రమించువాఁడు నా వంశమున గాక యీ మధ్య మరి యెచట పుట్టి వచ్చును ? (నవ్వును)

వీర :- మా వైశాలిని సుఖ ప్రసూతి నొంది పుత్ర రత్నమును గాంచిన విషయము నింత యూరించి తెలియఁ బరచినందులకు మీకు మేమెంతయుఁ గృతజ్ఞులము. చిరకాలమునకు వినఁ దగిన మాట వింటిమి. మా పూర్వ పుణ్యము లనేకము లేకమై యిటు ఫలించిన వనవలెను.

కర :-ఇంతగా నోరూరించి మాకీ శుభ వార్త నెఱింగించిన మీ ఋణ మెటులు దీర్చు కొనఁ గలము. ఏమి ప్రతి ఫల మర్పింపఁ గలము ?

తుం :- మీ యానందమే మాకుఁ బ్రతి ఫలము. అంతకన్న గావలసిన దేముండును.

కర :-దేవమునీ! చిరుతఁడు క్షేమముగా నున్నాఁడా ఎవరినిఁ బోలి యున్నాఁడు?

తుం :- ఆ జగన్మోహన మూర్తి కుశలముగా లేకున్న నింక ముల్లోకముల గతి యేమి కావలెను ? అచ్చము తాతగారి నోటి నుండి యూడిపడినటు లున్నాఁడు. నే వచ్చు నపుడు కనుల చలువగాఁ గాంచి వచ్చితిని.

కర :- ఏమను చున్నాఁడు ? ముచ్చటగా నవ్వు చున్నాఁడా ?

తుం :- కను లల్లార్చుచు నోటినిం దెరచుచున్ గాల్సే తులాడించి కే
లను బాదాంగుళిఁ దీసి నోటనిడు లాలందేము యా పొత్తిలిం
గొని మోమున్వడిఁ గప్పి కొంచునె పెనంగున్ జీదరన్నాగుఁ గ
న్గొని యేరేనియు మందలించగనె 'యుగ్గూఁ' యంచిడున్ ముచ్చటన్.

వీర :- "ఉగ్గూ" యన నోట నింత యమృతము వోయలేక పోయితిరా ? చిరంజీవియగు వాఁడు.

తుం :-స్వామీ ! యతఁడే శతాధిక క్రతువు లొనర్చి మా కన్న మిడఁ గల దాత ! అతనికి మా యమృత మెంత ? అందాల గనియే కాక యదృష్ట జాతకుఁడగు నీ పౌత్రునకు సాటి యా కమల మిత్రుడే. అతని ముందు నితని ముందు మరి యొకఁడు ప్రకాశించఁ జాలడు.

వీర :- మీ వాక్యము లతని మేము ప్రత్యక్షముగాఁ జూచు చున్నట్లున్నది. ఈ లోకములో నున్నట్లుగానే భ్రమింపఁ జేయు చున్నవి.

కర :- నాకు నట్లే యనిపించుచున్నది. దేవర్షీ! శిశువునకు నేమని నామ కరణ మొనర్చిరి?

తుం :- అతని జననకాలమున సకల గ్రహములు ప్రసన్నములై సకల భూతములు ప్రశాంతములై యుండెను. అపుడచటనుండి సమశీతోష్ణ స్పర్శగలిగి యలరి, యా వాయుదేవుఁడు "నీవును నావలెనే సకల ప్రాణి కోటికిఁ బ్రాణమై రక్షింతు"వని "మరుత్తు" అని తన పేరిడియే పిలి చెను. ఇంద్రాద్యష్ట దిక్పాలకులు నదే పేరఁ బిలిచి యాశీర్వదించిరి. బృహస్పతి యతని జాతకమును వ్రాయుచు నిట్టి గొప్ప జాతకుఁడు త్రిలోకములఁ ద్రికాలముల సుదుర్లభుఁడని యాశ్చర్యపడెను.

కరం :- దేవతలందరను "మరుత్త"ని నామకరణమొనర్చిరా? మరుత్తువలె చిరంజీవియై బ్రతుకుఁగాక!

తుం :- మా గంధర్వరాజు మీ పుణ్యదంపతుల నిరువురను "గంధర్వలోక మును పావనమొనర్ప విచ్చేయు"డని అభ్యర్థన మొనర్చినాఁడు. మీకుఁ బౌత్రిదానోత్సవ మచటనే జరిపింప వేడుక పడుచున్నాఁడు. అల్లదో యా విమానరాజము నధిరోహింపుడు.

కర-వీర :- ధన్యులము. (అందరును నిష్క్రమింతురు.)

(తెరయెత్తగ గంధర్వలోకము) [సునయతుంబురులు- వీరాకరంధములు- విశాలాంకుమతులు- వజ్రిదంతసుమాలినులు- వైశాలినీ యవీక్షితులు ప్రవేశింతురు.]

కరం :- దేవీ! యీ స్వర్లోక నివాసు లసమ పుణ్యులు.

ఆకలి లేకయుఁ జా మరణమంతకు లేకయు యౌవనమ్మనుం
బోకయు నిద్రశోకకయుఁ బూర్ణసుఖమ్ములఁ దేలు దేవతా
నీకము ధన్యమెంతయును నిస్తుల కల్పక కామధేనువుల్
నాకనివాసులఁ జా వలచినావన వల్లని భోజనమ్మొకా.

వీర :- నిజము. వీరి పుణ్యము లగణ్యములు.

సున :- కరంధమ సార్వభౌమా! అరిందమ శిరోమణులగు మీ రాకవలన మా యీ గంధర్వలోకము రాకా శశాంక శోభలఁ బ్రికాశించుచున్నది.

వజ్ర :- (అవీక్షితునిఁ గౌగిలించుకొని) మిత్రమా! నీ కంటిచ లువ వలన నేనొక యింటివాఁడనైతిని. నీ యుపకారభారము తలవంచఁజేయుచుండుట నివే నా ప్రణామాంజలులు.

సుమా :- (వైశాలినిని సంశ్లేషించి) నాకు మంగళ మొనగూర్చిన నీ మాంగల్యము చిరకాలము ధరామండలి వర్ధిల్లుగాక!

అవీ :- (కరంధముని దిక్కై కి-) తండ్రీ! ఈ వజ్రదంతుఁడు నాయనుంగు చెలికాఁడు ఇతని వలన నే నెంతయు నుపకారమును బొందితిని.

కం :- నాకుఁ దెలియును. నీవు నాగపాశ వశంగతుఁడవై నపు డితఁడు నా దరి కరుదెంచెను.

సున :- కరంధమ సార్వభౌమా! మీ రాకవలన మా లోకమునకు గౌరవము చేకూరినది. మీకెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇఁక నీ పౌత్రునిగొని చిరకాల వాంఛితము పరిపూర్తిగావించుకొనుడు. మరుదాఖ్యనొప్పు నితఁడు సామాన్యుఁడు కాఁడు.

స్వీయజీవిత మహా క్షీరార్ణవముఁద్రచ్చి
సౌఖ్యామృతము గోరిలు శక్రిఁడితఁడు
నుతగుణ ముక్తామణులు తలంబ్రాలుపోసి
యలఘుకీర్తి సతిఁ బెండ్లాడు నితఁడు
తనదాన ధారల ధనవృష్టినిడియర్థి
వాంఛితార్థములఁ బండించు నితఁడు
అరిచమూపాథోధి నడుగంట మథియించి
విజయలక్ష్మిని గొను విష్ణువితఁడు!
సురలు మఖహవిస్సులు గోరిలి మురియ నగ్ని
నాల్క లూరించఁగల మరున్నాముఁ డితఁడు
వక్రగతి వచ్చు విషయుక్త వైరిఫణుల
మాయ మొనరించఁగల వైనతేయుఁడితఁడు.

కర :- మీ వలననే మాకీ గంధర్వలోక సందర్శనము లభించినది. మేమెంతయు ధన్యులము. మమ్మందర నొకచోఁ గలిపి, మాకుఁ బౌత్త్రిదర్శన మహోత్సవ భాగ్యము గలిగించిన మీకు మేమెంతయు ఋణపడితిమి.

సున :- అవీక్షిదార్త్రిజకుమారా! నీ కుమారుఁడగు మరుత్తును పూజ్యులగు మీ జనకుల కర్పించి కీర్తిని వరింపుము ! మమ్మానందాబ్ధి ముంపుము !

అవీ :- నేనెంతయుఁ గృతకృత్యుఁడను. జనకుని మనోరథము దీర్చు భాగ్యమునకు నోచితిని. (అని పౌత్త్రినొసంగును.)

కర :- వత్సా! అవీక్షిత్కుమారా! నీ వెంతయు ధన్యుఁడవు. (అని పౌత్త్రిని ముద్దిడుకొనును.)

చను బాల్ద్రావిన తావి గుప్పుమన విచ్చన్జిన్ని నోరందుఁ దో
చినలేదంతములొండు రెండు గనరాన్జెక్కిళ్ల సొట్టల్వడం
గ, నగున్, మైమరపించు నిట్టి సుతులంగాంచంగఁ బెంచంగ నో
చనియా మానవజన్మ మన్న నదియున్జన్మంబె తా నెందునుజా.

వీర :- సత్యము. సత్యము. (అని పౌత్త్రుఁగొని చుంబించును)

విశా :- (అంశుమతి దిక్కైకి) [బాష్ప గద్గద కంఠస్వరమున] దేవీ! బిడ్డను శ్వశ్రుగృహమునకుఁ బంపు సమయమాసన్నమైనది. వారి చేతుఁబెట్టిన మన భారము దీరినట్టులగును.

అంశు :- తల్లీ విద్యకై సువ్రతాశ్రమమున తపమునకై యరణ్యముల నుండి యిపుడత్తింట శాశ్వతముగాఁ నుండ జనుచుంటివి. నీ ముద్దు ముచ్చటలనే సరిగాఁజూడ నోచనైతిని. (కన్నీటిని బయ్యెదకొనలతో నద్దుకొనుచు) మహాదేవీ! వీరా! ఇంక మా వైశాలిని మీ సన్నిధినుండ గలదు. అది యేమియుఁ దెలియనిది. దానివలనియపరాధములఁ గడుపు నందిడికొని కన్నకూతురని సాదుకొను వారనిమిమ్ము నమ్మియుంటివి. (అని యామె చేతిలో వైశాలిని చేయనుంచును.)

వైశా :- కన్నీరు గార్చుచు మౌనయై తల నేలవ్రాల్చి నిల్చును.)

అంబ :- పిచ్చి తల్లీ ! ఏల యేడ్చెదవు ! నే నొకటి వీరమాత యొకటీ యా ! కనుట మావంతు. సాకుట వారివంతు.

పుట్టుట కంటెను బూర్వమే యవ్యాజ
ప్రేమ బీజముల హృద్భూమి నాటి
ముద్దు ముచ్చటఁ జేసి మురిపించి మరపించి
మమతా లతకు జీవనము లొసంగి
ఇరువురి రూపమ్ము లేకమై కనఁబడు
నానంద రూపమౌ నాత్మ సుతను
ప్రాణమ్ము టుల్పెంచి ఫలమటుల్ వగ ద్రెంచి
విభునికై నిడి యంపువేళ దరిసె
గుండె కరఁగి తా గొంతుక నిండి వచ్చె
కడుపు చెరువయ్యె దుఃఖము కట్టుతెగెను
చూడలేనని కనుల నశ్రువులు గ్రమ్మె
పలుక లేనని గద్గద భాష లొలసె.

విశా :- దేవీ ! దుఃఖము నడఁచు కొని బిడ్డ నవీక్షితుని కేలనుంచ వలెను. ఇది కన్నవారి కున్న కోఁతయే. దాని దప్పు కొనఁ జాలము

(అని బిడ్డను గని)

శ్రీ రమణి విష్ణునకు వలె
నీ రమణుని హృదయ సీమనివసతిఁ గొనిపె
న్గూరిమి బంధు వ్రతతికి
హారములో దారమగుచు నలరగ దమ్మా !

(బిడ్డను దరి దీసి చుబుక మంటి) ఇంక నీ పయి మాకు స్వాతంత్ర్య మెచట గలదు. దయతో నీ ప్రియుఁడు తెచ్చినిను జూపిన జూతుము.

స్వాభిమాన మెపుడు చచ్చి పోయిన దన
నాడపిల్ల పుట్టినపుడె యంచుఁ
జెప్ప వలయు నొకరి చేత నుంచిన విత్త
మయిన మమత వీడ దాత్మజ పయి.

తనదు వంశమ్ము వెల్గించు తనయుఁ డెందు
ఉభయ గోత్రమ్ములను కూతురుద్ధరించు
ధరణిఁ బురుషున కంటెను దరుణి కెందు
ద్విగుణ భారమ్ము తల నుండి తీరు గాదె.

సున :- విశాల మహారాజా ! కరంధమ సార్వభౌమా ! మీ రగణ్య పుణ్య ధనులు. మీ మనోరథము లీడేరెను. మీజీవితములు కృతకృత్యతఁగాంచెను. అవీక్షిత్కుమారా ! తలిదండ్రుల యాజ్ఞ తలఁ దాల్చి సత్య ధర్మ పరిపాల కుఁడవై శాశ్వత కీర్తి నార్జింపుము. తల్లీ ! వైశాలినీ! తప మొనర్చియుఁ దగిన వరుని బడసిన నీవు ధన్య చరితవు.

వనితా రత్నము లెందు శీలవతులై వైశాలినీ సాధు వ
ర్తన మాదర్శముగా మెలంగెదరు సత్వ ప్రోన్నతిన్ బూరుషుల్
ఘన చారిత్రుఁ దవీక్షితుంబలె నమోఘ క్షాత్ర సంపన్నులై
గణుతిం జెంది చరింత్రు ధర్మ విజయా కాంక్షారతిన్ నిత్యమున్.

తుం :- వైశాలినీ ! యవీక్షిత్కుమారా ! మీ వలెనే.

స్త్రీల శీలమ్ములును బూరుషాలియతుల
పౌరుషములు ధర్మమునకు వజ్ర కవచ
సమములగుచు నే వేళ రక్షణ మొనర్ప
ధరణి శాంతి సౌఖ్యము లెందుఁ దనరు గాత.

(మరుత్తు వాక్యం)

ధార్మికు లవీక్షితుని వలె శర్మ మొంద
పతితు లెప్పుడు దృఢకేశి వలెన శింత్రు
సతులు వైశాలినిం బలె శౌర్య ధనుల
బతులఁ బొంది మరుత్తు బోల్పుతులఁ గాంత్రు.

అందరు :- తథాస్తు తథాస్తు అంబా! వైశాలినీ! ఈ నీ కుమార సంభవముతో నీగాథ మంగళాంత మైనది.

అవీ :- మీ యాశీస్సు లంది నేను నా జీవిత సర్వస్వము ప్రజా సేవకై వారి సుఖ శాంతులకై యంకిత మొనర్చు చున్నానని ప్రతిజ్ఞ సేయు చున్నాను. ఇంక ముందు నా సామ్రాజ్యములో.



వైశాలిని.

సకల జనులు నిరామయ సరణి నుండి
యఖిల సంపదల భద్రములందు చుండి
ఎట్టిదో దుఃఖ మన నెవ్వఁ డెరుఁగ కుండి
యఖిల ధారుణి స్వర్గమై యలర వలెను.

వైశా :- నా హృదయ వాంఛితము నీ ప్రతిజ్ఞతో నార్య పుత్రులు దీర్చి వైచినారు.



స్త్రీల మానములకు క్షితి జనమ్ముల ప్రియ
ప్రాణములకు వారి బ్రదుకు లీడ్చు
ధనములకును నెందుఁదగు రక్షణము గల్గి
స్వామి పాలనమ్ము సాగు గాక.



భ ర త వా క్య ము

వింతలు గాగ నీ ప్రకృతి వేషములన్నిట నేనటంచు నెం
దంతట సర్వనామ మహితాంశల నుత్తమ పూరుషా కృతిన్
సంతత మాత్మ కర్మ చయ సాక్షిఁగ దుఃఖ సుఖాసు భూతిలోఁ
జింతన సేయు వానికయి సేవలొనర్తురు గాక నెల్లయున్.

ఇ తి శ మ్

స ం పూ ర్ణ ము



| పేజీ | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 4. | ఒనర్తృ | ఒనర్తుృ |
| 5. | ఆది | ఆవి |
| 6. | ర్యాదే | ర్యాఁదే |
| 9. | నిథులు | నిధులు |
| 11. | మణి కుండల | మణి కంధర |
| 12. | క్షిఁచ | క్షించ |
| 20. | బయశుల | బయళుల |
| ,, | వతా | వత్సా |
| 21. | సమర్ధింప | సమర్థింప |
| 26. | చుట్ణు | చుట్టు |
| ,, | నిండి నుండి | నింటి నుండి |
| 29. | వచ్పి | వచ్చి |
| ,, | నుంచుఁడు | నుంచుడు |
| 31. | గల్లు | గల్గు |
| 34. | ముఁగదా | ముకదా ! |
| ,, | వెంతఁ జూచినన్ | వెంత చూచినన్ |
| 35. | నీవుఁ దక్క | నీవు దక్క |
| ,, | యామెను చేపట్టను | యామెను జేపట్టను. |
| 37. | వైశాలినీ కురుల | వైశాలిని కురుల |
| 37. | ప్రీతిమై యతిథి | ప్రీతిమై నతిథి |
| 43. | మాకు ఇంత | మాకు నింత |
| 44. | చిత్రమును కాబోలు | చిత్రమును గాఁబోలు |
| 45. | నవ్వెలది | నవ్వెలఁది |
| 47. | మల్లిఁ పూచు | వల్లిఁ బూచు |
| 48. | నొ్క | నొకే |
| 61. | ముద్దుల | ముద్దులు |
| 65. | నలె | వలె |
| ,, | సూర్యల | సూర్యుల |
| 65. | మును తాము | మును దాము |

| పేజీ | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 133. | వంద | పంద |
| 136. | ఆశ్చరము9 | ఆశ్చర్యము |
| 141. | డతిని | డతని |
| 132. | యంకటి | యంతటి |
| ,, | బందింతుఁడు | బంధితుఁడు |
| 133. | నితని | ఇతని |
| ,, | వీక్షితుని | నవీక్షితుని |
| 148. | (5వ పంక్తి తర్వాత) | తలపడి గున్న మాకును. అను పద్యం మొదట. వై శా :- |
| 187. | శ్రినివాస | శ్రీనివాస |
| 168. | దుఁఖోప | దుఃఖోప |
| 171. | కిమిచ్చక | కిమిచ్ఛక |
| 177. | ఒగి పేరు | ఒగిఁ బేరు |
| 180. | వినబడ | వినఁ బడ |
| 182. | సల్పు పోరు | సల్పుఁ బోరు |
| 185. | యెద నుండి | యెద మండి |
| 185. | బెకల్చ నీ | బెకల్చ |
| 188. | నీకు తెలిసి | నీకుఁ దెలిసి |
| 189. | కురరి పలె | కురరి వలె |
| 189. | ఎవ్వడ | ఎవ్వఁడ |
| ,, | ఏదు రెవ్వరు | ఎదు రెవ్వరు |
| 191. | మను జంఢి బక | మను జడింభక |
| 192. | తనను తా | తనను దా |
| 192. | దున్ను దానె | దన్ను దానె |
| ,, | లేను లేదు | లేదు లేదు |
| ,, | ప్రార్థింపుము | ప్రార్థింపము |
| ,, | వార్థి | వార్ధి |
| 194. | శక్తినిఁ బంవు | శక్తిని బంపు |
| 202. | కల్యాణముఁ చేకూర్చి | కల్యాణము చేకూర్చి |